శ్రీమతే రామానుజాయనమః



శ్రీ పరాశర భట్ట రనుగ్రహించిన

# శ్రీ గుణరత్నకోశము



ఆళ్వార్ తిరునగరి శ్రీ ఉ. వే. విద్వాన్
తిరుమలై నల్లాన్ రామకృష్ణ అయ్యంగారు రచించిన

## "సువర్ణకుంచిక"

అను వ్యాఖ్యానముతోను ద్రావిడానువాద పద్యములతోను
గూడినది.



శ్రీ శింగంశెట్టి-యతీంద్రులు శెట్టి చారిటీసు
వారిచే ప్రకటింపఁబడినది.
407, మింటు స్ట్రీటు, మదరాసు-1

ద్వితీయ ముద్రణము.

1969

(సర్వ స్వామ్యములు వ్యాఖ్యాన క



(By V Narasimham)

ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ

నిర్వాహ కోరకిత నేమ కటాక్ష లీలామ్।

శ్రీరఙ్గ హర్మ్యతల మఙ్గళ దీపరేఖాం

శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః॥



కీ॥ శే॥ శ్రీమాన్ శింగంశెట్టి యతీంద్రులు శెట్టిగారు
చారిటి స్థాపకులు

# శ్రీ లింగంశెట్టి యతీంద్రులుశెట్టి చారిటీసుయొక్క
# ప్రస్తుత పరిపాలకులు

**1969**



అగ్రాసనాధిపతి.

శ్రీ ఉప్పుటూరు - ఎంబెరుమానార్ శెట్టిగారు

కార్యదర్శి:

శ్రీ పరమార్థభూషణం-నాదెళ్ళ సంపత్తు శెట్టిగారు

కోశాధ్యక్షులు.

శ్రీ గట్టె-సుబ్బుకృష్ణ శెట్టిగారు, B A, B L

ట్రస్టీలు:

శ్రీ రాచమడుగు-నారాయణస్వామి శెట్టిగారు
శ్రీ వీరబొమ్మల-రంగనాథం శెట్టిగారు
శ్రీ గొల్లపూడి-వేంకటసుబ్బారావుగారు
శ్రీ అల్లత్తూరు-వి. నంబెరుమాళ్ శెట్టిగారు
శ్రీ పాతాళం-చంద్రయ్యగారు, B A
శ్రీ తాటికొండ-రామచంద్రగారు
శ్రీ గంధవడి-శ్రీరాములు శెట్టిగారు

మేనేజరు:

K. V కణ్ణన్

శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః

# ద్వితీయ ముద్రణ పీఠిక

శ్రీ సింగంశెట్టి యతీంద్రులు శెట్టిగారి ధర్మ సంస్థ యొనర్చు కార్యములలోఁ
బూర్వాచార్య విరచిత ప్రబంధముల ముద్రింపించి భక్తుల కుచితముగాఁ బంచిపెట్టుట
యొక్కటి ఇట్లుచితముగా పొత్తముల నియ్య దొరకొనినంత భక్తులకంటె నితరులే
వానిఁ గైకొని అమ్మి ధనము సంపాదించుటకు మొదలిడిన విషయము దెలియవచ్చి
నంత, సంస్థ పరిపాలకులు కబ్బమున కొక్క రూపాయ యని నామకార్థముగా
విలువ యేర్పరచినంతనే అట్టి దుష్కార్య మాగిపోయి, గ్రంథముయొక్క ప్రయో
జనము, అందలి విషయము తెలిసినవారే స్వీకరింపఁ జొచ్చిరి ఈ సంస్థ తొలుత
శ్రీ పరాశర భట్ట రచిత సహస్రనామ భాష్యమును దెనుఁగునఁ దర్జుమా చేయించి
ముద్రింపించిరి తర్వాత నా మహనీయులే వ్రాసిన శ్రీ గుణరత్నకోశ మను
ప్రబంధమును, ఆళ్వార్ తిరునగరి శ్రీ ఉ వే విద్వాన్ తిరుమలై నల్లాన్ రామ
కృష్ణ అయ్యంగార్లు భాషాంతరీకరించిన పాశురములును, సువర్ణకుంచికా వ్యాఖ్యాన
ముతో ముద్రింపించి భక్తుల కందఁజేసిరి ఈ పుస్తకము లచిరకాలములోనే
కర్చయినది

శ్రీరంగనాచ్చార్, శ్రీరంగనాథుల అనుగ్రహంబున నీ పొత్తము మగుడ
నచ్చొత్తించు భాగ్యమేర్పడినది ఈ ద్వితీయ ముద్రణము శ్రీ త్యాగరాయనగరు,
గోపాలకృష్ణ వీధి, 7వ నెంబరునందు నెలకొల్పఁబడిన శ్రీనిలయం ముద్రణాలయము
వారికిఁ బ్రాప్తించెను

మొదటి ముద్రణములో దొరలిన కొన్ని తప్పులిందు దిద్దుట, ప్రూఫు కాగిత
ములను దిద్ది సరిపెట్టి యిచ్చుట అను రెండు కార్యములు నాపాలఁబడినవి ధర్మసంస్థ
యొనర్చు ధర్మ కార్యములో నాకైంకర్యముగూడఁ గొంత యుండనిమ్మను నాశతో
నికార్యమును బైన వేసికొంటిని ప్రథమ ముద్రణమున నేర్పడిన దోసఁగులు
సరిపెట్టఁబడినవి

ప్రూఫులు దిద్దుటలో నావలనఁగూడ నక్కడక్కడ నొండురెండు స్ఖాలిత్య
ములుండవచ్చును ఈ ముద్రణమున నేర్పడిన దోసఁగు లన్నిటిని సరిదిద్ది శోధన
పత్రము ముద్రింపించి చదువరుల కనుకూలము గల్పింపఁబడినది ఈ కైంకర్య

ప్రాప్తిచేత నాకుఁ బరాశర భట్టరు విరచించిన ఈ దివ్య ప్రబంధము, వ్యాఖ్యానము, పాశురములును దృష్టిగఁ బఠించు భాగ్య మేర్పడినది నాకీ యవకాశము గల్పించి నందులకు ఈ సంస్థకు నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు నా యీ స్వల్ప కైంకర్యము శ్రీరంగ క్షేత్రాధిదైవతములగు నాదివ్యదంపతుల కర్పితము ఆ పూజ్య దంపతులు దృష్టియై మా కుటుంబముపై దమ దయాపూరిత దృగంచలములఁ బ్రసార మొనర్చి మమ్ము కృతార్థులఁ జేయుదురు గాక

ఈ సంస్థ ధర్మకర్త శెట్టి యాచార్యసూక్తుల ముద్రింపించి, ఆచార్యుల హృదయము మన దేశమంతటను వ్యాపింపఁ జేయుదురు గాక

మద్రాసు
31—12—1969

వంగీపురము కృష్ణమాచార్యులు,
రిటైర్డు అసిస్టెంటు ప్రొఫెసర్,
పచ్చయప్ప కళాశాల, మద్రాసు,

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఈ చారిటీ సంస్థాపకులు శ్రీ సింగం శెట్టి, యతీంద్రులు శెట్టిగారి ముఖ్యోద్దేశానుసారము శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రచార అభివృద్ధికొరకై మేము ఇదివరలో శ్రీ విష్ణు సహస్రనామ భాష్యమును భట్టరువారి వ్యాఖ్యానమననుసరించి ఆంధ్ర భాషలో ముద్రింపించితిమి. ప్రస్తుతము శ్రీ పరాశర భట్టరువారి శ్రీ గుణరత్న కోశమును ప్రతిపదార్థ తాత్పర్య ఆంధ్ర వ్యాఖ్యానముతో ముద్రింప యత్నించితిమి. దీనికి మా చారిటీయందు కాల క్షేపము నొనర్చు శ్రీ ఉ. వే. విద్వాన్ తిరుమలనల్లాన్ రామ కృష్ణయ్యంగారు ద్రావిడ భాషలో పాశురములు రచించి వానికి వ్యాఖ్యానము పూర్తిగావించిరి. వాటిని అనగా తత్ ప్రతిపదార్థ తాత్పర్య వ్యాఖ్యానములను రిటైర్డు జిల్లా కోర్టు జడ్జి పి. యం. శ్రీనివాసయ్యంగారి సహాయముతో ఆంధ్ర భాషకు తర్జుమా చేసిరి. డా॥ గిడుగు. వేంకట సీతాపతి, B A , L T , D LIT గారు పరిచయపరచిరి దానిని శ్రీ వానమామల రామానుజ జియ్యరు స్వామివారు అభినందించిరి. శ్రీ మధురాంతకం తిరుమల ఈచ్చంబాడి వీరరాఘవాచార్యులు భూమిక ననుగ్రహించిరి. ఇట్లు మా కార్యమునకు తోడ్పడి మా కోరికను సఫలము గావించిన మహనీయులకందరికీ ఈ గ్రంథ నిమిత్తము సహాయ మొనర్చిన తదితరులకును మే మెంతయు కృతజ్ఞతా పూర్వకముగ వందన మాచరించుచున్నాము

ఇట్లు,

శ్రీ శింగంశెట్టి యతీంద్రులు శ్రేష్ఠి చారిటీ ట్రస్టీలు

శ్రీః

# వ్యాఖ్యానకర్త విజ్ఞప్తి

శ్రియఃపతియైన పరమపురుషుని కృపకుఁ బాత్రులైన ఆళ్వారులు దురూహములైన వేదాంతార్థములను చక్కని తమిళ భాషలో ననుగ్రహించిరి. అట్టి తమిళభాషలో విశదమగు శాస్త్రార్థములను ఆచార్యులు సంస్కృత భాషలో మహత్తర గ్రంథములుగా నమర్చిరి వారిలో "శ్రీగుణరత్న కోశము"ను అనుగ్రహించిన భట్టరువారగ్రగణ్యులు

<u>గ్రంథకర్త</u> —వీరు ఆళ్వానుల కుమారులు ఆగర్భ శ్రీమంతులు ఎంబారు స్వామివద్ద ఉపదేశమును పొందినవారు ఎంబెరుమానారుల కృపకుఁబాత్రులు శ్రీసూక్తులకు వీరుచేయు నర్థములు ప్రాజ్ఞులకు మనోరంజకములైనవి. వీరి శాస్త్ర పాటవము, సహస్రనామభాష్యమువలన విదితమగుచున్నది "తత్త్వ రత్నాకర" మను వేదాంత గ్రంథమును కూడ వీరు రచించియున్నారు కాని మన అజాగ్రత వలన మన కది లభింపలేదు శ్రీవేదాంత దేశికులవారు ప్రదర్శించు ప్రమాణముల చేత వీరీ గ్రంథమును రచించినట్లు మనకుఁదెలియుచున్నది వీరు విద్వాంసులు మాత్రమేకారు గొప్ప కవులుకూడ, దానికీ గ్రంథమే తగిన సాక్ష్యము. ఇవ్విధ మనసే వీరు "శ్రీరంగరాజస్తవ" మను స్తోత్ర గ్రంథమును రచించిరి కొన్ని యితర స్తోత్రములను, విడి శ్లోకములను వీరనుగ్రహించియున్నారు "క్రియాదీప" మను అనుష్ఠాన గ్రంథమునుకూడ రచించిరి సంగ్రహముగాఁ జెప్పవలెయుననిన శ్రీ ఎంబెరుమానారుల యనంతరము వారివలె కీర్తియు, మహత్త్వమును బొందినవారు భట్టరువారొక్కరే యనవచ్చును కవిమండలములో కాళిదాసుని ఉపమయు, భవభూతిస్వభావోక్తియు, భారవి యర్థగౌరవమును, మురారి యసాధారణ వైఖరియూ వీరివద్దనే ప్రకాశించుచున్నవనుటలో నతిశయోక్తి లేదు

గ్రంథము·—"అనాఘ్రాతావద్యం" అను శ్లోకమున నెట్లు ఈ గ్రంథమును రచించుటకు అభిలషించిరో అట్టి మనోఽభీష్టము సఫలమగుట మన మీగ్రంథమునఁ జూడనగును. మనకుఁగావలసిన శ్రీదేవీ విషయమైన జ్ఞానవైశద్యమును కలుగఁ జేయుటకీగ్రంథము శక్తివంతమైనది మాధవుని ప్రేమను విస్తరింపఁ జేయునది

ఇది మనకు లబ్ధమైన బొక్కసము ఇది శ్రీగుణరత్నకోశముగదా! రత్న పరీక్షా జ్ఞానరహితు లీ కోశమునఁ బ్రవేశింప ననర్హులే! ఇందలి వర్ణనాసమృద్ధియు, నర్థగాంభీర్యమును, భావసౌందర్యమును, వాగ్ధోరణియును మనలఁ బరవశులనొనర్చుచున్నవి (38, 41, 43, 44, 50, 51 మున్నగు శ్లోకములఁ గనుఁడు)

<u>శ్రీదేవి</u> —ఇరుదు స్తుతింపఁబడు శ్రీదేవి ఈశ్వరుని మించినది ౨0-వ శ్లోకమును దిలకింపుఁడు కోపించువాఁడతఁడు క్షమింపించునది యీమె. 52-వ శ్లోకమును గమనింపుడు ఉత్కర్షమును బొందువాఁడతఁడు ఉత్కర్షరూపముగా నుండునదీమె 29-వ శ్లోకమును జూడుఁడు కాఁగా గ్రంథకర్తను గ్రంథమునకును, శ్రీదేవికిని గల నిస్సమాభ్యధికమైన గొప్పతనము విశదీకరింపఁబడినది

<u>వ్యాఖ్యానము</u> —శ్రేష్ఠమైన ఈ గ్రంథమున కనేక పండితులు వ్యాఖ్యానములు చేసియుండుట సహజమే! వీరరాఘవాచార్యులవారు, వేంకటాచార్యులవారు, భాష్యనారాయణాచార్యులవారు మఱికొందఱు చేసిన వ్యాఖ్యానములున్నవి ఇవి యన్నియు సంస్కృత భాషామయములు తమిళభాషలో దాసుఁడనైన నేను ప్రతిపదార్థముతో విస్తరముగా నొక వ్యాఖ్యానమును రచియించి ప్రకటించియున్నాను ఇప్పుడదియే ఆంధ్రభాషలో తర్జుమాచేసి ప్రకటింపఁబడుచున్నది

విస్తరమైన ఈ వ్యాఖ్యాన రచనలో మీఁదఁ జేర్కొనబడిన సంస్కృత వ్యాఖ్యానములు సహాయమొనర్చినవి వానిలోని యభిప్రాయ భేదము లీ గ్రంథములో నచ్చటచ్చట అవశ్యములని తోఁచిన చోట్లలో మాత్రము గుర్తింపఁబడియున్నవి అందులో కొన్ని విరసములు అట్టివానిని కొన్ని చోట్లలో తప్ప, వ్యక్తముగా ఖండింపలేదు అన్ని యభిప్రాయ భేదములును గుర్తింపఁబడలేదు

దివ్యప్రబంధ వ్యాఖ్యానము, చతుశ్శ్లోకీ, స్తోత్రరత్న, గద్యత్రయ వ్యాఖ్యానములు, తత్త్వసంగ్రహము, రహస్యత్రయసారము మున్నగునవి యీ వ్యాఖ్యాన రచనలో చాల సహాయమొనర్చినవి

ఈ వ్యాఖ్యానము, కోశమును తెఱచు తాళపుఁజెవియే! దీనికి "సువర్ణకుంచిక" (బంగారపు తాళపుఁజెవి) యని నామకరణము చేసియున్నాను ఈ తాళపుఁజెవి ఎచ్చటైనను సరిపడక పోయినను, బంగారపుఁజెవి యగుటచే ప్రాజ్ఞులు దీనిని దగినరీతి దిద్ది, యుపయోగించుకొందురని తలంచుచున్నాను

**పాశురములు:**—ఒకనాఁడు ఈ గ్రంథమును తమిళ భాషలో పద్యకావ్యముగా రచించునట్లు శ్రీదేవి యాజ్ఞ లభించినది శ్రీరంగనాచ్చియారుల కరుణాకటాక్షము నేమని వచింతును! పద్యములొకటివెంట నొకటిగా నుద్భవించినవి భట్టరువారి శ్రీ సూక్తిని—అందును శ్రీగుణరత్నకోశమును, భాషాంతరీకరించుట అందులోను పాశురములుగా నొనర్చుట శక్యమా? అట్టి కార్యము నల్పజ్ఞుఁడనైన నేనొనర్చితిని! ఔను, శ్రీదేవి కరుణాప్రవాహము పల్లములో దిగును ఈ పాశురములు భట్టరువారి శ్రీ సూక్తికి న్యూనత నొందించునేమో యనియు, ఇవి సరిగా నున్నవా యనియు సంశయించి, తమిళ వాఙ్మయమునందారితేఱిన వారును, లోకమునందు తమిళ భాషాజ్ఞానమును విస్తరింపఁజేసి, సుప్రసిద్ధులైన వారును, పెక్కు వ్యాఖ్యానములు వ్రాసి, మేరలేని ఖ్యాతిఁ జెందినవారును, పరమ భక్తులునునైన శ్రీ ఉ వే గోపాలకృష్ణమాచార్యులవారికిఁ జూపితిని వా రుభయ భాషాప్రవీణులగుటచే శ్లోకముల యర్థములను గమనించి, పాశురములను పరిష్కరించిరి దానిచే సందేహ రహితుఁడనై పరమ సంతోషభరితుఁడనైతిని 4

నా కాలక్షేప గోష్ఠిలో నన్వయించుచున్న ఆస్తికాగ్రేసరులచే 25-6-195 శుక్రవారమున తిరువల్లిక్కేణి శ్రీ పార్థసారథి సన్నిధిలో మహోత్సాహముతో జరుపబడిన శ్రీ వేదవల్లి తాయారు, శ్రీరంగనాథుల సమ్మేళన మహోత్సవ సందర్భములో ఈ గ్రంథము సమర్పింపఁబడి, శ్రీ ఉ వే ఎస్ వరదాచార్యులు స్వామి (విశ్రాంతి పొందిన ఫెడరలు కోర్టు జడ్జి) వార యాధ్యక్ష్యమున, ఆ సన్నిధిలోనే జరిగిన మహా సదస్సులో ప్రకటితమైనది

తమిళ పాశురములు మదరాసునందలి తెలుఁగువారికిని, తెలియుటంబట్టి, ఈ గ్రంథములోఁ జేర్పఁబడియున్నవి మఱియు, చతుశ్శ్లోకీ, శ్రీ స్తవములును శ్రీ గుణరత్న కోశముతోఁగూడ మనఃపాఠమున కనుగుణముగా పాశురములతోఁ బాటు ప్రత్యేకముగా నిందుఁ జేర్పఁబడియున్నవి

ఉపకారము,—సువర్ణకంచికయు, తమిళ పాశురములును శ్రీమత్పరమహంసేత్యాది వర్తమాన వానమామలస్వామివారివంటి అనేక సంస్కృత పండితుల చేతను, పెక్కురు తమిళ భాషా నిపుణులచేతను, హిందూ మున్నగు ప్రఖ్యాత పత్రికలచేతను మిక్కిలి కొనయాడఁబడియున్నవి. అట్టి గ్రంథము ఆంధ్రభాషలోను ప్రకటింపఁబడినయెడల లోకోపకారమగునను తలంపుతో చెన్నపురి శ్రీమాన్ లింగంశెట్టి యతీంద్రులు శెట్టి చారిటీ ట్రస్టీలు పూర్ణభారమును వహించి ప్రీతి పూర్వకముగా ఈ గ్రంథమును ప్రకటించిరి శ్రీ వైష్ణవ సిద్ధాంత ప్రచారమే పరమోద్దేశ్యమని నిర్మూల్యముగా తగినవారికి గ్రంథము నొసంగుటచే వారి విశాల హృదయము వ్యక్తమగుచున్నది ఇట్లు నా గ్రంథ ప్రచారమునకు మహోప

కారకులైన వారికి నే ప్రత్యుపకారమ్ముఁజేయ శక్యమగును? తన స్తుతిని ప్రకటించిన వీరికి శ్రీరంగనాచ్చియారు ఇట్టి పెక్కు గ్రంథములను ప్రకటించుటకు మనోభావమును, ఆయురారోగ్యములను నిరవధికైశ్వర్యమును, తన పరిపూర్ణ కటాక్షము నొసంగుఁగాక!

పై చారిటీ మానేజరు బండారం-వెంకటేశ పెరుమాళ్లు, B.A గారీగ్రంథ ప్రకటన విషయములో మిక్కిలి ఉత్సాహవంతులై కార్యమును నిర్వహించిరి వారికిని నా కృతజ్ఞత

ఆంధ్రభాషలో మిక్కిలి పాండిత్యముగల శ్రీ ఉ వే P M శ్రీనివాసయ్యంగారు, (రిటైర్డు డిస్ట్రిక్టు జడ్జి) మహోత్సాహముతో ఈ గ్రంథమును ఆంధ్రభాషలో ననువదించిరి పరమ రసికులైన వారు చేసిన అసదృశమైన ఈ ఉపకారమునకు సదృశ ప్రత్యుపకారము తెలియక, మనఃపూర్వకముగా ధన్యవాదములు మాత్రము తెలియఁజేయుచున్నాఁడను

చేతివ్రాఁత ప్రతిని పరిష్కరించుటకై హిందూ తియలాజికలు పాఠశాల ఆంధ్రోపాధ్యాయులు, శ్రీ ఉ వే విజయరాఘవాచార్యగారును, వివేకానంద కాలేజి తెలుఁగు ప్రొఫెసరు శ్రీ ఉ వే భక్తవత్సలయ్యంగారును, కెల్లెట్ హైస్కూలు ఆంధ్రోపాధ్యాయులు బ్రహ్మశ్రీ బులుసు-వేంకటరమణయ్యగారును సాహాయ్యమొనర్చిరి వీరికి నా నిండు మనస్సుతో కృతజ్ఞతను తెలుపుచున్నాను.

అత్యంత వాత్సల్యమున దీనికి శ్రీ ఉ వే మధురాంతకం-వీరరాఘవాచార్యస్వామిగారు 'భూమిక'ను రచించిరి మహాప్రీతితో బహుభాషావేత్తలు, విద్వత్కవులు నగు డాక్టర్ శ్రీ గిడుగు-వేంకటసీతాపతిగారు (బి ఏ, ఎల్ టి., డి లిట్) దీనికి "గ్రంథ పరిచయము"ను వ్రాసిరి ఈ యిరువురి మహోపకారము మఱువరానిది

సావధానముగా అచ్చులోని తప్పొప్పులను దిద్దుటలో ప్రశంసింపఁదగిన సహాయము శ్రీ బులుసు-వేంకటరమణయ్యగారొనర్చిరి వారి ఉపకారము అవిస్మరణీయము.

ఈ గ్రంథ మాంధ్రభాషాదేవి కొక యాభరణముగా నమరినచో, అదియే నా గ్రంథ ప్రణయనమునకు సాఫల్యము

ఈ గ్రంథము నాంధ్రులెల్లరును అంగీకరించి ఆంధ్రలోక మంతటను వ్యాపింపఁజేసిన దుర్భిక్షాది ఈతి బాధలు నశించి, దేశము సమృద్ధియగుననుటలో సందియములేదు అట్లే శ్రీదేవి కృపఁజేయునుగాక!

తిరుమల నల్లాన్ రామకృష్ణయ్యంగారు



# అనువాదకర్త విజ్ఞప్తి

పూర్వాచార్యులైన శ్రీపరాశర భట్టరు రచించిన శ్రీగుణరత్న కోశము కఠినశైలి గలదియు, నత్యంత భావగర్భితమైనదియునై యున్నది దానికి శ్రీతిరుమలై-నల్లాన్ స్వాములవారు సులభశైలిలోను శబ్దములపై తెలియు నర్థమేగాక శ్లోకములో నమరి యంతర్భూతముగానుండు తత్త్వార్థములను అందఱకును కరతలామలకములగునట్లుగా విశదపఱచిరి కొన్ని సంస్కృత గ్రంథములను వ్యాఖ్యాన నిరపేక్షముగా చదువరులు తెలిసికొనఁగలరు అయితే తత్త్వ గ్రంథములలో సామాన్యముగా అభిదా వృత్తియేకాక, తాత్పర్య వృత్తియు విశదమగుటకు వ్యాఖ్యానము లత్యంతావశ్యకములైనవి వ్యాఖ్యాత ఉభయ వేదాంతములయందును ఎక్కువ పాండిత్యము కలిగియుండవలయును మన వ్యాఖ్యాతృ స్వాములు స్వాధ్యాయ ప్రవచనములే నిత్య కాలక్షేపములుగాఁ గలిగి, సంస్కృత తమిళ భాషలలోని ప్రాచీనుల ముఖ్య గ్రంథములను జదివి, వానిలోని యర్థముల నన్నింటిని లెస్సగా తమ యనుభవమునకుఁదెచ్చుకొని యున్నారు కనుక వారు శ్రీగుణరత్నకోశములోని శ్లోకము లన్నింటిలోనుండు తత్త్వార్థములను బాగుగానెత్తి చూపియున్నారు వ్యాఖ్యానమునకు "సువర్ణకుంచిక" యని నామకరణము చేయుటయు సర్వవిధముల సమంజసమై యున్నది అనాఘ్రాతా పద్యమను శ్లోక వ్యాఖ్యానములో శబ్దదోష, వాక్యదోష, అర్థదోషము లేవియు తన గ్రంథములో రాకుండ కృపచేయవలయునని స్వామి భట్టరువారు శ్రీరంగనాచ్చియారులను ప్రార్థించియున్నారు. అట్టి దోషములేవియు వ్యాఖ్యాతగారి వ్యాఖ్యానము నంటకుండుటయేగాక యా త్రిదోషములకు వ్యతిరిక్తములైన త్రిగుణములు అనఁగా శబ్దపుష్టి, వాక్యసౌష్టవము, అర్థ గాంభీర్యము వ్యాఖ్యానములో ప్రకాశించుచున్నవి

వ్యాఖ్యాత శ్రీదేవియొక్క స్వరూప రూపగుణ విభవైశ్వర్యములను వ్యాఖ్యానములో ననేకస్థలముల విశదీకరించియున్నారు. శ్రీదేవికుండవలసినవియు సదా యుండునవియు నగు కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము అను మూఁడు గుణముల నచ్చటచ్చట ఉదాహరణ పూర్వకముగా నిరూపించి యున్నారు.

ఇట్లుండుటంబట్టియే శ్రీదేవి మనకెల్లరకును పురుషకారముగానై మన దోషములను భగవంతునిచేత మన్నింపఁజేసి మనకు భగవత్ప్రాప్తి కలుగునట్లు చేయుచున్నది అందుచేతనే శ్రీదేవియొక్క ముఖ్యగుణములు క్షమా వాత్సల్య కారుణ్యౌదార్యములని పెక్కుభంగుల నొక్కి చెప్పియున్నారు "శ్రీ" శబ్దము "శ్రిఞ్ సేవాయాం" అను ధాతువునుండి నిష్పన్నమైనది ఆ శబ్దమునకు "శ్రీయతే-ఆశ్రయింపఁబడినది" అను కర్మణి వ్యుత్పత్త్యర్థము, "శ్రయతే-తానాశ్రయించునది" అను కర్తరి వ్యుత్పత్త్యర్థము కలవు శ్రీదేవి తన్నాశ్రయించునట్టి జీవుల నత్యంత వాత్సల్యముతో దగ్గరకుఁ దీసి వారికి మంచి మార్గమును బోధించి భగవంతునిఁజేరునట్లొనరించును తాను భగవంతుని నాశ్రయించి తన పారతంత్ర్య, అనన్యార్హత్వములచే భగవంతుని వశపఱచుకొని మనము సకల విధములైన యైహికాముష్మిక ఫలములఁబొందునట్లు చేయుచున్నది ఈ గ్రంథ శ్లోక వ్యాఖ్యానముల పఠనముచేత నెల్లరకును ఆయురారోగ్యైశ్వర్యములు మనశ్శాంతి దివ్యదంపతులయందు నెడతెగని భక్తి తప్పక లభించును

వ్యాఖ్యాతగారి తమిళ వ్యాఖ్యానము ఆంధ్రు లెల్లరకు నుపయోగపడవలయునను నుత్సాహము వారి కపరిమితమై యుండెను వారి పరోపకారార్థచింతయే దానికి కారణము నాయొనర్చిన తెలుఁగు భాషాంతరీకరణము వ్యాఖ్యాతగారి తమిళ వ్యాఖ్యానము నన్నివిషయములలో ననుసరించినదియే వారి తమిళ గ్రంథములోని అర్థతాత్పర్యములు తేటతెల్లముగా నమరియుండుటచేతను, వారి తమిళశైలి మార్దవ మాధుర్య ప్రచురమైనదిగా నుండుటచేతను భాషాంతరీకరణము సులభోద్యమముగానే యుండెను

ఈ గ్రంథము నొకసారి చదివి మూలలో పడవేయవలసిన పుస్తకముల వంటిదికాక, దినదినము పారాయణముచేసి శ్రద్ధతో వ్యాఖ్యానములలో విశదపఱుపబడిన యర్థములను బోధపఱచుకొని, భక్తితో నా యర్థముల ననుదినము మననము చేయుట కర్హమై, యమూల్యమైన గ్రంథము గనుక యాంధ్రులెల్లరి పుస్తకమును తమ తమ గృహములలోని పుస్తక భాండాగారములలో నొక గొప్ప గ్రంథముగా నుంచుకొని, దానిని భక్త్యాదరములతో పఠించి శ్రీదేవియొక్క పూర్ణకటాక్షమునకుఁ బాత్రులగుదురుగాక,

ఇట్లు

పి. ఎం. శ్రీనివాసయ్యంగారు



శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమదుభయవేదాంత ప్రతిష్ఠాపకాచార్యులై 'శిరోమణీ, తర్కరత్నము, న్యాయవేదాంతకేసరి' ఇత్యాది బిరుదాలంకృతులై తిరువైయారు సంస్కృత కళాశాలలో న్యాయాధ్యాపకులుగానుండి, విరామముఁ బొందిన మధురాంతకం-శ్రీ వీరరాఘవాచార్యులవారు పరమకృపతో ననుగ్రహించిన

# భూమిక

శ్రీగుణరత్నములు నిండిన రత్నకోశమును దరిద్రులకు గృహమునసే మహానిధిని చూపించునట్లు మనకు "శ్రీపరాశర భట్టరు" అను ఉదారులైన అస్మదాచార్యులు చూపిరి ఈ స్తోత్రములోనే (10) "దేవిశ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః, త్వత్సద్గుణౌఘ మణికోశ గృహం గృణన్తి" అని వేదములకు శ్రీగుణరత్నకోశమను నామము ప్రాచీనులచే వ్యవహరింపఁబడి యున్నట్లు ప్రదర్శించిరి వేదవేద్యుఁడైన పరమపురుషుడు దశరథాత్మజుఁడై యవతరించినపుడు వేదము ప్రాచేతసునినుండి శ్రీరామాయణముగా నవతరించినట్లు, శ్రీదేవి శ్రీరంగనాయకిగా నవతరించునపుడు శ్రీగుణరత్నకోశమైన వేదము భట్టరువారినుండి యర్చావతార వేదముగా నవతరించెను గాబోలు! మూలవేదమైన రత్నకోశమునకు నితిహాస పురాణాదులు తాళపుఁజెవు (తద్ద్వార పాటన పటూని చ సేతిహాస సన్తర్కణ స్మృతిపురాణ పురస్సరాణి) (10) లని చూపఁబడియున్నది అవ్విధమైన తాళపుఁజెవులు లేక యీ కోశమునుదెఱచి రత్నములఁ జూచుట యశక్యము శ్రీ ఉ. వే విద్వత్ సార్వభౌమ తిరుమల నల్లాన్ రామకృష్ణయ్యంగారు రత్నకోశమున కనురూపమైన "బంగారుచెవి" (సువర్ణ కుంచిక) నొకదానిని సమర్చి లోకమున కనుగ్రహించి యున్నారు దీనిచే రత్నకోశములో నున్నదానిని మనము సంతతము ననుభవించుట కొక భాగ్యము లభించినది

శ్రీగుణరత్నకోశమును, శ్రీరంగరాజస్తవమును వరుసగా ద్వయార్థ వివరణమై యమరినవి. ద్వయములోని పూర్వోత్తర ఖండములనుండు శ్రీశబ్దార్థ వివరణమే శ్రీగుణరత్నకోశము సువర్ణకుంచికచే రత్నకోశమును దెఱచి శ్రీశబ్దార్థ రత్నములను వేఱువేఱుగా ననుభవింపనగును వ్యాఖ్యాన కర్తయు

శ్రీగుణరత్నముల శ్రేష్ఠతను అవతారికలో మేళవింపఁజేసి తన వ్యాఖ్యానమును రసవత్తరముగా సమర్చియున్నారు. "సువర్ణకుంచిక" యను వ్యాఖ్యానమును, "తమిళానువాద పద్యములు" అను రెండు తాళపుఁజెవులను నల్లాన్ స్వామి రచించుట యందఱికిని భట్టరు శ్రీసూక్తుల గభీరార్థములను బాగుగా తెలిసి కొనుటకు మిక్కిలి సహాయ మొనర్చుచున్నది.

మఱియు, పరాశర భట్టరుల శ్రీసూక్తి అసాధారణ మహాత్త్వము గలది అది అంతరాజ్ఞానాంధకారమును బోఁగొట్టు దీపము అనాది జన్మ విషమునకు నుత్కృష్టామృతము. వేదసారము పరమతములను ప్రత్తికి నగ్ని కణములు సంస్కృత లక్షణములకుఁ దగిన లక్ష్యము అందువలననే "యస్సాంస్కృత కవితాయాం ప్రౌఢిమ్నాన్వేతి కూరనాథ సుతం" అని సప్తతి రత్న మాలికలో భట్టరువారి సూక్తియొక్క గరిమ కొనియాడఁబడియున్నది దీని హృదయమును ఉన్నదున్నట్లుగా నెఱింగి అచ్చటచ్చట వ్యాకరణ సూత్రములను ప్రమాణముగాఁగొనియు, నాళ్వారులు మున్నగువారి శ్రీసూక్తులచే అర్థనిర్ణయముఁ జేసియు, నపేక్షిత స్థలములో శ్రుతి పురాణాది ప్రమాణములను విశదీకరించియు, వ్యాఖ్యాత తమ వ్యాఖ్యానమును యథాక్రమముగ సమర్చియుండుట పండిత పామర విభాగము లేక అందఱిచే శ్లాఘింపఁ దగినదై యున్నది తాత్పర్యార్థము, వాక్యార్థము, పదార్థము, అక్షరార్థము అనువానిలో నొక్కదాని నుపేక్షింపక సువర్ణకుంచిక రసఘనమై యమర్పఁబడి యున్నది దీని నెల్లరును గాఢముగా ననుభవించి సంతసింపవలయును ఇంకను వీరిట్టే వ్యాఖ్యానమూలముగాఁ బూర్వాచార్య సూక్తులను విశదపఱచి లోకము నుజ్జీవింపించునట్లు దాసుఁడనైన నా ప్రార్థనను నల్లాన్ స్వామి సన్నిధిలో సవినయముగా నివేదించుచున్నాను

శిరోమణి స్తర్కరత్నం న్యాయవేదాన్త కేసరీ।
సువర్ణకుఞ్చికా వ్యాఖ్యా మన్వభూద్వీరరాఘవః ॥

116, ఉత్తర రథవీథి,
శ్రీరంగం
10-3-1956

ఇట్లు,
శ్రీమధురాంతకం
తిరుమల ఈచ్చంబాడి-వీరరాఘవాచార్యుఁడు

# గ్రంథ పరిచయము



వైష్ణవాచార్య శ్రేణిలో శ్రీ యామునాచార్య రామానుజాచార్యులతర్వాత ప్రసిద్ధిపొందిన శ్రీ పరాశర భట్టరువారు శ్రీ గుణరత్నకోశము అను గ్రంథ రాజమును విశ్వకళ్యాణమునకై యనుగ్రహించి యుండిరి ఇందు 61 శ్లోకములు కలవు ఇవి సంస్కృత భాషలో కఠినమైన శైలిని రచితములయినవి ఇందలి శబ్దార్థములను తెలిసికొనుటకు చక్కని భాషాపాండిత్యము, కొంత సంస్కారము, సంప్రదాయ విజ్ఞానము ఉండవలెను కొన్ని శ్లోకములందు అంతర్భూతములై యున్న తత్త్వార్థములను గ్రహించుట సాధారణముగా పండితులకైనను సాధ్యము కాదు. అందుచేత ఈ గ్రంథమునకు వ్యాఖ్యానములు కావలసి వచ్చినవి. కొన్ని వ్యాఖ్యానములు రచితములయినవి కాని అవి సంస్కృత భాషలోనే రచితములగుట వలన సంస్కృత పండితులకే కాని సంస్కృతము రానివారికి అంతగా ఉపకరించునవి కావు అందుచేత, తమిళ సంస్కృత భాషలందు గొప్ప పాండిత్యము గలవారును, వైష్ణవ సంప్రదాయములను లెస్సగా తెలిసిన వారును భగవద్భక్తాగ్రగణ్యులును విద్వత్ సార్వభౌములును అయిన శ్రీ ఉ. వే తిరుమలనల్లాన్ రామకృష్ణయ్యంగారు కేవలము కూలంకషమైన వ్యాఖ్యానము వ్రాయుటతో మాత్రమే తృప్తినందక ఈ గ్రంథమును తమిళ భాషలో పద్య కావ్యముగా రచించిరి సంస్కృత శ్లోకములకు వీరొనర్చిన పాశురములు మూలమునకు ఏమాత్రమైనను తీసిపోలేదనియు, అంతేకాక మూలమందలి తత్త్వార్థములను సాధారణ తమిళ భాషాపరిచయము గలవారికైనను సులభముగా గ్రహించుటకు సహాయములుగా నున్నవనియు పండితుల యభిప్రాయము వీరి పరిశ్రమ తమిళులకేకాక తెలుగువారికి సైతము ఉపరికంపవలెనన్న ఔదార్య ముతో శ్రీ తిరుమలనల్లాన్ స్వాములవారు తమ తమిళ వ్యాఖ్యానమునకు తెలుగు అనువాదము సైతము కావలెనని కోరిరి వారి కోరికననుసరించి తమిళ సంస్కృతాంధ్ర భాషాకోవిదులయిన శ్రీ పి ఎమ్ శ్రీనివాసయ్యంగారు దీనికి ఆంధ్రానువాదము గావించిరి ఈ అనువాదము తెలుగువారి కృతజ్ఞతకు పాత్ర మైనది శ్రీ తిరుమలనల్లాన్ రామకృష్ణయ్యంగారు శ్రీ పరాశర భట్టరువారి

రత్నకోశమునకు సువర్ణకుంచిక యనదగు వ్యాఖ్యానమును అనుగ్రహింపగా శ్రీనివాసయ్యంగారు ఆ వ్యాఖ్యానమునకు స్వచ్ఛమైన దర్పణమును తెలుగువారికి ప్రసాదించినారనుటలో అతిశయోక్తి లేశమయినను లేదు

గ్రంథ ప్రశస్తిని గూర్చిగాని వ్యాఖ్యానముల ఉత్కృష్టతను గూర్చిగాని వ్రాయగల సమర్థత నాకు చాలదు అయినను ఈ గ్రంథ పరిచయము వ్రాయుటకు పూనుకొనుట సాహసము కాదు ఎందు చేతననగా, ఈ గ్రంథము, ఈ వ్యాఖ్యానము ఈ తెలివిడి — అన్నీ నావంటి అల్పజ్ఞునకు సైతము తెలియవలెనన్న సదుద్దేశముతో రచితములై ప్రకటితములగుచున్నవి వీరి ఉద్దేశము ఎంతవరకు నెరవేరినదో నావంటి అల్పజ్ఞుడే చెప్పదగును కనుక అల్పజ్ఞులకు ప్రతినిధిగా ఈ పరిచయ వాక్యములను వ్రాయుటకు పూనుకొన్నాను

భట్టరువారు రచించిన శ్లోకములలో ఏది చదివి చూచినను ప్రతిపదార్థము తెలిసికొన్నంతమాత్రాన దానిలో అంతర్గర్భితమైన తత్త్వార్థము సరిగా బోధపడదు వ్యాఖ్యానము, తెలుగులో తెలివిడి చదివిన తర్వాత నాకు బ్రహ్మానందము కలిగినది తెలియని విషయము తెలియదన్న సంగతి తెలిసికొనుటయు నొక విశేషమే కదా! అందుకు నిదర్శనముగా ఈ గ్రంథమందలి యద్యావత్తవ వైభవం తదుచితస్తోత్రాయ దూరే స్పృహా" అను అయిదవ శ్లోకము గ్రహించ దగును బ్రహ్మాదులయినను శ్రీదేవి వైభవమును స్తుతించుటకు అర్హతగలవారు కారు గదా! మేమేపాటివారము? అందుకు మేము చేయు ప్రయత్నము, సాహసము పరిహాసాస్పదము" అని భట్టరువంటి మహాకవి పండితులు పలుకుచుండగా నేనేపాటివాడను? అను భావముదయించి నా యల్పజ్ఞత్వము నాకు స్పష్టముగా గోచరించినది. "అనాఘ్రాతావద్యం ..." అను ఎనిమిదవ శ్లోకము చదివినప్పుడు శ్రీదేవి కటాక్షమువలన భట్టరువారికి వాగ్విలాసము కలుగునన్న విశ్వాసము కలిగి నట్లే ఆ శ్రీదేవి ప్రసన్నతవలన భట్టరువారి శ్లోకముల నర్థము చేసికోగలనన్న నమ్మకము నాకును కలిగినది అందుకు శ్రీతిరుమల నల్లాన్ వారి వ్యాఖ్యానమును, శ్రీ శ్రీనివాసయ్యంగారి తెలుగు వివరణమును నాకు తోడ్పడినవి

"శ్రీగుణరత్న కోశము" అను నామధేయ మీ గ్రంథమునకు పెట్టుటలో భట్టరువారికి గల ఉద్దేశము "దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః..." అను పదియవ శ్లోకమున గుర్తింపనగును. "దేవీ! వేదము నీ శుభ గుణరత్నములు

గల బొక్కసమందురు, ఆ బొక్కసము మూసికొనియున్నది. దానిని తెఱచుటకు ఇతిహాస తర్కశాస్త్ర సహితములయిన స్మృతి పురాణములు మొదలయినవి బీగపుఁ జెవులుగా ఉపకరించుచున్నవి" అని ఆ శ్లోకము చెప్పుచున్నది ఈ శ్లోకమందలి భావముననుసరించియే కాబోలును శ్రీ తిరుమల నల్లాన్ వారు తమ వ్యాఖ్యానమునకు సువర్ణ కుంచికా వ్యాఖ్యానమనిరి సువర్ణ పదమునకు గల రెండర్థములందును ఈ వ్యాఖ్యానము సార్థకమైనది

శ్రీదేవి భగవన్నిరూపిక, అనగా శ్రీదేవి లేక భగవంతుని నిరూపించుట సాధ్యము కాదు ఈ విశేషమును భట్టరువారు ఇరువదియెనిమిదవ శ్లోకమున చక్కగా వర్ణించినారు శ్రీదేవిని విడిచియుండు స్థితి భగవంతునికి లేదు భగవంతుని స్వరూపము "త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి" అన్నారు అందుచేతనే లక్ష్మీనివాసము విష్ణువు వక్షస్థలమందే అమరియున్నది, లక్ష్మీనారాయణులు చంద్రికా చంద్రులవలె నుందురు

61 శ్లోకములతో భట్టరువారు మనకు అందజేసిన శ్రీదేవీ గుణరత్నములు గణనాతీతములయి యున్నవి శ్లోకములందలి ప్రతి పదమును సార్థకమయినది దాని సార్థకతను గ్రహించుటకు శ్రీ తిరుమల నల్లాన్ వారి సువర్ణ కుంచికా వ్యాఖ్య పూర్తిగా తోడ్పడుచున్నది

ఇట్టి గ్రంథరాజమును శ్రీ వైష్ణవ లోకమునకు మహోపకారముగా ప్రకటించిన శ్రీ శింగంశెట్టి యతీంద్రుల శెట్టి చారిటీ సంస్థా పరిపాలకులకు నా ధన్యవాదములు శ్రీదేవీ పూర్ణ కటాక్షమునకు పాత్రులయి వీరు ఇతోధికముగా నిట్టి సత్కార్యములను గావించి తాము కృతార్థులగుటయే కాక లోకులను కృతార్థులగుటకు ప్రయత్నింతురు గాక!

మద్రాసు
19—4—1957

డాక్టర్ గిడుగు - వేంకటసీతాపతి,
బి.ఏ. ఎల్.టి, డి.లిట్.

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య — ఉయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యులై, శ్రీమద్రమ్యజామాతృ యతివరకృపాలబ్ధ శ్రీవరమంగాసమేత శ్రీదేవనాయకాంతరంగ కైంకర్యైక ధురంధరులై, అఖండ మహీ మండలాలంకార మహీపాల కోటీర కోటిఘటిత మణికిరణ పటలపాటలిత పాదపీరపర్యంతాచార్యులై పరమపురుషార్థలక్షణ విలక్షణమోక్షైక ప్రయోజనార్థ పంచక జ్ఞానైక సాధన శ్రీమదష్టాక్షర్యాదిరహస్యత్రయ జగదుజ్జీవనాచార్యులై సకలమునిజన మానసారవింద సందోహ సముల్లాస సముల్లసిత శ్రీరాజహంసావతారులై శ్రీ భగవద్రామానుజ సిద్ధాంత నిర్ధారకాచార్య సార్వభౌములై సర్వతంత్ర స్వతంత్రులై వేంచేసియున్న శ్రీ వానమామల రామానుజ జియ్యరు స్వామివారు అనుగ్రహించిన

# అభినందన పత్రిక

శ్రీ పరాశర భట్టరువారు శ్రీదేవి విషయమై యనుగ్రహించిన విశేషార్థపుష్టమైన శ్రీ గుణరత్నకోశమునకు మన శ్రీ ఉ వే తిరుమల నల్లాన్ మిక్కిలి విశదముగా రచించిన "సువర్ణకుంచిక" యను విస్తర వ్యాఖ్యానము, తమిళానువాద పద్యములుగల ఈ గ్రంథము శ్రీవైష్ణవలోకమున కత్యంతోపకారకమగును దీనిలో వ్యాకరణ శాస్త్రానుసారముగ శబ్దసాధుత్వమును గురించి విమర్శించుటయు, మూలమునకనుసరిగా తమిళపద్యములమరి యర్థపుష్టితోనుండుటయు శ్లాఘనీయముగను సంతోషకరముగను నున్నది దీనివలె వీరు మన సంప్రదాయములలోనున్న తక్కిన స్తవములకును ఎల్లరకును విశదమగునట్లు విస్తర వ్యాఖానమును తమిళ పద్యములతో రచించుచు, చిరకాలము ఆయురారోగ్యైశ్వర్యములతో తులతూగుదురుగాక యని ఆశాశించుచున్నారము

27—1—1955

శ్రీరామానుజన్

(TRUE COPY)

# SANSKRIT—TAMIL

"HINDU" dt 29/8/1954 review of Sri Guna Ratna Kosam of Parasara Bhattar with the commentary Swarna Kunchika by Thirumalai Nallan Ramakrishna Iyengar — Author, 29, Perumal Mudali St, Sowcarpet, Madras-1 **Rs 2-8-0**

After Yamunacharya and Ramanuja, Parasara Bhattar occupies the highest place in the hierarchy of Vaishnavite Acharyas His Stotra called Sri Guna Ratna Kosa consists of sixty one Slokas and is in praise of the Goddess Sri Ranganachiar Some of the Slokas in the poem give expression to ideas and sentiments concerning Sri which later Acharyas cite as an authority on the status of Sri in the religion of Vaishnavites

The Slokas have a depth of meaning and a dignity of diction which have made them famous Occasionally the sentences are elliptical and the words employed by Bhatta are of rare usage. There are several commentaries on the poem some in Sanskrit and others in Tamil. The commentary under review is in Tamil and elucidates the meaning of difficult passages in a manner that is easily understandable. In many places the author quotes panini and other grammarians as also lexicographers in support of his explanatory comments

Thirmalai Nallan's book is not only a commentary but a rendering of Sri Guna Ratna Kosa in Tamil verse and may be considered as a valuable addition to Tamil poetry Mr. V M. Gopalakrishnamachariar, the veteran Tamil Scholar, justly states in the introduction that the author's Tamil verses have spontaneity of expression as well as faithfullness to the original

The author has transliterated Sanskrit Slokas and Sanskrit passages in Tamil for the benefit of those who cannot read Sanskrit

Agnihotram RAMANUJA THATHACHARIAR

శ్రీః

# శ్రీ గుణరత్నకోశ విషయానుక్రమణిక.



శ్లోకములు


1 తనియను

2. అవతారిక

3. మంగళ శ్లోకములు 1—4

4 స్తుతించు బాధ్యత నాకేయని గ్రంథకర్త సమాధానము 5—6

5. శ్రీదేవి తన స్తుతిని దానే నెఱవేర్చుట 7—8

6 శ్రీరంగనాథునికంటె శ్రీదేవి గొప్పతనము .. 9

7 ప్రధాన ప్రమేయము శ్రీదేవి యనుట 10—14

8. శ్రీదేవి కటాక్షముఁబొందినవి మంచివి, కానివి చెడ్డవియనుట 15—18

9. లీలా విభూతిలో శ్రీదేవి పరిహాస రసము ననుభవించుట .. 19—20

10 నిత్యవిభూతిలోని శ్రీదేవీ భోగము 21

11. శ్రీదేవియొక్క పరికరములు 22

12 భోగానుభవప్రకారము .. 23—25

13. ఇతర దేవీమణులు శ్రీదేవికి అవయవములు మాత్రమేయనుట .. 26

14 కైంకర్యాంగీకార పద్ధతి .. 27

15. శ్రీదేవి భగవన్నిరూపిక యనుట 28

16. భగవంతుని పేర్మికి శ్రీదేవియే కారణ మనుట 29—31

17. దివ్యదంపతుల సాధారణ గుణములు 32—33

18 దివ్యదంపతుల విశేష గుణములు ... 34—35

19. దివ్యమంగళ విగ్రహ వర్ణనము ... 36—38

20 సౌందర్య పరవశులై గ్రంథకర్త శ్రీదేవీ పాదములపైఁబడుట ... 39

శ్లోకములు


| | | | శ్లోకములు |
|---|---|---|---|
| 21 | కటాక్ష వర్ణనము | . | 40—41 |
| 22 | దివ్యమంగళ విగ్రహ గుణములు | .. | 42—44 |
| 23. | సంశ్లేషానందము | ... | 45 |
| 24 | దివ్యాభరణ సన్నివేశము | ... | 46—47 |
| 25 | అవతార విగ్రహము | . | 48 |
| 26 | శ్రీదేవి క్షీరాబ్ధియందావిర్భవించుట | .. | 49 |
| 27. | పురుషకారమగుటకు వలసిన క్షమాతిశయము | . | 50 |
| 28 | శ్రీదేవీ మూలముననే భగవత్సంబంధమును కోరవలయుననుట | .. | 51 |
| 29, | పురుషకార కృత్యమొనర్చు విధము | ... | 52 |
| 30 | పడరానిపాటులకుఁ గారణములైన కరుణాస్వాతంత్ర్యములను నిందించుట | | 53 |
| 31. | భగవంతుడు శ్రీదేవికై యరుదైన పనులనైనఁ జేయుననుట | | 54 |
| 32 | భగవంతుడు మునిఁగియుండునంతటి శ్రీదేవి భోగ్యత | . | 55 |
| 33 | శ్రీరంగములో శ్రీదేవి నిత్యవాసము | ... | 56 |
| 34 | శ్రీరంగమునందలి అర్చాస్థితిలోని గుణాతిశయము | .. | 57 |
| 35 | త్యాగశీలతాతిశయము | . | 58 |
| 36 | నైచ్యానుసంధానము | . | 59 |
| 37 | శ్రీదేవి పురుషకారమగుట | ... | 60 |
| 38. | ఇహపరములను ప్రార్థించి స్తోత్రమును ముగించుట | ... | 61 |




శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

ఆళవందారు లనుగ్రహించిన

# చతుశ్శ్లోకీ



## తనియను

స్వాదయన్నిహ సర్వేషాం త్రయ్యన్తార్థం సుదుర్గ్రహమ్ ।
స్తోత్రయామాస యోగీన్ద్ర స్తం వన్దే యామునాహ్వయమ్॥
నమో నమో యామునాయ యామునాయ నమో నమః ।
నమో నమో యామునాయ యామునాయ నమో నమః ॥



కాన్త స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం
వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ ।
బ్రహ్మేశాది సురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసే గణః
శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్ ॥౧॥

యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః
నాలమ్మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః।
తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః
లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాన్తే! దయాం తే విదన్ ॥౨॥

## చతుశ్శ్లోకీ

ఈషత్త్వత్కరుణా నిరీక్షణ సుధాసన్ధుక్షణా ద్రక్ష్యతే
నష్టం ప్రాక్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనన్తోదయమ్।
శ్రేయో నహ్యరవిన్దలోచన మనఃకాన్తా ప్రసాదాదృతే
సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సమ్భావ్యతే కర్హిచిత్ ॥3॥

శాన్తానన్త మహావిభూతి పరమం
యద్ బ్రహ్మ రూపం హరేః
మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం
రూపం య దత్యద్భుతమ్।
యాన్యన్యాని యథాసుఖం విహరతో
రూపాణి సర్వాణి తా
న్యాహుస్స్వై రనురూప రూప విభవై
ర్గాఢోపగూఢాని తే

చతుశ్శ్లోకీ సంపూర్ణా

ఆళవందారు తిరువడిగళే శరణం



శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

ఆళ్వారు తిరునగరి - తిరుమలై నల్లాన్

రామకృష్ణయ్యంగార్లు రచించిన

# చతుశ్శ్లోకీ పాశురములు



## తనియను

ఎల్లారు మీజ్ఞిన్ప మెయ్‌ద ఎన్నిల్ మఱైయిన్
వల్లారు జ్ఞానకలా వాన్పొరుళై —చొల్లారుమ్
తోత్తిరమా యోగియర్కోన్ తూయమునై తోత్తఱరుమ్
ఏత్తువనా లన్నవనై యాన్



కాదలనార్ పురుషోత్తమన్నినక్కు,
కదిర్మణియార్ పణియరశిన్ అణైయి రుక్కై,
ఊర్తిమఱై యురువాగుమ్ పఱవై మన్నన్
ఉఱుతిరైయా ములగనైత్తు మయక్కుమాయై,
పోదనరిన్ ముదలాన పుత్తేళ్ కూట్టమ్
పొన్ఱోడియ రోడడిమై పురియు జ్ఞాట్టి,
సోదకుపేర్ తిరువెన్న దునక్కు; నిన్నై
విళమ్బువదు బగవతి! నా మెజ్జనేయో! (1)

నిన్నగిన్ర్నర్ వలనెనినుమ్ తనదే పోల
　　నెడిదియల్బాయ్ నిలై నిఱ్కుమ్ నలమే వాయ్న్ద
నిన్మడివిల్ మగిమైయుళ్ విళ్ని దె నఱ్కు
　　నిలవనల నొరుతలై వి యులగి త్కుళ్
తన్మనమార్ కాదలియే! ఎళియేఱ్ బాలుఱ్
　　దయైయటిన్ద శరణెన్రుమ్ దాసనెన్రుమ్
ఎన్మనత్తి లిత్తైయేను మచ్చు మిన్రి
　　ఏత్తిడవ త్తగైయనినై యిత్తగి న్రేనే. (2)

ఉనదరుళార్ నోక్కముదమ్ శేరిదే పాయ
　　ఉలగజ్గ ళొరుమూన్రు మవ్వా మిన్ద్రై
మునమడైయా తక్షిన్దొక్షిన్ది పొపుదు మీణ్డుమ్
　　పసున్నఱుమా లోజ్గివళర్ న్దళిక్కు ప్పెర్రై,
తనితానే యామ్మనలమ్ కాణ్డాల్ విణ్డు
　　తనదుపద మైశ్వరియ జ్గళిలామ్ ననై శ
మనిదర్దమ క్కొరుకాలు మలర్కు ణానుళ్
　　మరువణాజ్గి నరుళిన్రి వాయ్కా తన్రో? (3)

అరితళత్త త్కురుక్కొల్వామ్ పడైత్తు చ్చాన్ర
　　మామ్పరమ పిరమమెను మరిసా రూపమ్,
ఉరువుడైయ పిరమమెను మదని నన్బిఱ్
　　కుఱుకలనాయ్ వియప్పుమిగ విళై కుం మేని,
పురిన్దినిదు విళైయాడ త్కుడుత్తు కొళ్ళుమ్
　　పొన్నురువ, మివై యనైత్తుమ్ పొరున్ద నిత్కు
ఉరియనవామ్ తిరువారు మురువ జ్గొణ్డే
　　ఉఱ్గిఱుగ త్తుపువినై యె న్రుక్కిఱ్ తారే. (4)

## చతుశ్లోకీ పాశురములు

ఆళవ న్దారణి తీర్న్దిడ నమ్బియ త్తాళ్ తుతిప్పై
ఆళవ న్దారరుళ్ శెయ్దన రన్దమిళ్ వల్లవర్కై
యాళవ న్దార్వమా యాత్తనక్ శీర్మలై నల్లనియా
ఆళవ న్దారిదు వల్లవర్ యావరు మెన్దనై యే

చతుశ్లోకీ పాశురములు సంపూర్ణములు

ఆళవందారు తిరువడిగళే శరణం



శ్రీః



ఆళ్వాను లనుగ్రహించిన

# శ్రీ స్తవము

## తనియను

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః నమ ఉక్తి మధీమహే।
యదుక్తయస్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గళసూత్రతామ్॥



స్వస్తి శ్రీ ర్దిశతా దశేష జగతాం సర్గోపసర్గస్థితీః
స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వఞ్చ కుర్వన్ హరిః।
యస్యా వీక్ష్య ముఖం తదిఙ్గిత పరాధీనో విధత్తేఽఖిలం
క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాదైకరస్యాత్తయా ॥౧॥

హే శ్రీర్దేవి! సమస్తలోకజననీం త్వాం స్తోతు మీహామహే
యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియం।
భక్తింభన్ధయ నన్దయాశ్రితమిమం దాసం జనం తావకం
లక్ష్యం లక్ష్మి! కటాక్షవీచివిసృతే స్తే స్యామ
చామీ వయమ్ ॥౨॥

స్తోత్రం నామ కిమామనన్తి కవయో యద్యన్యదీయాన్ గుణాన్
అన్యత్ర త్వసతోఽధిరోప్య ఫణితి స్సా తర్హి వన్ధ్యా త్వయి।
సమ్యక్ సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ
వాగ్వాచస్పతినాఽపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥౩॥

యే వాచాం మనసాఞ్చ దుర్గ్రహతయా
ఖ్యాతా గుణా స్తావకాః
తానేవ ప్రతి సామ్బుజిహ్వా ముదితా
హ్యై మామికా భారతీ।
హాస్యం తత్తు న మన్మహే న హి చకో
ర్యేకాఽఖిలాం చన్ద్రికాం
నాలం పాతుమితి ప్రగృహ్య రసనా
మాసీత సత్యాం తృషి॥ ॥౪॥

క్షోదీయానపి దుష్టబుద్ధిరసి నిస్స్నేహోఽ ప్యనీహోఽపి తే
కీర్తిం దేవి! లిహన్నహం న చ బిభే మ్యజ్ఞోన జి హ్రేమి చ।
దుష్యేత్సా తు న తావతా నహి శునా లీఢాఽపి భాగీరథీ
దుష్యేచ్ఛ్వాఽపి న లజ్జతే నచ బిభే త్యార్తిస్తు
శామ్యేచ్ఛునః ॥౫॥

ఐశ్వర్యం మహాదేవ వాల్ప మథవా దృశ్యేత పుంసాంహి యత్
తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే।
తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణః
ధన్యమ్మన్యత ఈక్షణా త్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః ।౬॥

ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌన్దర్య లావణ్యయోః
రూపం యచ్చహి మఙ్గళం కిమపియ ల్లోకే సదిత్యుచ్యతే।
తత్సర్వం త్వదధీనమేవ హి యతశ్శ్రీరి త్యభేదేన వా
యద్వా శ్రీమ దితీదృశేన వచసా దేవి! ప్రథామశ్నుతే ॥౭॥

దేవి! త్వన్మహిమావధి ర్నహరిణా నాపి త్వయా జ్ఞాయతే
యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే।
యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః
వ్యోమాంభోజ మిదన్తయా కిల విదన్ భ్రాన్తోఽయ
మిత్యుచ్యతే ||౮||

లోకే వనస్పతి బృహస్పతి తారతమ్యం
యస్యాః ప్రసాద పరిణామ ముదాహరన్తి।
సా భారతీ భగవతీ తు యదీయదాసీ
తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ||౯||

యస్యాః కటాక్ష మృదువీక్షణ దీక్షణేన
సద్య స్సముల్లసితపల్లవ ముల్లలాస।
విశ్వం విపర్యయసముత్థ విపర్యయం ప్రాక్
తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ||౧౦||

యస్యాః కటాక్ష వీక్షా క్షణలక్షం లక్షితా మహేశాస్స్యుః।
శ్రీరఙ్గరాజమహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః ||౧౧||

శ్రీ స్తవము సంపూర్ణము

ఆళ్వానుల తిరువడిగళే శరణం

శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

ఆళ్వార్ తిరునగిరి-తిరుమలై నల్లాన్

రామకృష్ణయ్యంగార్లు రచించిన

# శ్రీస్తవ పాశురములు

## తనియను

అమ్మైపుజ మత్తైయణ జ్ఞణియు నూలెన
చ్చెమ్మైపుఱు నూల్ పల చాస్త్రుమ్ చాల్ పిన్
అమర్ మఱు వాళనా మూర్త్ వా నుక్కియామ్
నమువెనుమ్ వాళగమ్ నవిలువామరో.

మజ్ఞళజ్ఞ శైజ్ఞటుక్క మలర్ వాప్తి మజ్ఞై
మలరులగ ముఝువదుమే పడైప్పిరుప్పు
చ్చెజ్ఞరిప్పు చువర్కనర కజ్ఞళ్ వీడు
సకలముమె శెయవిత్తైదన్ ముగమే నోక్క
ఇజ్ఞైవజ్ఞ శ్శాలవఱుక్క మిజ్ఞనెన్జ్ఞె
ఎడుత్తుణర్త్తు మేన్మైయముడై యాళరుళ్ గ!
తజ్ఞళుక్కుళ్ సమరసమే నిలవ లాలే
తనిత్తువిళై వండలిన్బమ్ తారాదన్జ్ఞె

తిరుమగళే! దేవియే! నీళ్ శెగత్తుక్కెల్లామ్
　　శెననియామ్ నిన్నై యేత్త ముయలుగిన్ఱోమ్,
వరుఙ్గవిఞై యరుళుదినీ వాయ్క్కుమ్ వణ్ణమ్,
　　వళర్త్తిడుది యతివిర్గళ్ మిక్క అన్బై
పరివు నలమ్ పెఱుత్తి, మగిళ్ వుఱుత్తి యున్నై
　　ప్పుగళ్గియవి మ్మకళ్కళై యడియో మాక్కి,
తరఙ్గమెన వరుఙ్గడైక్కణోక్కమ్ పాయ్స్తు
　　తైక్కుమిల క్కలక్కుమియే! యోవోమ్ నామే. (2)

తోత్తిరమె న్నఱిఙ్ఞరెదై చ్చొల్లుగిన్ఱార్?
　　తూయగుణ మిల్లైనిను మొన్ఱై మఱ్ఱోర్
పాత్తిరత్తిల్ గుణమెన్ఱి ప్పేశ లెన్నిల్,
　　పయ నృడుమో అఙ్గ నున్నై ప్పుకవి యేత్తల్?
వార్త్తిడిలో ఇనియున్న పణ్బ నైత్తుమ్
　　పరక్కవురై ప్పదువేయాం తుతియె న్నుఙ్గ
శీర్త్తిరళామ్ తిరైక్కడలై చ్చెప్పి డఱ్కు
　　త్తేవర్గురు తనక్కేనుమ్ తిఱమై యుణ్డో? (3)

వాక్కు మన క్కెట్టాద గుణఙ్గళెన్ఱు
　　మాఞాలమ్ నిన్గుణమా ణ్బతియు మేనుమ్,
నా క్కుదనిల్ నీర్ చొట్ట చొట్ట ఎన్ఱు
　　నవిన్ఱు మొళి వరుమదో! అవైయే నాడి,
నోక్కులమే ఎళ్ళులెన, నిలవు ముగ్గామ్
　　నుగరగిలే నోరుతనియే మెన నిన్నైస్తు
నాక్కడఙ్గి యిరున్దిడుమో చకోర మెన్నుమ్
　　నామఙ్గొళ్ పఱవై నీర్ వేట్కై గ్గాళే? (4)

మిగచ్చిఱియేన్ పున్మదియేన్ నట్పి లాదేన్
మేవుగిలే నొరుపణియు మెనినుమున్దన్
పుగళ్చ్చియిన్నై త్తేవి! యతివళ్ఱనానే
పురిన్దిడువేన్ నామిశైనా ణచ్చుమ్ కొళ్ళేన్,
ఇగళ్చ్చియుద ఱ్కిడనాలెయ్దాపొ, కుఱ్కాల్
పఱ్ఱు ముడై క్కణ్డై కుడి త్తిడినుమన్నీర్
ఇగళ్చ్చియుఱాదన్నాయుమ్ నాణ మచ్చుమ్
ఎయ్దాదు, విడాయుదఱ్కో తీరు మన్ఱే. (5)

నల్వమదు పెరిదేనుమ్ శిఱియదేనుమ్
తెరిందిడలా ముయిర్గళిడై యెవ్విడత్తుమ్
శెల్విత్తిరు క్కణ్ణామత్తు ప్పార్త్తు నోక్కుమ్
శెలుత్తుదలి నామ్, ఎనినుమిదు వియప్పా
చ్చెల్లగిల మెనెనిఱ్ఱఱ్కోశన్ తానామ్
తొల్లులగి ఱ్కుత్తై నారా యణనుమ్ కూడ
నల్లపెరుమ్ బాగ్గియనా నిన్ కణోక్కున్
నణ్ణలుమె తన్నై క్కరుదుగిన్ఱా నన్ఱే. (6)

ఉయిరన్నై త్తి ఱ్కాణ్గిన్ఱ ఐశువరియం
ఉడలముఱు ప్పివై మేవు మళగు మఱ్ఱుమ్
వియనులగిల్ నలముడైయ ఇన్న వెన్ఱు
విళమ్బుగిన్ఱ పొరుళ్ మఱ్ఱ శిఱ్ఱళ్ యావుమ్
వయమేయా మునక్కడనా లన్ఱో దేవి!
మదియాదు వేఱనవే యన్నై శీరన్ఱే
పెయర్ పెఱుమా లల్లదు శీ మత్తా మెన్నుమ్
పేరిడుపో న్ఱదుకొణ్డు పేశ లామే. (7)

దేవి! నిన్ మగిమై క్కెల్లై తేర్కిలి రరియుమ్ నీయుమ్;
ఆవదన్నినిను మూనమ్ అన్నైత్తునీ రఱిన్దమైక్కు ;
యావిల వన్నై కాణామై యావదు ముణర్ద త్తెఱ్కుమ్,
పూవిదు విణ్ణావెన్ను పుగలువోఽ పిరాన్త నన్నో? (8)

ఉలగిడై యుమ్బరాశ్శాఽ మరమెన వోదుమ్ వేదన్
నలనుడై నావిఽమన్నై నల్ కరుళ్ విళ్ళైవే యాగ
చోలైలుఱుమ్, చేడెయాగిత్తోఽమ్బిన్నై యవళే శెయ్యుమ్
మలర్ మగళ్ దేవదేవఽ మగిడిమై వణఙ్గుగిన్రామ్. (9)

ఉలగెలాం తన్నొక్కిన్ని యులర్న్దుము నొబ్బిన్దుపోగ
మలర్ క్కణాఽ చిఱిదే నోక్క మసఙ్గోళు మూత్తిరత్తిల్
మలర్న్దవై తళిర్త్తు మీణ్డుమ్ వళముఱ చ్చెయ్యుమాణ్బళ్
మలర్ మగళ్ దేవదేవఽ మగిడిమై వణఙ్గుగిన్రామ్ (10)

తిరుక్కణ్ కడై నోక్కమ్ చేరుమ్ కుఱియాయ్
ఇరుక్క క్కణమ్ వాయ్కుమేనుమ్—పెరుక్కముడై
ఈశరాయ్ చ్చెయ్యరఙ్గఽ దేవి ఇలక్కుమియి
త్తాసనైయు నోక్కుగవే తాన్ (11)

మలరవ ళ్కెత్తై పయన్ద మత్తై ప్పొరుళ్ తేర్న్ద ఆఙ్ వాఽ
మలరవళ్ తన్నై వళ్ళుత్తుమ్ వడమొళ్ళి క్కవియిఽ బావమ్
మలర వన్దమిళ్ళిల్ యాత్తాఽ వణ్డమిళ్ కూఱు నల్ల
మలరవనిక్కె యిన్బమ్ వర త్తిరుమలై నల్లానే.

శ్రీ స్తవ పాశురములు సంపూర్ణము.

ఆళ్వారుల తిరువడిగళే శరణం

―――

శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పరాశరభట్టరనుగ్రహించిన

# శ్రీ గుణరత్న కోశము

---

తనియను

శ్రీ పరాశరభట్టార్యః శ్రీరఙ్గేశపురోహితః ।
శ్రీ వత్సాఙ్కసుతశ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే॥

శ్లోకములు

శ్రియై సమస్త చిదచిద్విధాన వ్యసనం హరేః ।
అఙ్గీకారిభిరాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః ॥౧॥

ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ
    నిర్వాహ కోరకిత నేమ కటాక్షలీలామ్ ।
శ్రీరఙ్గ హర్మ్యతల మఙ్గళ దీప రేఖాం
    శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥౨॥

అనుకల తనుకాణ్డాలిఙ్గనారమ్భ శుమ్భ
    త్ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధేః ।
స్తననయనగుళుచ్ఛ స్ఫార పుష్ప ద్విరేఫా
    రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్ ॥౩॥

యద్భ్రూభఙ్గాః ప్రమాణం స్థిరచర రచనా
తారతమ్యే మురారేః
వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి య
త్పాదచిహ్నై స్తరన్తి ।
భోగోపోద్ఘాత కేళీ చులుకిత భగవ
ద్వైశ్వరూప్యానుభావా
సా నశ్శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీ
లఙ్ఘనీయై రపాఙ్గైః ॥౪॥

యద్భ్యావ త్తవ వైభవం తదుచిత స్తోత్రాయ దూరే స్పృహా
స్తోతుం కే వయమి త్యదశ్చ జగృహుః ప్రాఞ్చోవిరిఞ్చాదయః ।
అప్యేవం తవదేవి! వాఙ్మనసయో రాభాసనభిజ్ఞం పదం
కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తిప్రశస్త్యైగిరామ్ ॥౫॥

స్తోతారం తముశన్తి దేవి! కవయో యో విస్తృణీతే గుణాన్
స్తోతవ్యస్య తతశ్చతే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి ।
యస్మా దస్మదనర్ఘణీయ ఫణితి స్వీకారత స్తే గుణాః
క్షాన్త్యౌదార్య దయాదయో భగవతి! స్వాంప్రస్తువీరన్ప్రథామ్ ॥౬॥

సూక్తిం సమగ్రయతు న స్స్వయమేవ లక్ష్మీః
శ్రీరఙ్గరాజ మహిషీ మధురైః కటాక్షైః ।
వైదగ్ధ్య వర్ణగుణ గుమ్ఫన గౌరవై ర్యాం
కణ్డూల కర్ణకుహరాః కవయో ధయన్తి ॥౭॥

అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మహసో
　　దుహానం సౌహార్దం పరిచితమివాథాఽపి గహనమ్ ।
పదానాం సౌభ్రాత్రా దనిమిషనిపేయం శ్రవణయోః
　　త్వమేవ శ్రీర్మహ్యాం బహుముఖయ వాణీవిలసితమ్ ॥౮॥

శ్రియశ్శ్రీః! శ్రీరఙ్గేశయ! తవ చ హృద్యాం భగవతీం
　　శ్రియం త్వత్తోఽప్యుచ్చై ర్వయమిహ ఫణామః శృణుతరామ్ ।
దృశౌ తే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః
　　పున ర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్ ॥౯॥

దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః
　　త్వత్సద్గుణౌఘ మణికోశ గృహం గృణన్తి ।
తద్ద్వారపాటన పటూని చ సేతిహాస
　　సన్తర్కణ స్మృతి పురాణ పురస్సరాణి ॥౧౦॥

అహుర్వేదా నమానం కతిచన కతి చారాజకం విశ్వమేత
　　ద్రాజన్వత్ కేచిదీశం గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే ।
భిక్షావన్యే సురాజమ్భవ మితి చ జడా స్తే తలాత ల్యకార్షుః
　　యే తే శ్రీరఙ్గ హర్మ్యాఙ్గణ కనకలతే! న క్షణం
లక్ష్యమాసన్ ॥౧౧॥

మనసి విలసతాజ్ఞా భక్తి సిద్ధాఞ్జనేన
　　శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః ।
నిధిమివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః
　　నను భగవతి! దైవీం సంపదం తేఽభిజాతాః ॥౧౨॥

అప్యేశానా జగత ఇతి తేఽనీమహే యాం సమృద్ధిం
శ్రీః! శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్।
ఈశ్షే కశ్చి జ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః
తం చ త్వత్కం పతిమధిజగా వుత్తర శ్చానువాకః॥ ॥౧౩॥

ఉద్బాహుస్త్వా ముపనిష దసా వాహ నైకా నియన్త్రీం
శ్రీమద్రామాయణమపి పదం ప్రాణితి త్వచ్చరిత్రే।
స్మర్తారోఽస్మజ్జనని!యతమే సేతిహాసైః పురాణైః
నిన్యుర్వేదా నపి చ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్ ॥౧౪॥

ఆకగ్రామనియామకా దపి విభో రాసర్వ నిర్వాహకాత్
ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరఙ్గభర్తుః ప్రియే!।
తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవ త్పుణ్యం పునః పావనం
ధన్యం యత్తదదశ్చ వీక్షణభువస్తే పఙ్చషా విప్రుషః ॥౧౫॥

ఏకో ముక్తాతపత్ర ప్రచల మణి ఘృణాత్కారిమాళి ర్మనుష్యః
దృప్యద్దన్తావళస్థో న గణయతి నతాన్ యత్క్షణం క్షోణిపాలాన్।
యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దన్తపఙ్క్తిం
తత్తే శ్రీరఙ్గరాజప్రణయిని! నయనోదఞ్చిత
న్యఞ్చితాభ్యామ్ ॥౧౬॥

రతిర్మతి సరస్వతీ ధృతి సమృద్ధి సిద్ధి శ్రియః
సుధాసఖి! యతోముఖం విచలిషేత్ తవ భ్రూలతా।
తతోముఖ మథేన్దిరే! బహుముఖీ మహంపూర్వికాం
విగాహ్య చ వశంవదాః పరివహన్తి కూలఙ్కషాః ॥౧౭॥

సహ స్థిర పరిత్రస వ్రజ విరిఞ్చనాకిఞ్చనై
రనోకహ బృహస్పతి ప్రబల విక్లబ ప్రక్రియమ్ ।
ఇదం సదసదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతం
కటాక్షితముపేక్షయోస్తవ హి లక్ష్మి! తత్త్వార్ణవమ్ ॥౧౮॥

కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్య మాలిఙ్గతోః
భూతాహఙ్కృతి బుద్ధి పఞ్చకరణీ స్వాన్త ప్రవృత్తీన్ద్రియైః ।
అణ్డానావరణైః సహస్రమకరోత్ తాన్ భూర్భువ స్స్వర్వతః
శ్రీరఙ్గేశ్వర దేవి! తే విహృతయే సఙ్కల్పమానః ప్రియః ॥౧౯॥

శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం
వైష్ణవ్యా గుణమాయయాత్మ నివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్ ।
పుంసా పణ్యవధూవిడమ్బనపుషా ధూర్తానివాయాసయన్
శ్రీరఙ్గేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే ॥౨౦॥

యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతమ్
యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః ।
సాయుజ్యస్య యదేవ సూతి రథవా యద్దుర్గ్రహం మద్గిరామ్
తద్విష్ణోః పరమం పదం తవకృతే మాత స్సమామ్నాసిషుః ॥౨౧॥

హేలాయా మఖిలం చరాచర మిదం భోగే విభూతిః పరా
ధన్యాస్తే పరిచారకర్మణి సదా పశ్యన్తి యే సూరయః ।
శ్రీరఙ్గేశ్వరదేవి! కేవలకృపానిర్వాహ్యవర్గే వయం
శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్వారణే ॥౨౨॥

ఆజ్ఞానుగ్రహ భీమ కోమల పురీపాలా ఫలం భేజుషాం
యాఽయోధ్యేత్యపరాజితేతి విదితా నాకం పరేణ స్థితా ।
భావై రద్భుత భోగ భూమ గహనై స్సాన్ద్రా సుధాస్యన్దిభిః
శ్రీరఙ్గేశ్వరగేహలక్ష్మి! యువయో స్తాం రాజధానీం విదుః ॥౨౩॥

తస్యాఞ్చ త్వత్కృపావ న్నిరవధి జనతా విశ్రమస్థావకాశం
సజ్జీకర్తుం దాస్యతృష్ణా కలిత పరికరై ః పుమ్భి రానన్దనిఘ్నైః ।
స్నేహా ద్ధ్యాన రక్షా వ్యసనిభి రభయం శార్ఙ్గ చక్రాసి ముఖ్యై
రానన్దైకార్ణవం శ్రీర్భగవతి! యువయో రాహు
రాస్థానరత్నమ్ ॥౨౪॥

తత్ర స్రక్ స్పర్శ గన్ధం స్ఫురదుపరి ఫణారత్న రోచిర్వితానం
విస్తీర్యానన్త భోగం తదుపరి నయతా విశ్వమేకాతపత్రమ్ ।
తై స్తైః కాన్తేన శాన్తోదిత గుణ విభవై రర్హతా త్వా మసఙ్ఖ్యై
రన్యోఽన్యాద్వైత నిష్ఠా ఘనరస గహనాన్ దేవి
బధ్నాసి భోగాన్ ॥౨౫॥

భోగ్యా వామపి నాన్తరీయకతయా పుష్పాఙ్గరాగై స్సమం
నిర్వృత్త ప్రణయాతివాహనవిధా నీతాః పరీవాహతాం ॥
దేవి! త్వామను నీళయా సహ మహీదేవ్య స్సహస్రం తథా
యాభి స్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే ॥౨౬॥

తే సాధ్యా స్సన్తి దేవా జనని! గుణవపుర్వేష వృత్త స్వరూపైః
భోగై ర్వా నిర్విశేషా స్సవయస ఇవ యే నిత్య నిర్దోషగన్ధాః ।
హే శ్రీః! శ్రీరఙ్గభర్తు స్తవ చ పదపరీచారవృత్త్యై సదాపి
ప్రేమప్రద్రాణ భావావిల హృదయ హఠాత్కార
కైఙ్కర్య భోగాః ॥౨౭॥

స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే!
త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్ష సమయే।
త్వమాసీ ర్మాత శ్శ్రీః! కమితు రిదమిత్థన్త్వ విభవః
తదన్తర్భావాత్ త్వాం న పృథ గభిధత్తే శ్రుతిరపి ॥౨౮॥

తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మఙ్గళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీరసి యతః
ప్రసూనం పుష్యన్తీమపి పరిమళర్ధిం జగదిషుః
నచైనన్త్వా దేవం స్వదత ఇతి కశ్చి త్కవయతే ॥౨౯॥

అవాఙ్గా భూయాంసో యముపరి పరం బ్రహ్మ తదభూత్
అమీ యత్ర ద్విత్రా స్స చ శతమఖాది స్తదధరాత్।
అతశ్శ్రీ! రామ్నాయ స్తదుభయ ముశంస్త్వాం ప్రణిజగౌ
ప్రశస్తి స్సా రాజ్ఞో యదపి చ పురీ కోశ కథనమ్ ॥౩౦॥

స్వతశ్శ్రీ! స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వేఽప్యభవ దపరాధీన విభవః।
స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం
న కుణ్ఠస్వాతన్త్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్ ॥౩౧॥

ప్రశకన బల జ్యోతిర్ జ్ఞానైశ్వరీ విజయప్రథా
ప్రణత వరణ ప్రేమ క్షేమఙ్కరత్వ పురస్సరాః।
అపి పరిమళః కాన్తి ర్లావణ్య మర్చి రతీన్దిరే!
తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః ॥౩౨॥

అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః
    శ్రీరఙ్గ మఙ్గళ విజృమ్భణ వైజయన్తి! ।
తస్మింస్తవ త్వయి చ తస్య పరస్పరేణ
    సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే ॥౩౩॥

యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతా శత్రు శమన
    స్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్త్వ సులభాన్ ।
త్వయి స్త్రీత్వైకాన్తాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా
    క్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా ॥౩౪॥

ఘన కనక ద్యుతీ యువదశామపి ముగ్ధదశాం
    యువతరుణత్వయో రుచిత మాభరణాది పరమ్ ।
ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్య హరౌ
    త్వయిచ కుశేశయోదర విహారిణి! నిర్విశసి ॥౩౫॥

అఙ్గన్తే మృదు శీత ముగ్ధ మధురోదారై ర్గుణై ర్గుమ్భితః
    క్షీరాబ్ధేః కిమ్ము జీవతా ముపగతా మన్యే మహార్ఘాస్తతః ।
ఇన్దుః కల్పలతా సుధా మధుముఖా ఇత్యావిలాం వర్ణనాం
    శ్రీరఙ్గేశ్వరి! శాన్త కృత్రిమ కథం దివ్యం వపు ర్నార్హతి ॥౩౬॥

ప్రణమ దనువిధిత్సా వాసనా నమ్ర మగ్రే
    ప్రణయి పరిచిచీషా కుఞ్చితం పార్శ్వకేన ॥
కనక నికష చఞ్చ చ్చమ్పక స్రక్ సమాన
    ప్రవర మిద ముదారం వర్ష్మ వాచా మభూమిః ॥౩౭॥

ఏకం న్యఞ్చ్య నతిక్షమం మమ పరం చాకుఞ్చ్య పాదామ్బుజం
మధ్యేవిష్టరపుణ్డరీక మభయం విన్యస్య హస్తామ్బుజమ్ ॥
త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్య కూలఙ్కష
స్ఫారాపాఙ్గ తరఙ్గ మమ్బ! మధురం ముగ్ధం ముఖంబిభ్రతీమ్ ॥౩౮॥

సురభిత నిగమాన్తం వన్దిషీవేన్దిరాయాః
తవ కమలపలాశప్రక్రియం పాదయుగ్మమ్ ॥
వహతి యదుపమర్దై ర్వైజయన్తీ హిమామ్భః
ప్లుతిభిరివ నవత్వం కాన్తబాహ్వన్తరాలే ॥౩౯॥

త్వత్ స్వీకార కలావలేప కలుషా రాజ్ఞాం దృశో దుర్వహాః
నిత్యం త్వన్మధుపాన మత్త మధుప శ్రీ నిర్భరాభ్యాం పతిమ్ ।
దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం వేదో విదామాస తే
సాత్వంల్లక్ష్మి! తవావలోకవిభవః కాక్వా కయా వర్ణ్యతే? ॥౪౦॥

ఆనన్దాత్మభి రీశమజ్జనమద క్షీబాలసై రాగల
ప్రేమార్ద్రైరపి కూలముద్వహా కృపా సమ్ప్లావితాస్మద్దృశైః ।
పద్మే! తే ప్రతిబిమ్బబద్ధ కలిక బ్రహ్మాది విమ్బామ్భకై
రైశ్వర్యోద్గమ గద్గదై రశరణం మాం పాలయాలోకితైః ॥౪౧॥

పాదారవిన్దమివ పఙ్కజరజశ్చేటీభృశాలోకితైః
అఙ్గమ్లాని రథామ్బ! సాహసవిధా లీలారవిన్దగ్రహః ।
డోలా తే వనమాలయా హరిభుజే హా కష్ట శబ్దాస్పదం
కేన శ్రీ రతికోమలా తనురియం వాచాం **విమర్దక్షమా !** ॥౪౨॥

ఆమర్యాద మకర్ణికం స్తనయుగం నాద్యాపి నాలోకిత
భ్రూభేద స్మిత విభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః ।
సాతే శైశవ యౌవన వ్యతికరో గాత్రేషు తే సౌరభం
భోగస్రోతసి కాన్తదేశిక కరగ్రాహేణ గాహక్షమః ॥౪౩॥

ఆమోదాద్భుతశాలి యౌవనదశా వ్యాకోచ మమ్లానిమత్
సౌన్దర్యామృత సేక శీతల మిదం లావణ్య సూత్రార్పితమ్ ।
శ్రీరఙ్గేశ్వరి! కోమలాఙ్గ సుమనస్సన్దర్భణం దేవి! తే
కాన్తోరః ప్రతియత్న మర్హతి కవిం ధిఙ్మామకాఙ్క్షాకులమ్॥౪౪॥

మర్మస్పృశో రస సిరా వ్యతివిధ్య వృత్తైః
కాన్తోపభోగ కలితై ర్లులితాఙ్గయష్టిః ।
పుష్పావళీవ రసిక భ్రమరోపభుక్తా
త్వం దేవి నిత్య మభినన్దయసే ముకున్దమ్ ॥౪౫॥

కనక రశనా ముక్తా తాటఙ్క హార లలాటికా
మణిసర తులాకోటి ప్రాయై ర్జనార్దనజీవికే ।
ప్రకృతిమధురం గాత్రం జాగర్తి ముగ్ధ విభూషణై
వలయ శకలై ర్దుగ్ధం పుష్పైశ్చ కల్పలతాయథా ॥౪౬॥

సామాన్య భోగ్యమపి కౌస్తుభ వైజయన్తీ
పఞ్చాయుధాది రమణ స్స్వయమేవ బిభ్రత్ ।
తద్భార ఖేదమివ తే పరిహర్తు కామః
శ్రీరఙ్గధామ మణిమఞ్జరి! గాహతే త్వామ్ ॥౪౭॥

యది మనుజ తిరశ్చాం లీలయా తుల్యవృత్తేః
అనుజను రనురూపా దేవి! నావాతరిష్యః ।
అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః!
దరదళదరవిన్దోదన్తకాన్తాయతాక్షి! ॥౪౮॥

స్ఖలిత కటక మాల్యై ర్దోర్భి రబ్ధిం మురారేః
భగవతి! దధిమాథం మథ్నత శ్శ్రాన్తి శాన్త్యై ।
భ్రమదమృతతరఙ్గావర్తతః ప్రాదురాసీః
స్మిత నయన సుధాభి స్సిఞ్చతీ చన్ద్రికేవ ॥౪౯॥

మాతర్మైథిలి! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా
రక్షన్త్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।
కాకం తఞ్చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః
సా నస్సాన్ద్ర మహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ ॥౫౦॥

మాతర్లక్ష్మి! యథైవ మైథిలజన స్తేనాధ్వనా తే వయం
త్వద్దాస్యైక రసాభిమాన సుభగై ర్భావై రిహాముత్ర చ ।
జామాతా దయిత స్తవేతి భవతీ సంబన్ధ దృష్ట్యా హరిం
పశ్యేమప్రతియామయామచపరీచారాన్ప్రహృష్యేమచ ॥౫౧॥

పితేవ త్వత్ప్రేయాఞ్జనని! పరిపూర్ణాగసి జనే
హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః ।
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వ ముచితైః
ఉపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః ॥౫౨॥

నేతుర్నిత్యసహాయినీ జనని! నస్త్రాతుం త్వ మత్రాగతా
లోకే త్వన్మహిమావబోధబధిరే ప్రాప్తా విమర్దం బహు ।
క్లిష్టంగ్రావసు మాలతీ మృదుపదం విశ్లిష్య వాసో వనే
జాతోధిక్కరుణాం ధిగస్తు యువయోః స్వాతన్త్ర్యమత్య
ఙ్కుశమ్ ॥౫౩॥

అధిశయితవా నబ్ధిం నాథో మమన్థ బబన్ధ తం
హారధనురసౌ వల్లీభఙ్గం బభఞ్జ చ మైథిలి!
అపి దశముఖం లూత్వా రక్షఃకబన్ధ మనర్తయత్
కిమివ న పతిః కర్తా త్వచ్చాటు చుఞ్చు మనోరథః? ॥౫౪॥

దశశత వాణి పాద వదనాక్షి ముఖై రఖిలైః
అపి నిజ వైశ్వరూప్య విభవై రనురూప గుణైః ।
అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే!
క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే ॥౫౫॥

జననభవనప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే
జనని! దయిత ప్రేమ్ణా పుష్ణాసి తత్పరమంపదమ్ ।
ఉదధిపరమవ్యోమ్నో ర్విస్మృత్య మాదృశ రక్షణ
క్షమమితి ధియా భూయ శ్శ్రీరఙ్గధామని మోదసే ॥౫౬॥

ఔదార్య కారుణికతాశ్రితవత్సలత్వ
పూర్వేషు సర్వ మతిశాయిత మత్ర మాతః!
శ్రీరఙ్గధామ్ని యదుతాన్య దుదాహరన్తి
సీతావతారముఖ మేత దముష్య యోగ్యా ॥౫౭॥

ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
కస్మైచి దఞ్జలిభరం వహతే వితీర్య ।
అస్మై న కిఞ్చిదుచితం కృత మిత్యథాంబ!
త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః! ||౫౮||

జ్ఞాన క్రియా భజనసంప దకిఞ్చనోఽహ
మిచ్ఛాధికార శకనానుశయా నభిజ్ఞః ।
ఆగాంసి దేవి! యువయోరపి దుస్సహాని
బధ్నామి మూర్ఖచరిత స్తవ దుర్భరోఽస్మి ||౫౯||

ఇత్యుక్తి కైతవశతేన విడమ్బయామి
తానంబ! సత్యవచనః పురుషాన్ పురాణాన్ ।
యద్వా న మే భుజబలం తవ పాదపద్మ
లాభే త్వమేవ శరణం విధితః కృతాసి ||౬౦||

శ్రీరఙ్గే శరదశ్శతం సహసుహృద్వర్గేణ నిష్కణ్టకం
నిర్దుఃఖం సుసుఖం చ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధింపరామ్ ।
యుష్మత్పాద సరోరుహా న్తరరజ స్స్యామ త్వమంబా పితా
సర్వంధర్మమపిత్వమేవ భవన స్స్వీకురు ర్వకస్మాత్కృపామ్ ||౬౧||

శ్రీ గుణరత్నకోశము సంపూర్ణము

భట్టరు తిరువడిగళే శరణం



శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్

ఆళ్వార్ తిరునగరి - తిరుమలై నల్లాన్

రామకృష్ణయ్యంగార్లు

రచించిన

# శ్రీగుణరత్నకోశ పాశురములు



తనియము

శీరార్ పరాశర భట్టర్ తిరువరఙ్గ
త్తూరాను కూఱ్ఱ పురోగితనామ్ - కూరత్తిన్
ఆళ్వాన్ పుదల్వన్ అరుళ్ శెల్వన్ ఎజ్ఞూయర్న్ద
వాళ్వాగ వాయ్కకు మగిళ్న్దు.

పాశురములు

అరియిన దన్నైత్తుయి రల్ల వైగళుమ్
తరుమరు న్దాళిలినై త్తనదు నోక్కినాల్
పెరుమ్పయ నెయ్దిడ వెఱ్ఱుమ్ పెఱ్ఱియాళ్
తిరువిను క్కుఞ్జలి శెయ్గు వామరో. (1)

ఉదిత్తిడ త్తళిర్త్త లోడాళ్ ఉలకజ్ఞ శేళ్ను న్దాఙ్గుమ్
విడత్తినిల్ ముగిళ్క్కు మఱ్ఱ విళివిళై యాట్టినాలై
వృదిత్తలై యరఙ్గమాడత్తలత్తణి దీపమెన్న
మదిత్తిడు మరఙ్గరాశన్ మగిడియా న్తిరువైచ్చార్వామ్. (2)

కణ్ణన్డాలుమ్ తణ్డు మేని కలన్దదుమ్ కవిన్కు నైజ్ఞుమ్
పణైక్కైకళై క్కారత్తు మాలాను పాదనమ్ శెళ్ప్పుచ్చేర్ న్దే
ఇణార్మలరై కొత్తుమ్ కణ్గళ్ ఎళిల్ మలర్ వణ్డు మాన
అణజ్ఞు కఱ్పగత్తిన్ వల్లి అడియనేఱ్కారుళ్గ నోక్కే (౩)

నిఱ్పనవు న్దిరివనవు మోన్ఱ త్తాళ్వాయ్
నిరుమిత్తానెవళ్ పురువ నెఱిప్పు క్కేఱ్ప
మఱ్పగర్ తో ళవన్మార్బి లెవళ్ కాణ్ చిన్నమ్
మత్తై ముడియి ఱ్పరమొఱ్పరుళిన్ శజై క్కె తీర్త్త
పఱ్పల పారిత్తై వన్ విశ్వ రూప
త్తుడనిళియిఱ్ పరియాదు భోగత్తిన్ముణ్
అఱ్పమదాయ్ క్కరత్తడక్కు మవ్వణ్ణజ్ఞే
అముదవల్లై క్కడ్డై క్కణిప్పా లణైక్క వెమ్మే. (4)

దేవి! నిన వైభవమ త్తనైక్కుమ్ శేరుమ్
తిఱత్తనవామ్ తుదివిళై ద లరిదే యన్త్రో
యావరమ తుది త్తిడఱ్కు యామెన్నార్గళ్
యాత్తశకత్తియన్మదల మునోర్కూడ
నావలిమై యిల్లాదేమ్ నామానాలుమ్
నామనజ్గళ్ పఱ్గలానిన్ వైభవత్తై
ప్పావరిశై పాడిడవే ముయల్గి న్ఱోమాల్
పావళజ్ఞళిన్ శిఱప్పు వాణ్గ మాదో! (౫)

తుది త్తిడువోర్ తుదిపడువ దన్ఱు ఉళ్ళ
తూయగుణ ఙ్గళై విరిప్పో నెఱ్బర్ మేలోర్
తుది త్తిడునల్ పొఱుప్పదనా లెన్ఱు మీదే
శుమన్దువిడు మెలెన్ని అప్పొఱు క్కొణ్డాద
ఉదిప్పిఴైగళ్ పడుమెమదు శొఱ్కళ్ శేఱ్పు
దరిదేనుమ్ భగవతి! నీ పఱ్ఱు క్కొణ్డాయ్
ఇదిఱ్పులనిల్ పొఱ్ఱై కొఱ్ఱై త ణ్ణళిము న్నాన
ఇయఱ్కుణఙ్గళ్ దేవి! నని విళఙ్గు మన్ఱే (6)

నల్లదా ముఱ్ఱ త్తానే నడత్తుగ నమదు శొల్లై
శెల్వశ్రీ రరఙ్గ రాజర్ దేవితన్ కళిర్న్ద నోక్కాల్
శొల్లియై పరుత్తిచ్చిఱై త్తొగుప్పుమ్ గుణఙ్గళ్ శోడు
వల్లునర్ శెవియిల్ వాఴ్వి మాఱిడ ప్పరుగు మాఱే. (7)

కుఱ్ఱత్తిల్ వాఴై యన్ఱు గ్గుణంపల పల్గి నెఞ్జిల్
కుఱ్ఱ విన్బత్తై నల్గి ఉళ్ళుఱ్ఱాఱ్ న్దళియ దేనుమ్
శొఱ్ఱశొల్లియెయ ప్పొఱ్ఱు శురుతిగ ళిమ్మెయా దెయ్యుమ్
పెఱ్ఱియ వాణిలీలై పెరుక్కుగ తిరువే! నీయే. (8)

తిరువుక్కుమ్ తిరువే! శ్రీ రరఙ్గ ప్పిళ్ళి
శెఱ్వనే! నినక్కుమన క్కినియ శాన
తిరుమగళై బ్భగవతియై నినక్కుమ్ మేలా
చ్చెప్పుగిన్ఱోమ్ యామిఙ్గు నన్గు కేళాయ్
కరువిక్రిగళ్ పిఱన్దిడుగ నినదు కణ్ణిల్
కాదుకోడుక్కు ఇచ్చగత్తా ఱ్కిచ్చెకఙ్గళ్
ఇరుబుయముమ్ పొరుమిమిగ వువనై కూర
ఎణ్ణి లడఙ్గాదు వెడిపడుగ మేలుమ్. (9)

పురుడర్ గళ్ పుగల్వార్ తొల్లోర్ పున్ఱ్మొగళ్ శితిదుమ్ పుల్లా
చ్చురుదియై దేవి! నిన్న శుభగుణ మణివీ డెన్ఱే
శెఱిపుదా తిఱత్తుక్కుమ్శీర్మై కెళ్ల మియ తిఱవు కోలే
తెరుక్కన ల్లితిహాసజ్గళ్ దరుమనూల్ పురాణమాది (10)

వేదజ్గళ్ పిరమాణ మల్ల వెన్బార్
వియనులగు క్కొత్తై యవనే ఇల్లై యెన్బార్
నాదనుక్కే వ్వులగిఱుక్క నల్ల నెన్బార్
నలనుడై య వచన్ఱనై ని ర్గుణనే యెన్బార్
ఏదజ్గో ళిరప్పాళ నిత్తై వ నెబ్బార్
ఇప్పడియే మదికేడ రడిత్తు క్కొళ్వార్
పోఱిత్తై యు మరజ్గత్తు విమాన ముజ్గ్ఱి
ప్పోలజ్గోడియే! ఇలకుక్కనిన క్కాగా దారే (11)

బత్తి సిద్దాన్జనత్తాల్ బగవతి! మత్తై యిల్ మూడి
వైత్తనిఱ మహిమై కణ్డు మనక్కణిఱ నిధియే పోల
త్తుయ్త్తిడు వోర్గళ్ శెల్వి! తుగళఱు బాగ్గియత్తాల్
మెయ్త్తిరు వాన దెయ్వ ప్పిఱవియే మేయా రన్ఱే. (12)

ఇత్తైవియి వ్వులగత్తిల్ క్కొన్ఱోదుని న్నిత్తైమై తన్నై
నెఱిపల విరిత్తు మేల్మేల్ నిగళ్త్తుమ తిరు! నిఱ సూక్తమ్
ఇత్తైయెన ప్పురుడ సూక్త త్తియంబియ ఒరువ నైప్పిఱ
మత్తైయను వాకముద్దఱ మగిళ్ననన్ఱోదు మన్ఱే. (13)

ఉఱ్ఱిబియ మీశువరి యాగ వున్నై
    ఉపనిడద మాత్తిరమే యుఱైక్క విల్లై
ఉయఱ్ఱియుడై చ్చీరామాయణము ఙ్గూఱ
    ఉయిరుఱువ దునదునని చరిత్తిరత్తాల్
ఉయఱ్ఱిరలు కొళుఱ్ఱాయే! మేలోక్క ళాగ
    ఉన్నుడైయ మహిమైయినుక్కు పచాదిత్తార్
శెయిర్త్తనైయు మిల్లత్తైయే మిరుది కారర్
    శీరిఖిహా సత్తుడనే పురాణ జ్జొణ్డే. (14)

తిగ్ బ్రాహ్మన్ ముదలాగ చ్చొగ మనైత్తుమ్
    తిఱమ్బామ నడాత్తుగిన్ర ఇఱైవన్ కాఱుమ్
పెన్ఱిల్ల శెల్వముమీ జ్గరఙ్గ నాదన్
    పేరన్బే! మేఱ్కోలుమ్ పెరుక్క మాగ
మన్ఱోఙ్గి వళర్న్దనవుమ్ గనత్త నవ్వామ్
    మఙ్గళము మిలఙ్గునవుమ్ బాగ్గియత్తై
ప్పెఱ్ఱనవుమ్ పావనము మఱుముమ్ నిన్న
    పెరుఙ్గరుణై నోక్కిత్తుళి ఐన్దా తానే! (15)

ఒరుముత్తు క్కుడై మణిగ ళురళ మాలి
    ఒలిప్ప "గణగణ" వెన్ర ఒరుమా నిడనార్
కరుమత్తి క్కరిమైశై పీర్త్తిరున్ద శర్బమ్
    కావలరే వణఙ్గిడినుమ్ గణిశియామై
ఇరుపత్తి ప్పుల్వారిశై యుళిత్తు మున్నే
    ఇన్నారువర్ పుగలిన్రి యేఙ్గుమ్ తనైశ్శ
పురిపిత్త ఱ్కువై ముత్తైయే తిఱుక్కు మూడుమ్
    పొన్నరఙ్గర్ కాదలి! నిన్ కణ్గళ్ తానే. (16)

నిన్బురు వఙ్గళాగ్నేల్ నెళినిడై విరుమ్బు మూక్కై
అన్బుత్తి వాక్కుమ్ ఉీరమ్ అరుఙ్గలై శెక్షివ్వ సిద్ధి
ఎన్బున పలవా అఙ్గుమ్ ఇరుకన్రై వోనుమ్ శెల్వ!
ఇన్బము దనై యాయ్! ముద్ది మున్దియె న్రైఙ్కు మాతే. (17)

పెయర్వ్వన పెయర్గిలాద పిరమనే శెల్వ మిల్లాఙ్
ఉయర్గురు నురనే మన్ ుమ్ ఉఱుపల ముగ్గోరన్గోర్
ఉయర్వ్వచ తాన్వ ాాఞ్పుమ్ నల్లతి యనవా యుఙ్కణ్
అయర్వ్వని నరుళిఙ్ నోక్కు త్తాడు తాణ్డవ మణాఙ్గే (18)

కలన్దవుయిర్ శడప్పొరుళై యాక్కు క్కాలమ్
కళ్లుఱుఙ్గాల్ ఐమ్బూత మానా ఙ్గారమ్
పుల నుళ్ళుమ్ కన్మేన్ది రియఙ్గళాతే
భూర్భువ చ్చువర్లోక ముదై య వణ్డమ
పలవాయి రఙ్గళ్మది శైన్ని నోడుమ్
పడై త్తనవా ఙ్బుఙ్కుఙ్పి త్తునదు కేళ్వఙ్
ఇలఙ్గుతిరు వరఙ్గనగర్ క్కిఱై వఙ్ దేవి
ఇన్బుఱ్ఱు నీవిళై యా ట్టయర్వ దత్కే. (19)

పొల్లాద పులనైన్దుమ్ నన్గు కాట్టి
ప్పొన్నడిమై త్తిఱత్తినై యే మఱక్కు చ్చెయ్దు
తొల్లాది పురుడనుయిర్ గళై మయక్కి
విణ్డుగుణ మూన్రైయెయినాల్ పొదువెఙ్ శొల్లార్
నల్లార్పోల్ నయవడివను పూణ్డ ఆశాల్
నయక్కిన్ర కాముకరై ప్పోల్ వరుత్తి
వల్లానాయ్ నిసదు నగై చ్చువై యాట్టత్తిల్
వళరరఙ్గ నాయకియే! విళఙ్గు గిన్రాఙ్ (20)

ఎదుమనత్తు క్కొట్టాదు తమసు కొప్పాల్
　　ఎదువియప్పు క్కురియదెదు కాల త్తాలే
ఎదుమాఱా దెదనై యడై న్దా నుక్కే
　　ఇమైయోరి న్నైవగరుమ్ నరకాంగ్ త్తోగ్ నమ
ఎదునాయు చ్చియ మన్ప్పు దీదు విల్కు
　　ఎణ్పెచ్చు క్కొదునిలమే యన్నో మాయో
సిన్నవాన వప్పరివు ఎనెను న్నాంపి
　　అన్నాయ్! నిణ్తన క్కొన్నై ఓది నాళే　　(21)

విళై యాడ చ్చరాచర మిన్నై త్తుమ్ భోగమ్
　　విళై త్తిఱ్కు మెతకు ఎఘాతి యోగుమ్
కళియాడ చ్చదాకాణుం శెల్వ రాన
　　కామరు సూరిగళావర్ పణివిడై క్కే
ఉళనాఙ్గ ళునదియల్బా కరుణై యాలే
　　ఉఱుతుణై యా నీతాఙ్గ ళిణై మై క్కోళ్
ఉళనరఙ్గ నాయకను క్కున్ఱ దేవి!
　　ఉణ్పెరుమై క్కొన్ఱ పరికరఙ్గ ళమాన్!　　(22)

అఱ్పుదమా మతియాన భోగమ్ తున్నుమ్
　　అముదోఙ్గు పొరుళ్ మలిన్దు భక్తరుక్కు
నఱ్పయనాయ్ నాకత్తి ఱ్కాప్పా ఱ్పట్టు
　　నాముఱుత్తు మానై యుడ నరుళు మేవుమ్
పొఱ్పుడై యోర్ కావల్పూ ణ్డయోఙ్గి యెన్నుమ్
　　పుగలపరా జిత్తై యెన్నుమ్ వేదమ్ పోఱ్ఱుమ్
నఱ్పురమే తలై నగరామ్ నాయగఱ్కుమ్
　　నళిరరఙ్గ క్కోయిలిల క్కుమియే! నిఱ్కుమ్.　　(23)

అవ్వాయినిఱ్ కరుణై యెన చ్చొన త్తిరళ్ గళ్
అళవిన్ఱి యుళ్ళై ప్పాఱ ఱ్కిడ ముడైత్తాయ్
అవ్వవకై క్కొడుకరువి యడియై పూఖమ్
ఆవలుడఱ్ ఉవగై మిగున్దవర్క్కెన్దు
తెవ్వాలతా యినున్దెయ్వ ప్పడైక శిన్బిఱ్
శిఱున్దు ముయన్ఱ త్తిడవే బయన్దిరిన్బ
ప్పవ్వమణి యాత్తాన మణ్డప త్తె
ప్పగర్ వర్ తిరు! బగవతి!ను మ్మరుపిర్ కుఱ్మ్మె (24)

పూన్దెరియల్ పోలమణి గుణమ్ పొలిన్ద
పొఙ్గుమణి యొళ్మేలా ప్పడైయ సన్ద
పాన్దళుడల్ విరిత్తదన్మేల్ వీఱ్ఱిరున్దు
పల్లులగు మొరుకుడైక్కీఱ్ ప్పడ నడాత్తి
చాన్దముడఱ్ తానుగరుమ్ తనదెణ్ణఱ్ఱ
శాన్తోదిత గుణఙ్గళానిఱ్కుమ్
కాన్దనుడ నాఙ్గొరువర్ కొఱుత్తర్ దేవి!
కలన్దొన్ఱు దలిఱ్కనివాఱ్ భోగమ్ శేర్త్తి. (25)

ఇరుపీఱ్ఱ మనుభవిత్తఱ్కినియ రాగి
ఇన్ద్రియమై యాదుమలర్ శాన్దు పోల
ప్పెరుకాఱ్కుమ్ పిరేమత్తిఱ్ వెళ్ళమ్ కేడు
పిఱప్పియా వాఱమెత్త మఱుకా లాయ్నిఱ్
పొరువాఱ్కుమ్ పువిమడన్దై యోడు నీళై
పోన్ఱవా యిరన్దేవి మాఙ్గ ళుళ్ళార్
ఇరుపాఱ్కుమ్ విక్రిక్ళెక్కైక్కొణ్డన్న
ఎన్దలై నీ యవరాలిఱ్ పుఱుత్తి దేవి, (26)

ఉఱ్ఱార్ పో నట్పురిమై యుడలమ్ కోలమ్
ఉయిరినిలై శెయల్ భోగమ్ పణ్పాడాణ్డిల్
శఱ్ఱైనుమాఱెన్ని కుఱ్ఱమెన్నుమ్
శొరాదు నాత్తియ దేవర్గళెప్ప
ప్పెఱ్ఱార్గ ళుక్కురుగి క్కుళమ్బి యెణ్ణాన్
క్రైమైయినా త్తెయువిత్తి పణియిల్ పుఱ్ఱోర్
కుఱ్ఱైవ అక్కురీన్తోయ్! తిరువే! యెన్నున్
కుళిరరఙ్గ కోనోడున్దన్ పఱై కళత్తే. (27)

ఇన్దవిత్తై మైయురిమై ఎమ్బిరాక్కే
యిఱుక్కుమా సీతకు పు మేఱ్ఱత్తాలే
సన్దనవా మివై తమ్మై మనత్తి లెణ్ణి
వఱై యఱుక్కు పుగ్నమలరి న్మగళే! తాయే!
ఇన్దుముఖి! యేన్దలుడై యిదువాత్తనైత్తు
ఇనై యదా త్తనైయవా మేఱ్ఱ మావాయ్
అన్దముఱై యడఙ్గుదలా లవను క్కెళ్ళ్
అరుమఱైయు మునై వేఱా యఱైన్ద దిల్లై (28)

మఙ్గళ ప్పెయ రీశఱుక్కు వన్దుళ్ తోడర్ బా నిఱోక్కు
అఙ్గన న్ఱిం౦దియఱైక్క యల్లైయో తిరునీ! అల్లి
నఙ్గయే! శిఱు ప్పులర్కు నఱుమణాత్తా లదఱుక్కుమ్
ఎఙ్గనమ్ శిఱప్పు క్కేతు వియమ్బువళ్ కవిఞ్ఞళ్ మాదో! (29)

కఢై క్కణాల్ తిరు! నీ మిక్కు క్కణ్డాదు పరబ్బిరమ్మమ్
పడై త్తన విన్దిరాది పారై ప్వగ శిరణ్డు మూన్తే
ఎడు త్తిరు పొరుళు మోడి ఇయమ్బియదునై యే వేదమ్
పడి త్తిడిల్ నగర్ శెల్వఙ్గళ్ పార్థివళ్ పుగఴ్ వా గాదో? (30)

ఇయల్బిని ఱ్చెత్తా మున్నాల్ ఇఱై శిఱప్పెయ్‌ది నాలుమ్
అయ ల్వారు శాలే యాగుమ్ అదిశయ ముఱ్ఱైయ నాగా఩
సుయ ఒళి తులక్కు మేనుం తూమణి గుణ మఱ్ఱ్రాన్ఱాల్
ఉయర్న్దదు తిరు! ముదన్మై ఒన్ఱిన్దదే఩ ఉఱైక్కుప్పోవమో? (31)

మిగుమాఱ్ఱల్ బలమ్ తేశు మెయ్యోణర్ తల్
విజయమ్ శేర్ పుగళుడనే ఐశువర్యమ్
అగవాయి లన్బుడై మై యజ్ఞినారై
ఆదరిత్తు వయమాక్కల్ కాత్తిలాడి
మగిళ్ వేఱ్ఱు ముయిర్గుణను ముఱుప్పిల్ మేపుమ్
వనప్పు మణమ్ ఒళిమేని యళగే఩ జిన్న
భగవానుమ్ నీయు మెయి ప్పణ్పి నజ్గళ్
పరమేశువరి! పొదువాయ్ ప్పడైత్తు శీరే. (32)

ఇన్నము మిరువర్ తజ్గళ్ ఇళమై ముఱ్఩ నిట్ట పణ్బు
మన్నియే పొదువాయ్ మాఱ్ఱి మాఱ్ఱి మఱ్ఱవరి ఱ్ఱోన్ఱి
నన్నిలై కణ్డాడి యిఱ్ఱ్పోల్ ననితిగళ్న్దళిక్కు మిన్బమ్
మన్ను తెన్నరజ్గత్తోజ్గు మజ్గళక్కోడి పోల్ వాళ్గే! (33)

పగర్న్దన పొదువె న్ఱాలుం పగై తెఱల్ తిరమ్బు అఱ్ఱాట్
పుగున్దిడ లిన్మై యిన్న పురుడర్ పణ్పిఱ్ఱెయిల్ వైత్తుమ్
మగిళ్ నరు క్కాదల్ మెన్మై పొఱైయరుళ్ మగట్ప ణ్బన్దే఩
అగముఱ వైత్తు న్తుయ్య అడైన్దనళ్ రాన్మ జేదమ్ (34)

కరుముగి ల్పోన్ని నాట్ట్రి కట్టిళైక్కాళై మణ్ణై
ప్పురువమ న్నిలై క చ్చుట్ట్రు ప్పాల్ వగై వెవ్వేఱాన
ఉరువిని లొళిరు నఱుప్పోశ్ ఉఱుది నీ తుయ్త్త మఱ్ఱుమ్
అరిమిశై పీత్తు న్నీధుం అమ్ముళ త్తాడువాళే! (35)

మదియముగు మదు కఱ్పవల్లి మానుమ్
మాఱ్ఱప్పెరుళ్ళ తన్నైయుఱ గినిమై వన్నై
మెదుమైయెనుమ్ గుణఙ్గోళ్గళ విళఙ్గు మఙ్గమ్
వెఙ్గిరుప్పా ఱ్కడల్కొప్ప కోడాయ్ నిన్తే
అదికమది ప్పదనాలే యమ్మైన్న పోలుమ్
అన్నై యెనవే అగఙ్గలఙ్గి వరుణి త్తిట్టాల్
అదుదివియ మామాక్క ల్పేచ్చే యన్ఱ
ఆరుడమ్ము కడుకుమో? శీ రరఙ్గత్తాళే! (36)

వణఙ్గినా రిట్టైయున్ ఎణ్ణిళ వాసనై యదనాళ మీఁదు
వణఙ్గియఱ బన్నై నెరుఙ్గుమ్ వాఴ్చ్చియా ఱ్పడై శెరుఙ్గి
మణఙ్గమళ్ శెణ్బ కప్పూ మాలై యొడుఱై పొ న్నన్న
గుణఙ్గోళి వ్వన్నై మేని కూఱుద ఱ్కోళిదో అమ్మా! (37)

నళినమల ర్త్తాళ్గొన్ను నాలవిట్టు
నాన్వణఙ్గ మఱ్ఱుమొరు తాళ్ మడక్క
నళిర్ కమల క్కరమబయం నల్గవైత్తు
నాప్పణలర్ తామరై మేల్ వీఱ్ఱిరుప్పాయ్!
అళికరై యి ప్పొరువు మగళ కడైక్క ణోక్కున్
అఱై యెఱియు నని యినియ ఎళ్ళిల్ ముగత్తాయ్!
కళిపెరుగ క్కణక్కిన్ఱి యన్నాయ్! ఉన్నై
క్కణ్డోఱుమ్ కణ్డోఱుమ్ కాణ్బె మియామే (38)

పైన్దాళై పనినీర్ పెయ్యుమ్ పాన్మయిల్ మిదిత్తు ప్పుల్గాల్
మైన్దనిఙ్ విర్నద మార్పిల్ వైజయన్తిమై యలర్త్తి
ఇన్దిరై! మత్తై యన్నత్తై ఇన్మణాన్ పుణర్తున్ పూవిఙ్
శన్దమా రిదర్త్తేఙ్గ్ నిన్దఙ్ తాళ్గై వన్దిప్పేనే. (39)

నీశిఱిదే కన్దైక్కుశిప్ప నిరుపర్ కణ్గళ్
నిలవుమద త్తాఱ్ఱాలఙ్గి నిలపాయల్ల
పేశిడఱ్ఱాఙ్ పతికణ్గళ్ నాళుమ్ నీయామ్
పిరస త్తై ప్పురుగి మదమ్ పిడిత్తవఙ్డిఙ్
తేశుడనే తిగళ్ళువదాల్ అవనై వేదమ్
శెఙ్గమల కణ్ణానెన త్తెరిన్ద దన్రే
పేశువది జ్గిలకుఱ్ఱమిదే! నే ఱే నిన్దఙ్
పీడు పెఱు పార్వైయినై యెవ్వాఱో దాఙ్ 2 (40)

ఇన్బవడి వాయిత్తైవ న్నన్నై ఘుళ్ళుకుఱ్ఱమ్
ఎకఱ్ఱాళిప్పి న్నిమిర్తు మడి న్దీరమాగి
అన్బినిన్మడ అళవాక వళవు మిఱుమ్
అరుళ్ వెళ్ళ న్దనిలెమ్మ నోక్కై సూట్టి
మున్బిడఙ్గొ శయఙ్ ముదలోర్ తివళై దోఱుమ్
ముగ్గినశై కలహమిడ మూళుమ్ శెల్వ
వనొప్పత్తైయి నడై యిడఱు నోక్కి జాఱ్ఱప్పాయ్
మఱుప్పుగలి లడియేనై మలరి నాళే (41)

పఙ్గయత్తాళ్ పదుమేనుమ్ పాదమ్ తున్ఱు
ప్పదువదువే చేడిమా రుఱ్ఱు ప్పారిల్
అఙ్గమద ప్పాళ్దన్నాయ్ ! వాడి ప్పోగుమ్
అరుణచ్ఛాయలే విళై యాడు మలర్ శుమత్తల్
తోఙ్గుమరి తోళిల్ వనమాలై యానీ
తుయరన్దో ! ఎనక్కిడమా మూఞ్జిలాడల్
ఎఙ్గనమా ఇమ్మిగమెల్లియలుడమ్బై
ఇలక్కుమియో ! వాశకత్తాల్ కసక్కలాగుమ్ ! (42)

ముళువదు జ్కోడై ముఱ్ఱ ముడిన్దిల తిరై ఇచ్చ లిన్నుమ్
విళ్ళినగై పురువ లీలై విట్టిల ఇయల్పుళిప్పై
కుళవు యౌవనఙ్గళ్ కూడుమ్ వాసము న్మోని కూరుమ్
ఇళ్ళిది నీ బోగ వెళ్ళత్తు ఏన్దలిఙ్ కర మ్బిడిత్తే (43)

అఙ్గమెను మెన్మలర్ కళరియ గన్దమ్
ఆచ్చరియ మాయ్కమళ వాడాదెన్నుమ్
తఙ్గియ యౌవన మలర్చ్చి యుడను ఉప్పేర్
తణ్ణముదా ఉక్కళిర్న్దు మిగ విలా వణీయమ్
ఎన్గిన్ఱ సూల్దన్నిల్ ఇరైయెయ కోత్త
ఇన్దొడైయ లెనవన్బి మార్పుకేల్పు
తఙ్గినై శీరరఙ్గత్తిఙ్ తలైవి ! దేవి !
తగ విన్ఱి కలఙ్గి యిఙ్ఙ్ శాఱ్ఱినేనే ! (44)

చువై తరు నరమ్బు మర్మమ్ తొడువన తొట్టుత్తాక్కి
నవై యఱ లీలై నాదఙ్ నడత్త నీ దువణ్ణు మేని
చువై యఱి శురుమ్బు శేర్న్దు తుదైత్త పూన్దొడై యల్ పోల
ఉవగై యిల్ ముకున్దనై నీ ఉయ్త్తి యెన్నాళుమ్ దేవి ! (45)

ఴనకమే కళై ముత్తారమ్ కాదణి శిలమ్బు చుట్టి
ఇనమణి చ్చరమె న్ఱిన్న ఎళ్ఴిలిఴై యణిన్ది యఱ్చేర్
ఉనదుడల్ మలరిఱ్ కళ్ప వోణ్గొడి కణ్డిఱ్ పాలుమ్
ఎన వొళిర్ తరుణ్జనార్దఱ్ ఇన్నుయి ర్కేదువావాయ్! (46)

పదిమై న్దగల మేన్దు మెళ్ళిల్మణి వైజయన్తి
ఆదినీ తాఙ్గిఱ్ తున్బ మూామెన ప్పోదు వానాలుమ్,
కాదలఱ్శుమన్దు తానే కనమ్ కరు దాద రఙ్గమ్
పోదరు మణిపూ్ప జోడ్తే! పుకుమునై త్తుయ్ప్ప దఱ్కే. (47)

వేణ్డియే విళై యా డఱ్కు విలఙ్గుమా నిడ ప్పిఱప్పై
పూ్పణ్డిదు న్దోఱు మేఱ్ప పోన్దనీ తోన్ఱిడాయేల్
యాణ్డుని న్నన్బఱ్ తాయే! ఇన్బనాం? శిఱిదలర్న్దు
కాణ్డగు కమలమ్ పోలుమ్ కవినుఱు కణ్ణాయ్! దేవి! (48)

కడకముమ్ తోడై యలుమ్ కఴల కైగళాల్
కడై యిఱై తయిరెన కట్టై ప్పా నీఙ్గిడ
ప్పడు నిల వెనసగై పారై వ్వాయి బ్బగవతి!
కడలము దళై చ్చుళ్ఱి కాణ వన్దనై. (49)

అన్నాయ్ శీరై మ్మదిలియే! అరక్కర్ యర్కళ్
అన్తైక్కమ్ పైఙ్కన్ఱమ్ పురియా నిఱ్ప
అన్నారై యళిత్తనుమఱ్ అళియా వణ్ణమ్
అళిత్తనై యా లిరామనదు కుఴువిఱ్ మేన్మై
తన్నావి బ్బురణమెన త్తగుది వాయ్న్ద
దశముకనిఱ్ తమ్బియొడు కాక జ్కాత్త
తెన్నావదు? ఇరుఙ్కన్ఱ మిఴైక్కి న్ఱోము
కిన్బమున దియల్బాన పొఱుమై నల్గ! (50)

తాయాగు మిలక్కుమియే! జనక నూరిల్
జనజ్గళైన యామునైయే శార్వ్వో మావోమ్
నీయేఱ్కుమ్ పణివిడైయి నిన్బ మొన్ఱై
నిన్నైయు మనత్తిలగు కరుత్తోడు నిలత్తుమ్
చేయామ్ విణ్వాత్తుమణ మగని నక్కు
త్తిరుక్కణావ నెన్నవుమున్ తోడర్ప్ప ఱ్కణోర్పమ్
మాయోనై వణజ్గిడువో మిన్ను మేవల్
పురిన్దిడువో మనమిగవు మగిఴ్వు వోమే (51)

అప్పున్ పో లునదన్బ నన్నాయ్! కుఱ్ఱమ్
ఆర్న్దుళ్ల మక్కళిదమ్ తోడర్న్దు నాడి
నెప్పొఴువే తిరువుళ్ల మెన్ఱై క్కేనుమ్
వెకుణ్డిడుమే లన్ఱవనై యిందెన్ శీఱ్ఱమ్?
తప్పువే శెయ్యాదార్ చగత్తిలార్దాన్?
చాఱ్ఱిడువా యెనత్తక్క విరిగి నాలే
అప్పిళ్ళైగళ్ మఱక్కచ్చెయ్ దవనో డైమ్మై
అణైత్తిడలాల్ నీయన్నై యాగిన్ఱాయే (52)

ఇఱైయోను కేన్నాళుమ్ తుణైవి! యున్దన్
ఏఱ్ఱమెలా మెడుత్తున న్నియమ్బు నాలుమ్
ఇఱైయేనుమ్ శెవియేఱా ఇన్ద లోక
త్తైమై యేఱ్క వన్దునీ పడుమ్ పాడెన్నే!
అఱైమీదు నడన్దడిమెల్ లలర్గళ్ వాట్టమ్
అడైన్దనకాణ్ కాన్బిరిన్దు తున్బ డైన్దాయ్
నిఱైకరుణై యొడు తాయే! నీవిర్ కొణ్డ
నెఱి కడన్ద సుదన్దిరముమ్ నిన్నై శెయ్వామ్ (53)

తడఙ్కడ ల్పాయ్న్దాన్ సేతు శమైత్తనన్ కడైన్దా నాదన్
కొడియెన వరన్దన్ వల్విల్ కుఱైత్తన నరకన్ పత్తు
ముడితడి న్దుడల మాడ మున్నమర్ కణ్డాన్ సీతే!
ముడిన్దిడ ఉన్ విరుప్పమ్ మున్దుమన్ ముడియా నెన్నో? (54)

ఆయిర మాయిరమాన వడిగళ్ కైగళ్
ఆననఙ్గ ణయనఙ్గ ళాది యేయ్న్దు
మాయిరుమై వాయ్న్దతన విశువ రూప
మహిమైయినా లేఱ్పడైయ కుణఙ్గ ళాలుమ్
శేయొరు తామరై వాళ్వాయ్! శనిత్త లాలుమ్
సిఙ్గార నలనుయ్ప్పా నినదు నేశన్
పోయొరు మాలైయిల్ మాఱ్గి ప్పొగి న్దానిన్
పురిలళిత లీలైయెను ఇచ్ఛశివాయ్ ప్పట్టే. (55)

పిఱన్దగ త్తన్బినాలే పీడుపా ఱ్కడత్పెఱుత్తి
శిఱన్దగ మున్దన్ శెమ్మ లన్బినా ఱ్పెచ్ఛివ్పెఱుత్తి
మఱన్దగ మఱై మగిళ్న్దు మక్కళై మ్మనోరై క్కాక్క
చ్చిఱన్దగ మ్మిందే మెన్ఱు శెనని! శీరరఙ్గిల్ వాళ్త్తి (56)

పణ్మైయు ఙ్కరుణైయుమ్ వాఱ్చల ముదలన
ఉణ్మైయి లరఙ్గుఱై యునక్కొరో ప్పిలైయనాయ్!
పెణ్మణి జానకి పోలున పిఱవిగళ్
ఎణ్ణిడి లిన్నిలై క్కేన్ఱ నఱ్పయిఱలే. (57)

అఞ్జిఱ ప్పకర మాక్కవో అమ్మనాయ్!
అఞ్జలి శుమప్పవర్ క్కరుళియ మేల్పయా఩్
ఎఞ్జఱ పీకల నెన త్తలై కునిదియేల్
కొఞ్జమో కూఱుది అమ్మ! ఏ఩్ కొణ్డై త్తిఱ఩్? (58)

శఱ్ఱుమే యఱివు కన్మం బత్తియా ఇచ్చప్పత్తిలె
కఱ్ఱిలే నిచ్చై పెఱ్ఱి కవుశల మిరజ్గల్ దేవి!
కుఱ్ఱమే పురియా నిఱ్ప఩్ కొదిక్కను మ్మిరుపీ రుళ్ళుం
ముఱ్ఱుమే మూర్కనేనై ముడియుమో తాజ్గనీదా఩్ (59)

తొల్లవ ర్శ్మయ్యో శొల్లుమ్ తూనెఱి తొడరు వేనోల్
ఎల్లైయి ల్లామ లిజ్గ఩్ ఇయమ్బిన఩్ చలజ్గ ళన్దో!
అల్లదు తాయే! ఉన్ద఩్ అడిమలర్ ప్పెఱవే఩్ కైయిల్
వల్లమై యిలైయ దఱ్కు వల్లైనీ విదియినానాయ్. (60)

తిరువరజ్గ నగర్తనిలే నణ్బరోడే
శేర్న్దిడైయా ఱుఱుదుయర మిన్ఱి నూఱు
వరుడజ్గళ్ సుకమాగ వడిమై యిన్బం
వాయ్న్ద పెరు వళ఩్ తుయ్త్తు వాళ్న్ద పిన్నర్
ఇరువరుమా ముమదుపద మలర్త్తా ళావోమ్
ఈన్ఱోయు మెన్దైయునీ శెయ్యుమెల్లా
ద్దరుమమునీ యెన్దమక్కుత్తానే యాగి
చ్చాచ్చదనమ న్ఱియల్బాన దమైశెయ్ వాయే. (61)

తిరువినై నవిలుమ్ బట్టర్ తేమొழி తన్నైత్తానుమ్
తిరువినై యమైత్తు నన్నర్ త్తిరుమలై నల్లార్యాత్త
తిరువినై యిదనై యోర్న్దే యిన్బమిழ் వల్లీర్ ! ఉళ్ళ
త్తిరువినై నీఙ్గుమ్ వణ్ణ మెణ్ణినీ రియమ్బు వీరే.

శ్రీగుణరత్నకోశ పాశురములు సంపూర్ణము

భట్టరు తిరువడిగళే శరణమ్.



శ్రీః



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పరాశరభట్ట రనుగ్రహించిన

# శ్రీ గుణరత్న కోశము

తనియను

**శ్రీ పరాశరభట్టార్యః శ్రీరఙ్గేశపురోహితః ।**
**శ్రీ వత్సాఙ్కసుతశ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే॥**

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గేశ పురోహితః | శ్రీరంగనాథునికి పురోహితులును | శ్రీ పరాశర భట్టార్యః | శ్రీపరాశర భట్టరను పూజ్యులు |
| శ్రీ వత్సాఙ్క సుతః | కూరత్తాళ్వానుల కుమారులును, | మే | నాకు |
| శ్రీమాన్ | శ్రీమంతులును నగు | భూయసే | అధికమైన |
| | | శ్రేయసే | హితముకొఱకు |
| | | అస్తు | అగుదురుగాక |

ఈ తనియను నంజీయరుచే ననుగ్రహింపఁబడినది భట్టరువారి శిష్యులు నంజీయరు గ్రంథమునుండి వేర్పడియున్న కారణముచేత తనియనని చెప్పఁబడుచున్నది

శ్రీ పరాశర భట్టార్యః— ఇయ్యది శ్రీ గుణరత్నకోశమును రచించిన వారి దివ్యనామము శ్రీ ఆళవందారుల యభిప్రాయము చొప్పున ఎంబెరుమానార్ల చేత నీ గ్రంథ కర్తకీ పేరు పెట్టఁబడినట్లు చెప్పఁబడుచున్నది భట్టరు=శాస్త్రము తెలిసినవారు ఆర్యః = గొప్పఁదనము గలిగినవారు తత్త్వము కాని విషయము లందుఁ దమ తెలివినిఁ బోనీయనివా రార్యులని శ్రీ వేదాంత దేశికులు వివరించి యున్నారు "అతత్త్వేభ్యః దూరా ద్యాతా బుద్ధిః యేషాం తే ఆర్యాః" అని వారి దివ్య వాక్కు.

“అణ్ణిక్కుఙ్గ్ అముదూఱుమ్” (తియ్యనై యుండునై, అమృతములూరుచును) “శొల్లప్పుగిల్ వాయముదమ్ పరక్కుమ్” (పలుకఁ బూనినపుడు నోట నమృతము పొంగి పొరలును) అను రీతిగా నాచార్యుని దివ్యనామము భోగ్యముగనుండుట చేత మొట్టమొదట నది యనుసంధింపఁబడినది

గురుని పేరు చెప్పఁగూడదను నిషేధము గురువును పేరుపెట్టి పిలువఁగూడదను నర్థము గలది, కాని యనుసంధానమును నిషేధింపదు ఈ గ్రంథకర్తకు రంగనాథుఁడనునదే మొదటి పేరని తెలియవచ్చుచున్నది

శ్రీరఙ్గేశపురోహితః — పురోహితము = వేదమును విన్నవించుట, పురాణము సేవించుట మొదలగునవి ఎంబెరుమానార్లు తిరువరంగత్తముదనారువద్ద నుండి యాళ్వానునకుఁ దీసి యిచ్చిన పురోహితము, వారి కుమారులగుటంబట్టి వీరికిని బ్రాప్తించినదని చెప్పఁబడుచున్నది ప్రథమాచార్యులైన రంగనాథునికిని నాచార్యులని చెప్పఁబడినది

శ్రీవత్సాఙ్కసుతః — అనఁగా రాజకుమారుఁడనుట వంటిది

శ్రీమాన్ — శ్రేష్ఠైశ్వర్యము గలవాఁడని యర్థము శ్రేష్ఠమైన యైశ్వర్యమనఁగా వైష్ణవ లక్ష్మి “ధనమాయతానే కైకూడుమ్” సంపద లగునవి తామె లభించునను వచనమును గాంచుఁడు ఇక, “శ్రీవత్సాఙ్కసుతః శ్రీమాన్” అను నీరెండు పదములను జేర్చి యాళ్వాను కుమారుఁడగుటచేత శ్రేష్ఠములైన సంపదలు గలవారనియుఁ జెప్పనగును ఆగర్భ శ్రీమంతులనుట ఇప్పుడు ఐశ్వర్యమనునది యెంబెరుమానార్లయొక్క సంబంధమే! ఈ యైశ్వర్యమును బొందిన యాళ్వానునకు జన్మించిన యీ గ్రంథకర్తకును బరంపరగా నిది లభించినది సహస్రనామ భాష్యమునందుఁ దన్నుగుఱించి (జాతో లక్ష్మణ మిశ్రసంశ్రయ ధనాత్ శ్రీవత్స చిహ్నాత్ ఋషేః) ఎంబెరుమానార్ల నాశ్రయించుటయను నైశ్వర్యమును బొందిన యాళ్వానను ఋషియొక్క కుమారుఁడనని చెప్పుకొనియుండుట నిచ్చట గమనింపఁదగినది రత్నకోశమును లోకమునకొసఁగు నుదారతనుబట్టి “శ్రీమాన్” అనియుఁ జెప్పఁదగును ఆచార్యుఁడు శిష్యుని యాత్మ నుద్ధరింపఁజేయును గావునఁ దమ యాత్మ నుజ్జీవింపఁ జేయవలసినవారు భట్టరే యని చెప్పుచున్నారు దీనిచేత నాచార్యాభిమానమునందుఁ దా నుండుటను నంజీయరు చూపించినవారైరి

“తనక్కేయాగ ఎనైక్కొళ్ళుమ్ ఈదే” (తమకొఱకుఁగానే నన్నంగీకరించు నియ్యది)యనునట్లుగాఁ దాను పొందు శ్రేయస్సుకంటె నాచార్యుఁడు పొందించునట్టి శ్రేయస్సే మేలైనది గనుక “భూయసే” యను విశేషణమును గూర్చిరి.

తనియను

శ్రీరాన్ పరాశర భట్టర్ తిరువరఙ్గ
త్తారాను క్కుళ్ళ పురోహితనామ్ - కూరత్తిన్
ఆళ్వాన్ పుదల్వన్ అరుళ్ శెల్వన్ ఎమ్మైయాళ్
వాళ్వాగ వాయ్క్క మగిళ్‌న్దు.

శ్రీమంతులగు పరాశరభట్టరు శ్రీరంగము వెలసియున్న శ్రీరంగనాథునకు దగిన పురోహితులు, కూరత్తాళ్వాన్ కుమారులు, గొప్ప సంపదలు పడసినవారు, వారు నాకు ప్రీతిపూర్వకముగ బరమహితమును గూర్చువారగుదురు గాక!

---

శ్రీః

ఎమ్పెరుమానార్ తిరువడిగళే శరణం

అవతారిక — శ్రియఃపతి కనుగ్రహపాత్రులైన శ్రీ నమ్మాళ్వారులయొక్క మార్గము ననుసరించిన మన యాచార్యులనుగ్రహించిన ప్రబంధము లన్నిటిలోను ద్వయ మంత్రముయొక్క పరిమళము వెల్లివిరియుచుండును భగవంతుని కటాక్షము చేతను, ఆళ్వానుల సంబంధముచేతను సమస్తము నెఱింగిన శ్రీ పరాశరభట్టరు "శ్రీ గుణరత్న కోశము" "శ్రీ రంగరాజ స్తవము" అను రెండద్భుతములైన స్తోత్రములలో ద్వయమంత్రము పరిమళించునట్లొనర్చియున్నారు శ్రేష్ఠ మంత్రమైన ద్వయము గాక చేతనులుజ్జీవింప మఱొక మార్గమేదియు లేదు గనుక నీ గ్రంథకర్త దానినే వివరించుచున్నారు

ద్వయ మంత్రమునందుండు "నారాయణ" పదమునకు సౌలభ్య పూర్ణమైన యర్చావతారమునే యర్థముగా గ్రహింపవలయును అట్లు గ్రహింపగా దక్కిన యర్చామూర్తుల కన్నింటికిని మూలమై వెలసియుండు శ్రీ రంగనాథుడే ద్వయ మంత్రమునందు బ్రతిపాద్యమైన యుపాయము, నుపేయము నగునని యీ గ్రంథ కర్త సిద్ధాంతము కనుక, ఆ విధముగ ననుభవించి యాయనుభవమును దనలో నణంచుకొనజాలక పరమకృపతో నీ తత్త్వమును బ్రబంధరూపమున వెల్లడించిరి శ్రీ రంగనాథుని నుపాయముగా ననుభవించునపుడు ఉపాయమగునట్లు పురుష కార మొనర్చు శ్రీదేవి యనుభవము గలుగక మానదు ఉపేయముగ ననుభవించు నపుడు శ్రీదేవియు నుపేయము గనుక శ్రీదేవి యనుభవము నిందు జేరుచున్నది శ్రీ రంగనాథుని దేవియైన శ్రీరంగనాచ్చియారే ద్వయమంత్రమందలి శ్రీ శబ్దమునకు విషయముగా ననుసంధింపవలసియున్నది ఈ గ్రంథకర్త తండ్రియైన యాళ్వానులు

శ్రీ స్తవము రచియించుటలో "శ్రీరఙ్గరాజ మహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః" అని వ్రాయుచు శ్రీ రంగరాజ మహిషిని శ్రీశబ్దమున కర్థముగ ననుసంధించిరి ఈ గ్రంథకర్తయు "శ్రీ గుణరత్నకోశ" మని శ్రీరంగనాచ్చియారుల గుణములనే యనుసంధించుటను జూచుచున్నాము

శ్రీ గుణరత్నకోశము శ్రీమత్పదార్థమును, శ్రీరంగరాజస్తవము తదితరమైన దాని యర్థమును వరుసగా వివరించుచున్నవి ఆ విధముగనే యాచార్యులైన యాళవందారులు "చతుశ్శ్లోకీ" "స్తోత్రరత్న"మను గ్రంథముల ననుగ్రహించి యుండుటయు నిచ్చట నెఱుంగఁదగినది శ్రీదేవి పురుషకారముగ నుండుటకుఁ దగిన గుణములును, నుపేయముగా నుండుటకుఁ దగిన గుణములు నీ గుణరత్నకోశమున వివరింపఁబడినవి

అనుష్ఠాన సమయమునందు శ్రీదేవి పురుషకారముగ నుండుట తొలుత సంభవించునదైనను, వ్యుత్పత్తి సమయమున శ్రీదేవి ఫలాంశముగ (ఉపేయముగ) నుండుట మొదట వివరింపఁబడవలసి యుండుటచేత నీ గ్రంథమునందు మొదట నుపేయమునకుఁ దగిన గుణములును, దర్వాత పురుషకారముగ నుండుటకుఁ దగిన గుణములును బ్రతిపాదింపఁబడినవి

ఇఁక నీ గ్రంథమున నుడువఁబడి యుండు విషయములను బరిశీలింతము మొదటి నాలుగు శ్లోకములు మంగళ శ్లోకములుగ నమరియున్నవి తర్వాత రెండు శ్లోకములచేత శ్రీదేవిని స్తుతించుటకుఁ దా నసమర్థుఁడయ్యును, దనయొక్క దోషయుక్తములగు పలుకులచేత శ్రీదేవీ సద్గుణములు వెల్లడి యగుటకుఁ బ్రసక్తి యుండును గనుక స్తుతించు బాధ్యత తనకే కలదని సమర్థించిరి 7, 8 శ్లోకములచే శ్రీదేవియొక్క స్తుతి తన దోషయుక్తములైన పలుకులతో నమరియుండ నేల? దీనిని సారముగల ప్రబంధముగఁ జేసికొని తన స్తుతిని దానే నిర్వహించుకొనును గాత యని నుడివిరి 9-వ శ్లోకములో శ్రీరంగనాథునితో "నీకన్నను బేర్మి కలిగిన దని శ్రీదేవిని బొగడెదను, విని సంతోషింపు"మని వాక్రుచ్చిరి 10 మొదలు 14-వ శ్లోకమువఱకు వేద ప్రమాణములచేతను, ఉపబృంహణములచేతను బ్రధాన ప్రమేయముగఁ దెలిసికొనఁదగినది శ్రీదేవి యనిరి 15 మొదలు 19-వ శ్లోకము వఱకు శ్రీదేవియొక్క మంగళకరమైన కటాక్షమును బొందిన వన్నియు మేలైన వనియుఁ, బొందనివి కీడ్పడినవనియుఁ దెలిపినారు 19, 20 శ్లోకములలో లీలకనియే యేర్పడిన లీలావిభూతిలోఁ బరిహాసరసము ననుభవించు విధమును దెలిపిరి 21-వ శ్లోకమున నీమె భోగమున కేర్పడినది నిత్యవిభూతి యనిరి 22-వ శ్లోకమున నుభయ విభూతులును భగవంతునితోఁగూడ నన్నియును శ్రీదేవియొక్క పరికరములే యని తెలియఁజేసిరి. 23 మొదలు 25-వ శ్లోకమువఱకు శ్రీదేవి నిత్యవిభూతిలో భగవంతునితోఁగూడి యుండి భోగ మనుభవించు విధమును నుడివిరి.

26-వ శ్లోకమున నితర దేవీమణులెల్లరు శ్రీదేవి కవయవ మాత్రమే యని చెప్పిరి 27-వ శ్లోకమున భగవంతునితోఁబాటు కైంకర్యము నంగీకరించు పద్ధతిని గనఁబఱచిరి 28-వ శ్లోకములో భగవంతుని నిరూపించున దిమెయే యనిరి 29, 30, 31 శ్లోకములలో భగవంతుని పేర్మి కీమెయే కారణ మనియు నుడివిరి 32, 33 లలో భగవంతునకు నీమెకును సాధారణముగ నుండు గుణములను వర్ణించిరి 34, 35 లలో విశేషగుణముల నెత్తి చూపిరి 36 మొదలు 38 వఱకు దివ్య మంగళ విగ్రహమును వర్ణించిరి 39 లో నా సౌందర్యమునకుఁ బరవశులై వారి పాదముల మీఁదఁ బడిరి 40, 41 శ్లోకములలో వారి నేత్రములందుండి ప్రసరించు కటాక్షములను వర్ణించిరి 42 మొదలు 44 వఱకు వారి దివ్యమంగళ విగ్రహ గుణములు వరుసగా మృదుత్వము, శైశవము, సౌందర్యము మున్నగునవి యని వివరించిరి 45-వ శ్లోకములో వారియొక్క సంశ్లేషరసమును దెలిపిరి 46, 47 లలో దివ్యాభరణముల పొందికను గొనియాడిరి 48 లో నవతార విగ్రహమును, 49 లో క్షీరాబ్ధియం దుండి యావిర్భవించుటను వర్ణించిరి 50-వ శ్లోకములో శ్రీదేవి పురుషకారమగుటకు వలసిన క్షమాతిశయమును గనఁబఱచిరి 51-వ శ్లోకమున నీ తల్లి మూలముగనే భగవంతుని సంబంధమును గోరవలయునని చెప్పిరి 52-వ శ్లోకమునఁ బురుషకార కృత్య మొనర్చు రీతిని దెలిపిరి 53 లో నీ దివ్యదంపతు లవతరించి పడరాని పాటులు పడుటకుఁ గారణము లైన యెల్లలేని కరుణయు, స్వాతంత్ర్యము నను గుణములను నిందించిరి 54-వ శ్లోకములో భగవంతుఁ డీమెకై యరుదైన పనులనైనఁ జేయునని 55-వ శ్లోకమున భగవంతుఁడును మునిఁగియుండు నంతటి భోగ్యతను నుడివిరి 56 లో నెల్లప్పుడు పురుషకార మగునట్లు శ్రీరంగము లోని నిత్యవాసమునుగుఱించి నుడివిరి 57 లో విభవావతారమునకన్న శ్రీరంగ మునం దర్చారూపిణియై యుండుటలోని గుణోత్కర్షమును శ్లాఘించిరి 58 లో త్యాగశీలతాతిశయమును దెలియఁజేసిరి 59, 60 లలో నైచ్యానుసంధానమును జేసి తనకు శ్రీదేవియే పురుషకారమైన దనిరి 61-వ శ్లోకములోఁ దన కిహపర ములు శ్రీరంగనాచ్చియారే యనుగ్రహింప వలయునని ప్రార్థించుచు స్తోత్రమును ముగించిరి

వేదములందు నిరూపింపఁబడిన వైభవ సమృద్ధితోఁగూడిన శ్రీదేవియొక్క నిరతిశయశేషిత్వస్వరూపము, దానియొక్క స్వరూప నిరూపకత్వము భగవంతునకు శ్రేష్ఠతను గలిగించు నుత్కర్షమునుగుఱించి చెప్పి, స్వరూపాంశమును మొట్ట మొదటఁ దెల్లముచేసిరి పిమ్మట నా స్వరూపమునకుఁ జెందిన సాధారణ గుణ ములను విశేషగుణములను నా క్రమముగనే విగ్రహ గుణములను వర్ణించిరి తర్వాత మున్ను జెప్పిన రూపగుణములను బ్రకాశింపఁ జేయు దివ్యమంగళ విగ్రహము ననుభవించి వారి పాదపద్మములపైఁ బడి కటాక్ష వైభవమును జెప్పిరి అట్టి దేహ సంబంధమైన సద్గుణములును, సంశ్లేష దశయందు భగవంతు నానంద పఱచుటయు, దివ్యాభరణముల పొందికయుఁ గనఁబఱుపఁబడినవి పిమ్మట

దివ్యమంగళ విగ్రహముయొక్క యవతార స్థితియు, క్షీరాబ్ధిలోఁ బ్రాదుర్భవించు స్థితియు నను విభాగములు వివరింపఁబడినవి ఇంతవఱకు సుసేవ్యమై యుండుటకుఁ దగిన స్థితులు వచింపఁబడినవి ఇఁక మీఁదఁ బురుషకారమై యుండుటకుఁ దగిన స్థితులు నుడువఁబడును

పురుషకారమై యుండుటకుఁ గావలసినవై భగవంతు నెడను లేనటువంటి క్షమ, పురుషకారత్వోపయోగి యగు మాతృత్వము, భగవంతునికంటె నెక్కువ సన్నిహితమై యున్న సంబంధము కలిమి, మేర లేని కరుణ, భగవంతునితోఁ దన యిచ్ఛమెయి నిర్వహించునట్టి స్వాతంత్ర్యము, తనకయి యెట్టి కార్యము నేనియుఁ జేయునట్టులు భగవంతుఁ దన వశమున నుంచుకొని యుండుట, అతఁడు తన యందే తవిలి యుండునట్లుగఁ జేయు భోగ్యత, శ్రీరంగమునందు గోచరించు సౌలభ్యము, అర్చారూప స్థితియందలి గుణపూర్తి, యౌదార్యము నను గుణము లన్నియు మనోహరముగ వర్ణింపఁబడినవి పురుషకారమగుట కీ గుణములన్నియు నత్యంతావశ్యకములైనవి గదా!

ఇట్టి గుణములతోఁ గూడిన శ్రీదేవిని నైచ్యానుసంధాన మొనరించి పురుష కారముగ నీ గ్రంథకర్త చేపట్టుచున్నారు

శ్రీదేవి మాహాత్మ్యమును జెప్పఁబూనిన దైనను శ్రీరామాయణము ఒంటరిగ నున్న పెరుమాళ్ళ (శ్రీరాముని) చేత నాలకింపఁబడినది ఈ గ్రంథ మన్ననో, గూడియున్న పెద్ద పెరుమాళ్ళచేతను, శ్రీదేవిచేతను నాలకింపఁ బడుచున్నది కాన రామాయణమునకంటెను నిది శ్రేష్ఠమైనది

శ్రియఃపతిని గుఱించిన దివ్యప్రబంధములకంటె శ్రీదేవిని గుఱించిన దైన యీ గ్రంథము శ్రేష్ఠమైనది ద్వయమంత్రమువలె సంగ్రహముగఁ గాక విస్తర వర్ణన కలదైనందున దానికంటె నిది యుత్తమమైనది

లోకములకెల్లఁ దల్లియగుట యొకవంక నుండఁగా, నీ గ్రంథకర్తను బుత్రునిగా స్వీకరించి యుండుటచేత శ్రీదేవి వీరికి విశేషించి తల్లియైనట్లు సంప్రదాయస్థులు వచించెదరు ఈ రీతి ననుసరించి బిడ్డలతో కూడ పలుకులు తల్లిని సంతోషపఱచు నట్లు "చతుశ్శ్లోకీ" మొదలగు గ్రంథములును సంతసముఁ గూర్పఁజాలవు కాన వానికంటె నీ గ్రంథము శ్రేష్ఠమైనది ఇందువలన గ్రంథకర్తకుఁ గల మహిమయు విశదమగుచున్నది

అవతారిక ముగిసెను

శ్రీః

ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణం

శ్రీ పరాశరభట్ట రనుగ్రహించిన

# శ్రీ గుణరత్నకోశము

ఆళ్వార్ తిరునగరి - తిరుమలై నల్లాన్

## రామకృష్ణయ్యంగారు,

రచించిన "సువర్ణకుంచిక" యను వ్యాఖ్యానముతోను,
ద్రావిడానువాద పద్యములతోను గూడినది

**శ్రియై సమస్త చిదచిద్విధాన వ్యసనం హరేః ।**
**అఙ్గీకారిభిరాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః ॥౧॥**

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| హరేః | భగవంతునియొక్క | అఙ్గీకారిభిః | ఒప్పుకొనుచున్న |
| సమస్త | అన్ని | ఆలోకైః | చూపులచేత |
| చిత్ | చేతనులను, | సార్థయన్త్యై | సఫలముగునట్లు చేయు |
| అచిత్ | అచేతనంబులను | శ్రియై | శ్రీ దేవికి |
| విధాన | సృజించుట చేఁగలిగిన | అఞ్జలిః | చేమోడ్పు |
| వ్యసనమ్ | ప్రయాసను | కృతః | చేయఁబడినది |

ఈ గ్రంథ రచన నిర్విఘ్నముగ నెఱవేఱుటకుఁ దాను గొలుచు దేవతయుఁ బ్రతిపాద్య దేవతయునగు శ్రీదేవిని గ్రంథకర్త నమస్కరించుచున్నారు

భగవంతుని సృష్టికార్యము శ్రీదేవి తన కటాక్షముచేత నంగీకరించుటనుబట్టి ఫలమును బొందుచున్నదనుట ఇట్లు చెప్పు గ్రంథకర్తయొక్క యభిప్రాయము — శ్రీదేవి హరియొక్క విధానముఁ (సృష్టిని) దన కటాక్షముచే నంగీకరించి ఫలవంతముగ నెట్లొనర్చునో, యట్లే నా విధానమును (కవిత్వమును) ఫలము గలదిగాఁ జేయవలయుననుట ఈ యభిప్రాయము "సూక్తిం సమగ్రయతు" అను శ్లోకమున స్పష్టము.

మంగళమగు పదమగుటచే శ్రీ శబ్దము మొదట నుపయోగింపఁ బడినది మహాలక్ష్మికి లెక్కలేనన్ని పేరులు గలవు వానిలో "శ్రీ" యను పేరే యా తల్లి పేరిమికిఁ దగినది కావున గ్రంథకర్త దానినే మొట్టమొదటఁ బ్రయోగించిరి.

శ్రీరంగనాచ్చియారును గుఱించిన యీ స్తోత్రమునకు "శ్రీరంగనాయకీ గుణరత్నకోశ"మని నామకరణ మొనర్పక "శ్రీ గుణరత్నకోశ"మని పేరిడుటయే శ్రీయను పేరఁగల గొప్పతనమును బాగుగఁ దెలిసికొని గ్రంథకర్త యనుభవించి నందులకుఁ దగిన నిదర్శనమగును ఆచార్యులైన యాళవందారులును "శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్" అని యీ దివ్యనామమును బడసియుండుటయే శ్రీదేవి పేరిమికి సూచకమని యనుగ్రహించిరి ఈ గ్రంథకర్త గూడ నిఁకముందు "శ్రీరసి యతః" యని నుడువుదురు

దీప సంగ్రహమున "లక్ష్మీ స్వభావము నున్నదున్నట్లుగాఁ దెలుపుటచేత మొదటి పేరు 'శ్రీః' అనున"దని చెప్పఁబడి యున్నది

"శ్రీరితి ప్రథమం నామ లక్ష్మ్యాః స్తన్నిర్వచః క్రమైః ।
తత్స్వభావ విశేషాణాం యాథాత్మ్య మవగమ్యతే॥"

శ్రీ శబ్దమునకుఁ బలు విధములుగ నర్థమును జెప్పి శ్రీదేవి స్వభావమును ఆచార్యులు వివరింతురు అందఱచేతను నాశ్రయింపఁబడునది, తాను భగవంతు నాశ్రయించి యుండునది, ఆశ్రితుల దోషములను బోఁగొట్టునది, ఆశ్రితుల దైన్య వచనముల నాలకించునది, అట్టి దైన్యోక్తుల నాధారముగఁ గొని వారిని భగవంతుఁ డంగీకరించునట్లు వారి గుణములఁ బెద్దచేయునది, అట్లు ఆశ్రితుల గుణములను బెద్దచేసి చెప్పు తన పలుకులను భగవంతుఁడు వినునట్లు చేయునది ఇట్లు స్వభావ సిద్ధమైన పురుషకారత్వమునకుఁ దగిన యాఱు విధములైన యర్థములు వివరింపఁబడి యున్నవి పురుషకారమనఁగా భగవంతునిఁ జేతనులను జేర్చి పెట్టుట

చెప్పఁబడిన యీ యర్థములెల్లఁ దప్పక యనుసంధింపవలసినవైనను, జేతులు మోడ్చి, యాశ్రయించు ప్రకరణ మగుటచేత "నందఱచేతను నాశ్రయింపఁబడు నాయమ" యను నర్థ మిచ్చుట చక్కఁగాఁ బొసఁగును

<u>సమస్త చిదచిద్విధానమ్</u>—చిద్విధానము, అచిద్విధానము నని విభాగించు కొనవలయును విధానం = సృష్టి చిత్సృష్టి యనఁగాఁ జేతనులను గరణ కళేబర ములతోఁ జేర్చుట అచిత్ సృష్టి యనఁగాఁ బ్రకృతిని మహత్తు, అహంకారము మొదలగు తత్త్వములుగఁ బరిణమింపఁజేయుట. "సమస్త" యను పదము సృష్టికిఁ బాత్రములైన బద్ధచేతనులను, ప్రకృతి, మహత్తు మున్నగు నిరువదినాలుగు తత్త్వ ములను దెలుపుచున్నది మఱియు "సమస్త" పదము బద్ధ, ముక్త, నిత్యులైన సమస్తచేతనులను, శుద్ధసత్త్వము, మిశ్రసత్త్వము, సత్త్వశూన్యము అని చెప్పఁబడు సకలా చేతనములను నిర్దేశించుచున్నదన్నను గొఱంత కాదు నిత్యవస్తువులైన నిత్యులను, భగవత్పదము మున్నగు వస్తువులను సృజించుట యనునది—ఇవి నిత్యములుగ నుండును గాత యను సంకల్పమునకు విషయముగ నొనర్చుట

వ్యసనము కలుగక శ్రీదేవి కటాక్షము లేనిచో భగవంతుని సృష్టికార్యము ప్రయోజన శూన్యమగు ప్రయాస మగునని సూచించుచున్నది. రాజునకు వేట దుటవలె భగవంతునకు సృష్టి వ్యసనమే (ప్రయాసయే) యైనను వినోదమై యుండుట గూడు ననుట.

"హరిః" అను పదము సృష్టిని జెప్పుసందర్భమునఁ జక్కఁగా నమరియున్నది.

"బ్రహ్మాణ మిన్ద్రం రుద్రఞ్చ యమం వరుణమేవ చ ।
ప్రసహ్య హరతే యస్మాత్ తస్మాద్ధరి రితీర్యతే॥"

అనునట్లు, అందఱను సంహరించి సృష్టించునపుడు తానొక్కఁడే యుండుట చేత భగవంతుని జగత్కారణత్వమును ఈ పదము చూపుచున్నది. బ్రహ్మయు లేఁడు, ఈశానుఁడును లేఁడు, నారాయణుం డొకఁడే యుండెనను వేదవాక్య మిచ్చట స్మరణీయము. 'భూతానాం ప్రభవో హరిః' అను వాక్యము కలదు.

ఇఁక, సృజించుటకు వలసిన సమస్త గుణములు గలిగియుండుట నీ హరి శబ్దము చూపుననుటయు నెఱుంగఁదగును. "హరిర్హరతి పాపాని" యనునట్లు పాపములను బోఁగొట్టునపుడు జ్ఞానమును, శక్తియు, దయయు, క్షమయుఁ దప్పక యుండవలసినవి కావున గుణములఁ గలిగియుండుట దోఁచుచున్నది.

ఇఁక "ఉపహరతీతి హరిః" అనునట్లు సృజించు జగత్తును శ్రీదేవికిఁ గానుకగా సమర్పించువాఁడను నర్థము నగును. "అవాపఅచ్యూత్ర్ అరిద్రై" యనుచోట ఈడులో "సర్వాపేక్షితప్రదనాన సర్వేశ్వరనై"— సర్వాపేక్షితముల నిచ్చు సర్వేశ్వరుని అని వ్యాఖ్యానము చేయఁబడియుండుటను గాంచుఁడు. ఇంకను ననేకార్థము లీ పదమునకుఁ జెప్పవచ్చును, అయినను విస్తరభీతిచే విరమించితిమి.

<u>అఙ్గీకారిభిః ... సార్థయన్త్యై</u> — భగవంతుని సృష్టిని నవలోకన మాత్రముచేత లక్ష్మి అంగీకరించునఁట. సరియేయని నోరువిప్పి చెప్పదు. లజ్జచేత కాఁబోలు! ఇఁకఁ, ఒనివాని తోఁటపనిని ప్రభువు చూచి యంగీకరించు విధమున భగవంతుని సృష్టిని శ్రీదేవి యామోదించుటయు నున్నది అనియు ననఁదగును. ఇది నిజమే! ఆమె తిలకించినమాత్రముచేతఁ దన సృష్టి సఫలమైనదని భగవంతుఁడును తలంచుచున్నాఁడు. అతఁడు పడు పాటులన్నియు నామె కడకంటి చూపుల కొఱకే గదా!

"కటాక్ష లాభాయ కరోతి లోకాన్ పరాక్రమస్తే పరిరమ్భణాయ ॥
ముదేచ ముక్తిం మురభిద్రమే! తత్ కథం ఫలాభావ కథాస్య కర్తుః॥"

అనునట్లు లక్ష్మి కటాక్షము పొందుటకుఁగానే భగవంతుఁడు లోకములను సృజించుచున్నాఁడు. ఈ తల్లి కటాక్షము లేనియెడల పాపము! భగవంతునకు గొప్ప పాటగును. సృష్టిని జెప్పుట స్థిత్యాదులకును నుపలక్షణము. ఉపలక్షణ మనఁగా నొకమాట తనయర్థమునేగాక జాతిని గూడఁ దెలుపుట.

అఞ్జలిః కృతః — చేతులు మోడ్చుటచేతఁ గాయిక నమస్కారము సేయఁబడినదని చెప్పుటచేత వాచిక నమస్కారమును, మనస్సునఁ దలంపక నోటితో నుచ్చరించుటకు వలనుగాదు - కేసి మానసిక నమస్కారమును దోఁచుచున్నవి

“నాచే నంజలి చేయఁబడిన” దని తన్మాత్ర పేర్కొనకుండుటచేత శ్రీదేవి మ్రొక్కుటలో నందఱకు నధికారముండుట దోఁచుచున్నది అంజలి చేయఁబడిన దని కర్మార్థకమునఁ జెప్పుట యంజలి ముఖ్యమేగాని చేయువారు కారను తలంపుచేతనే

“అఞ్జలిః” అని యేకవచన ప్రయోగము సులభమైన యుపాయమును, నొకమాఱే చేసినఁ జాలునని తోఁచుటకు అంతమునందును “అఞ్జలిభరం వహతే” యని చెప్పుదురు

“అంజలి చేయఁబడుచున్న” దనక చేయఁబడినదని భూతకాల క్రియగాఁ జెప్పుట తన నైసర్గిక శేషత్వము నెఱింగిన వీరికిఁ దా నేఁడొనర్చు నమస్కారము పూర్వమే చేసినట్లు కనఁబడుటవలననే, “అడియేన్ వైగ్గెన్ ముడిక్కు మున్నమే” (దాసుఁడనగు నేను మొట్టమొదటనే పొందినాఁడను అని స్వామి నమ్మాళ్వారలు ననుగ్రహించి యున్నారు,

శ్రీదేవి విషయమునఁ బలు విప్రతిపత్తులున్నవి కొంద ఱీమె భగవంతుని సత్తా, అహంతా మాత్రమే యనియుఁ, బ్రత్యేకమగు తత్త్వము కాదనియు నుడువుచున్నారు కొందఱు మూల ప్రకృతియే లక్ష్మి యందురు శక్తివంతుఁడైన భగవంతుఁడే లక్ష్మియనియుఁ వాదించువారున్నారు భగవంతుని సృష్టి నామోదించు చేతనగా శ్రీదేవి నీ గ్రంథమునందుఁ దెలియఁజేసి యుండుటచేత నచేతనములైన సత్తా, అహంతా మూలప్రకృతి యని లక్ష్మి తత్త్వమును వాదించువారి భ్రమము నీ గ్రంథకర్త నిరసించినారు అచేతనములు సృష్టి నామోదించునట్లు చెప్పనందున నచిత్తునుండియు నీయమకుఁ గల వేర్పాటును దెలిసికొనునది

భగవంతుని సృష్టి వ్యాపారము నామోదించి బలవంతముగా లక్ష్మి చేయుచున్నదని చెప్పుటచేత “భగవంతుఁడే లక్ష్మి” యని నుడువువారి వాదము నిరసింపఁబడినది వేదము కూడ “లక్ష్మీశ్చ తే పత్న్యౌ” యని భగవంతునినుండి యీమెను వేఱు పఱచినది

ఈ శ్లోకమునందు సృష్టి భగవంతుని కృత్యమనియు, నంగీకరించుట శ్రీదేవి కృత్యమనియు విభజించి చెప్పుటను జక్కఁగా గమనింపుఁడు దీనిచే భగవంతుఁడే కారణభూతుఁడనియు, లక్ష్మి కారణమగునట్లు పురికొల్పునదనియుఁ దెలిసికొనునది

భగవంతుని వ్యాపారము సఫలమగునట్లు చేయునదిగాన పరత్వమును, మన మాశ్రయింపఁ దగిన ట్లా తల్లి యుండుటంబట్టి యీమెకుఁ గల సౌలభ్యమును వ్యక్తమగుచున్నవి

“హర్తారిత పాపాని” అనునట్లుగా నితరుల పాపములను దొలఁగించువాఁడు హరి అతని ప్రయాసను తొలఁగించుటకు మన శ్రీదేవియే కావలయును కనుక పాదేకతయ్యన శ్రీదేవియే యెల్లప్పుడు మనకు గతి

అరియన దన్నైత్తుయి రల్ల వైగళుమ్
ఎరుమరు క్కాళిలిన్నై త్తినదు నోక్కినాల్
పెరువినైపయ నియ్దిడ వేణ్గుమ్ పెణ్ణిరుమాళ్
తిరువిన్ కణ్ అంజలి శెయ్గు వామరో. (1)

అల చేతనాచేతనములను సృజించుట యను ప్రయాసతో హరి చేయునట్టి పనిని తన కటాక్ష వీక్షణముచేత సఫల మగునట్లు చేయు శ్రీదేవి కంజలి చేయుచున్నాము (1)



అవతారిక — సృష్టి నామోదించుట మాత్రమే కాదు, సృష్టికి హేతువగు నదికూడ శ్రీదేవి కటాక్షమే యని చెప్పి మఱల నాతల్లి నాశ్రయించుచున్నారు

ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోక
నిర్వాహ కోరకిత నేమ కటాక్షలీలామ్ ।
శ్రీరఙ్గ హర్మ్యతల మఙ్గళ దీపరేఖాం
శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥౨॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| ఉల్లాస | తోఁచుటచేత | శ్రీరఙ్గ | శ్రీరంగమునందున్న |
| పల్లవిత | చిగిరించినదియు, | హర్మ్యతల | హర్మ్యమునకు |
| పాలిత | పాలింపఁబడు | మఙ్గళ దీప | మంగళ దీప జ్వాల |
| సప్తలోకీ | ఏడు లోకములను | రేఖాం | వంటిదియు, |
| నిర్వాహ | ధరించుటచేత | శ్రీరఙ్గరాజ | శ్రీరంగరాజ పట్ట |
| కోరకిత | మొగ్గతొడిగినదియు, | మహిషీం | మహిషియునైన |
| నేమ | స్వల్పమైనదియు నగు | శ్రియం | శ్రీరంగనాచ్చియారును |
| కటాక్ష | వీక్షణముయొక్క | ఆశ్రయామః | ఆశ్రయించుచున్నాము |
| లీలాం | ఆట గలదియు, | | |

తన స్వల్ప కటాక్షముచేతనే యనాయాసముగ లోకములను సృజించి పాలించునదియు, శ్రీరంగ విమానమును ప్రకాశింపఁ జేయుచుండునదియు, రంగరాజునకుఁ బట్టమహిషియు నగు శ్రీదేవి నాశ్రయించుచున్నా మనుట

<u>ఉల్లాస ..లీలాం</u>—ఏడు లోకములయొక్క నిర్వాహ మింక ముందు చెప్పఁబడుటచేతఁ దోఁచుటయు వానికే! లోకములు దోఁచుటయందు లక్ష్మి యొక్క కటాక్షలీల చిగిరించునట్లు చెప్పుటచేత సృష్టికి ముందుండిన దానికంటె నెక్కువగ నుండుటయు, నిర్వాహమునందు మొగ్గ దొడుగుటచేత నంతకంటె నింక నెక్కువగ నుండుటయుఁ దోఁచుచున్నవి అంకురించుటయుఁ మొగ్గ దొడుగుటయుఁ జెప్పఁబడుటచేతఁ గటాక్షలీల నొక తీఁగగా రూపకము చేసికొనవలయును

లోకములు తోఁచుట కటాక్షలీల చిగిరించుటను, నిర్వాహము మొగ్గ దొడుగుటను దెలుపుచున్నవి ముక్తిదశలోనే యీ తీగ ఫలించును గాఁబోలు!

ఏడు లోకములు దోఁచుట కటాక్షలీలయను తీగయొక్క చిగురు నిర్వాహము దాని మొగ్గ యని భావము లక్ష్మీకటాక్షమే లోకముల సృష్టిని, స్థితిని జేయుచున్నదని తెలిసికొనఁదగును

వీరరాఘవాచార్యులు మొదలగువారైన పూర్వులు చెప్పియున్న యర్థములో "ఉల్లాస" యను పదమునకు ముందుగ "నేడులోకముల"న్న పలుకును దెచ్చిపెట్టు కొనవలసి యున్నది నిర్వాహ పదమునకు స్థితి యని యర్థమును జేసికొన్నచో నదే యర్థమునిచ్చు "పాలిత" యను పదమున కేమియుఁ బ్రయోజనము కనఁబడదు సృష్టిస్థితులు మాత్రమే చెప్పఁబడి సంహారము చెప్పఁబడకున్నది

ఇఁక దీని కీ క్రిందఁ గనఁబఱచిన యర్థము గ్రహించుట పొసఁగునని తోఁచుచున్నది ఉల్లాస యను పదము ఏడు లోకములు దోఁచుటను జెప్పుట లేదు, తన వికాసమును దెలుపుచున్నది అనఁగాఁ గటాక్షలీలయొక్క వికాసమును జెప్పుచున్నది పల్లవిత యను పదము చిగిరించుట యనఁగా నుత్పత్తిని జెప్పుచున్నది లోకముల యుత్పత్తి ప్రోడువడిన చెట్టు చిగిరించుట వంటిది యనుట. ఉల్లాసము (వికాసము) చేతఁ గలుగునట్టివిగను, రక్షింపఁబడునట్టివిగను నుండునవి సప్త లోకములు ఉత్పత్తికిని రక్షణమునకు నుల్లాసమే హేతువు చతుశ్శ్లోకీ భాష్యమునందు "ఈషత్త్వత్ కరుణా నిరీక్షణ సుధా సంధుక్షణాత్" అను దానిని నుదయమునకును, రక్షణమునకును హేతువుగా శ్రీ వేదాంత దేశికులు కనఁబఱచి నట్లుగ దీనిని గ్రహించునది నిర్వాహ పదము సంహారమును దెలియఁ జేయు చున్నది "నిర్వహణన్తు నిష్ఠా స్త్రీ సంహారశ్చ సమాపరే" యని శబ్దార్ణవ నిఘంటువు కోరకిత యను శబ్దము కటాక్షలీలావికాసము మొగ్గ యగుటను—అనఁగా ముడుఁగుటను దెలుపును కాఁగాఁ దన వికాసముచేతఁ గలిగింపఁబడి రక్షింపఁ బడిన సప్తలోకముల సంహార విషయమున ముడిఁగిన స్వల్పమైన కటాక్షలీల యని

యయ్యెను "సేమ" అను పదము సగమును నర్థము నిచ్చునదైనను నిచ్చట స్వల్పమను నర్థమున వచ్చినది

ఇప్పుడు "ఈషత్త్వత్ కరుణా నిరీక్షణ సుధా సంధుక్షణా ద్రక్ష్యతే నష్టం ప్రాక్ తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్" అను ఆళవందారుల శ్రీ సూక్తియును "యస్యాః కటాక్ష మృదువీక్షణ దీక్షణేన సద్యస్సముల్లసిత పల్లవ ముల్లలాస, విశ్వం విపర్యయ సముత్థ విపర్యయం ప్రాక్తాం దేవదేవ మహిషీం శ్రియ మాశ్రయామః" అను వీరి తండ్రిగారి శ్రీసూక్తి ననుసరించిన దయ్యెను

ఇచ్చట నొక సందేహము పొడముచున్నది — బ్రహ్మమే లోకమునకుఁ గారణమని వేదాంతములయందుఁ దిర్ధారింపఁబడియున్నది బ్రహ్మమనఁగాఁ బురుషోత్తముఁడు "నారీణాం ఉత్తమా" (స్త్రీలలో శ్రేష్ఠురాలు) అగు లక్ష్మిని బ్రహ్మ మని చెప్ప వలనుపడదు కనుకఁ గారణము కాఁజాలని లక్ష్మి నీ వోట నెట్టిరు కారణ మని నుడివి యుండెనట్లు పొసఁగును? అని

దీనికి మేము చెప్పు సమాధాన మిది — లక్ష్మీకటాక్షముచేత లోక ముత్పత్తి యైనట్లు చెప్పిరే కాని లక్ష్మియే లోకముగ విస్తరించె నని చెప్పలే దను విషయము బాగుగ గమనింపఁదగినది వేదాంతములలోఁ బురుషోత్తముఁడే లోకముగ విస్తరించి నట్లు చెప్పఁబడుచున్నది అట్టి కారణముగ — అనఁగా నుపాదాన కారణముగ లక్ష్మి కానేరదు కాని లోక సృష్టిలో నీమెకు సంబంధమే లేదని చెప్ప వలను గాదు "జగత్కారణత్వములో నీమెకు నన్వయ (సంబంధ) మున్నదా?" యని ప్రశ్నించిన నడాదూరమ్మాళును గురించి "యీ యర్థమునందు సందేహమున్నదా? 'ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని' (మన మిద్దరము వ్యాపారమును జేసెదము) 'ప్రజాశ్చ ఉత్పాదయితవ్యాః' (బిడ్డలను గనెదము) అని ప్రమాణము చెప్పుచున్నందున సహధర్మచారిణి యగు నీమెకును — ననఁగా లక్ష్మీదేవికిని సంబంధమున్న"దని పిళ్ళా ననుగ్రహించిరఁట.

దీని తాత్పర్య మేమనఁగా — గృహస్థ ధర్మమునందు భార్యా భర్తలకు సంబంధమున్నది భార్య లేక యా ధర్మము నడపుటకు వలనుగాదు లోకముల సృష్టి భగవంతుని గృహస్థ ధర్మము లక్ష్మి లేనిదే యది వలనుగా దనుటయే

మఱియు, లోక సృష్టి భగవంతునకు లీలగాఁ జెప్పఁబడుచున్నది తా నేకాకియై యాడుకొనుట యింపు గలిగింపదు "క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాత్" (లక్ష్మి లేక యీ లీల భగవంతున కానందమును గూర్పదు) అని కూరత్తాళ్వానులు నివేదించిరి

వేద మీ విధముగఁ జెప్పుచున్నది, "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే" (లక్ష్మివలన దేవుఁడు దేవత్వమును బొందుచున్నాఁడు) దేవశబ్దము ఆట యను నర్థము గల "దివ్" అను ధాతువునుండి వచ్చినది దేవుఁడు అనఁగా నాటలాఁడు వాఁడని యర్థము దేవత్వమనఁగా నాటలాడువాని ధర్మము — అనఁగా నాట కనుక వేదమును లక్ష్మితోఁ గూడియే భగవంతుఁ డాడుకొనునని చెప్పినట్లయ్యెను

సంహార కాలములోను మఱియెవరును లేక యేకాకిగా నున్న సర్వేశ్వరుఁడు లక్ష్మీసహితుఁడై యున్నట్లు వేదము తెలుపుట నెఱుంగఁదగును "ఆనీద వాతం స్వధయా తదేకం" అను వాక్యమును గాంచుఁడు "స్వధా త్వం లోక భావినీ" యనుదాని ననుసరించి "స్వధా" యను శబ్దము లక్ష్మిని నిర్దేశించుచున్నది ఆ భగవంతుడు మాత్రము సంహార కాలమునందు లక్ష్మితోఁగూడి బ్రతికి యుండెనని యీ శ్రుతివాక్యమున కర్థము ఈ విషయము "శ్రేషశ్చ" యను సూత్రమున శ్రుతప్రకాశికలో స్పష్టముగాఁ గలదు "ఏకో విద్యా సహాయస్త్వం యోగీ కాలాగముపాగతః" అని హరివంశమునందును నీవిధముగనే చెప్పఁబడియున్నది

సృజించుకాలమున లక్ష్మితోఁగూడియుండియే భగవంతుఁడు సృజించినాఁడని వేదము చెప్పుచున్నది "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" (కాలము మున్నగు సకల వస్తువులు మెఱుపువన్నె గల పురుషునిలోనుండియే పుట్టినది అనుటను జూడుఁడు నల్లని పురుషునకీ మెఱుపువన్నె "తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్" (లక్ష్మిని సందర్శించితిని, బంగరుమేనిని సందర్శించితిని) అని చెప్పినట్లు లక్ష్మీ సంబంధముచేతనే గలిగినది

ఈ గ్రంథకర్తయే శ్రీరంగరాజస్తవమునందు "అనుశిఖిని శిఖీన క్రీడసి శ్రీసమక్షమ్" అని చెప్పుటయు నిచ్చట గుర్తింపఁదగినది ఆడు నెమలి యెదుట మగనెమలి పురులు విప్పి యాడుటవలె లక్ష్మి సన్నిధియందు భగవంతుఁడు చేతనాచేతనములను విస్తరింపఁజేసి యాడునని యీ యుపమమూలముగ శాస్త్రార్థమును దెల్లముసేయు సొగసు మదికింపుఁ దులకించుచున్నది పురులు విప్పి యాడునది మగ నెమలియే, అదే విధమునఁ దన శరీరమందలి యొక యవయవమైన చేతనాచేతనములను విస్తరింపఁజేసి (సృజించి) యాడు నతఁడు భగవంతుఁడే ఆడు నెమలి ప్రక్కనుండి, యట్లాడునట్టులుగ మగనెమలికి నింపుఁ గూర్చుచున్నది, ఆ విధముగనే లక్ష్మీదేవి భగవంతుని విస్తరించి యాటలాడునట్లు సంతోషపఱచుచున్నది సంతసపఱచుటయేగాని పురులువిప్పి యాడుటలో నాడునెమలి కే సంబంధమును లేనట్టులు లక్ష్మీదేవికిఁగూడ సృజించుటలో నేవిధమైన సంబంధమును లేదని తెలియునది

కాఁగా, లక్ష్మీదేవి కన్నులఁ దెఱచి కటాక్షించెనేని నుత్సాహపూరితుఁడైన భగవంతుఁడు లోకముల సృజించుననియు, నామె గన్నులు మూసికొనినచో, భగవంతుఁడు సంహరించుననియు భావమయ్యెను

లక్ష్మి కన్నులు దెఱచినఁగాని యీ లోకములు పుట్టుటకు హేతువులేనందు వలనను, గన్నులు మూసికొనినచో నీ లోకము నిలిచియుండుటకు వీలు లేనందునను లక్ష్మి కటాక్షమే లోకమునకు హేతువుగాఁ జెప్పఁబడినది సృజించువాఁడు భగవంతుఁడు సృజించునట్లుతనిని బ్రోత్సహించునది లక్ష్మీదేవి.

నిర్వాహ (సంహార) సమయములో శ్రీదేవి కటాక్షము నన్నెల్లునని చెప్పి యుండుట గమనింపఁదగినది కటాక్షమును బొందకపోవుటచేత నీ లోకము సంహరింపఁబడుచున్నదిగాని కోపముచేతఁ గాదని యర్థము "కః కుప్యేత్ వానరోత్తమ" (ఎవఁడు కోపగించుకొనును?) అని వాక్రుచ్చు శ్రీదేవికిః కోపము కలుగుటకుఁ బ్రసక్తి లేదుకదా!

<u>శ్రీరఙ్గ . దీపరేఖామ్</u> — "క్షీరాబ్ధేర్మణ్డలాద్భానోః యోగినాం హృదయాదపి। రతిఙ్గతస్సదా యత్ర తద్రఙ్గం మునయో విదుః॥" అనునట్లు పాల సముద్రము, సూర్యమండలము, యోగుల హృదయము నను వీనికన్న భగవంతుఁడు తా వలచి నిలిచిన దివ్యస్థలమునకుఁ దిరువరంగమని పేరు శ్రీరంగమునందుండు హార్మ్యతలము శ్రీరంగ హర్మ్యతలము హర్మ్యతలము=విమానము రాజమహిషి కనుక నీమె వసించు స్థలము హార్మ్యతలమనిరి హర్మ్యతలం=ధనవంతులు వసించు చోటు "హర్మ్యాదిః ధనినాం వాసః" అని అమర నిఘంటువు

ఇఁక "శ్రీరఙ్గ హార్మ్యతల" మను తత్పురుష సమాసముగ నర్థము చేసికొనక "శ్రీరంగమను హర్మ్యతల" మని కర్మధారయ సమాసముగా గ్రహింపఁదగును అప్పుడు శ్రీరంగవిమాన ప్రవేశమని యర్థము విమానమందలి దీపముగ శ్రీదేవిని రూపకము చేయుట, కొండకొనపై నుండు దీపమువంబోలె బహుదూరమున నుండువారలకును బ్రకాశించుటంబట్టియే!

గాలి మున్నగువానిచేత నాఱిపోవు దీపమువలెఁ గాక, యెల్లప్పుడు వెలుఁగు చుండు దీపమని చూపించుటకు "మఙ్గళదీపరేఖాం" అనిరి మఱియు, మంగళార్థమైన దీపమనియు నర్థము

దీప మితర పదార్థములను జూపుచుఁ దన్ను దానే ప్రకాశింపఁజేయునట్లు భగవంతునిఁ జూపించి తన్ను దానే ప్రకాశింపఁజేయుటచేత దీపమని రూపక మొనర్చిరి భగవంతునిఁ బడయుటకు శ్రీదేవి పురుషకారము గావలయును శ్రీదేవిని బడయుటకు వేఱొక పురుషకార మక్కఱలేదు తన్ను దానే చూపించునని యర్థము దీపముగా రూపింపఁబడినందున శ్రీదేవి ప్రకాశము కలిగి యుండుట దోఁచుచున్నది

<u>శ్రీరఙ్గరాజ మహిషీమ్</u> — "మామేకాం దేవదేవస్య మహిషీం శరణం వ్రజేత్" అని శ్రీదేవి "పట్టమహిషినగు నన్ను శరణముఁబొందవలసిన" దని తానే చెప్పినట్లు శ్రీరంగరాజ మహిషి నాశ్రయించెద మనుచున్నారు సర్వేశ్వరుని సామ్రాజ్యమున నతనితో సాటెగఁ బట్టము గట్టుకొన్నది గావున మహిషి యనిరి "కృతాభిషేకా మహిషీ"యని నిఘంటువు మహిషి యగుటచేత నీమె పురుషకారముగ నిలిచి భగవంతునితో మనలను జేర్చుటకై ముందంజ వేయఁగా నా పురుషకార కృత్యమున కే సమయమునందును విఘ్నము గలుగఁజాలదు

“మహిషీ” యనుటచేత నితర భార్యలకంటె నీయమకుఁ గల యగ్రస్థానము దోఁచుచున్నది “అనన్తనామధేయా చ శక్తిచక్రస్య నాయికా” యని బ్రహ్మాండపురాణములో భార్యలందఱిలో నీయెకుఁ బ్రథమస్థాన మీయఁబడియుండుట చూడఁదగినది శక్తిచక్రము — భార్యల సమూహము స్వామి యెంబెరుమానారులు గద్యములో “శ్రీశేషాశనాది సర్వపరిజనం భగవతస్తదవస్థోచిత పరిచర్యాయామ్ ఆజ్ఞాపయన్త్యా” అని యనంతుఁడు మున్నగాఁగల సూరులను నాయా పరిస్థితులకుఁ దగిన కైంకర్యములందు నియోగించునట్లుగాఁ బ్రాధాన్యమునుబట్టి కలిగిన వేఱుపాటును శ్రీదేవికిఁ జెప్పుటయు నిచ్చటఁ దెలియఁదగినది

శ్రీరంగరాజ మహిషియైన శ్రీదేవి నాశ్రయించునట్లు నుడువుటచేత, మహిషి యగుటంబట్టి యీమెకు శేషిత్వము గలిగినదని చెప్పినవారైరి

శ్రియం — శ్రీయతే — అందఱచేత నాశ్రయింపఁబడున దను నర్థమిచ్చుటఁ దలఁపఁ దగినది ఇఁక “ఉల్లాస” మున్నగు పదములచేత నాశ్రయింపఁబడుచున్న స్థితియు, “శ్రీరఙ్గహర్మ్యతల” మున్నగు వానిచేతను, “శ్రీరఙ్గరాజ మహిషీం” అనుదానిచేతను నాశ్రయించుచున్న స్థితియుఁ గనఁబఱచుటచేత ఆశ్రయింపఁబడునది ఆశ్రయించునది యను రెండర్థములను జెప్పుటయుఁ ఎగును

శ్రియమ్ ఆశ్రయామః — అందఱచేత నాశ్రయింపఁబడుచున్న తల్లిని మేము నాశ్రయించుచున్నా మనుట ఇది సర్వలోకశరణ్యని విభీషణుఁ డాశ్రయించుటం బోలినది

ఈ శ్లోకమునఁ బూర్వార్థమున శ్రీదేవీపరత్వమును, నుత్తరార్ధమున నామె సౌలభ్యమును జెప్పఁబడినవి

ఉదిత్తిడ త్తళిర్త్త లోడాళ్ ఉలకఙ్గ ళేళ్లు న్దాఙ్గుమ్
విదత్తినిల్ ముగిళ్క్కుక్క మఱ్ఱు విళ్రివిళై యాట్టినాళై
ప్పదిత్తలై యరఙ్గమాడత్తలత్తణి దీపమెన్న
మదిత్తిడు మరఙ్గరాశన్ మగిడియా న్దిరువై చ్చార్వామ్. (2)

ఒక లత యంకురితమై, పల్లవితమైనట్లు శ్రీదేవి యొక్క స్వల్ప కటాక్షవీక్షణము ఈసప్తలోకములను బుట్టించి, రక్షించి, పరిపాలించి, నిర్వహించుచున్నది తిరుపతులలోఁ బ్రధానమగు శ్రీరంగములో విమాన ప్రదేశమందలి యలంకార దీపమువలె వెలుంగుచున్న శ్రీరంగరాజ మహిషియైన లక్ష్మీదేవి నాశ్రయించెదము (2)



అవతారిక — మొదటి రెండు శ్లోకముల చేత నమస్కార రూపమైన మంగళము నుచేసి, కటాక్షింపవలయునని యాశీర్వాద రూపమైన మంగళమును సూచింప జేయుచున్నారు

> అనుకలతనుకాన్త్యాలిఙ్గనారమ్భ శుమ్భ
> త్ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహార్ధిః ।
> స్తనయనగుళుచ్ఛ స్ఫార పుష్ప ద్విరేఫా
> రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్ ॥3॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అనుకల | ప్రతిక్షణము | ఋద్ధిః | ఏపు గలదియు |
| తనుకాన్త్యా | ప్రాఁకుఁ గొయ్యంబోలిన తనువును | స్తననయన | పూలగుత్తులం బోలిన |
| ఆలిఙ్గనారమ్భ | కౌఁగిలింపఁ దొడంగి నపుడు | గుళుచ్ఛ | స్తనములును, వికసిం |
| శుమ్భత్ | ప్రకాశించు | స్ఫార | చిన పూవులందున్న |
| ప్రతి దిశ | నలువైపులందును | పుష్ప | తుమ్మెదలం బోలిన |
| భుజశాఖ | కొమ్మలం బోలిన చేతులను గలిగిన | ద్విరేఫా | నల్లగ్రుడ్లను గలిగిన |
| శ్రీసఖానోకహా | వృక్షమునుం బోలిన లక్ష్మీపతియొక్క | లక్ష్మీకల్పవల్లీ | కల్పలతను బోలిన లక్ష్మీదేవి |
| | | మయి | నామీఁద |
| | | కటాక్షాన్ | కడగంటి చూపులను |
| | | రచయితు | ప్రసరింపఁ జేయును గాత! |

ప్రాఁకుఁ గొయ్యవలెనుండు భగవంతుని శరీరమును గౌఁగిలింపఁ దొడంగి నంతనే కొమ్మలవంటి నాలుగు చేతులు వెలయఁ గల్గు వృక్షముఁబోలె నిలిచియున్న భగవంతుఁడే పొందునట్లుగ నా చెట్టున నల్లుకొనిన కల్పలతవంటిదగు లక్ష్మి నా తలంపు నెఱవేఱునట్లు కటాక్షించి యనుగ్రహింపవలయునని భావము

రెండవశ్లోకమునఁ జెప్పఁబడిన మహిషీ స్థితికి హేతువు అనురూప్యము గలిగి యుండుట యనుచున్న దీ శ్లోకము కల్పవృక్షమునకుఁ గల్పలత యను రూపమైనది గదా! "ఉనక్కేఱ్ఱుం కోలమ ర్వాప్పై" యని నమ్మాళ్వారులు ననిరి "సనాతనైవోచితయా తవ శ్రియా" యని ఆళవందారులు ననిరి "ఏవంభూత భూమినీళానాయక" యని గద్యమునందు నీ తల్లిం బోలినవా రితర దేవీమణులని యతిదేశించుటను బట్టి శ్రీదేవికిఁ గల యానురూప్యము తదితరులకు లేదని తత్త్వసంగ్రహకారు లనిరి

అనుకల... ..బుద్ధేః — తీఁగ ప్రాఁకుఁ గొయ్యనూఁతగాఁ గొని యల్లుకొను
నట్టులు శ్రీదేవియు భగవంతుని విగ్రహమును "యయా పదుష్ఠలం హరేః" యను
నట్టులుగాఁ బోయి కౌఁగిలించుకొనుచున్నది కౌఁగిలింపఁ బోఁకొన్నంతనే యా
చెట్టు మిక్కిలిగ నేపు వొందుచున్నది తనుకాండము = కాండముం బోలిన మేను
కాండము = ప్రకాండము (ప — యను నుపసర్గము లేకున్నను దాని యర్థ మిచ్చట
వివక్షితము (ప్రకాండ మనఁగాఁ జెట్టుబోదె ఇఁకఁ గాండమను దానికి దండము
(కఱ్ఱ) అను నర్థముచేఁ గొన్నన వృక్షమును గత్తించి యిచ్చట చెప్పుటచేత నందుఁ
గల దండమునే — యనఁగా దాని బోదెనే సూచించునని గ్రహించుటయుఁ దగును
భగవంతుని పాదములు వేరనియుఁ, పైనున్న భాగము బోదె యనియుఁ, జేతులు
శాఖలనియు విభజించి గ్రహించునది ఇట్లు "తనుకాండ" మనునది వృక్షమునం
దొక భాగము నుపమించుటగాఁ గొనకపోయిన, నీ శ్లోకమునఁ గల యుపమిత
సమాసము లెల్ల చెట్టునకు — లేదా, లతకు సంబంధించినవై యమరియుండ నియ్యది
మాత్రము సంబంధములేక వేఱొక వస్తువు నుపమించునదైన పొసఁగని దగు ననుట
భగవంతుని మేనికిఁ గఱ్ఱ నుపమానముగఁ జెప్పుటలో సొంపు లేమియే కాదు,
మీఁదు మిక్కిలి విరసమయి యుండుటయుఁ జూడుఁడు

ఇఁకఁ దనుకాండమును శ్రీదేవికిఁ జెందినదిగాఁ గొని కఱ్ఱను బోలిన మేనితో
లక్ష్మి భగవంతునిఁ గౌఁగిలించుకొనునపు డని యర్థమును జెప్పువారలును గలరు

తీగం బోలిన శ్రీదేవియొక్క తనుకాండమును జెట్టునుం బోలిన భగవంతుఁడు
గౌఁగిలించు నని వ్యాఖ్యానించువారలును గలరు తీఁగ యల్లుకొనుచు వచ్చి
వృక్షమును గౌఁగిలించుకొనునట్టులు, వృక్షము చని తీగను గౌఁగిలించుకొనుటయుఁ
గొమ్మల మూలమున సంభవించు ననియే వారందురు

తీఁగతోఁ జేరునపుడే యీ వృక్షము శోభింప నారంభించుచున్నది,
"శుంభత్" అనుదానిని "అనోకహ" యనుదానితో నన్వయించుకొనునది

కలయిక ప్రతిక్షణము క్రొత్తదిగాఁ గనఁబడుటచేత "అనుకల" యనిరి
"అనుకల" యనుదానిని "శుంభత్" అనుదానితోఁ జేర్చి "ప్రతిక్షణమును బ్రకా
శించుచున్న" యను నర్థమును జెప్పుటయుఁ దగును

శ్రీదేవి కౌఁగిలించుకొనుటచేఁ గలిగిన యానంద మన్ని దిశలలోను బలు
చేతులు గలిగినవానినిగాఁ జేసిన దనుచు "ప్రతి దిశ భుజ శాఖ" యనిరి నమ్మాళ్వా
రుఁ బడసిన సంతోషముచేత "తోళ్ గళాయిరత్తాయ్" యని భగవంతునకుఁ
జేతు లనేకములు గలిగిన వని చెప్పఁబడి యుండుటయుం జూడుఁడు

ఇఁక నీయను ననుభవింప మనోరథము పొంది "అనన్త బాహుమ్" అను
గీతా వచనము ప్రకారము పలుచేతులు గలిగిన విశ్వరూపముతోఁ దనరువాఁడు
గనుక "ప్రతిదిశ భుజశాఖ" యని రనుటయుఁ దగును. కొమ్మలవంటి వనుటచే
భుజముల పొడవును, సువృత్తతయుఁ దోఁచుచున్నవి

శ్రీదేవీ సంబంధమును జెప్పి ముగించుటకు మునుపే లక్ష్మి లేక భగవంతుని నిరూపించుట యశక్యము గనుక "శ్రీసఖ" యనిరి

వృక్షముఁ బోలిన భగవంతునకు ఏపు, జ్ఞానము, శక్తి మున్నగు నాత్మ గుణములును, సౌందర్యము, కాంతి మున్నగు శరీర గుణములును జక్కఁగా వెలుఁగొందుననుట శ్రీదేవీ సంబంధము లేదేని భగవంతుని గుణము లణఁగిపోవు నని తాత్పర్యము

శ్రీదేవి యాలింగనముచేతఁ గలిగిన యానంద పారవశ్యముచే మైమఱచి భగవంతుఁడు నిక్కి నిలుచుటచే చెట్టువలెనని యతని నుపమించుటంబట్టి దోఁచుచున్నది ఇఁక నెల్లప్పుడును నానందభరితుఁడై నియమముచేత నేర్పడిన ప్రమాను పాటుంబట్టి చెట్టువలె నుపమించుటయుఁ దగును, "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః" యని శ్రుతియు నిట్టులే యుపమించియుండుటం గనుఁడు లేదా సంసారపు బాటలోఁ బడినవనియు వారికి నొదిగి నిలువ నీడఁ గలిగియుండుటం బట్టియు నట్లనుట తగును "ఛాయావృక్ష మివాధ్వగాః" యని కాళిదాసుఁడు ననెను "వాసుదేవ తరుచ్ఛాయా" "నివాస వృక్షస్సాధూనామ్" అనునవియుఁ జూడుఁడు

లతను గల్పకవల్లి యని విశేషించుటవలన "అనోకహ" యని సామాన్యపదము నుపయోగించినను దానికిఁ గల్పవృక్షమను విశేషార్థము గ్రహింపఁదగును సహస్ర నామ భాష్యమున నీ యాచార్యులే "శ్రీనివాసః" యను దివ్యనామమున కిట్లే వ్యాఖ్యానమొనర్చియుండుటయు నిట నెఱుంగఁదగును "దివ్య వల్ల్యా ఇవ కల్ప ద్రుమః తస్యా నిత్యోపఘ్నః" (కల్పక లతకుఁ గల్పక వృక్షముంబోలె లక్ష్మీదేవికి భగవంతుఁ డెల్లప్పుడును ప్రాఁకుఁ గొయ్య) యనునది సహస్రనామ భాష్యము

స్తన నయన.... ద్విరేఫా—గుత్తులం బోలిన స్తనములును, తుమ్మెదలం బోలిన కన్నులు నని వరుసగాఁ జేర్చుకొనునది పువ్వులో నున్న తుమ్మెదయని విశేషించినందున నయన మనునది నల్ల గ్రుడ్లను దెలుపు ననుట విరులం బోలినవి కన్నులు వానిలోని తుమ్మెదలం బోలినవి నల్లని గ్రుడ్లని వేర్పఱిచి తెలిసికొనునది

స్ఫారమ్—విశాలమైనది "స్ఫారస్తు స్ఫురికాదీనాం బుద్బుదే విపులేఽపి చ" యనునది హేమచంద్ర నిఘంటువు స్తనములకు గుత్తుల నుపమానముగఁ గూర్చుట వలన లేఁబ్రాయము, నందమును గలిగి యుండుటయు, నల్ల గ్రుడ్డులఁ దుమ్మెదలతోఁ బోల్చినందున నల్లఁదనము, నిద్దంపుఁదనము గలిగియుండుటయును దోఁచుచున్నని

లక్ష్మీ కల్పవల్లీ—ప్రాఁకుఁ గొయ్య నూఁతగాఁగొనక నిలువజాలని తీఁగతోఁ బోల్చుటచేత భర్త లేక తానుమాత్ర మొంటరిపాటున నుండఁజాలని శ్రీదేవియొక్క పారతంత్ర్యము వెల్లడింపఁబడిన దయ్యెను ఇందువలన శ్రీదేవి పారతంత్ర్యము నైసర్గికమనియు, నాగంతుకము గాదనియుఁ జెప్పినట్లయ్యెను మునుపటి

శ్లోకమునఁ జెప్పఁబడినట్లు, భార్య యగుటచేతఁ గలిగిన పారతంత్ర్యము మాత్రము కాదు, సహజమగు పారతంత్ర్యముగూడ లక్ష్మికిఁ గలదని తెలియునది పారతంత్ర్యమునకు సహజత్వమనునది, యీ తల్లి కోరికమెయి వచ్చినది గాక భగవంతుని గోరికమెయి వచ్చియుండుననుట ఈయమ పారతంత్ర్యమువలెనే భగవంతుని సంకల్పమును నిత్యమగును "సర్వ కామ ప్రదాం" అనునట్టులు కోరినదెల్లయు నిచ్చుటచేఁ గల్పలతను బోలిన దనిరి ఇందువలన నిరుపాధికమైన స్త్రీత్వమును, ఔదార్యమును దోఁచుచున్నవి

<u>మయి కటాక్షాన్ రచయితు</u>—మయి అనఁగా స్తోత్రము చేయఁబూనుకొనిన నాయందు కటాక్షలక్షణము సంగీత రత్నాకరములో నీ విధముగఁ జెప్పఁబడియున్నది "యద్గతాగత విశ్రాన్తి వైచిత్ర్యేణ వివర్తనమ్॥ తారకాయాః కలాభిజ్ఞాః తం కటాక్షం ప్రచక్షతే॥" ప్రీతిని గొలుపుచు నల్లని గ్రుడ్లనిటునటు పొరలించుటయే కటాక్షము దీని కనుగుణముగ నల్లగ్రుడ్లను దుమ్మెదలం బోలినవని వర్ణించియుండు సొంపును గని మురియుఁడు "కటాక్షాన్" కటాక్షములను నను బహువచన ప్రయోగముచే మాటిమాటికిఁ గటాక్షమునకుఁ బాత్రుఁడను గావలయు నను తన మనోరథమును వెల్లడించిరి స్తోత్రమొనర్ప నర్హుఁడనగునట్లు నన్ను గటాక్షింపుమని తాత్పర్యము

ఈ శ్లోకమున బూర్వ భాగమున లావణ్యమును, నుత్తర భాగమున నవయవ సౌందర్యమును వరుసగా వర్ణింపఁబడినవి

స్థావర వస్తువగు కల్పలత కటాక్షించుట సంభవింపదు గనుక లక్ష్మి యను కల్పలత యని రూపకముగఁ గొని యర్థము చెప్పఁబడదయ్యెను ఇఁకఁ బరిణామాలంకారముగఁ గొని కల్పలత లక్ష్మిగాఁ బరిణమించి కటాక్షించుచున్నట్టులు నిర్వహించినయెడల నన్ననో, లక్ష్మి యను కల్పవల్లి కటాక్షించునట్లు చెప్పి యది పొసఁగమిచేత కల్పవల్లి లక్ష్మిగాఁ బరిణమించునని ప్రయాసపడుటకన్నఁ గల్పలత వంటి లక్ష్మి యని లుప్తోపమగా నర్థము చేసికొనుటయే ప్రశస్తము ఉపమిత సమాసము పొందుపడనిచోట గత్యంతరములేక పరిణామాలంకారము నంగీకరింపవలసి యుండును. ఇట నట్లు కానేరదు. కాన దీనిని లుప్తోపమాలంకారమనుట సరియగును

కణ్ణ్డాఉుమ్ తణ్డు మేని కలన్దదుమ్ కవినుఱ్ నైజ్ఞుమ్
పణ్ణైక్కుళ్లై క్కరత్తు మాలామ్ పాదనమ్ శెప్పచ్చేర్న్దే
ఇణర్మలై క్కొత్తుమ్ కణ్గళ్ ఎళిల్ మలర్ వణ్డు మాన
అణాజ్ఞు కల్పగత్తిన్ వల్లి అడియనేఱ్కరుళ్ గనోక్కే (3)

ప్రతిక్షణము కత్తువంటి శరీరము నాలింగనము చేసికొనఁగానే సౌందర్యముతోఁ బ్రకాశించుచు నాలుగువైపుల వ్యాపించిన కొమ్మలను చేతులుగల భగవం

తుఁడను వృక్షము పెనుపొందు నల్లిబిల్లిగొనిన స్తనములను పూల గుత్తులును, కన్నులను నలరు విరులలోని తుమ్మెదలును గలిగిన లక్ష్మియను కల్పలత తన కడగంటి చూపుల నావిూఁదఁ బ్రసరింపఁ జేయును గావుత



అవతారిక — మూఁడవ శ్లోకమునఁ జెప్పఁబడిన శ్రీదేవియొక్క జగత్కారణత్వ మిట్టిదని చూపి, యీశ్లోకమున నిఖిల శ్రీదేవికిఁ గల కొన్ని గొప్పతనములను విశదపఱచి యామె కటాక్షమును మఱల నపేక్షించుచున్నారు

యద్భ్రూభఙ్గాః ప్రమాణం స్థిరచర రచనా
తారతమ్యే మురారేః
వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి య
త్పాద చిహ్నై స్తరన్తి।
భోగోపోద్ఘాత కేళీ చుళుకిత భగవ
ద్వైశ్వరూప్యానుభావా
సా నశ్శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీ
లఙ్ఘనీయై రపాఙ్గైః. ॥౪॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| యద్భ్రూభఙ్గాః | ఎవరి కనుబొమల ముడుతలు | ప్రమాణం | దారిని చూపునవియో |
| మురారేః | భగవంతునియొక్క | వేదాన్తాః | వేదాంతములు |
| స్థిరచర రచనా తారతమ్యే | స్థావర వస్తువులను, జంగమ వస్తువులను సృజించుటలోఁగల యెచ్చుతక్కువ లందు | మురభిదురసి | భగవంతుని వక్షఃస్థలమునందు |
| | | యత్పాద చిహ్నైః | ఎవరి పాదముల గుర్తులచేత |
| | | తత్త్వచిన్తాం | పరతత్త్వ విషయమైన చర్చను |

| | | | |
|---|---|---|---|
| తరఙ్గి | ముగించుచున్నవో, | సా | అట్టి |
| భోగ-ఉపా | అనుభవారంభమునం | శ్రీః | శ్రీదేవి |
| ద్రాత కేళీ | దాటుగాఁ బడినిటుఁ | అమృతలహరిదీ | అమృతేఁపుఁ గెరటము |
| చుళుకిత | బట్టిన భగవంతుని | లఙ్ఘనీయైః | లను తెలివిచేతఁ దెలిసికొనఁదగిన |
| నగవద్విశ్వ | విశ్వరూపస్వము | అపాఙ్గైః | క్రేఁగంటి చూపులచేత |
| రూప్య- | యొక్క మహిమ | నః | మమ్ము |
| అనుభావా | నెవ్వతె కలిగి యున్నదో | అస్నపిణీతామ్ | కప్పివేయును గావుత |

ఎవరి కనుబొమల ముడులు భగవంతుని సృష్టిలోని యెచ్చుతగ్గులకుఁ గారణములో, యెవరి చరణ యుగళంపు గుఱుతులచేత వేదాంతములు పరతత్త్వ నిర్ణయ మొనర్చినవో, భగవంతుఁడు విశ్వరూపము నెత్తి యనుభవింప దొరఁకొన్నను దాని నెవ్వతె యారంభమునందే యతి స్వల్పముగాఁ జేయునో యట్టి తల్లి మమ్ముఁ దన క్రడకంటి చూపులతోఁ గప్పి యనుగ్రహించుఁగావుత మనుట

<u>యద్భ్రూ భఙ్గాః</u> <u>మురారేః</u> — దేవ, మనుష్య, తిర్యక్, స్థావరములను నలుతెఱంగుల నొప్పు భగవంతుని సృష్టిలో నిమ్నోన్నతము లనేకములు గోచరించుచున్నవి భగవంతుఁడేల యిట్లుత్పత్తి చేయుచున్నాఁడు? శ్రీదేవి తన బొమముడుల జాడలచేత నొకని నైశ్వర్యవంతునిఁగాను, మఱియొకనిని దుఃఖపీడితుని గాను సృజింపవలయునని సూచింపఁగా భగవంతుఁ డట్లే యొనర్చునఁట! ఎందుచేత నట్లొనర్పవలయుననికూడ నడుగఁడఁట! శ్రీదేవి కంత వశ్యుండై యున్నాఁడు! "తదిఙ్గిత పరాధీనో విధత్తేఽఖిలమ్" అని యీ గ్రంధకర్త జనకులును శ్రీదేవి సూచనలకు వశ్యుఁడై భగవంతుఁడు సమస్తమును జేయుచున్నాఁడని నుడివిరి

వారివారి కర్మానుసారముగ శ్రీదేవి తన భ్రూభంగముల సూచన లిచ్చుటచేత నామెకు వైషమ్య నైర్ఘృణ్యములు లేవని తెలియనగును

"భ్రూభఙ్గాః ప్రమాణమ్" అనునది "వేదాః ప్రమాణమ్" అనుదానివంటిది వేద ప్రమాణము ననుసరించియే బ్రహ్మ యుత్పత్తి చేయునట్లు భగవంతుఁడును శ్రీదేవి కనుబొమల ముడుల జాడలను ప్రమాణము నవలంబించియే సృష్టిచేయుచున్నాఁ డనుట వేదములు దోఁచుకొనఁ బడినపుడు "అంధుఁడనైతిని, రిక్తుఁడనైతిని" అని బ్రహ్మ యుత్పత్తినిఁ జేయఁజాలక పోయినట్లు భగవంతుఁడును శ్రీదేవి భ్రూభంగములు లేనిచో సృజింపఁజాలనివాఁడే యగును

జ్ఞాన శక్తులు నిండుకొనియున్న భగవంతునకు శ్రీదేవి భ్రూభంగములు కావలయునా? వారివారి కర్మానుగుణముగ వారివారి కుచితమైన రీతిని సృష్టిని భగవంతుఁడే చేయఁజాలఁడా? యను ప్రశ్నకు నుత్తరము చెప్పెదము

అనిక్కుఁడైన భగవంతుఁడు తానే కర్మలను జూచి యుచిత ప్రకార ముత్పత్తి చేయునేని శ్రీదేవి కనుబొమల ముడులఁ జూచి మఱియు మెచ్చులను గోల్పోవును గదా! అందుచేతనే తనంతటతానే సృష్టిఁ జేయఁడు మఱియు సృష్టియనునాటలో శ్రీదేవియును పాల్గొన వలయును గదా! అటు లేనిచో నేకాకియై నిలిచిన భగవంతుఁడు మెచ్చుటఁ గొలుపు నియామకుఁడు గలవాఁ డెట్లు కాఁగలఁడు? "క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాత్" (శ్రీదేవి సన్నలకు లోఁబడి భగవంతుఁ డన్నిటిని కొనర్పఁ డయ్యెనేని నీ యాట యతని కానందమును గొలుపదు) అను నీ గ్రంథకర్తల తండ్రిగారి దివ్యవాక్యము జూడుఁడు మనుష్యుఁడు తన యిల్లాలితోఁ గలసిమెలసి గావించు గృహస్థ ధర్మమే మది కింపుఁ గొలుపుట లోకమందును మనము చూచుచున్నాము

ఇఁక, నే కాలమందును విడఁబాయఁ జాలని శ్రీదేవితోఁ గూడి యుండుట చేత ముందటి శ్లోకమునఁ జెప్పినట్టులు పెట్టిన యడుగు నూడ్చఁదీయలేనట్టి చెట్టువలె నేమి చేయుటకును దోఁచక మైమఱచి నిలుచు భగవంతుని నిట్లట్లు సృష్టి చేయ వలయునని శ్రీదేవి పురికొల్పియే తీఱవలయు ననియుఁ జెప్పఁదగును సంయోగ జనితమైన యానందాతిశయముచేత భగవంతుని మాడ్కి శ్రీదేవియు మైమఱచి నిలువదా? యన్ననో, భోగ్యతలో నతిశయమును గలిగిన యీమె మొదట తనకు వశ్యుండైన భగవంతుని స్థితిని జూచి యధికోత్సాహము కలదగును గాన నట్లు తాఁ గాఁజాలదు పెరియ తిరుమొழி 9-6-3 వ్యాఖ్యానములో "తన్నైక్కిట్టత్తిత్తోన్ఱు తోల్వియాగవే శేవడిగళ్ మిడుక్కుమ్ ఇదిలే వన్దేఱుమిఱో" యను పెరియవాచ్చాన్ పిళ్లై శ్రీసూక్తియొక్క తాత్పర్యమిచ్చోటఁ బొందుపడి యుండుటను జూడుఁడు

ఇందువలన భగవంతునిఁ గారణమగునట్లు పురికొల్పుటయే శ్రీదేవి కారణభూతురాలనుటలోఁ దాత్పర్యమగునని తెలియనగును

మురాసురుని నిరసించినవాఁడు మురారి ఇక్కడ భగవంతుని మురారి యన్నది గమనింపఁదగినది శత్రునిరసన మొనర్చు పనిలో శ్రీదేవి పురికొల్పుట లేకున్నను యుత్పత్తికార్య మొనర్చుటకది తప్పనిసరిగ వలసియున్నదని తోఁచుటకు "మురారియొక్క సృష్టిలో" ననిరి శత్రువులను భగవంతుఁడు నిరసించునపుడు శ్రీదేవి నిషేధింపక యుండునే కాని పురికొల్పుట లేదు అని తెలియనది ఇఁక మురారి యను పదము శక్తి కలిగియుండుటను జూపించుచు, నట్టి స్థితిలో శ్రీదేవి ముఖమును దిలకించుచు నిలిచియుండు భగవంతుని స్థితిని దెల్లము సేయుచున్నది

శ్రీరంగరాజ స్తవమునందు "నమః శ్రీరఙ్గనాయక్యై యద్భ్రూవిభ్రమ భేదతః। ఈశేశితవ్య వైషమ్య నిమ్నోన్నత మిదం జగత్॥" అని శ్రీరంగనాచ్చియారుల కనుబొమల ముడులందుఁ గల భేదములచేత నియంత, నియామ్యము, ఉత్కృష్టము, నికృష్టము నను వ్యత్యాసము లీ లోకమున నేర్పడినట్లు వీరే నుడివియున్నారు

వేదాన్తాః — తరన్తి — శ్రీదేవియొక్క పాదములు ఉన్న చోటని వక్షస్స్థలమునందుఁ జూడఁదగునో యతఁడే పరతత్త్వమని యుపనిషత్తులు తీర్మానించినవి. “లక్ష్మీపద లాఞ్ఛనైక లక్షణమ్” అని శ్రీరంగరాజ స్తవమునందును గలదు “పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షారసాఙ్కమ్” అని వేదాంత దేశికులు ననిరి ఇందుచేత “చిహ్నైః” యను పదమునకు లత్తుకరసపు గుర్తులను నర్థము కొనవలయు నని తెలియుచున్నది

ఈ పాదముయొక్క తాత్పర్యము — సత్, బ్రహ్మం, ఆత్మ యను సామాన్య శబ్దములచేత కారణ వస్తువును నిర్దేశించి యట్టి వస్తువు బ్రహ్మ కాదు, ఈశానుఁడు కాఁడు, నారాయణుఁడేయని విశేషించి వేదాంతములు పరతత్త్వమును సిద్ధాంతము చేసినవి ఆ నారాయణుఁ డెవ్వఁడని యాకాంక్షలో లక్ష్మీదేవియొక్క పతి యని కడపటఁ దీర్మానించినవి అనఁగా నారాయణుఁడని శ్రుతిచేతను, లక్ష్మీ సంబంధ మను లింగముచేతను బరతత్త్వము నిర్ణయింపఁబడినది “శ్రియః పతిత్వ లిఙ్గత్తాలుం నారాయణ శబ్దత్తాలు మిక్కే శ్రుతిగళిల్ పరతత్త్వ విశేష నిర్ణయమ్ పణ్ణప్పట్టదు” (శ్రియః పతిత్వ లింగముచేతను, నారాయణ శబ్దముచేతను శ్రుతులలోఁ బరతత్త్వ విశేష నిర్ణయము చేయఁబడినది) అని రహస్యత్రయసారమందలి ద్వయప్రకరణములో వివరింపఁబడి యున్నదానిని చూడుఁడు వక్షస్స్థలమునఁ బాలఁతిని దాల్చియుండుట పరతత్త్వ చిహ్నమని యర్థము

“మురభిదురసి యత్పాద చిహ్నైః” అనుట తం దృష్ట్వా శత్రుహన్తారమ్ . బభూవ హృష్టా వైదేహీ” యనునట్లు శత్రువుల నాశమొనర్చినంతనే శ్రీదేవి సంతోషించి యతని ఱొమ్మున నటనమాడుటను జూపుచున్నది

ఱొమ్మున నడుగుల గుర్తులు నాటునట్లు నడయాడుట తోఁచుటచే భగవంతుని ఱొమ్ము మిక్కిలి వెడల్పయినదని తెలియవచ్చెడిని

మాఱువడక యీ యడుగుల గుఱుతును భగవంతుఁడు గాపాడుచుండుటచే భగవంతునకు వానిలోఁగల యాదరము మనకుఁ దెలియవచ్చుచున్నది

ఏ లక్ష్మీ సంబంధముచేత వేదాంతములు సిద్ధాంతీకరించుచున్నవని చెప్పక ఆమె యడుగుల విన్యాసములంబట్టి సిద్ధాంతీకరించుచున్నవని చెప్పుటచేత శ్రీదేవి భగవంతునిఁ దనకు మిక్కిలి వశ్యుఁగాఁ జేసికొనెనని తెలియుచున్నది

ఈ పాదముచేత పరతత్త్వమును నిరూపించునది లక్ష్మీ తత్త్వమే యని తేటపడుచున్నది

భోగోపోద్ఘాత .. అనుభావా — భగవంతుఁడు విశ్వరూపము నెత్తి యనుభవింపఁ బూనినను నీమె భోగ్యత కిది యిఁ జాల దనుట భోగ మనఁగా స్వరూప రూపగుణములను సాక్షాత్కార మొనర్చుట వైశ్వరూప్య మనఁగా పరత్వము మొదలగు దశలలోని సమస్త రూపములను గలిగియుండుట ఇఁక “అనేక బాహూదర వక్త్ర నేత్రం” అను నట్లనేకావయవములుగల రూపమును

ధరించియుండు దశయనియుఁ జెప్పెదరు "దశశత పాణిపాద వదనాక్షి ముఖై రఖిలైః" యని యీ గ్రంథకర్తయే మీఁద ననుగ్రహించి యుండుటను జూడుఁడు నిత్యులు, ముక్తులు భగవంతు ననుభవింప నత్యంత మనోరథముతో లెక్కలేనన్ని రూపములఁ దాల్చి విచ్ఛేదములేక కాలమంతయు ననుభవించినను, ననుభవించిన యంశము స్వల్పముగను, ననుభవింపని యంశ మెక్కువగను దోఁచునఁట అట్లే భగవంతుఁడును శ్రీదేవి ననుభవించుటకై విశ్వరూపమును ధరించి పూనుకొన్నను నా వైశ్వరూప్యానుభవము మిక్కిలి యల్పమై తోఁచునఁట అంతటి భోగ్యతను గలిగినది శ్రీదేవి యనుట ఆహా! తనయెడ నిత్యముక్తులు పడు పాటు లెల్లను శ్రీదేవియెడ భగవంతుఁడు పడు పాటు లయ్యెనుజూఁడీ! "స్వవైశ్వరూప్యేణ సదాను భూతయా ప్యపూర్వవ ద్విస్మయ మాదధానయా" యని యాళవందారులు ననిరి

ఇఁక శ్రీదేవియొక్క భగవంతుని గుఱించిన భోగము నిచ్చట విషయముగఁ గొనువారలును గలరు అప్పుడు శ్రీదేవి యనుభవింపఁ దొడంగునపుడే యా యనుభవమునకుఁ జాలక యల్పమైనదై భగవంతుని విశ్వరూపము దోఁచునని చెప్పుట యగును తొలి యర్థమున భోగ్యతలోని శ్రేష్ఠతయును, మఱి యర్థమున ననుభవించుటలోని సామర్థ్యమును వరుసగాఁ దోఁచుచున్నవి తొలి యర్థమే శ్రేష్ఠమైనది, ఆచార్యులును దానినే యాదరించుచున్నారు

భోగోపోద్ఘాతమైన కేళి యని కర్మధారయముగఁ గొనువారలును గలరు అపుడు "భోగమున కారంభమగు కటాక్షించుట మున్నగు లీలలచేత" అని యర్థ మగును "కేళీ" యనుదానికి అనాయాసముగ నని తత్త్వ సంగ్రహమున నర్థము చెప్పఁబడి యున్నది

అనుభవించుటకుఁ గావలసిన జ్ఞానము, శక్తి మున్నగు గుణములను గలిగి యుండుటను జూపుటకు భగవచ్ఛబ్దమును బ్రయోగించిరి

అమృతలహరిధీ లఙ్ఘనీయైః అపాఙ్గైః—లంఘనీయైః అనుదానికిఁ బడయఁదగిన వనున దర్థమై, "గత్యర్థాః బుద్ధ్యర్థాః" యనునట్లు పడయుట తెలియుటయై తెలియఁ దగినవని యయ్యెను ఇఁక "అమృతలహరిధీః లఙ్ఘనీయా యై స్తైః" అమృతంపుఁ దరంగముల బుద్ధి వేనిచేత దాఁటి పోఁదగినదో యట్టి కటాక్షములనియు నర్థముఁ జెప్పుదురు అమృతంపుఁ గెరటములందు బుద్ధి చననట్లు దానికన్న మధురములై యున్న కటాక్షములనుట అమృతపుఁ దరంగములన్నందులకుఁ దగినట్లు "అపాఙ్గైః" యనుదానికిఁ గ్రేఁగంటి చూపుల వరుసలచే నని యర్థమును గొనవలయును శ్రీస్తుతియు "అమృతంపుఁ దరంగములం బోలిన కటాక్షములు" అనుటం జూడుఁడు. ఉజ్జీవింపఁ జేయుట కటాక్షమునకును, నమృతమునకును సమాన ధర్మము ఆత్మ నుజ్జీవింపఁ జేయుటలో నమృతమునకంటెఁ గటాక్షము శ్రేష్ఠమైనది

ఈ శ్లోకమున మూఁడు పాదములచేత వరుసగా భగవంతుని బురికొల్పి కార్యమును సాధించుకొనుటయందలి వాల్లభ్యము, నిరూపకత్వము, భోగ్యతా శ్రేష్ఠత యనునవి శ్రీదేవికిఁ జెప్పఁబడినవి

ఇతర దేవీమణులకు లేనట్టివియు, శ్రీదేవికే చెందినవియునగు కొన్ని గొప్ప తనములను, రెండవ శ్లోకము మొదలుగ నింతవఱకు గ్రంథకర్త యేర్చి కూర్చియుండు సొగసు గమనించి యనుభవింపఁ దగురీతి నమరియున్నది మహిషియై యుండుట, ఆనురూప్యము గలిగియుండుట, తాఁ బనిచిన పనిని భగవంతుఁ డొనర్చు నట్లతని కిష్టురాలై యుండుట, వక్షస్స్థలము వీడి తొలఁగకుండుట, నిరూపకత్వము, భోగ్యతలో శ్రేష్ఠత యను గొప్పతనములు గూర్పఁబడి యుండుటం జూడుఁడు ఇతర దేవీమణులకన్న శ్రీదేవికిఁగల యాధిక్యమునకు హేతువులం బేర్కొనునపుడు తత్త్వ సంగ్రహమునందు మహిషీభావము, ఆనురూప్యము, అభిమతత్వము, భోగ్యతోత్కర్షము, నిరపాయత్వము, స్వరూప నిరూపకత్వము ననునివియే మొదటి స్థానముం బడసియుండుట యిచ్చోటఁ దెలియఁదగినది

ఇందువలన స్వతంత్రుఁడైన భగవంతుని బొందుటకుఁ బురుషకారము వలసి యున్నను శ్రీదేవినే పురుషకారముగాఁ జేపట్టవలయు నను నిర్బంధమేమి? ఇతర దేవీమణులను స్తుతించి పురుషకారముగాఁ జేపట్టరాదా? యను ప్రశ్నమునకు సమాధానము చెప్పఁబడిన దయ్యెను మీఁదఁ జెప్పిన శ్రేష్ఠతలను గలిగియుండుటం బట్టి యీమెయే పురుషకార మగుటకుం దగిన దనుట "లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః" అను దానినిం జూడుఁడు ఇతరులకుఁ జెప్పఁ బడిన పురుష కారత్వము లక్ష్మీసంబంధముచేతఁ గలిగినది, నైసర్గికము కాదని తెలియునది

నిఱ్పనవు న్దిరివనవు మేఙ్గ త్తాళ్వాయ్
నిఱుమిత్తా నెవళ్ పురువ నెఱిప్పు క్కేఱ్ప
మఱ్పుగర్ త్తో ళవన్మార్బి లెవళ్ కాఱ్ చిన్నమ్
మత్తై ముడియి ఱ్పరమ్బురుళ్గళ్ ళత్తై క్క తీర్ త్త
పఱ్పల పారిత్తిత్తై వళ్ విశ్వరూప
త్తుడనిఱ్ఱియిఱ్ పరియాదు భోగత్తిళ్ముళ్
అఱ్పమదాయ్ క్కఱ త్తడక్కు మవ్వాణ్గై
అముదవల్లై క్కల్లై క్కణిప్పా లన్నై క్క వెమ్మెత్ర. (4)

స్థావర జంగమములను భగవంతుఁ డెవ్వతె భ్రూభంగముల జాడలం బట్టి యెచ్చుతక్కువలు గలవిగా సృజించెనో, బలిసిన భుజములు గల యాతని వక్షస్స్థలమునం దెవతెయొక్క పాదవిన్యాసములను బట్టి వేదాంతములు పరతత్త్వ సిద్ధాంతము గావించినవో, యనేక విధముల మనోరథములను పొంది యతఁడు విశ్వ

రూపముతోఁ దన్ను ననుభవింపఁ దొడంగినంతనే యతని విశ్వరూపమును నల్పమైనదిగా నొనర్చి తన పుడిసిట నణంచుకొనునట్టి లక్ష్మీదేవి యమృత తరంగములం బోలిన కటాక్ష వీక్షణములచేత మమ్ముఁ జేర్చుకొనుఁ గావుత



అవతారిక —పై రెండు శ్లోకములలో నీ గ్రంథకర్త ప్రార్థించిన ప్రకారము శ్రీదేవి తన్ను జల్లఁగాఁ గటాక్షించినందునఁ దా నామె స్వరూపాదులను సాక్షాత్కరింపఁ జేసికొని "బ్రహ్మాదులకుఁగూడ స్తుతించుటకు గష్టసాధ్యమైన యిట్టి వైభవమును నేను స్తుతించుటయా? బాగుబాగు, నా శ్రేష్ఠమైన వాక్కులు వెలయుత్ర" మని తమ్ముఁ దామే పరిహసించుకొనుచున్నారు

యద్యావ త్తవ వైభవం తదుచిత స్తోత్రాయ దూరే స్పృహా
స్తోతుం కే వయమి త్యదశ్చ జగృహుః ప్రాఞ్చో విరిఞ్చ్యాదయః
అప్యేవం తవదేవి వాఙ్మనసయో ర్భాషానభిజ్ఞం పదం
కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తిప్రశ స్త్యైగిరామ్ ॥౫॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | శ్రీదేవీ! | జగృహుః | తీసికొనిరి (నుడివిరి) |
| తవ | నీయొక్క | ఏవమపి | ఇట్లుండినను |
| వైభవం | మహిమ | వాఙ్మనసయోః | వాక్కునను మనస్సునను |
| యత్ | ఏ స్వరూపముగలదో, | భాషానభిజ్ఞం | నుడివి (వాడుకపడి) యెఱుంగని |
| యావత్ | ఏ పరిమితి కలదో, | తవ | నీయొక్క |
| తదుచిత | దాని కుచితమైన | పదం | వైభవమును |
| స్తోత్రాయ | స్తుతిని జేయుటకు | కావాచః | దోషయుక్తములైన మాటలుగల మేము |
| స్పృహా | ఆశ | కవయితుం | వర్ణించుటకు |
| దూరే | (ఎవరికిని) అందనిది | ప్రయతామహే | బాగుగఁ బ్రయత్నించుచున్నాము. |
| ప్రాఞ్చః | ప్రాచీనులైన | గిరాం | మా మాటలయొక్క |
| విరిఞ్చ్యాదయః | బ్రహ్మ మున్నగువారలు గూడ | ప్రశస్త్యై | అతిశయమునకు |
| అదః | ఈ వైభవమును | స్వస్తి | మేలగుఁగాత! |
| స్తోతుమ్ | స్తుతించుటకు | | |
| వయం కే | మే మెవరము? | | |
| ఇతి | అను మాటను | | |

ఎట్టివారైనను శ్రీదేవి వైభవమును వర్ణింపఁజాలరు. అయిన నిందు మేము ప్రయత్నించుచున్నారము. ఇట్టి సాహసము పరిహాసాస్పదమని భావము.

యద్యావత్తవ వైభవం... ...స్పృహా— యత్ —ఏ స్వరూపము గలది యావత్ —ఎంత పరిమితి గలది యనుట. భగవంతుని వైభవమునకంటె వేఱుపాటు తోఁచుటకయి "నీ వైభవము" అనిరి. భగవంతుని వైభవమును గొలిచి చెప్పవచ్చునను తలంపున వేదములు ప్రయత్నించి చూచినవి. శ్రీదేవి వైభవమన్నను గొలిచి చెప్పఁగోరుటకును నరుదైనది. కావుననే యీ వైభవమును వేదములు లెక్కించి వచింపఁ బూనవయ్యె ననుసొంపు "తవ వైభవం.. . దూరే స్పృహా" అనుటలో స్ఫురించి ముదముఁ గూర్చుటను జూడుఁడు. "ఇట్టి వైభవము" అని విశేషింపమిచేత స్వరూపాదులయొక్క యన్ని వైభవముల నని గ్రహింపుఁడు.

"స్తుతించుటకు యోగ్యత" అని చెప్పక "ఆశపడుట" అని చెప్పుట శ్రీదేవీ స్తోత్రమభిలషింపఁ దగిన ఫలమని తెలియఁజేయుటకే. ముక్తిదశయందును స్తుతించుటయే ఫలముగా వేదము తెలియఁజేయుచుండుట ఇట యెఱుఁగఁ దగినవి.

స్తోత్రాయ స్పృహా—స్తోత్రము చేయుట కభిలాష అనుట. "క్రియార్థోపపద" ఇత్యాది వ్యాకరణ సూత్రప్రకార మిచట చతుర్థీ విభక్తి వచ్చియున్నది. ఇఁక "పుష్పేభ్యః స్పృహా" (పుష్పములకొఱకు ఆశ) యనుచోటఁ గల చతుర్థీ విభక్తిఁ బోలినదిది యనుటయుఁ దగును. పుష్పమును బొందుట కభిలాష యనుట వలె, స్తోత్రమును బొందుట కభిలాష యని యర్థము. ఇప్పుడు "స్పృహేరీప్సితః" అను వ్యాకరణసూత్రము ప్రకారము చతుర్థీవిభక్తి వచ్చియున్నది. మేము స్తోత్రము రచింపక పోయినను, ఏ మహానుభావుఁడైనను శ్రీదేవి వైభవమునకుఁ దగిన రీతిని రచించియుండిన యెడల, దానిని స్వీకరించి యనుభవింప నుబలాట పడవచ్చును గదా! అట్టి స్తోత్రమే లేమిచే దానిని బడయఁ గోరుటయు నసాధ్యమే యని చెప్పుటయయ్యెను.

ఇట్టివారికిఁ గోరుట యరుదనక, యెల్లరకును గోరుట యరుదను నర్థమును గ్రహింపుఁడు. భగవంతునికిఁ గూడ శ్రీదేవి మహిమ వర్ణనాతీతమైనదని "యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః, నాలమ్మాతుమియత్తయా నిరవధిం" అని యాళవందారును, "దేవి త్వన్మహిమావధిర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే" యని యాళ్వానును నుడివియున్నారు.

అర్థమునందువలె పదమునందును, "స్తోత్రము"తో "స్పృహ" అను దానిని జేరనీయక యడ్డుపడి నిలిచిన "దూరమ్" (దూరే అను పదము) అమరియున్న సొంపును జూడుఁడు.

"ఏల? బ్రహ్మాదులు శ్రీదేవిని స్తుతింప లేదా?" యన్నచో నిజముగా వారెవరును స్తుతింపనే లేదే యని రెండవ పాదమున నుడువుచున్నారు.

స్తోతుం కే వయం ..విరిఞ్చ్యాదయః — చిరకాలముగ జ్ఞానమును, అనుభవమును బడసినవారని గనఁబఱచుటకై "ప్రాఞ్చః" అనిరి.

సృష్టికర్త యను నర్థమునిచ్చు "విరించి" యను పదముతో బ్రహ్మను బేర్కొనుట అతని శక్తిని దెలియఁబఱచుటకయి యున్నది

"చ" అనుదానిని "విరిఞ్చ్యాదయః" అను దానితో నన్వయించుకొని యర్థముఁ జెప్పవలయును బ్రహ్మ మొదలగువారలు కూడ ననుట "చ" కారము పేరిమిని దెలుపుచున్నది బ్రహ్మ మొదలగు వారలును "స్తోత్రము చేయుటకు మే మెంతటి వారమ?" మని చెప్పిరే కాని నిజముగా స్తుతింప లేదే యనుట వారి స్తుతుల గమనించినచో వారి యెఱుంగమి వెల్లడి యగుచున్నదే కాని శ్రీదేవి నున్న దున్నట్లుగా స్తుతించినట్లు తెలియరాదని భావము ఇఁక, "చ" అనుదాని నున్న చోటనే గానియు, "అదః" అను పదమును "స్తోతుం" అనుదానితో నన్వయింపకయు, పురాణపురుషులైన బ్రహ్మాదులు "స్తుతించుటకు మేమెవర" మను పలుకులను నీ వైభవమును (స్తుతించుటను) గ్రహించిరి—అని కొంద ఱర్థము చెప్పుదురు స్తుతించుట కసాధ్యమని చెప్పుచుఁ దమకు సాధ్యమైనంతవఱకు స్తుతించిరనుట వారి తాత్పర్యము మఱియు, వేఱువిధముగ దీనికి కొంద ఱర్థములు చేయుదురు అట్టి యర్థములు ప్రాసంగికముచేతను, శ్రేష్ఠములు గాకుండుటచేతను విడువఁబడినవి

"అదః" అను శబ్దమిచట రసపుష్టి గలది సంస్కృత భాషలో వస్తు నిర్దేశార్థక సర్వనామములు నాలుగు కలవు అవి—ఇదమ్, ఏతత్, అదః, తత్ అనునవి కంటి యెదుట దగ్గరగా నుండుదానిని "ఇదం" అనియు, మిక్కిలి సమీపమం దున్నదానిని "ఏతత్" అనియు, దూరమందున్న వస్తువును "అదః" అనియు, కంటికిఁ దెలియనిదానిని "తత్" అనియు నిర్దేశింపవలయును శ్రీదేవి వైభవమును బ్రహ్మాదులును వర్ణింప నరుదగునట్లు దూరమందున్నదని "అదః" అను శబ్దమిచట సూచించుటఁ గని మురియునది

"నతే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః" అ శ్రీదేవీ గుణములను బ్రహ్మాది దేవతలకుఁగూడ స్తుతించుట సాధ్యము కాదని విష్ణు పురాణము చెప్పుచున్నది

విరిఞ్చ్యాదు లనునది పరమశివుని, సనకాదులను దెలుపుచున్నది "శర్వ పితామహాద్యైః" "విధి శివ సనకాద్యైః" అని వీరి నొక గుంపుగా నితరులు ప్రస్తావించి యుండుటయుఁ జూచునది

అప్యేవం—"ఏవ మపి" యని మార్చుకొనవలయును

వాఙ్మనసయోః—"అచతుర" ఇత్యాది వ్యాకరణ సూత్రము ననుసరించి మనశ్శబ్దము అకారాంత మయ్యెను

మాటలాడుట యను నర్థముగల "భాషా" యను పదము లక్షణా వృత్తిచేత నలపడుటను దెలుపును

పదం—పద్యత ఇతి పదం—అని వ్యుత్పత్తిపడసి యనుభవింపఁదగు శ్రీదేవి యొక్క వైభవము అనుట వైభవమని యారంభించినదానికి విరోధించుటం బట్టి స్వరూప మను నర్థము చెప్పుట పొసఁగదు

కావాచః—"ఈషదర్థే చ" యను సూత్రప్రకారము "కు" శబ్దము "కా"గా మారినది తమ సకృష్టత తెలియఁజేయునట్లుగా బహువచనములో "బ్రూమః కథం త్వాం వయం" అను చోట వలె పేర్కొనిరి ప్రయతామహే—పట్టనపట్టు విడువక ప్రయత్నించుచున్నామనుట శ్రీదేవీ వైభవమునంతను దమ స్తోత్రములో నిముడ్చు నుబలాటముతో ప్రయత్నించుటంబట్టి "ప్ర" యని తమ ప్రయత్నపుఁ బెక్కువిని జూపిరి కవయితుం—శ్రీదేవి వైభవము నున్నదున్నట్లుగాఁ బేర్కొనుటయేకాక మీఁదుమిక్కిలి లేనివానిని గూడఁగూర్చి కవివరునివలె వర్ణింపదొరఁకొంటిమనుట

స్వస్తి ప్రశస్త్యై గిరాం—తమ దోషభూయిష్ఠములైన వాక్కుల పేర్మి వెలయుతి మనుచు తమ్ము పరిహసించుకొనుచున్నారు నా దోషయుక్తమైన రచన పేర్మి లేనిది గావున నందఱచేతను పరిహసింపఁబడును, కావున నేను స్తోత్రము చేయకుండుటయే మేలని తాత్పర్యము

ఇఁకను, ఇది సాహస కార్యమైనను, ప్రాప్తమైన శ్రీదేవీ విషయమగుటచేత శ్రేష్ఠతను బొంది వెయుఁగాత యని కొందఱు భావము చెప్పుదురు

"తత్త్వేన యస్య మహిమార్ణవ శీకరాణుః" — అను స్తోత్రరత్న శ్లోకము నొకరీతి నిది అనుసరించి యున్నది

"ఈ భూలోకములో నొకరు స్తుతింపఁ బూనుకొని తదర్థముగా మా కటాక్షము నపేక్షించుచున్నారే" అని శ్రీదేవి సంతోషించి, వెలసి తన స్వరూప రూపాదుల నీ గ్రంథకర్తకు ప్రదర్శించెనని — "దేవీ!" యని సంబోధించి — "నీయొక్క" యని యెదుట నుంచుకొని మాట్లాడుటచేత తెలియుచున్నది

దేవి! నిన వైభవమ త్తనైక్కుమ్ శేరుమ్
తిఱత్తనవామ్ తుడవిళై ద లరిదే యన్ఱో
యావరదు తుదిత్తిడఱ్కు యామెన్ఱార్గళ్
యాత్తశకత్తయాన్మదుల మున్నోర్ కూడ
నావలిమై యిల్లాదేమ్ నామానాలుమ్
నామఙ్గళ్ పఴగలానిన్ వైభవత్తై
ప్పావరిశై పాడిడవే ముయల్గిన్ఱోమాల్
పావళఙ్గళ్ళిఱ్ శిఱప్పు వాఴ్గ మాదో! (5)

దేవీ! నీ వైభవమెల్ల ప్రకాశింపఁ జేయు స్తుతిని రచియింప వలయునని యభిలషించుటయే కష్టసాధ్యమైనది. లోకములను సృజించిన బ్రహ్మ మున్నగు పూర్వులును "స్తోత్రముచేయ మేమెంతటివారము?" మని తమ యసమర్థతను ప్రకటించిరి. అవాఙ్మనసగోచరమైన నీ వైభవమును స్తోత్రముచేయ నుద్యమించుచున్నాను. వాక్పటుత్వము లేని నా కవిత వర్ధిల్లుఁ గావుత! (5)



అవతారిక — స్తోత్రము చేయుటకు బ్రహ్మాదులకును కష్టసాధ్యమైన శ్రీదేవి వైభవమును నేనే స్తుతించుట కర్హుండనని చెప్పుచున్నారు.

స్తోతారం తముశన్తి దేవి! కవయో యో విస్తృణీతే గుణాన్
స్తోతవ్యస్య తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి।
యస్మాదస్మదమర్షణీయ ఫణితి స్వీకారత స్తే గుణాః
క్షాన్త్యౌదార్య దయాదయో భగవతి! స్వాం ప్రస్తు
వీరన్ప్రథామ్ ॥౬॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| భగవతి | పూజింపఁదగిన | మయ్యేవ | నాయందే |
| దేవి! | ఓదేవీ! | విశ్రామ్యతి | విశ్రాంతిని పొందుచున్నది |
| కవయః | ప్రాజ్ఞులు | యస్మాత్ | ఏల యనఁగా |
| యః | ఎవఁడు | తే | నీయొక్క |
| స్తోతవ్యస్య | స్తుతింపఁదగినవానియొక్క | క్షాంత్యౌదార్య | ఓర్పు, ఈవి, దయ |
| గుణాన్ | గుణములను | దయాదయః | మొదలైన |
| విస్తృణీతే | వివరించునో | గుణాః | గుణములు |
| తం | అతనిని | అస్మత్ – అమర్ష | సహింపరాని మా |
| స్తోతారం | స్తుతించువానినిగా | ణీయ – ఫణితి – | మాటల నంగీకరిం |
| ఉశన్తి | భావించుచున్నారు | స్వీకారతః | చుటచేత |
| తతశ్చ | అందువలన | స్వాం | తమదైన |
| తే | నీయొక్క (నిన్ను గుఱించిన) | ప్రథాం | ప్రసిద్ధిని |
| స్తుతిధురా | స్తుతించు భారము | ప్రస్తువీరన్ | ప్రకటించును |

ఒక వస్తువు గుణములను వివరించువాఁడే స్తోత్రము చేయువాఁడు జ్ఞానశక్తులఁ బడసిన బ్రహ్మాదులు శ్రీదేవి గుణముల నన్నింటిని వివరింప నశక్తులు సహింపరాని నామాటల నంగీకరించుటచేత శ్రీదేవియొక్క క్షమాది గుణములు సుప్రసిద్ధములగుటంబట్టి నేనే స్తుతించుట కధికారినని యర్థము

ఈ శ్లోకమందలి పూర్వభాగముచేత స్తుతించువాని లక్షణమును, ఉత్తరభాగముచేత నట్టి లక్షణము తనయందు పొసఁగి యుండుటను గ్రంథకర్త చూపుచున్నారు.

లోకములో పలువురు కవు లనేకముగ నొకరియందు లేని గుణములను, వారియం దారోపించి స్తుతించెదరు శ్రీదేవియందు లేని గుణము వేఱొకటి లేనందున నట్లారోపించి స్తుతింప వలనుగాదు ఇంక "సమ్యక్సత్య గుణాభివర్ణనం" అన్నట్లున్నదున్నట్లుగానే శ్రీదేవియొక్క యెల్లలేని గుణములను వర్ణించి ప్రకటించుటయు నసాధ్యమైన కార్యమే! కనుక శ్రీ దేవిని స్తుతింప నెరికిని సాధ్యముకాదు అయినను నాదోషయుక్తమైన కవిత శ్రీదేవియొక్క మితిమీఱిన క్షమాది గుణముల నొకరీతిగా ప్రకటించునదై యమరి యున్నందున నిది స్తుతియయ్యెను నావంటి దోషభూయిష్ఠమైన వాక్కుగలవా రితరులెవరును లేరుగనుక శ్రీదేవిని స్తుతించుటలో నేనే యధికారినని చెప్పఁబడినదయ్యెను

ఒకదానియందలి గుణములను విశదీకరించుటయే స్తుతించువాని లక్షణము బ్రహ్మాదులకు స్తోత్రము చేయుట కధికారము లేదిని తోఁచునట్లుగా "నాకే స్తుతించు నధికార" మనుచున్నారు తప్పు లెక్కువగా నుండుటచేత మాటలు సహింపఁజాలని వైనవి

మొదట "నాయందే" యని యేకవచనము చెప్పుకొని, యిచ్చట "మా" (అస్మత్) అని బహువచన ముపయోగించినారు దోషయుక్తమైన కవితనుగూర్చి తన నైచ్యము గోచరమగుటకుఁ గాను, మఱియు ననుసంధించువారిని కలుపుకొనుటకుఁగాను బహువచన ప్రయోగము చేయఁబడినదని చెప్పఁదగును

స్వాతంత్ర్య మను దోషముతోఁగూడిన భగవంతుని గుణములనుండి వేఱుపాటు గోచరించునట్లుగా "నీగుణములు (తే గుణాః)" అనిరి

"క్షాన్త్యౌదార్య దయాదయః" అనుటలో "ఆది" శబ్దముచేత వాత్సల్య గుణమును దీసికొనవలయును

క్షాంతి యనఁగాఁ జేసిన యపరాధమునకు శిక్షింపఁదలఁపక సహించుకొనుట "ఔదార్య" మనఁగా ఈవి "దయ" యనఁగా నితరులు పడు కష్టమునుజూచి సహింపకుండుట "వాత్సల్య" మనఁగా దోషమును గుణముగాఁ బరిగ్రహించుట.

మాటలలోని దోషములను సహించుటచేత క్షాంతి బయలుపడుచున్నది "క్షాన్తిస్తే సవిషయా మమ దుర్వచోభిః" ఇది వీరి తండ్రిగారి వచనము దోషయుక్తములైన మాటలచేనైనఁ దన్ను బొగడనిచ్చినందువలన నౌదార్యము వెల్లడియగుచుండుటను జూడుఁడు "నావలర్ పామరువి నిఱ్కత్తన పాన్మైయే వళ్ళలే" (కవుల పద్యములందుఁ పనుపడి నిల్చి పిలువఁ దన్నొసంగిన స్వభావము కలిగిన దాత యగువాఁడా!) అనునది నమ్మాళ్వారు శ్రీసూక్తి స్తుతింపఁజాలక పడు శ్రమలను జూచుటచే దయ ప్రకటితమగుచున్నది "కిఞ్చైష శక్త్యతిశయేన న తేఽనుకమ్ప్యః స్తోతాపి తు స్తుతికృతేన పరిశ్రమేణ" అని ఆళవందారుల శ్రీసూక్తి దోషవంతములైన మాటలను గుణవంతములుగా స్వీకరించుట వాత్సల్యమును విశదీకరించుచున్నది "ఇళైయపుణ్ కవితైయేలుమ్ ఎమ్బిరాఱ్కు ఇనియవాఱే" అని తొండరడిప్పొడియాళ్వారుల శ్రీసూక్తి

జ్ఞాన శక్తులు పడసిన బ్రహ్మాదులు స్తుతించినయెడల వారి మాటలను గుఱించి దోష సహిష్ణుత్వము, తన్ను విషయముగా నిచ్చుట, శ్రమపడుటను జూచి దయ కనఁబఱచుట, దోషములను గుణములుగా నంగీకరించుట కలుగనేరకుండుటచే పైనుదహరించిన గుణములు ప్రకాశించుటకు మార్గము లేదు

ఈ విధముగ బహు గుణములు కలిగి యుండుటంబట్టి "భగవతి!" యని సంబోధించిరి దోషము లేక గుణములు గలదానా! యనుట శ్రీదేవియందు దోషము లేదనఁగా-దోషమును గుణహానినిజూచి యాశ్రితులుపేక్షింపకయుండుట గుణమనఁగా దానినే భోగ్యముగ భావించుట ఇచ్చట దోషయుక్తములైన మాటల నుపేక్షింపకయుండుటచేత దోషరాహిత్యమును, అంగీకరించుటచేత గుణయుక్తతయుఁ దెలియుచున్నవి

వీనిలో క్షాంతి, ఔదార్యము, దయ, ఈమూఁడు ఉపేక్షింపకయుండుటకు హేతువులు, వాత్సల్యమంగీకారమునకు హేతువు-అని విభాగించి తెలిసికొనుఁడు "ఉపేక్షియామైక్కు హేతు దయాక్షాన్తిగళ్, పఱ్ఱియాగక్కొళ్ళుగైక్కు హేతువాత్సల్యమ్" అను మణవాళమహామునుల శ్రీసూక్తి ఇచ్చట ననుసంధేయము, అచ్చట ఔదార్యము చెప్పఁబడకయున్నను "ఆశ్రయణోన్ముఖి చేతనగతం" అని యుపక్రమించుటచేత అభిముఖ్యమునొసంగుట యను నౌదార్యము కనఁబడుచున్నది

ఇఁక పూజార్థమైనందున "భగవతి" యనుటయు నొప్పును అందఱిచేతను బూజింపఁబడఁ దగినవాఁడగుటనుబట్టి ఈశ్వరుని (భగవాన్) భగవంతుఁ డందురు అతఁడును నీమెను బూజింపఁగా నీమెను, "భగవతి" యని చెప్పుటలో నేమి యాశ్చర్యము? "తొళుదైమేలుమ్ నన్మార్పి న్మేలుమ్ .పుణైన్దతణ్ణన్దుళాయుడై యమ్మాన్" అని తిరువాయ్మొఴియందీ గ్రంథకర్తయే భగవంతుఁడు శ్రీదేవిని బూజించునట్లు విశేషార్థ మనుగ్రహించి యుండుటను జూడుఁడు "శబ్దోఽయం నోపచారేణ హ్యన్యత్ర హ్యుపచారతః" అన్నట్లుగా "భగవాన్" నను శబ్దమునకు

ఈశ్వరుఁడే ముఖ్యార్థమైనను, నతని యట్టిభగవత్త్వమునకుఁ గారణమైన యీమెను భగవతి యనుటలో నడ్డు కలదా? స్వతః శ్రీస్త్వం ......... . అని మీఁదఁ జెప్పఁబడియుండుటను జూడుఁడు

స్వాం ప్రథాం ప్రస్తువీరన్—తన ప్రసిద్ధిని దొడంగుమ ప్రస్తావమనఁగా నారంభించుట చెప్పెడివారు లేక యణఁగియుండు నీ గుణములఁకఁ బ్రకాశించు నని యనుట "ష్ణు ప్రస్రవణే" యను ధాతువున కాత్మనేపదము లేదు గనుక "ప్రస్నువీరన్" అను పాఠము తప్పు. కొన్ని వ్యాఖ్యానములలో "ప్రస్తువీరన్" అను పాఠమే స్వీకరింపఁబడి దానికి నివృత్తియుఁ జూపఁబడియున్నది కనుక దోషరహితమైన యీ పాఠమునే యిచట మే మాదరించితిమి ఈ విధముననే యతిరాజ సప్తతి 29-వ శ్లోకములో "పరిచిత గహనా నః ప్రస్నువీత ప్రసాదం" అనుచోటను "ప్రస్తువీత" అను పాఠమే యుండి యుండవచ్చునని తోఁచుచున్నది

ఉశన్తి—"వశకాన్తౌ" అను ధాతువు కాన్తి—ఇచ్ఛ లోక వ్యవహారములో నీ ధాతువు నుపయోగింపఁగూడదని కొందఱనెదరు అయినను ననేకకవు లిట్లు వ్యవహరించియే యున్నారు

స్తుతి ధురా — "ఋక్పూరబ్ధూః పథామానక్షే" అను వ్యాకరణము ప్రకారము అకారము సమాసాంతముగ వచ్చి "ధురా" యని యైనది స్తుతేః ధూః-స్తుతి ధురా" యని వివరణము

తుదిత్తిడువోన్ తుదిప్పడువదర్కుళ్ళ
తూయగుణఙ్గళై విరిప్పోన్ ఎన్బర్ మేలోర్
తుదిత్తిడునల్ పొఱుప్పదనాలెన్దన్ మీదే
శుమన్దువిడు మేనెన్నిల్ అప్పొఱుక్కొణ్డాద
అదిప్పిళైగళ్ పడుమెనదు శొఱ్కళ్ శేర్ప్ప
దరిదేనుమ్ భగవతి! నీ ఏఱ్ఱు కొళ్ళాయ్
ఇదిల్పులనిమ్ పొఱైకొడై తణ్ణళిమున్నాన
ఇయఱుణఙ్గళ్ దేవి! నని విళఙ్గుమన్ఱే. (6)

ఓ భగవతీ! పెద్దలు స్తుతింపఁబడుదానియం దుండు సుగుణములను విస్తరించు నతనిని "స్తోత" యని చెప్పుదురు నిన్ను స్తుతించుబాధ్యత నామీఁదనే యున్నది. కనుక నా దోషభూయిష్ఠములైన మాటల నంగీకరించుట యరుదే! అయినను నీ వంగీకరింపుము ఇందుచేత నీ క్షమ, ఈవి, దయ, అను గుణము లెక్కువగాఁ బ్రకాశించును గదా! (౬)

**అవతారిక** —సహింపరాని నామాటలను స్వీకరించుటకంటె మంచికవితగాఁ దన స్తుతిని శ్రీ దేవియే చేసికొనును గాతమని చెప్పుచున్నారు

సూక్తిం సమగ్రయతు న స్స్వయమేవ లక్ష్మీః
శ్రీరఙ్గరాజ మహిషీ మధురైః కటాక్షైః ।
వైదగ్ధ్య వర్ణగుణ గుమ్ఫన గౌరవైర్యాం
కణ్డూల కర్ణకుహరాః కవయో ధయన్తి ॥ ॥2॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గరాజ | శ్రీరంగరాజుయొక్క | యాం | ఏ వాక్కును |
| మహిషీ | పట్టపురాణియైన | వైదగ్ధ్య వర్ణ | అర్థ గాంభీర్యమును, |
| లక్ష్మీః | శ్రీరంగనాయకి | గుణ గుమ్ఫన | అక్షర గుణమును, |
| మధురైః | మధురములగు | గౌరవైః | కూర్పునందు మేలిమి |
| కటాక్షైః | కటాక్షములచేత | | యు నను వీనిచేత |
| నః | మాయొక్క | కవయః | ప్రాజ్ఞులు |
| సూక్తిం | మంచివాక్కును | కణ్డూల కర్ణ | దురద యెత్తిన |
| స్వయమేవ | తానే | కుహరాః | చెవుల రంధ్రములు |
| సమగ్రయతు | పూర్తియొనరించు | | గలవారై |
| | కొనును గాక! | ధయన్తి | త్రాగుచున్నారో |

ఇందువలన నేను చేయనుపక్రమించిన నీస్తుతి ప్రాజ్ఞులును గని యానందించునట్లు నీవే నెఱవేర్పవలయునని స్తుతించు భారమును శ్రీదేవికే యప్పగించినవారైరి

బిడ్డలు చెప్ప నారంభించిన ముద్దు పలుకలను తల్లి సరిచేసి, నేర్పి, విని, యానందించునటులు నా దోషయుక్తములైన మాటలను శ్రీరంగనాయకయే సరిచేసి, విని, యానందింపవలయునని భావము ఈగ్రంథకర్త తల్లియేకదా శ్రీరంగనాయకి! వీరి తండ్రియైన ఆళ్వానులుకూడ "సమస్తలోకజననీం త్వాం స్తోతు మీహామహే, యుక్తాం భావయభారతీం" అని లక్ష్మిని జూచి, "సమస్త లోకములకును దల్లియైన నిన్ను స్తుతింప ముందంజ వేయుచున్నాము, ఉచిత వాక్కును బ్రసాదింపు" మని ప్రార్థించియున్నదియు గమనింపుఁడు

సూక్తిం సమగ్రయతు'—ఉపక్రమమునందే యీ విధముగా చెప్పుట, యీ గ్రంథము బాగుగా ముగియవలయు నను గ్రంథకర్తయొక్క యాతురతను సూచించు చున్నది వాక్కు బాగుగా నమరి యుండవలయును, పూర్తియుఁ గావలయునని భావము లక్ష్మీ కటాక్షముఁ బొంది రచియింపఁబడిన గ్రంథము గనుక తన మాట

సూక్తి (మంచిమాట)యైనది మఱియు, ప్రాప్త విషయమైన శ్రీదేవిని గుఱించినది
కనుక సూక్తియైన దనుటయుఁ దగును "సూక్తిం సమాపయతు" (గ్రంథమును
సమాప్తి చేసి యిమ్ము) అని చెప్పక "సమగ్రయతు" (నిండునట్లు చేసి యిమ్ము)
అని యుండుట గమనింపఁదగినది సమాప్తియగునట్లే కాక, కవితకుఁ గావలసిన
యంశముల నన్నింటితోనే కొఱఁతయు లేక నిండి యుండునట్లు కావింపవలయు
నను నర్థము నిచ్చుచు నీ పలుకు లమరియుండు సొగసుఁ జూడుఁడు

స్తోత్రమును నెఱవేర్చి యీయ వలసిన బాధ్యత శ్రీదేవిదే యని సూక్తితో
సంబంధమును గ్రంథకర్త వదలిపెట్టినట్లుగ, "సూక్తి"తో సంబంధము "నః" అను
పదమును వదలి నిలుచు నతిశయమును జూడుఁడు అయినను అర్థము సేయునపుడు
"నః" యనుదానిని సూక్తితోనే కదా యన్వయింప వలయును? అనిన, నట్లు చేర్చి
నప్పటికి నుచ్చారణ సంబంధము నిచ్చునే గాని, కర్తృత్వ సంబంధము నీయదు
"నః కృతిం" (మేము రచించినది) అని చెప్పక "నః సూక్తిం" (మేము చెప్పినది)
యనిన సొగసును దిలకింపుఁడు కాఁగా నీ స్తోత్రమును దాను రచించినట్లు
తలంపక శ్రీదేవియే రచించినదానిని దాను తొలుత నుచ్చరించినట్లు గ్రంథకర్త
తలంచుచున్నారని తోఁచుచున్నది 'స్వయమేవ" అను పద మీ భావమును
వ్యక్తపఱుచుచున్నది

స్వయమేవ —నా సంబంధమే లేక యనుట తన సంబంధ ముండినచో
సూక్తి సమగ్రము కాఁజాలదని గ్రంథకర్త యభిప్రాయము "ఎన్నాల్ తన్నై
యిన్దమిఴ్ పాడియ వీశనై" (నాచేతఁ దన్ను గుఱించి యింపైన తమిళభాషలో
పాశురము పాడించిన యీశుని) అన్నట్లు, ఆళ్వార్లను నుపకరణముగాఁ గొని
యీశుఁడు తిరువాయ్మొఴి పాడించినట్లు, నన్ను గొని శ్రీదేవి యీ స్తోత్రము
రచించుకొనఁగూడదు ఆళ్వార్లు "మయర్వఱ మదినలమ్" (ఏ విస్మృతి లేని
విశుద్ధ జ్ఞానమును) పొందినవారు గనుక తిరువాయ్మొఴి బాగుగాఁ బాడుట వలను
పడెను నేనో జ్ఞానహీనుఁడను నేనొకవైపున కీడ్పు, శ్రీదేవి మఱియొకవైపున
కీడ్పు స్తోత్రము విరసము కాఁగూడదని భయపడి ఇందులోఁ దన సంబంధమే కూడ
దనుచున్నారు ఇది తన నైచ్యము ననుసంధించు విధము "ఎన్నైక్కొం" అను
తిరువాయ్మొఴి పాశురమునకు "ఈడ"ను వ్యాఖ్యానములో ఎమ్బెరుమానార్లు
అనుగ్రహించిన దృష్టాంత మిచట మిక్కిలి పొంది యుండుటంబట్టి దాని నిటఁ
జేర్కొందము "శిఱు ప్రజై యెఴుత్తిడప్పుక్కాల్ తానే ఏదేను మొరుపడి
యిట్టుత్తలైక్కట్టుమ్, పితావాదల్ ఉపాధ్యాయనాద లిడప్పుక్కాల్ తానే
ఎఴుత్తాయిరుక్కుమ్, అజ్ఞనన్ని క్కే అవర్ కైయై ప్పిడిత్తు ఇడువిక్కప్పుక్కవాఱే
ఇవనోరిడత్తే యిఴుక్క అవనోరిడత్తే యిఴుక్క కుదఱికొట్టియాయ్ రూప
మఴిన్దు శిదఱిప్పోమ్" (చిన్నబాలుఁడు తానే వ్రాయఁబూనికొనినపు డేదో
యొక విధముగ వ్రాసి ముగించును. తండ్రి, లేదా ఉపాధ్యాయుఁడు వ్రాసినచో

నదే యాతురమై యమరును, అట్లుగాక వానిచేతిని బట్టుకొని (వ్రాయించునపుడు బాలకుఁ డొకవైపునకీడ్వ నితఁడు మఱియొకవైపునకీడ్చిన నే స్వరూపమును గాక చిందఱవందఱయగును )

ఈ ప్రార్థనను జేయుటకు సౌలభ్యమును, దానిని నెఱవేర్చుటకుఁ బరత్వమును గావలసినవి గావున, నవి రెండును వరుసగా "శ్రీరఙ్గరాజమహిషీ, లక్ష్మీః" యను పదములచేతఁ జూపఁబడినవి లక్ష్మీః-లక్షణము గలది "శ్రీరఙ్గరాజమహిషీ" యనుటచేత సౌలభ్యము చెప్పఁబడుటచే నిది పరత్వలక్షణ మనుట

మధురైః కటాక్షైః,— "శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతం" అనునట్లు తాపము నుపశమింపఁజేసి చల్లఁదనము నిచ్చునది మధుర కటాక్షమని తెలియునది దయార్ద్రమైన కటాక్ష మనుట భగవంతుఁడు నమ్మాళ్వార్లకు తిరువాయ్ మొళ్ళి సంతచెప్పి నేర్పినట్లుగా నిచ్చట నక్కఱలేదు కటాక్షించినఁ జాలునని భావము "యం త్వం దేవి! నిరీక్షసే సచ పణ్డితః" (దేవీ! నీ వెవనిని గటాక్షించెదవో యతఁడు పండితుఁ డగును) అనుటను జూడుఁడు

ఈ శ్లోక పూర్వార్ధమున మంచి వాక్కు కావలయుననిరి ఉత్తరార్ధము నందు వాక్కునందలి మంచి గుణములను విశదీకరించిరి

వైదగ్ధ్య...గౌరవైః —వైదగ్ధ్యమనఁగా నలంకారము, రసము మున్నగు నర్థగాంభీర్యము వర్ణ-(అక్షర) గుణంబు లనఁగాఁ బ్రసాదము, మార్దవము, మాధుర్యము మొదలైనవి గుంభన గౌరవమనఁగాఁ బదముల కూర్పులోని మేలిమి శయ్య మున్నగునవి యిందు నణఁగును ఇటునటు మార్ప వలనుపడక యుండు పదముల కూర్పు "శయ్య" యనఁబడును

ఇఁక, వైదగ్ధ్య-సామర్థ్యముగ, వర్ణ-అక్షరములయొక్కయు, గుణ-ప్రసాదము మున్నగు గుణములయొక్కయు, గుమ్భన గౌరవైః-కూర్చి చేర్చుటలోని శ్రేష్ఠతచేత నని దీనికిఁ గొంద ఱర్థము నుడివెదరు

వైదగ్ధ్యమును, వర్ణగుణములను జేర్చుటలోని గొప్పతనమని గొందఱర్థము సేయుదురు

కణ్డూల కర్ణ కుహరాః,— వైదగ్ధ్యాదులచే నింపుగా నుండు కవితను వినుటలో నత్యంత కుతూహలము కలవారని యర్థము

త్రాగుచున్నారని చెప్పుటచేత నీ సూక్తి యమృతతుల్యమై, మధురమైనదని ధ్వనించుచున్నది

"కణ్డూల" యను పదము "దురద గలిగిన" యను నర్థము గలది "సిధ్మాదిభ్యశ్చ" యను వ్యాకరణ సూత్ర ప్రకారము మతుబర్థమునందు "లచ్" ప్రత్యయము చేరుచున్నదని యందురు సిధ్మాది గణములో కణ్డూల శబ్దము చెప్పఁబడమిచే నది పొసఁగదు నిజముగ, కణ్డూం-దురదను, లాతి-తీయునది అను వ్యుత్పత్తినిబట్టి యీ శబ్దమునకు నిష్పత్తిఁ జేయవలయునని తెలియునది.

నల్లదా మున్ఱుర్ త్తానే నడత్తుగ నమదు శొల్లై
చ్చెల్వీశీ రరజ్గ రాశ్ఱ దేవితఱ్ఱ కుళిర్న్ద నోక్కాల్
శొల్లియ పరుత్త చ్చీర్మై తొగుప్పుఱుమ్ గుణజ్గళోడు
వల్లునర్ శెవియిఱ్ఱ వాశ్చె మాఱిడ ప్పురుగు మాఱే (7)

శ్రీరంగరాజమహిషి, ఈ నా కవితను నా ప్రయత్నమేమియు లేక తానే స్వర వర్ణముల చేరికలచేత మధురమైన శైలి గలదిగను, అలంకార వర్ణనలతోఁ గూడి యర్థగాంభీర్యము, భావపుష్టి గలదిగను, ప్రాజ్ఞుల కత్యంతాభిలాషను బుట్టించున దిగను దన చల్లని కటాక్షవీక్షణములచేతఁ బూర్తియగునట్లు నొనర్చుఁగాక! (7)



అవతారిక —౭-వ శ్లోకమునఁ జెప్పఁబడినదానినే వివరించి యపేక్షించు చున్నారు

అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో
దుహానం సౌహార్దం పరిచితమివాథాఽపి గహనమ్।
పదానాం సౌభ్రాత్రా దనిమిషనిషేవ్యం శ్రవణయోః
త్వమేవ శ్రీర్మహ్యం బహుముఖయ వాణీవిలసితమ్॥ ॥౮॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| శ్రీః! | ఓ లక్ష్మీ |
| అనాఘ్రాత-అవద్యం | దోష గంధము లేనిదియు |
| బహుగుణ పరీణాహి | పెక్కు గుణంబుల పెంపు గలదియు |
| మనసః | (రసికుల) మనస్సునకు |
| సౌహార్దం | సంతోషమును |
| దుహానం | చేపునదియు |
| పరిచితమివ | అలవాటు పడినదాని (అర్థము తెలియుదాని) వంటిదియు |
| అథాపి | అయినను |
| గహనం | లోతైన భావములు గలదియు |
| పదానాం | మాటలయొక్క |
| సౌభ్రాత్రాత్ | చేరిక చేత |
| శ్రవణయోః | చెవులకు |
| అనిమిష నిషేవ్యం | ఎప్పువాల్పక వినఁదగినదియునగు |
| వాణీవిలసితం | వాగ్విలాసమును |
| మహ్యం | నాకు |
| త్వమేవ | నీవే |
| బహుముఖయ | బహుముఖములుగా వర్ధిల్లఁజేయుము |

ఈ శ్లోకముచేతఁ దనకు శ్రేష్ఠమైన కవిత పెంపొందునట్లనుగ్రహింపవలయునని కోరుచున్నారు

అనాఘ్రాతావద్యం —కొంచెమైనను దోషము లేని దనుట, పదదోషము, వాక్యదోషము, అర్థదోషము అని దోషములు మూఁడు విధములు పదదోషమనఁగా నప్రయుక్తత్వము (ఇతరు లుపయోగింపని మాట నుపయోగించుట) మొదలగునవి వాక్యదోష మనఁగా ప్రక్రమభంగము (ఉపక్రమించిన ధోరణి మాఱిపోవుట) మొదలగునవి అర్థదోషమనఁగా నపార్థము మొదలైనవి

బహుగుణ పరీణాహి —గుణములనఁగాఁ బ్రసాదము మున్నగునవి ఉపమ మొదలగు నలంకారముల నిచ్చట గుణములుగాఁ గొనవలయును అలంకారములును గావ్యమున కంద మిచ్చును గనుక అవియు గుణములే యగును రుద్రభట్టు ఇట్లనెను — "యో హేతుః కావ్యశోభాయాః సోఽలఙ్కారః ప్రకీర్త్యతే, గుణోఽపి తాదృశో జ్ఞేయోదోషస్స్యాత్ తద్విపర్యయః" (కావ్యశోభకేది హేతువో యది యలంకార మనఁబడును గుణమును నట్టి హేతువే యని యెఱుంగవలయును దానికి విరుద్ధమైనది దోషమగును) బహుగుణముల యతిశయ మనఁగా ననేక గుణములు తేటతెల్లముగాఁ గనఁబడుట

మనసో దుహానం సౌహార్దం —రసికుల మనస్సులను రంజింపఁజేయునట్లుండవలయుననుట దోషరహితమై గుణభూయిష్ఠమై రంజిల్లఁ జేయునట్టి వాగ్విలాసము కావలయును కాఁగా నీ స్తోత్ర మొక కావ్యముగా నేర్పడవలయునని కోరినవారైరి "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలఙ్కృతీ" అని కావ్య ప్రకాశికలో దోషరహితములై గుణయుక్తములైయుండు పదమును, నర్థమును — అలంకారములు కొలఁదిగానున్నను కావ్యమేయగునని లక్షణము చెప్పఁబడి యుండుటఁ జూడుఁడు "అనలఙ్కృతీ" అనుచోటఁ గల వ్యతిరేకము "అనుదరా కన్యా" యనుటంబోలె స్వల్పార్థమును దెలుపునని తెలియునది ఇచ్చట నలంకారములను ప్రత్యేకముగాఁ జేర్కొనక గుణములతోఁ జేర్చి చెప్పుట వాని యప్రాధాన్యము తెల్లము చేయుటకు మాత్రమే!

కావ్య ముత్కృష్టమైనను నందులో నొకానొక తప్పుండినను నది గర్హ్యమే శరీర మెంత సౌందర్యముతో నున్నను, నందు నొకానొక కుష్ఠురోగపు మచ్చయుండినచో దానిని మనము గర్హించుట లేదా? కాఁగాఁ గావ్యమును జెఱచునది దోషము గావున దోషరహితమై యది యుంటవలయునని ప్రప్రథమముననే చెప్పుచున్నారు

"చమత్కృతి" కనఁబఱచుచు దోషరహితమై బహుగుణ యుక్తమై యమరియుండు శ్రేష్ఠమైన వాక్కే కావ్యమని గ్రంథకర్త యభిప్రాయము

పరిచితమివాథాపి గహనం —ఈ స్తుతి కావ్యముగా నేర్పడుట మాత్రమే చాలదు ఉత్తమ కావ్యముగా నమరవలయును అర్థము గోచర మగుచున్నను,

ధ్వనితో లోఁతైనదై యమరి యుండవలయు ననుట "ధ్వనిప్రధానతా యత్ర తదుత్తమ ముదాహృతం"—ధ్వన్యర్థము ముఖ్యముగాఁ గలది యుత్తమ కావ్య మనుటను జూడుఁడు.

మొదటి మూఁడు విశేషణములచేతఁ గ్రింది శ్లోకమునందు బ్రస్తావించిన వైదగ్ధ్యము వివరింపఁబడినది "పరిచితం గహనం" అను విశేషణములచేత వర్ణ గుణము వివరింపఁబడినది "పరిచిత" మనుటచేతఁ బ్రసాదమను గుణమ్ము, "గహన" మనుటచేత గాంభీర్య మను గుణమును దోఁచుటం జూడుఁడు

పదానాం శ్రవణయోః —దీనిచేత "గుంభన గౌరవము"ను వివరించు చున్నారు సౌభ్రాత్రం —సుభ్రాతుః భావః సౌభ్రాత్రమ్ అనఁగా మంచి సహోదరత్వము "హాయనాన్త" యని యారంభించు వ్యాకరణ సూత్రము ప్రకారము యువాది గనుక "అణ్" ప్రత్యయము వచ్చి "సౌభ్రాత్రం" అని యైనది పదముల కూర్పు చెప్పఁబడిన ట్లయ్యెను అదియే "శయ్యా" యనఁబడును "భ్రాతృత్వం" (సహోదర భావము) అని చెప్పక "సౌభ్రాత్రం" (మంచి సోదర భావము) అన్నందున వేఱు పదములనుగూర్చి మార్చుటకు సాధ్యము కానట్లు పద ములు పొందిన దగు శయ్యను గ్రంథకర్త గోరుచున్నారని తెలియునది, మార్చుటకు వలను పడునట్లున్న పదముల కూర్పు "రీతి" యనఁబడును

ఔప్ప వాల్పుక చెవులు వినుట యనఁగా నవధానముతో వినుట, ఆశ్చర్య ముతో వినుటయు నగును

త్వమేవ ...వాణీ విలసితం —"అర్థో విష్ణు రియం వాణీ" అనునట్లు వాక్కు శ్రీదేవియొక్క విభూతి గనుక నీవే నా వాగ్విలాసమును వృద్ధిపఱుప వలయునని కోరుచున్నారు "అఖిలం వాఙ్మయం యద్విభూతిః" అని శ్లాఘింపఁ బడు సరస్వతీ దేవియు శ్రీదేవికి దాసి గనుక తిన్నగా శ్రీదేవినే ప్రార్థించు చున్నారు "సా భారతీ భగవతీ తు యదీయదాసీ" యని సరస్వతియు శ్రీదేవికి దాసి యని యీ గ్రంథకర్తయొక్క తండ్రిగారు చెప్పియున్నారను విషయము గమనింపఁదగినది

"త్వయా జుష్టా జుషమాణా దురుక్తాన్ బృహద్వదేమ విదథే సువీరాః" (నీచేత నభిలషింపఁబడిన దుష్టవాక్కులు గల మేము విశేషముగా మాటలాడెదము) అను మేధా సూక్తము ననుసరించి యీ ప్రకరణ మమరిన పొంపుఁగని యానం దింపుఁడు

కుఱ్ఱత్తిన్ వాడై యఱ్ఱు గుణంపల పల్గి నెజ్జిల్
కుఱ్ఱ విన్బత్తై నల్గి ఉళ్ళుఱ్ఱాఙ్ ద్దళియ దేనుమ్
శొఱ్ఱశొ ల్లిమైయ ప్పెఱ్ఱు శురుతిగ ళిమైయా దేఱ్కుమ్
పెఱ్ఱియ వాణిలీలై పెరుక్కుగ తిరువే! నీయే. (8)

శ్రీదేవీ! దోషగంధ లేశమును లేక, అనేక గుణముల పెంపు గలిగి సులభముగనున్నను, లోతైన భావములతోఁగూడి శ్రోతలు సావధానముగ వినఁదగినట్లు పదముల కూర్పుతోఁ బొసఁగి యింపుసొంపులు గల వాగ్విలాసమును నీవే పెంపొందఁ జేయవలయును



అవతారిక — తన ప్రార్థనానుసారముగ శ్రేష్ఠమైన కవితా శక్తిని బొందిన గ్రంథకర్త, శ్రీరంగనాథునిజూచి "నీకంటెను పేర్మి గలిగినదిగా శ్రీదేవిని వర్ణించుచున్నాము, సావధానముగా నాలకించి సంతోషింపు" మనుచున్నారు

శ్రియశ్శ్రీః శ్రీరఙ్గేశయ! తవ చ హృద్యాం భగవతీం
శ్రియం త్వత్తోఽప్యుచ్చై ర్వయమిహ ఫణామః శృణుతరామ్।
దృశౌ తే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః
పునర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్ ॥౯॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రియశ్శ్రీః! | శ్రీకిని శ్రీయైన వాఁడా! | శృణుతరాం | సావధానముగ నాలకింపవలయును, |
| శ్రీరఙ్గేశయ! | శ్రీరంగమున శయనించియున్నవాఁడా! | శ్రవణతః | వినుటచేత |
| | | తే | నీయొక్క |
| తవ చ | నీకునుగూడ | దృశౌ | నేత్రములు |
| హృద్యాం | మనస్సునకిష్టురాలైన | సుఖతరళతారే | సుఖముచేతఁ గదలునట్టి నల్లగ్రుడ్లు గలవిగా |
| భగవతీం | మంచి గుణములు గల | | |
| శ్రియం | శ్రీదేవిని | భూయాస్తాం | అగును గాక! |
| త్వత్తోఽపి | నీకంటెను | పునః | మఱియు |
| ఉచ్చైః | ఎక్కువగా | హర్షోత్కర్షాత్ | ఆనందాతిశయముచేత |
| వయం | మేము | భుజయోః | (పొంగిన) భుజములలో |
| ఇహ | ఇక్కడ | కఞ్చుకశతం | అనేక కవచములు |
| ఫణామః | వర్ణించుచున్నాము, | స్ఫుటతు | బ్రద్దలగుఁగాక! |

నీకంటెను శ్రీదేవిని శ్రేష్ఠతగలదిగా మేము వర్ణించినను నిజముగా నామెకు శ్రేష్ఠత్వము నొసంగువాఁడవు నీవే కనుక, ఇది నీ గొప్పతనములోనే పర్యవసించుచున్నదని గ్రంథకర్త "శ్రియఃశ్రీః" అనుచు శ్రీరంగనాథునకు సమాధానము చు

గలుగఁజేయుచున్నారు "అందఱిని నతిశయింపఁజేయు శ్రీదేవికి నతిశయముఁ గూర్చువాఁడా!" యనుట "భర్తా నామ పరం నార్యాః భూషణం భూషణాదపి" (స్త్రీకి భర్త యాభరణముకన్న మించిన యాభరణము కదా!) అన్నట్లు భర్త యగుటచేత శ్రీరంగనాథుఁడు శ్రీదేవికి నుత్కృష్టతను గూర్చుచున్నాఁడు "కై నిఱైన్ద పణత్తైవిడ క్కణ్ నిఱైన్ద కణవనే మేల్" (చేతినిండు ధనముకంటె నేత్రానందకరుఁడైన భర్త మేలు) అను లోకోక్తి యున్నది మఱియు నందఱి చేతను నాశ్రయింపఁబడు శ్రీదేవి చేతను నాశ్రయింపఁబడువాఁడనియు నగుచు ఈయర్థమున భగవంతుఁడు కాక తక్కినయెల్లరకును శ్రీదేవి యజమానురాలనియుఁ, దన్ను దప్ప తక్కిన యెల్లరకును భగవంతుఁడు యజమానుఁడు (ప్రభువు) అనియుఁ దెలియుచున్నది

"శ్రియః శ్రీశ్చ భవేదగ్ర్యా" అని శ్రీరామాయణములోను, "తిరువుక్కుమ్ తిరువాగియ శెల్వా" యని దివ్యప్రబంధములోను, "కః శ్రీ శ్శ్రియః", "త్వాం చ శ్రియః శ్రియ ముదాహు రుదారవాచః" యనియు వరుసగా ఆళవందారులయు, నాళ్వానులయు శ్రీసూక్తులలోను నిట్లే చెప్పఁబడి యుండుటం జూడుఁడు

శ్రీకి శ్రీయైన పరత్వమును జెప్పి "శ్రీరఙ్గేశయ" యని సౌలభ్యమును దెలియఁజేయుచున్నారు "ఎట్టివారైనను దర్శించి పొందుటకు వలనగునట్లుగా శ్రీరంగక్షేత్రములో శయనించినవాఁడా!" యనుట

శేషశయనమునఁ బరుండియున్న తీరును గని మెయి కరఁగిపోవునట్లు భోగ్య భూతుఁడవు నీవు, అట్టి నీకును భోగ్యభూత యన్నహో నీకన్న మేలుగ నామెను స్తుతించుట సమంజసమే యను భావము దోఁచునట్లుగా "తవ చ హృద్యాం" అని ప్రయోగించినారు. "హృద్యాం" అనుటకు "వక్షఃస్థలమున నివసించు నామెను" యనియు నర్థము చెప్పుదురు

"భగవతీం" అను పదము స్తుతించుట కర్హమైన గుణము కలిగియుండుటను దెలియఁజేయుచున్నది

శ్రియం — పురుషకారముగా మావలన నాశ్రయింపఁబడు నామె ననుట

త్వత్తో ఽప్యుచ్చైః — అందఱికన్న శ్రేష్ఠుఁడవగు నీకన్నను శ్రేష్ఠురాలుగ ఇఁక నీవు శ్రీదేవిని స్తుతింపఁబూనెదవేని నీకంటెను మేలుగ మేము పొగడుదు మనియు దీనికి నర్థముఁ గొందఱు చెప్పుదురు

శ్రీదేవి కటాక్షము చేత తమకు లభించిన కవితా సామర్థ్యాతిశయము వెల్లడి యగునట్లుగా "వయం" (మేము) అని బహువచనమును ప్రయోగించినారు ఆళవందారులు మొదలగు తక్కిన యాచార్యులను గలుపుకొనుటకుఁగాను బహువచన ప్రయోగము చేసినారని కొందఱు వ్యాఖ్యానించెదరు

ఇహ — ఈ గ్రంథములో, ఇచ్చట, అనగా ఈ సమక్షమందు ననియు నగును

ఇంత ప్రౌఢముగా మాటలాడు గ్రంథకర్తను దిలకించి, విస్మయమొంది, మై మఱచి నిలిచిన భగవంతుని దాఁ జూచి "శృణు" (వినుము) అనుచున్నారు

నీకును హృద్యయైన శ్రీదేవిని గుఱించిన మా స్తుతిని విన్నచో మఱియుఁ బరవశమగుదువు గనుక సావధానముగఁ జక్కఁగా వినుము (శృణుతరాం) — అనుచున్నారు

నీవు దీనిని విన్నచో సంతోష సంభ్రమితమైన నీ నేత్రములు వికసించి నీ దేహ ముప్పొంగి పోవునని కడపటి రెండు పాదములచేతఁ జెప్పుచున్నారు

పునః — మఱియు, మాటి మాటికి అనియు ననుట

వినవిన దేహము మిక్కిలిగాఁ బొంగి పోవుచుండుటవలన రానురాను మీఁద మీఁద పెద్దపెద్ద కంచుకములను దొడుఁగుకొన్నను వందలకొలఁదిగ నున్న యవియు బ్రద్దలయి పోవునని భావము

భగవంతుని దివ్యమంగళ విగ్రహము కర్మసంబంధము చేత సంకోచ వికాసములను బొందదేకాని సంతోషాతిశయముచే నట్టి మార్పులు తప్పక పొందునని తెలియునది

ఈ శ్లోకము చేత నుభయులు గలసి యుండఁగా నీ స్తోత్రము విన్నవింపఁబడినదని తెలియుచున్నది "శ్రీరఙ్గేశయ" యని సంబోధించుటచేతను, "భుజయోః" అని యుభయ భుజములను బేర్కొనుటచేతను, "హృద్యాం" అను పదప్రయోగము చేతను బెద్ద పెరుమాళ్ల సమక్షములోనే వక్షస్థలవాసినియైన లక్ష్మిని గుఱించి యీ స్తోత్రము విన్నవింపఁబడినదని యూహింపవచ్చును

ఆచార్య ప్రాచార్యు లుభయులు కలిసి యున్నపుడు ప్రాచార్యులనే గొలుచునట్లుగ భగవంతుఁడును, శ్రీదేవియుఁ గూడి యున్నపుడు భగవంతునే స్తుతింపవలయును శ్రీదేవిని స్తుతించుట సరికాదు కనుక నిచ్చట నుభయులు గూడి యున్నప్పుడు శ్రీదేవిని స్తుతించుటెట్లు పొసఁగును? అను సందేహము కొందఱికిఁ గల్గును ఈ శ్రీదేవియొక్క స్తుతిచేతఁగలుగు నతిశయము భగవంతునకే

చెందునదిగా గ్రంథకర్త వర్ణించి యుండుటలోని యాథార్థ్యమును వారు గుర్తించి తెలిసికొనఁదగును. ఆచార్య ప్రాచార్యుల సమక్షములోఁ బ్రాచార్యుల మనస్సు సుప్రసన్నమగునట్లుగ నడచుకొనవలయు ననియే శాస్త్రము చెప్పుచున్నది. భగవంతుఁడు తన్ను గుఱించిన స్తుతికంటె నధిక ప్రీతితో శ్రీదేవి స్తుతిని వినును కనుక భగవంతుని సమక్షములో నీ స్తుతిని విన్నవించిరి. "ఇనిత్తాళ్ 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' 'ఈశ్వరీం సర్వభూతానాం' 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ' ఎన్ఱివైయుమ్ అవన్ విరుమ్బిక్కేట్పదు" (శ్రీదేవిని గుఱించిన దానినే కదా భగవంతుఁడు కోరి వినును) అను భగవద్విషయములోని (5-9-3) శ్రీసూక్తియు నిట ననుసంధింపఁ దగినది.

భగవంతునికంటె శ్రీదేవిని మేలుగఁ జెప్పెదనట్లు ప్రతిజ్ఞ చేసికొని యీ గ్రంథమును దొడంగుటచేత నక్కడక్కడ శ్రీదేవి వైభవము మిక్కిలిగ చెప్పఁబడి యుండినను తక్కువ గాదు.

తిరువుక్కుమ్ తిరువే! శ్రీ రఙ్గ ఉజ్జ్వ
శేర్వోనే! నినక్కు మన క్కినియ ళాన
తిరుమగళై బ్భగవతియై నినక్కుమ్ మేలా
చ్చెప్పుగిన్ఱోమ్ యామిజ్గు నన్గు కేళాయ్
కరువిక్కిగళ్ పిఱక్కిన్ఱిడుగ నినదు కణ్ణిల్
కాదుకొడుక్కు ఇప్పుఖత్తా ల్కఇప్పుకజ్గళ్
ఇరుబుయముమ్ పొరుమిమిగ వుచగై కూర
ఎణ్ణి లడజ్గాదు వెడిపడుగ మేలుమ్. (9)

సిరికిని సరియైనవాఁడా! శ్రీరంగములో శేషశాయిగా నుండువాఁడా! నీమనస్సునకుఁ జక్కఁగా నచ్చిన భగవతియైన శ్రీదేవిని నీకంటె మేలుగ మేమిందు స్తుతించుచున్నాము. దీనిం జక్కఁగా సావధానముతో వినుము. శ్రవణ జనిత సంతోషాతిశయమున నీ నల్లగ్రుడ్లు కదలును గాక! లెక్కలేనన్ని పెద్దపెద్ద కవచములు నీవు తొడిగికొన్నను నీ భుజము లుప్పొంగుటచేత నవి యన్నియు వీడి పోవును గాక! (9)

అవతారిక — ఈవఱకుఁ జేసిన ప్రతిజ్ఞానుసారము శ్రీదేవిని స్తుతింప నుద్దేశించి, యామె స్వరూపాదుల సిద్ధికి నితిహాసాదులతోఁ గూడిన శ్రుతియే ప్రమాణమని చెప్పుచున్నారు

దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః
త్వత్సద్గుణౌఘ మణికోశ గృహం గృణన్తి।
తద్ద్వార పాటన పటూని చ సేతిహాస
సన్తర్కణ స్మృతి పురాణ పురస్సరాణి॥ ॥౧౦॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | ఓ దేవి! | సేతిహాస | ఇతిహాస తర్క శాస్త్ర |
| ప్రథమే | పూర్వులైన | సన్తర్కణ | ములతోఁ గూడిన |
| పుమాంసః | పురుషులు | స్మృతి, పురాణ | స్మృతి పురాణములను |
| భగవతీం | దోషరహితమైన | పురస్సరాణి | ముందుగాఁగలవానిని |
| శ్రుతిం | వేదమును | తద్ద్వార | ఆ గృహముయొక్క |
| త్వత్ సద్గుణ | నీయందలి గుణముల | పాటన | వాకిటిని దెఱచుటలో |
| ఓఘ మణి | సముదాయమను రత్న | పటూనిచ | సమర్థములైనవిగను |
| కోశగృహం | రాశిక గృహముగను | గృణన్తి | చెప్పుదురు |

శ్రీదేవియొక్క స్వరూపాదుల సిద్ధికిఁ బ్రమాణమైన వేదము అజ్ఞాన వంచనేత్యాది దోషరహితమై, స్వతః ప్రమాణమై యమరిన దనుచు "భగవతీం" అని శ్రుతిని విశేషించిచెప్పిరి శ్రుతి —"ఓది ఓదువిత్తాదెయాయ్ వరుమ్" అనఁగా నెవరిచేతను రచింపఁబడక, యనాదిగాఁ బఠింపఁబడుచు వచ్చునది యనుట దీనిచేత వేదముయొక్క యపౌరుషేయత్వమును, (పురుష నిర్మితము కాని) నిత్యత్వమును దోఁచుచున్నవి ఒక వస్తువుయొక్క సిద్ధి, ప్రమాణముచేతనే యేర్పడవలయును "మానాధీనా మేయసిద్ధిః" కనుక నిత్య నిర్దోషమైన శబ్దరూప ప్రమాణముఁ గొని శ్రీదేవి యను వ్యక్తియొక్క సిద్ధి యేర్పడుచున్నదని తాత్పర్యము

<u>ప్రథమే పుమాంసః</u> —వాల్మీకి పరాశరు లిత్యాదులు, మఱియుఁ బ్రపన్న కులమునకుఁ బూర్వికులైన నమ్మాళ్వార్లు మొదలగువారుకూడ, "పరాఙ్కుశాద్యాః ప్రథమే పుమాంసః" అని శ్రీరంగరాజస్తవమునందును నుడివిరి

<u>త్వత్ సద్గుణౌఘ .. ....గృణన్తి.</u>—శ్రీదేవియెడఁ గల గుణము లేవియో యవన్నియును మంచి గుణములే శ్రీదేవీ సంబంధముచేత గుణములు మేలిమిని

పొందుచున్నవి గుణములచేత శ్రీదేవికి మాహాత్మ్యము కలుగుటలేదు శ్రీదేవి చేత గుణములకే యుత్కృష్టత కలుగుచున్నది "గుణఙ్ఞై ఎన్ కూఱువదు కొమ్బి నైచ్చేర్న్దవై ఉయ్యప్పిణఙ్ఞువన" (గుణములనుగుఱించి యేమిచెప్పుదును? సీతాదేవిని పొంది యవి యుజ్జీవింపఁ బెనగులాడుచున్నవి) అని కంబమహాకవి నుడివిరి

సముదాయము (ఓఘః) అని చెప్పుటచేత గుణము లనంతములై యున్నవని తెలియుచున్నది భోగ్యములగుటచేతను, జ్వలించుటచేతను, మంగళకరములగుటచేతను, గుణములు రత్నములుగ రూపింపఁబడినవి శ్రుతిని బొక్కసమనుటచేత నీ గుణరత్నములు దానిలో గూఢముగా నుంపఁబడినవని తోఁచుచున్నది రత్నపరీక్షలో నుత్తీర్ణులైన కొందఱే మంచి రత్నములను వెదకి తీసి యనుభవించునట్లుగా, నీ వేదమను బొక్కసములో గూఢముగా నుంపఁబడి యుండు శ్రీదేవి యొక్క గుణరత్నములను మేధావులగు కొందఱే యనుభవింపఁగలరు

ఇఁక "కోశగృహం" అని విడఁదీసి గుణ సముదాయములకు రత్నపు బొక్కసమనియు నర్థము సేయుదురు "త్వత్సద్గుణ" యని యారంభించు నీ పద సముదాయములో "శ్రీగుణ రత్న కోశ" మను నీగ్రంథముయొక్క నామమును నొకరీతిగఁ దోఁచుటం జూడుఁడు ఇందుచేత వేదతాత్పర్యార్థమే యీ గ్రంథముగా నమరియున్నదని యూహించి తెలిసికొనఁజేసిరి

శ్రుతి యని సామాన్యముగఁ జెప్పినందున శ్రుతిలోని కర్మజ్ఞాన భాగములు రెండును శ్రీదేవిని గుఱించినవే యని తెలియునది

భగవంతునిచే నధిష్ఠింపఁబడిన జడమైన ప్రకృతియే లక్ష్మీతత్త్వమని కొందఱు, భగవంతుని సత్తా, అహంతలే లక్ష్మీతత్త్వమని కొందఱును శ్రీదేవిని గుఱించి భ్రమింతురు ఈ గ్రంథకర్త "శ్రీయొక్క" యని చేతనగా నిర్దేశించి పై భ్రమలన్నింటిని త్రోసిపుచ్చినవారైరి

చేతనగాఁ జెప్పు ప్రమాణములకు విరోధమగుటంబట్టి, అక్కడక్కడ "ప్రకృతి" పదముతోఁ జేర్కొనుటవలన నీమెను ప్రకృతితత్త్వముగానే కొనరాదు ప్రకృతి యను తత్త్వము నభిమానించుటచేత నట్లు చెప్పుటగాఁ గొనుటయే తగును ఇట్లంగీకరింపనియెడల "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాన్తానుపరోధాత్" అను వ్యాస సూత్రములోఁ బ్రకృతి యను పదము భగవంతుని నిర్దేశించుటచేత భగవంతునే ప్రకృతితత్త్వముగా నెంచుట సంభవించును ఈ విధముగానే సత్తా, అహంతా యని చేర్కొనుట కుపపత్తులు గ్రహింపుఁడు

భగవంతుఁడు స్వీకరించిన యందమైన స్త్రీరూపమే లక్ష్మి యని కొందఱి మతము. "నీయొద్దనుండు గుణములు" అని నైసర్గిక గుణములుగాఁ జెప్పఁబడుట చేత నా మతము నిరాకరింపఁబడినది మృదుత్వము, పారతంత్ర్యము మున్నగునవి

శ్రీదేవియెడఁ గల యసాధారణ గుణములు అవి భగవంతునినుండి యీమెను వేఱుపఱచుచున్నవి గాన నికవిూఁద నీ గ్రంథకర్త చెప్పటం బోవఁడు.

భగవంతుని, లక్ష్మిని గొన్నిచోట్లలో నభేదముగా వ్యవహరించుట వేర్పఱుప రాకుండుటంబట్టి యని తెలియునది "ఏకైక వర్తతే భిన్నా జ్యోత్స్నేవ హిమదీధితేః" అని చంద్రుని, చంద్రికను నుపమించి యుండుటంబట్టి యని తెలియునది

శ్రీదేవీ గుణరత్నములు వేదమను కోశములో నున్నవనిరి అనఁగా వేదము శ్రీదేవి గుణములను జెప్పుచున్నదని మాచాయగాఁ జూచినంతమాత్రమునఁ దెలియదు వేదములోతు నరసిననే తెలియును లోపలఁ బ్రవేశించుటకు కోశముయొక్క తలుపులు తెఱువవలయునుగదా! ఈ శ్లోకమందలి యుత్తర భాగములో నా బీగపుఁజెవుల నిచ్చుచున్నారు

ఆ తలుపును సులభముగాఁ దెఱచు బీగపుఁజెవు లితిహాసాదులు ఇతిహాసము - రామాయణము మొదలగునవి సంతర్కణము - ఋజువైన తర్కము, మీమాంస యనియు చెప్పుదురు స్మృతి - మనుస్మృతి యిత్యాదులు పురాణము - విష్ణుపురాణము మున్నగునవి వీనిని ముందుగఁ గలిగినవి దివ్యప్రబంధాదులు "ఇతిహాస పురాణాభ్యాం వేదార్థః ప్రకాశ్యతే" (ఇతిహాస పురాణములచేత వేదాంతార్థము విశదీకరింపఁబడుచున్నది) "ప్రాయేణ పూర్వభాగార్థ పూరణం ధర్మశాస్త్రతః" [ప్రాయశః ధర్మశాస్త్రము (స్మృతి)చేత మొదటి భాగము (కర్మకాండము) యొక్క అర్థము పూర్తి యగునది] "యస్తర్కేణానుసన్ధత్తే స ధర్మం వేద నేతరః" (తర్కముతో ననుసంధించునతఁడే ధర్మమును దెలిసికొనును, తదితరుఁడు తెలిసికొననేరఁడు) "శెయ్య తమిళ్ మాలైగళ్ నామ్ తెళ్ళియవోది తెళ్ళియాదమఱై నిలజ్గళ్ తెళ్ళిగిన్ఱోమే" (శ్రేష్ఠములైన తమిళ పాశురముల వరుసలను బాగుగాఁ బఠించుటచేత వేదములో విశదము గాని పట్టులను విశదముగా నెఱుంగుచున్నాము) ఇత్యాదులు చూడుఁడు

ఇఁక నీ శ్లోకములోని తొలి రెండు పాదముల నొక వాక్యముగాఁ గొనియు, మిగిలిన రెండు పాదములను మఱియొక వాక్యముగాఁ గొనియుఁ గొందఱర్థము చేయుదురు. మూఁడవ పాదములోని "చ" అనుదానిని "పురస్సరాణి" అను దానితోఁ జేర్చి "తు" అను నర్థముతోఁ బురాణము మొదలగువానిని బురస్కరించుకొని యున్న గ్రంథము లన్నియో వేదముయొక్క కవాటమును దెఱువ సమర్థము లగుచున్నవని వివరింతురు

ఇతిహాసము మొదలగువానిచేత విశదపడుచున్న వేదము శ్రీదేవీ గుణములను బ్రతిపాదించునట్లు పూర్వులు నిర్ధారణ చేసియున్నారు

భగవంతుని గుణములను బఠించు వేదము శ్రీదేవీ గుణవర్ణనను జేయునట్లు చెప్పుట పొసఁగునా? యన్నచో సమాధానము చెప్పుదుము వేదము భగవంతుని

ప్రతిపాదించుట వెలుపల నే లోని భావమన్ననో శ్రీదేవిని బ్రతిపాదించుటయే యని తెలియునది వేదవేద్యుఁడని చెప్పఁబడు భగవంతునిచేతను శ్రీదేవి సేవింపఁ బడుచున్న దన్న నో దేవజుష్టయగు నా పరదేవతనే వేదము వర్ణింప వలదా? ఎవతెచేత భగవంతుఁడు పరబ్రహ్మమయ్యెనో యామె మాహాత్మ్యము కాక మఱియే విషయము వేదమున కుద్దేశ్యమై యుండును? "అపాఙ్గా భూయాంసః" అను శ్లోకములో ఈ గ్రంథకర్త యీవిషయము నిఁకముందు వివరించుటను జూడుఁడు

శ్రీరామాయణమును వేదార్థమును వివరింపఁ బూనెను "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" (వేదమును ఉపబృంహణముచేయు నిమిత్తము వాల్మీకి కుశలవులను స్వీకరించెను) అని శ్రీరామాయణములోనే చెప్పఁబడియున్నది అది "సీతాయాశ్చరితం మహత్" అన్నట్లు కారాగృహమందుండిన శ్రీదేవియొక్క మాహాత్మ్యమును చెప్పునదను విషయ మందఱికిని సమ్మతమే వివరణము చేయు రామాయణము శ్రీదేవీ మాహాత్మ్యమును నుడువుచున్నదనఁగా వివరణము చేయఁ బడు వేదముకూడ దానినే కదా చెప్పవలయును! కానిచో రామాయణ మెట్లుప బృంహణమగును?

వేదముయొక్క వెలుపలి యర్థమగు భగవంతునే యుపబృంహణము సేయు మహాభారతాది గ్రంథములకుఁగూడ శ్రీదేవియెడనే యాంతరింగిక తాత్పర్యమని తెలియఁదగును

గుణములవలె వదలి యుండక శ్రీదేవి భగవంతునికి విశేషణమగుటచేత భగవంతుని ప్రస్తావించినపుడే యీ మెయుఁ బ్రస్తావింపఁబడెనని కొందఱందురు

పురుడర్గళ్ పుగల్వార్ తొల్లోర్ పునైన్ద్రగళ్ శిఱినుమ్ పుల్లా
చ్చురుదిరైయ దేవి! నిన్న శుభగుణ మణిపీడన్తే
శెఱిపుదా తిఱక్కుమ్ శీరైన్ద్ర కెళుమియ తిఱవు కోలే
తరుకన ల్లితిహాసజ్గళ్ దరుమనూల్ పురాణ మాది (10)

దేవీ! పురాతనపురుషు లించుకయు దోషములేని వేదమును నీ శుభ గుణరత్నముల నుంచియుండు బొక్కసమని వక్కాణింతురు దానిని దెఱచుటకు సాధ్యము గాక దృఢముగా మూసికొనియుండు తలుపును దెఱచుటకు తర్కముతోఁ గూడిన ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు మున్నగునవి సమర్థములైన బీగపుఁ జెవులుగా నున్నవి.

**అవతారిక.**—ఇట్లు శ్రీదేవీ విషయములో నుపబృంహణములతోఁ గూడిన వేదమును బ్రమాణముగఁ దెలిపి, యీ ప్రమాణ ముండినను గొందఱు తత్త్వమును దెలియనివారై వాదములకు దిగి యొకరినొకరు కొట్టుకొనుటకుఁ గారణము, వారు శ్రీదేవీ కటాక్షమునకు లేశమైనను బాత్రులు కామియే యని యనుచున్నారు

ఆహుర్వేదా నమానం కతిచన కతి చారాజకం విశ్వమేత
ద్రాజన్వత్ కేచిదీశం గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే।
భిక్షావన్యే సురాజమ్భవ మితి చ జడా స్తే తలాత ల్యకార్షుః
యే తే శ్రీరఙ్గ హర్మ్యాఙ్గణ కనకలతే! న క్షణం
లక్ష్యమాసన్॥ ॥౧౧॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| శ్రీరఙ్గహర్మ్యాఙ్గణ కనకలతే! | శ్రీరంగ విమానపు ముంగిటిలోనుండు బంగారు లతా! |
| యే | ఎవరు |
| తే | నీయొక్క (కటాక్షమునకు) |
| క్షణం | క్షణకాలమైనను |
| లక్ష్యం | పాత్రముగా |
| న ఆసన్ | కాలేరో |
| తే | ఆ |
| జడాః | బుద్ధిహీనులగు |
| కతిచన | కొందఱు |
| వేదాన్ | వేదములను |
| అమానం | ప్రమాణము కావని |
| ఆహుః | చెప్పిరి, |
| కతిచ | మఱికొందఱు |
| ఏతత్ | ఈ |
| విశ్వం | జగత్తును |
| అరాజకం | నియమించువాఁడు లేనిదిగ (చెప్పిరి) |
| కేచిత్ | మఱికొందఱు |
| రాజన్వత్ | మంచిరాజు గలదిగ (చెప్పిరి) |
| అన్యే | ఇతరులు |
| తం | ఆ మంచి రాజును |
| ఈశం | నియామకుఁడుగాను |
| గుణినం అపి | గుణయుక్తుఁడుగాను నుండినను |
| గుణైః | (నిజముగ) గుణములచేత |
| దరిద్రాణం | శూన్యుఁడైన వానినిగ (చెప్పిరి) |
| అన్యే | తదితరులు |
| భిక్షా | భిక్షమెత్తు వానియందు |
| సురాజమ్భవం | మంచి ఈశ్వరత్వమును (చెప్పిరి) |
| ఇతి చ | ఈ విధముగను |
| తలాతలి | చేతులతో నొకరినొకరు కొట్టుకొను పోరు |
| అకార్షుః | చేసికొనిరి. |

మతము లనేక విధములు. వానిని బాహ్యమతము లనియు, నాంతరమతము లనియు విభజింపవచ్చును. వేదమును బ్రమాణముగా నంగీకరింపనివి బాహ్యమతములు. వేదము నంగీకరించునవి ఆంతర మతములు.

బాహ్య మతస్థులు బౌద్ధ జైనాదులు. అనేక విషయములలో వారిలో భిన్నాభిప్రాయములున్నను వేదమును దూషించుటలో వారందఱు నేకకంఠులే కనుక వారి మతము లన్నిటిని నొకటిగాఁ జేర్చి ప్రథమములోఁ జెప్పుచున్నారు.

ఆహుః శ్వైదాన్ . . . . కతిచన — ప్రత్యక్షము చేతను, అనుమానము చేతను నెఱుఁగరానివాని నెఱింగించునది వేదము, అట్టి వేదము ప్రమాణము కాదని చెప్పుచున్నారే! ఇది యెంత సాహసము! అని తాత్పర్యము. వారిని "బౌద్ధులు, జైనులు" అను పేర్లచే వ్యవహరించుటయు గ్రంథకర్త కనిష్టము కాన వారిని "కొందఱు" (కతిచన) అని యన్నారు. మీఁదను నిట్లే యెఱుంగునది.

ఇఁక ఆంతర మతములు చెప్పఁబడుచున్నవి. వేదమును బ్రమాణముగా నొప్పుకొనియు, నా వేదమును బ్రకటించిన భగవంతు నంగీకరింపనివారు సాంఖ్యులు. వారి మతము వివరింపఁబడుచున్నది.

కతి చారాజకం విశ్వమేతత్ — మూల ప్రకృతియు, దాని వికారమైన తదితరములగు నిరువదిమూఁడు తత్త్వములును, నిరువదియైదవదైన జీవతత్త్వమునునే యున్నవి. పృథక్కైన యొక యీశ్వర తత్త్వము లేదు. ఇది సాంఖ్యుల మతము.

ఏతద్విశ్వం — అచిద్రూపమైన యీ ప్రపంచము అనుట. అచేతనమైన యీ లోకము అచేతనమైన మూలప్రకృతినుండి తోఁచవలయునే గాని, వేఱై చేతనుఁడుగా నెన్నఁబడు నీశ్వరునినుండి దోఁచుట పొసఁగదని వారి మతము, కాఁగా నీలోకమునకుఁ గారణవస్తువుగ నొక యీశ్వర తత్త్వము నంగీకరింప నక్కఱలేదని చెప్పఁబడినదయ్యెను.

రాజు లేనియెడల లోకమేమియగును? లోకము నరాజకముగఁ జేసివేయుచున్నారే! యను దయ తోఁప "అరాజకం" అనుమాట యమరియున్నది.

కారణమైన మూలప్రకృతి యచేతన మగుటవలన నియత సమయము నెఱింగి తానే మార్పుఁజెంది లోకముగాఁ బరిణమించుట యశక్యము. భగవంతుఁడే తగిన సమయము నెఱింగి దానిని మార్చి లోకమును బుట్టించు ననుటయే తథ్యము.

మఱియు, నిరీశ్వర మీమాంసకుల మతముకూడ నిచ్చట పేర్కొనఁబడిన దనుటకును జోటు కలదు. "మనము చేయు కర్మమే చాలును, వేఱొక దైవ జాతియే లేదనుట వారి మతము.

అచేతనములైన కర్మలే నియత సమయమున, బరిమాణము నెఱిఁగి ఫలమిచ్చు ననుట యసంభవము మన మొనర్చు మంచి చెడు కర్మల కనుగుణముగ రాజువలె బరిమాణమునకుఁదగు ఫలమునిచ్చుటకొక యీశ్వరుఁడున్నాఁడనునది మన మతము

ఇఁక, ఈశ్వరతత్త్వము నొప్పుకొనియు నతని నిజస్థితి నెఱుంగక యుండు కాణాద మతము చెప్పఁబడుచున్నది

రాజన్వతీ చేచిత్ —రాజన్వత్-మంచి యజమానుఁడు గల లోక మనుట యజమానుని మంచితన మనఁగా సర్వజ్ఞత్వము సర్వశక్తత్వమును

మంచి యీశ్వరుఁ డొకఁ డున్నాఁడను విషయములో మనకును గాణాద మతస్థులకును నభిప్రాయ భేదము లేదు కాని వారు భగవంతుని ననుమానముచేత నెఱుంగుదురు మనమో శాస్త్రము ద్వారానే నిశ్చయింప వలయు ననెదము మఱియు వారి మతము ప్రకారము లోకమునకుఁ బరమాణువు కారణము భగవంతుఁడు కుండకుఁ గులాలునివలె నిమిత్త మాత్రమే కుండకు మట్టివలె లోకమునకు భగవంతుఁడే యుపాదాన కారణము గూడ ననునది మన సిద్ధాంతము కనుక "రాజన్వత్" అను పదమునకు నిమిత్త మాత్రుఁడైన భగవంతుఁడు గలది యనియో, యనుమానముచేత నెఱుంగఁబడిన భగవంతుఁడు గలది యనియో తాత్పర్యముఁ గొనఁదగును

ఇఁక భగవంతుని ననుమానముచేతఁ గాక శాస్త్రమూలముగానే నిశ్చయింపవలయు ననుదాని నొప్పుకొనియు, నతఁడు నిర్గుణుఁడని చెప్పు నద్వైత మతమును బ్రస్తావించుచున్నారు

గుణినమపి .. ....దరిద్రాణమన్యే —స్వభావముచేత బ్రహ్మ నిర్గుణమే, అవిద్యచేత నది గుణము గలదిగఁ దోఁచుచున్న దని యా యద్వైతుల మతము "దరిద్రాణం" అను పద మీ తత్త్వమును లెస్సగా నిరూపించుచున్నదను సొగసును జూచి యానందింపుఁడు "చానన్" ప్రత్యయము స్వభావార్థకము

ప్రకృతి గుణములైన సత్త్వాదులు లేవు గనుక బ్రహ్మము వేదమునందు నిర్గుణమనఁబడినదే కాని, యే గుణములును లేనిదని గాదు జ్ఞానము, బలము మొదలగునవి బ్రహ్మమునందు స్వాభావికగుణములని వేదము చెప్పుటచేత స్వాభావిక సద్గుణములు బ్రహ్మమునం దున్నవని మన మతము

ఇఁక, గుణములు కలవని యంగీకరించుచు, నీశ్వరత్వము లేనివాని నీశ్వరుఁ డని చెప్పు శైవ మతము చెప్పఁబడుచున్నది

భిక్షావత్యే సంరాజన్వతీం —భిక్షుకునకు రాజత్వమును చెప్పుటచే వా మతము విరుద్ధమైన దని పరిహసించుట యగును

త్రిమూర్తులకు నతీతుఁడైన సదాశివుఁడే పరతత్త్వమనుట శైవ సిద్ధాంతము

కర్మవశ్యుఁడని ప్రమాణ ముండుటచేత శివుఁడు పరతత్త్వము కానేరఁడని మన సిద్ధాంతము

ఇతి చ — "చ" అనుక్త సముచ్చయార్థకము ఇంకను జెప్పఁ బడని యితర మతములని గ్రహించునది

జడా —తథ్యము నెఱుంగమి యందఱకిఁ గలదు కావున ఆంతర మతస్థులను, బాహ్య మతస్థుల నొక గుంపుగాఁ జేర్చి జడులనిరి

తలాతలి అకార్షుః —వారందఱు నొకరినొకరు ప్రహరించు కొనుచున్నా రనుటచేత పట్టిన పట్టు విడువని వారి యవివేకము విశదమగుచున్నది. వారిలో వారే పరస్పరము కొట్టుకొనుటచేత వారిని నిరసింపవలసియుండుట మన కర్తవ్యము కాదని తాత్పర్యము

శ్రీరఙ్గ హర్మ్యాఙ్గణ కనకలతే .. . ఆసన్ —అంగణం - ముంగిలి, బంగారు లతగా వర్ణించుటచే కాంతియు, సౌందర్యమును దోఁచుచున్నవి

శ్రీదేవి కటాక్షమునకు వారు కించిత్తయినను పాత్రులై యుండిన యెడల "సచ పండితః" యన్నట్లు వారికి యదార్థ జ్ఞానము లభించి యుండును, ఇట్లు పరస్పరము కొట్టుకొనరని తాత్పర్యము

ప్రాజ్ఞులు వర్తమానార్థకమగు "ఆహుః" అనుదానిని ప్రాయశః "ప్రాఞ్చః ఆహుః" (పూర్వులు చెప్పిరి) అని భూతకాలార్థముగ వ్యవహరింతురు అట్లే ఇచ్చట "అకార్షుః" అను భూతకాలమున కనుగుణముగ "అహుః" అనుటకుఁ జెప్పిరని యర్థము గ్రహింపవలయును, "మనవే ప్రాహ" గీత "అహ" అనునది భూత కాలార్థ కావ్యయమని ప్రౌఢమనోరమలోఁ గలదు

రాజన్వత్ —"సురాజ్ఞి దేశే రాజన్వాన్" అను నిఘంటు వచనప్రకారము మంచి రాజుండు లోకమని యర్థము "రాజన్వాన్ సౌరాజ్యే" అను వ్యాకరణ రీతిగ "రాజన్వత్" అన్నారు

"సురాజమ్భవమ్"—"కర్తృ కర్మణోశ్చ భూకృఞోః" అను వ్యాకరణ విధి ప్రకారము భూధాతువుమీఁద భావార్థమున "ఖల్" ప్రత్యయము వచ్చి "అరుర్ద్విషదజన్తస్య ముమ్" అను వ్యాకరణ విధి ప్రకారము "ముమ్" ఆగమము వచ్చి "సురాజమ్భవమ్" అని యయ్యెను

తలాతలి —"తలైశ్చ తలైశ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తం" అను నర్థమున "తత్ర తేనేద మితి సరూపే" అను విధిప్రకారము సమాసమును "ఇచ్

కర్మవ్యతిహారే" అను విధి ప్రకారము "ఇచ్" ప్రత్యయమును "అన్యేషా మపి దృశ్యతే" అను విధి ననుసరించి మొదటి పదము చివరి యచ్చునకు దీర్ఘమును వచ్చి "తలాతలి" అని యయ్యెను

వేదఙ్గళ్ పిరమాణ మల్ల వెన్బార్
వియనులగు క్కిఱై యవనే ఇల్లై యెన్బార్
నాదనుణ్డే వ్వులగిఱ్కు నల్ల నెన్బార్
నలనుడై యవస్తనైని ర్గుణనే యెన్బార్
ఏదఙ్గొళి రప్పాళ నిఱైవ నెన్బార్
ఇప్పడియే మదికేడ రడిత్తు క్కొళ్వార్
పోదిఱైయు మరఙ్గత్తు విమాన మున్ఱి
ప్పొలఙ్గొడియే! ఇం కున్నిన కాంగాదారే. (11)

శ్రీరంగ విమానపు ముంగిటిలోఁ బ్రకాశించు బంగారు లతయగుదానా! (శ్రీదేవీ!) వేదములు ప్రమాణములు గావని కొందఱు (బాహ్యులు) అందురు, ఈవిశాలమైన ప్రపంచమునకు ఈశ్వరుఁడే లేఁడని కొందఱు (సాంఖ్యులు) అందురు, ప్రపంచమునకు మంచి నాయకుఁడు గలఁడని కొందఱు (కాణాదులు) అందురు మంచి గుణములు గలవాఁడగు నతని నిర్గుణుఁడని కొందఱు (అద్వైతులు) అందురు దోషయుక్తుఁడై భిక్షుకుఁడైన శివుఁడే సర్వేశ్వరుఁడని కొందఱు (శైవులు) అందురు ఇట్లు నీ కటాక్షమునకు లేశమైనను పాత్రులు కానివారు వివేకహీనులై పరస్పరము వాదించి కొట్టుకొనుచుందురు (11)



అవతారిక — శ్రీదేవీ! కటాక్షమునకు లక్ష్యములైన భాగ్యవంతులే వేదాంత నిధి యగు శ్రీదేవీ మహిమనుజూచి యనుభవించుటకయి పుట్టినవారనుచున్నారు

మనసి విలసతాజ్ఞా భక్తి సిద్ధాఞ్జనేన
శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః ।
నిధిమివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః
నను భగవతి! దైవీం సంపదం తే ఽభిజాతాః॥ ౧౨॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| భగవతి! | సుగుణములతో నిండిన | తే | నీయొక్క |
| లక్ష్మి! | ఓ లక్ష్మి! | మహిమానం | మహిమను |
| ధన్యాః | భాగ్యశాలురైన | నిధిమివ | భూమిలోఁ బూడ్చి పెట్టిన ధనమువలె |
| యే అపి | ఎవరు | | |
| భక్తిసిద్ధాఞ్జనేన | సిద్ధాంజనమువంటి భక్తితోఁ గూడినదియు | వీక్షమాణాః | చూచువారై |
| | | భుఞ్జతే | అనుభవించుచున్నారో |
| మనసి | (అందుచేతనే) మనస్సునందు | తే | వారు |
| విలసతా | ప్రకాశించునదియునగు | దైవీం | దైవ సంబంధము పడసిన |
| అక్ష్ణా | (జ్ఞాన) నేత్రముచేత | | |
| శ్రుతిశిరసి | వేదాంతములలో | సంపదమ్ | సంపద (గురించి)ననుభవించుటను |
| నిగూఢం | చక్కఁగా మఱుఁగుపఱుపఁబడియుండు | జాతా నను! | పుట్టినవారు గదా! |

ఈ శ్లోకము "చతుశ్శ్లోకీ" వ్యాఖ్యానములో నయినారాచ్చాన్ పిళ్లై చేత వ్యాఖ్యానింపఁబడి యున్నది దానిని యథాస్థితిగ సంస్కృతమున భాషాంతరీకరించి వీరరాఘవాచార్యులు వ్రాసిన వ్యాఖ్యానము మనలను మిక్కిలి యానందపఱచుచున్నది

నిధిని అందఱు కనిపెట్టఁ గలుగుదురా? కొందఱు భాగ్యశాలురే దానిని గనుఁగొనెదరు పర్వత శిఖరముఁ బోలిన చోటులలో దాఁచి యుంపఁబడిన నిధిని కంటిలో సిద్ధాంజన మను కాటుక పూసికొన్ననే, వారును కనుఁగొనుటకు శక్తులగుదురు అట్టులే శ్రీదేవీ కటాక్షమునకు లక్ష్యమగుట యను భాగ్యమును బడసిన వారే వేదశిఖరములలో దాఁపఁబడియున్న "శ్రీదేవీ మహిమ" యను నిధి నంతశ్చక్షువున భక్తి యను సిద్ధాంజనమును బూసికొని జూడఁ గలుగుచున్నారు, అనుభవింపను బడసి యున్నారని తాత్పర్యము

నిధిని గుఱించి చెప్పునపుడు "భక్తి సిద్ధాంజన" మనుదానికిఁ బూసికొనఁబడు సిద్ధాంజన మనియు, "శ్రుతిశిరసి నిగూఢం" అనుదానికిఁ జెవి ప్రక్కను దాఁపఁ బడినది - అనఁగా రహస్యముగా నుపదేశింపఁ బడిన దనియు నర్థము గ్రహింపుఁడు అంజనము పూయఁబడియుండుటవలన బాగుగాఁ బ్రకాశించుచున్న నేత్రముచేత "ఇచ్చోట నున్న" దని రహస్యముగఁ జెవిలోఁ జెప్పఁబడిన నిధివలె వని యనఁబడినదయ్యెను "భక్తి యుక్తం" (పూయుటతోఁ గూడిన) సిద్ధాంజన మని యిప్పుడు సమాసమును గొనవలయును

<u>శ్రుతి శిరసి నిగూఢం,</u>— ఈమాటల వలన నిధి పర్వతశిఖరమున దాఁచి పెట్టఁబడియుండుటయు సూచింపఁబడుచున్నది శిరసి = వేదాంతములలో నని

<u>భక్తిసిద్ధాఞ్జనేన</u> — భక్తి యనఁగా శ్రీదేవియం దైన విశేషించిన తగులుపాటు సిద్ధాంజనము = దాఁచి పెట్టఁబడిన వస్తువును జూపించు సామర్థ్యము గలిగిన కాటుక భక్తిసిద్ధాఞ్జన మనునది బహువ్రీహి సమాసము ఇఁక దీనిని "అక్ష్ణా" అను దానికి విశేషణముగాఁ గాక, భక్తియను సిద్ధాంజనమను కారణము చేత నని, కర్మధారయ సమాసముగా నర్థముఁ జెప్పువారును గలరు

శ్రీదేవి మహిమ యత్యంత రహస్యముగా వేదములం దుండుటం జేసి "నిగూఢం" (బాగుఁగా దాఁచిపెట్టఁబడినది) యనిరి "యేఽపి" అనుదానిలో నున్న "అపి" శబ్దము నిచ్చటఁ జేర్చి దాఁచిపెట్టఁబడి యుండినను — అని కొంద ఱర్థము చేసెదరు

<u>భుఞ్జతే</u> — నిధి ననుభవించుట యనఁగా దాని నుపయోగించుకొనుట మహిమ ననుభవించుట యనఁగా దానిని జక్కఁగా ననుసంధించుట యని తెలిసికొనునది

<u>యేఽపి ధన్యాః</u> — ధనం (భాగ్యమును) ప్రాప్తాః (పొందినవారు) ధన్యాః - భాగ్యవంతులు భాగ్యమనునది శ్రీదేవీ కటాక్షమునకు లక్ష్యమగుట "అపి" అను అవ్యయము వారి మితిమీఱిన యుత్కృష్టతను జూపుచున్నది

"నను" అను పదమును "లక్ష్మి" యను సంబోధనముతోఁ జేర్చి "ఓ లక్ష్మి" యనియు నర్థముఁ జెప్పుట గలదు

<u>దైవీం సంపదం తేఽభిజాతాః</u> — భగవదాజ్ఞానుసారులగు భక్తులు దేవతలు అట్లు కానివా రసురులు మొదటివారి స్థితి దైవ సంపద యనఁబడును రెండవ వారి స్థితి యాసుర సంపద యనఁబడును శాస్త్రమర్యాద ననుసరించి నడచుకొను శీలమే దైవ సంపద యనఁబడినదయ్యెను శీలమునే యైశ్వర్యముగా భావించుట చేత సంపద యనఁబడుచున్నది శాస్త్రమార్గము నతిక్రమించిన స్థితియే - అనఁగా శీలము లేమియే అసురసంపద యనఁబడుచున్నది వారద్దానినే యైశ్వర్యముగా భావింతురు గనుక వారి భావ ప్రకార మాసురసంపద యనఁబడుచున్నది మొదటిది మోక్ష హేతువు రెండవది నరక హేతువు శ్రీదేవీ మహిమను దర్శించి యనుభవించువారు దైవ సంపదకనియే జన్మించినవారు కానిచో వా రే విధమున దర్శించి యనుభవింపఁగలరు? అని తాత్పర్యము "సంపదం దైవీం అభిజాతః" అను గీతా వాక్య మిచ్చట స్ఫురించుచున్నది.

౧౧-వ శ్లోకములో నాసుర సంపద చెప్పఁబడినది ఈ శ్లోకమున దైవ సంపద చెప్పఁబడుచున్నది అసుర జన్మము గలవారు గనుక వారు శ్రీదేవి మహిమను

దర్శించలేకపోయిరి. దైవ జన్మము కలవారగుటచేత వీరు శ్రీదేవి మహిమను గని యనుభవింపఁ గలిగిరి. శ్రీదేవి కటాక్షము భక్తిని బుట్టించి జ్ఞాన వైశద్యములకు హేతు వయ్యెనని తెలిసికొనునది. "భక్తిచేత శాస్త్రమూలముగ జనార్దనుని దెలిసికొనుచున్నా" నని సంజయుఁడు నుడివెను. "ఎన్ నెఞ్జెన్నాల్ నోక్కి-క్కాణ్‌కిన్" అని భక్తియుక్తమైన జ్ఞాన నేత్రముచే భగవంతుని దర్శింప వలయు నని నమ్మాళ్వారు ననుగ్రహించిరి. భక్తి సిద్ధాంజనముచేత దర్శించి యనుభవించుచున్నా రనుటచే, భక్తియే దర్శనమునకును, అనుభవమునకును గారణమైనదని చెప్పఁబడినదయ్యెను. "భక్తిచే నన్ను దెలిసికొనుచున్నాఁడు, తెలిసికొని నన్ను బొందుచున్నాఁడు" అని గీతలోఁ జెప్పఁబడి యుండుటం జూడుఁడు. "ద్రష్టుం ప్రవేష్టు మపి భక్త్యైవ శక్యః" (దర్శించుటకును అనుభవించుటకును భక్తిచేతనే సాధ్యమగును) అను ఆళ్వానుల సూక్తి యిచ్చట స్మరణీయము.

స్వామి యాళవందార్లు "నైవాసుర ప్రకృతయః ప్రభవన్తి బోద్ధుం" (అసుర ప్రకృతి గలవారు తెలిసికొనలేనే లేరు) అనియు, "పశ్యన్తి కేచి దనిశం త్వదనన్య భావాః" (భగవంతుఁడవగు నీయందుఁదప్పఁ దక్కొనవానియందు మనస్సు కించిత్తైనను చెల్లింపనివారగు కొందఱు నిన్ను నిరంతరము దర్శించుచున్నారు) అనియుఁ జెప్పిన దాని ననుసరించియే ౧౧-వ శ్లోకమును, నీ శ్లోకమును నమరి యున్నవి.

ఆళ్వానులును "శ్రుత్యర్థ మర్థమివ భానుకరై ర్వ్యభేజుః, త్వద్భక్తి భావిత వికల్మష శేముషీకాః" (సూర్యుని ప్రకాశముచేత వస్తువునువలె నీయందలి భక్తిచేత బుద్ధి మాలిన్యము తొలఁగినవారు వేదార్థమును విభజించి తెలిసికొనిరి) అనియు "యే తు త్వదఙ్ఘ్రి సరసీరుహ భక్తిహీనాః, తేషామమీభిరపి నైవ యథార్థబోధః" (నీ చరణకమలములయందు భక్తిహీనులైనవారికో, ఉపబృంహణము లుండియు, తత్త్వయాథార్థ్యము గోచరమగుట లేదు) అనియు ననుగ్రహించి యుండుట యిచ్చట ననుసంధింపఁ దగినది. "నోక్కి-క్కాణుమ్ భక్తి సిద్ధాఞ్జనత్తై ఇడుగిఱార్ అజ్ఞాం బత్తిల్" అని యీ భక్తి సిద్ధాంజన ముపయోగింపఁబడుటను నాచార్యహృదయ కారులును జూపిరి.

బత్తి సిద్ధాఞ్జనత్తాల్ బగవతి! మఱైయిల్ మూడి
వైత్తనిన్ మహిమై కణ్డు మనక్కణిన్ నిదియే పోల
త్తుయ్‌త్తిడు వోర్గళ్ శెల్వి! తుగళఱు బాగ్గియత్తాల్
మెయ్‌త్తిరు వాన దెయ్‌వ ప్పిఱవియే మేయూ రన్ఱే. (12)

భగవతీ! లక్ష్మీ! వేదాంతమునందు దాఁచి యుంపఁబడిన నీ మహిమను జ్ఞాన నేత్రముచేత భక్తి సిద్ధాంజనమును గొని నిధినివలె దర్శించి యనుభవించువారు నీ కటాక్ష వీక్షణ మను దోషము లేని భాగ్యముచేత సత్యమైన సంపద యగు దైవ జన్మమును బడసినవారు గదా!

అవతారిక — ఈ పద్యంబులతోఁ గూడిన వేదము శ్రీదేవినిగురించినదే యని “దేవి శ్రుతిం” అను ౧౦-వ శ్లోకములోఁ జెప్పిన విషయము నిఁక రెండు శ్లోకములచేత విశదీకరించుచున్నారు

అస్యేశానా జగత ఇతి తేఽధీమహే యాం సమృద్ధిం
　శ్రీః! శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్।
ఈష్టే కశ్చి జ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః
　తం చ త్వత్కం పతిమధిజగా ఉత్తర శ్చానువాకః॥　　॥౧౩॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీః! | ఓ లక్ష్మీ! | పౌరుషేసూక్తే | పురుషసూక్తములో |
| అస్య | ఈ | జగతః | లోకమునకు |
| జగతః | లోకమునకు | కశ్చిత్ | ఒకఁడు |
| ఈశానా | ఈశ్వరి | ఈష్టే | ఈశ్వరుఁడై యున్నాడు |
| ఇతి | అని | ఇతి | అని |
| యాం | ఏ | యః | ఎవఁడు |
| సమృద్ధిం | ఐశ్వర్యమును | ఉక్తః | చెప్పఁబడెనో |
| అధీమహే | పఠించుచున్నామో | తం చ | అతనినిగూడ |
| తాం చ | ఆ యైశ్వర్యమును | ఉత్తరః | తర్వాతిదైన |
| శ్రీసూక్తం | శ్రీసూక్తమైనది | అనువాకశ్చ | అనువాకమును |
| శాఖానుశాఖం | ప్రతిశాఖలోను | త్వత్కం | నిన్ను జేరిన |
| బహు | అనేక విధములుగా | పతిం | భర్తనుగా |
| ముఖయతే | వివరించుచున్నది | అధిజగా | పఠించెను |

శ్రీదేవి మహిమను సాక్షాత్తుగా వివరించు వేదభాగములు మొదటి రెండు పాదములలోను, తాత్పర్యాంశమూలముగా నీమె మహిమను జూపు తక్కిన భాగములు కడపటి రెండు పాదములలోను జూపఁబడుచున్నవి

“ఈ లోకమున కీశాన” అను పూర్వకాండములోని వేద వాక్యమును “అస్యేశానా జగతః” అని యట్లే యుపయోగించుచున్నారు

తాం చ — “చ” సముచ్చయార్థకము “అస్యేశానా” అను వాక్యములోఁ జెప్పఁబడినదియు, నందు చెప్పఁబడనదియు నగు సమృద్ధిని - అనుట

పురుషుఁడైన భగవంతునిఁ జెప్పు వేదభాగము పురుషసూక్త మనఁబడునట్లు శ్రీదేవిని ప్రతిపాదించు వేదభాగము శ్రీసూక్త మనఁబడును

శాఖానుశాఖమ్ —"ఇదం హి పౌరుషం సూక్తం సర్వవేదేషు పఠ్యతే" (ఈ పురుష సూక్తము సర్వ వేదములలోను పఠింపఁబడినది) అనునట్లే శ్రీసూక్తము గూడ సర్వ శాఖలలోను గలదనుట "స్థితం" (ఉండు) అను పదమునధ్యాహరించు కొనవలయును ప్రతిశాఖలోను నుండు శ్రీసూక్త మని యర్థము

ఇఁక "శాఖానుశాఖ" మను దానిని "బహుముఖయతే" యనుదానికిఁ గ్రియా విశేషణముగ గ్రహించుటయుఁ దగును పుంఖానుపుంఖ మనునట్లు శాఖానుశాఖమనుట ఇంకను మీఁదమీఁద నెక్కువగావిజృంభించి పరిపూర్ణముగ నని యర్థము

శ్రీసూక్తము శ్రీదేవినే జగత్తున కీశ్వరిగాఁ జెప్పునుట యెట్లు పొసఁగును? పురుష సూక్తములోఁ బురుషుఁడే యీశ్వరుఁడుగాఁ జెప్పఁబడి యున్నాఁడే! యన్నచో - పురుషసూక్తముగూడ శ్రీదేవి మహిమనే దెలియఁజేయ నవతరించినదని తరువాతి రెండు పాదములచేతఁ జెప్పుచున్నారు

ఈష్టే ఉక్తః — ఇదంతయుఁ బురుషుఁడే యని పురుషసూక్తము చెప్పుచున్నది రాజే రాజ్యమనునట్లుగాఁ బురుషుఁడే దీని కంతకును నీశ్వరుఁడని దాని తాత్పర్యము అమృతత్వమునకు (మోక్షమునకు) నీశానుఁడని స్పష్టముగాను బఠింపఁబడియున్నది ఆ యర్థమునే "ఈష్టే కశ్చి జ్జగతః" యని ప్రతిపాదించుచున్నారు

తం చ —పురుషసూక్తమున విశదీకరింపఁబడిన యతనిని "చ" సముచ్చయార్థకము నారాయణానువాకాదులలో వివరింపఁ బడిన యతని నిచ్చట భావింపుఁడు

ఉత్తరః అనువాకశ్చ —"అద్భ్యస్సంభూత" అని ప్రారంభించునది తరువాతి యనువాకము చకారము సముచ్చయార్థకము "లక్ష్మి (శ్రద్ధ) చేత దేవుఁడు దేవత్వమును బొందుచున్నా" డను నిత్యాది వాక్యముల నిది తలఁపించుచున్నది

పురుష సూక్తములోను, నారాయణానువాకములోను జెప్పఁబడు పురుషుఁడే "అద్భ్యస్సంభూత" అని యుపక్రమించు ననువాకములోను జెప్పఁబడుచున్నాఁడు "ఈ పురుషుని నే నెఱుంగుదును" ఈ మొదలగు వాక్యము లన్నియు నైకపుత్య మున్నవిగాఁ గానవచ్చుటచేతఁ బురుషసూక్తమునఁ జెప్పఁబడిన పురుషుఁడే పై

యనువాకమువందును జెప్పఁబడినవాఁ డయ్యె ననుట స్పష్టము పై యనువాక మా పురుషుని "లక్ష్మీపతి" యని, యతని కతిశయమును గూర్చి చేర్కొనుచున్నది కనుక పురుషుని కేర్పడిన యతిశయ మంతయు లక్ష్మికిఁ బతి యగుటచేత లభించిన దని వేదముయొక్క తాత్పర్యమని తెలియుచున్నది ఇందుచేత భగవంతుని మహిమ నెత్తి పఠించు వేదభాగములన్నియు శ్రీదేవి మహిమలోనే పర్యవసించుచున్నవని గ్రహింపుఁడు

కనుక, సాక్షాత్తుగా పఠించు శ్రీసూక్తాదులును, భగవంతుని మూలముగఁ జెప్పు పురుషసూక్తాదులును జేరి వేదమంతయును శ్రీదేవి యైశ్వర్యమునే వచించుచున్నదని చెప్పఁబడినదయ్యెను

"నీకంటె నెక్కువ మహిమ గలదానినిగ శ్రీదేవిని వర్ణించెద" మని గ్రంథకర్త చేసిన ప్రతిజ్ఞ ననుసరించి భర్త నప్రధానముగ నొనర్చి, శ్రీదేవికిఁ బ్రాధాన్య మొసంగి చెప్పుచున్నా రందురు "శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యాతే తవ స్ఫారణే" అని ముందు రాఁబోవుదానిని గమనింపుఁడు

ఇత్తైవియి వ్వులగత్తిఱ్కొ న్ఱోదుని న్నిత్తైమె తన్నై
నెఱిపల విరిత్తు వేఱ్ఱవేల్ నిగళ్త్తువ్మే తిరు! నిన్ సూక్తమ్
ఇత్తైయెన ప్పురుడ సూక్త త్తియుంబియ ఒరువ నైప్పిన్
మత్తైయను వాకమ న్దన్ మగిళ్నన న్ఱోదు మన్ఱే (13)

శ్రీదేవీ! శ్రీసూక్తము జగత్తంతటికిని నీవే యీశ్వరివని యనేక విధములుగ మీఁదమీఁద విశదీకరించుచున్నది అద్వితీయుఁడైన యొకఁడు జగత్తునకు నీశ్వరుఁ డని వర్ణించు పురుషసూక్తమునకుఁ దరువాతఁ గల యనువాకము, అతఁడు నీ భర్త యని కదా పఠించుచున్నది



అవతారిక — వేదాంతమునమాత్రమే గాక రామాయణాదులగు నుపబృంహణ గ్రంథములందును నీ మహిమయే యుద్దేశింపఁబడిన దనుచున్నారు

ఉద్బాహుస్త్వా ముపనిషదసౌ వాహనైకా నియత్త్రీం
శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే ।
స్మర్తారోఽస్మజ్జనని! యతమే నేతిహాసైః పురాణైః
నిన్యుర్వేదా నపి చ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్ ॥ ౧౪ ॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అస్మజ్జనని! | మా తల్లీ! | ప్రాణితి | (వర్ణించి) జీవించి యున్నది |
| అసౌ | ఈ | | |
| ఉపనిషత్ ఏకా | (శ్రీ సూక్తాది) ఉపనిషత్తు మాత్రము | యత మే | ఎవరు |
| | | స్మర్తారః | స్మృతికర్తలో |
| ఉద్బాహుః | చేయి పైకెత్తి | తత మే అపి చ | వారును |
| త్వాం | నిన్ను | వేదాన్ | వేదములను |
| నియన్త్రీం | ఈశ్వరిగా | సేతిహాసైః | ఇతిహాసములతోఁ గూడిన |
| న ఆహ | చెప్పలేదు | | |
| శ్రీమద్రామాయణ మపి | శ్రీమద్రామాయణము కూడ | పురాణైః | పురాణములఁ గొని |
| త్వచ్చరిత్రే | నీ చరిత్ర విషయమున | త్వన్మహిమ్ని | నీ మహిమలో |
| పరం | ఎక్కువగా | ప్రమాణం | ప్రమాణముగా |
| | | నిన్యుః | నిరూపించిరి |

ఉద్బాహుః — రాజులను వైతాళికులు మర్యాదతోఁ జేయి పైకెత్తి స్తుతించు విధమున ఉపనిషత్తుకూడ శ్రీదేవిని స్తుతించుచున్నది ఇఁక "సత్యం సత్యం పునస్సత్యం, ముద్ధృత్య భుజముచ్యతే" (ముమ్మాటికిని సత్యము, చేయి పైకెత్తి చెప్పుచున్నాను) అన్నట్లు శ్రీదేవియే లోకమున కీశ్వరి యని యుపనిషత్తు సత్యము చేయుచున్నది - అనుటయుఁ దగును,

ఉపనిషత్.—తిన్నగాఁ బరతత్త్వమును బ్రతిపాదించు వేదము

"అసౌ" అను పదము 13-వ శ్లోకములో నిర్దేశింపఁబడిన శ్రీసూక్తమును జూపుచున్నది

"ఉపనిషద సావ్యాహ" యని పాఠాంతరము గలదు అప్పుడు "నైకా" యనునది యొకటే పదము అనేక మని యర్థము "అసౌ" యను పదమునకు పైఁ జెప్పిన శ్రీసూక్తము తప్పఁ దదితరము లని యర్థము అనఁగా శ్రీసూక్తము తప్పఁ దక్కిన యనేకములగు నుపనిషత్తులు నిన్నీశ్వరినిగా నూర్ధ్వబాహువులతోఁ జాటు చున్నవని చెప్పఁబడిన దయ్యెను అన్ని యుపనిషత్తులు నిన్నే వర్ణించుచున్న వనుట ఇఁక ఈ పాఠమునం దీ పాదమునకు "ఉద్బాహుః నైకా ఉపనిషత్ త్వాం నియన్త్రీం ఆహ, అసౌ అపి అహ" అనియన్వయించి చేతిని పైకెత్తి పెక్కు ఉపనిషత్తులు నిన్నీశ్వరినిగాఁ జెప్పుచున్నవి ఆ యుపనిషత్తులలోఁ జేరని కర్మ కాండ శ్రుతియు (ఆరాధింపఁబడు నిన్ను) జెప్పుచున్నదని యర్థముఁ జేయుదురు

శ్రీమద్రామాయణమపి... చరిత్రే —"సాహి శ్రీః" యని సంపదగాఁ జెప్పఁబడు వేదములోఁ జేర్కొనఁబడిన ఫలమును రామాయణములోఁ గలుగుటచేత దానిని "శ్రీమత్" అని విశేషించిరి

"పరం" అను పదమును రామాయణమునకు విశేషణముగ భావించుటయుఁ దగును పరం = శ్రేష్ఠమైనది "ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణ" మని పిళ్ళలోకాచార్యులు నుడివెదరు "త్వచ్చరిత్రే పరం" అని యన్వయించి చెప్పుటయుఁ దగును శ్రీదేవి చరిత్రము చేతనే రామాయణము జీవించుచున్నదని చెప్పఁబడిన దయ్యెను

రామాయణ మపి —"అపి" యనునది సముచ్చయార్థకము పైఁ జెప్పిన యుపనిషత్తులను జేర్చి చెప్పుచున్నది ఇఁక వ్యతిరేకార్థముగాఁ గొని పేరునకు రామచరిత్రముగ నున్నను, నీ చరిత్రమునే వచించుచున్న దనువారలును గలరు వారు కావలసిన సముచ్చయార్థమునకై కడపటి పాదములోని 'అపి చ" యను దానిలో నుండు "చ" యనుదాని నిక్కడ చేర్చుకొనుచున్నారు

శ్రీదేవి చరిత్రమున జీవించుచున్న దనుటచే శ్రీరామాయణమునకు రామకథ వాచ్యము, శ్రీదేవి చరిత్రము వ్యంగ్యమని యనఁబడిన దయ్యెను "జీవితం వ్యఙ్గ్య వైభవమ్" (వ్యంగ్యార్థము కావ్యమునకు జీవము) అని చెప్పఁబడియుండుటఁగనుఁడు "సీతాయా శ్చరితం మహత్" (సీతా చరిత్రమే ప్రధానము) అని వాల్మీకి ముని చెప్పుచున్నారు పురుషకార వైభవమే శ్రీదేవి చరిత్రమని గ్రాహ్యము

వాచ్యార్థమున కంగముగఁ గాక దానికన్నను ప్రధానమై యున్న వ్యంగ్యార్థమే శ్రీదేవి చరిత్ర మనుటకై "పరం ప్రాణితి" యని యనిరి "పరం" అనుదానిని రామాయణమునకు విశేషణముగాఁ దీసికొనినచో, దీనిని "ప్ర" యను నుపసర్గముయొక్క యర్థముగా గ్రహింపవలయును

కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము అను మూఁడు గుణములు క్రమముగా వెల్లడియగుచున్న శ్రీదేవియొక్క మూఁడు విశ్లేషములచేతను నామె పురుషకార వైభవము శ్రీరామాయణమునఁ బ్రధానమై వెలసి యుండుటఁ జూడుఁడు శ్రీవచనభూషణ వ్యాఖ్యానము దీనిని వివరించుచున్నది

"బ్రాహ్మణ వసిష్ఠ న్యాయము" (బ్రాహ్మణులు విచ్చేసిరి, వసిష్ఠులునువచ్చిరి) అనుట వలె నితిహాసములలో శ్రీరామాయణ మణఁగి యున్నను, శ్రేష్ఠతచేత దానిని బ్రత్యేకించి నుడివిరి

తర్వాతి పాదములలో నితరోపబృంహణములును శ్రీదేవియే విషయముగాఁ గలవి యనుచున్నారు, స్మృతికర్తలైన పరాశరాదు లితిహాస, పురాణముల ముఖముగా వేదములు శ్రీదేవి విషయమున బ్రమాణములని నిరూపించిరనుట

అపిచః—ఏక పదము ప్రమాణము - ప్రామాణ్యమనుట

"నిన్యుః" అనుక్రియ "వేదాః" "ప్రమాణం" అను రెండు కర్మలు గలది

"సేతిహాసైః పురాణైః యతమే స్మర్తారః వేదాః నిన్యుః, తతమే అపి త్వన్మహిమ్ని ప్రమాణం" అని యన్వయించి కొంద అర్థము చేయుదురు ఇతిహాస ములతోఁ గూడిన పురాణముల చేత నే స్మృతికర్తలు వేదార్థముల ను నిర్వహించిరో వారె నీ మహిమ విషయమున ప్రమాణ మగుదురని యర్థమయినది

ఉయర్త్తియ మీశువరి యాగ వున్నై
ఉపనిడద మాత్తిరమే యుర్రైక్క విల్లై
ఉయర్త్తియుడై చ్ఛీరామా యణము జ్గూడ
ఉయిరుబువ దునదునని చరిత్తిరత్తాల్
ఉయర్త్తిరళు క్కారుతాయే! మేఱ్కొ ళాగ
ఉన్నుడైయ మహిమైయినుక్కుపపా దిత్తార్
శెయర్త్తినైయు మిల్మఱైయి మిరుది కారర్
శీరితిహా సత్తుడనే పురాణ జ్కొణ్డే. (14)

భుజములను పైకెత్తి నీ విశ్వేశ్వరివని చాటునది యుపనిషత్తు మాత్రమే కాదు, శ్రేష్ఠమైన శ్రీరామాయణము కూడ నీ చరిత్రము చేతఁ బ్రాణవంత మగుచున్నది జీవకోటి కద్వితీయురాలవైన తల్లీ! స్మృతికర్తలు ఇతిహాసములతోఁ గూడిన పురాణములను గొని, దోషములేని వేదమును నీ మహామయందు బ్రమాణముగా నుపపాదించిరి



అవతారిక — ఇఁక నాలుగు శ్లోకములచేతఁ బ్రపంచమందలి మంచి వన్నియు శ్రీదేవీ కటాక్షము పొందినవనియు, మంచివి కానివి పొందనివనియుఁ జెప్పు చున్నారు

ఇట్లు, శ్రుతి ప్రమాణముచేతఁ దెలియఁదగు శ్రీదేవియొక్క కటాక్ష లవలేశ మునకు శ్రేష్ఠవస్తువులన్నియు వశమైనవని యనుచున్నారు

ఆకుగ్రామ నియామకాదపి విభో రాసర్వ నిర్వాహకాత్
ఐశ్వర్యం య దిహోత్తరోత్తరగుణం శ్రీరఙ్గభర్తుః ప్రియే!
తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవ త్పుణ్యం పునః పావనం
ధన్యం య త్తదదశ్చ వీక్షణభువ స్తే వక్ష్యసా విప్రుషః॥ ॥౧౫॥

## ప్రతిపదార్థము

| పదము | అర్థము |
|---|---|
| శ్రీరఙ్గభర్తుః | శ్రీరంగనాథుని యొక్క |
| ప్రియే! | ప్రియురాలా! |
| ఆగ్రామ | అల్ప గ్రామమును |
| నియామకాత్ | పాలించునతఁడు మొదలుకొని |
| సర్వ | సమస్తమును |
| నిర్వాహకాత్ | నిర్వహించు |
| ఆజభోరపి | విభువైన బ్రహ్మదేవుని పర్యంతము |
| ఇహ | ఈ లోకమునందు |
| ఉత్తరోత్తర గుణం | పైపై వృద్ధి పొందుచుండు |
| యత్ | ఎట్టి |
| ఐశ్వర్యం | ఐశ్వర్యము గలదో |
| తుఙ్గం | (మేరువు మొదలగు) ఉన్నతమైన వస్తువులు |
| మఙ్గళం | (పుష్పములోనగు) మంగళ వస్తువులు, |
| ఉజ్జ్వలం | (రత్నములు మొదలగు) ప్రకాశించు వస్తువులు, |
| గరిమవత్ | (హిమాలయము మొదలగు) బరువైన వస్తువులు, |
| పుణ్యం | (యాగము లోనగు) ధర్మము, |
| పునః | మఱియు |
| పావనం | (కావేరి మొదలగు) పరిశుద్ధి పఱుచు వస్తువులు, |
| ధన్యం | భాగ్యవంతములైన వస్తువులు అను, |
| యత్ | ఎట్టి |
| ఐశ్వర్యం | ఐశ్వర్యము గలదో |
| తత్ | అట్టి నిర్వహించు నైశ్వర్యమును |
| ఆదర్శ్చ | ఈ "తుఙ్గం" మొదలగునవి తెల్పు నైశ్వర్యమును |
| తే | నీయొక్క |
| వీక్షణభువః | చూపులచేతఁ గలిగిన |
| పంచషాః | ఐదాఱు |
| విప్రుషః | బిందువులు |

ఈ శ్లోకము, పూర్వభాగములోఁ జేతనులయం దుండు నైశ్వర్యమును, ఉత్తర భాగములో నచేతనములయం దుండు నైశ్వర్యమును జెప్పి, యీ రెండును శ్రీదేవియొక్క కటాక్ష లవలేశముచేఁ గలిగినవని చెప్పుచున్నది. కార్యమునందుఁ గారణము నారోపించి యైదాఱు బిందువులని చెప్పుచున్నారు

"సర్వ నిర్వాహక" యనుదానికి భగవంతుఁడను నర్థము పొసఁగదు. ఏలయన "అపాఙ్గా భూయాంసః" అని శ్రీదేవి క్రేఁగంటిచూపులను బూర్ణముగాఁ బొందినయట్టివాఁడే భగవంతుఁడని పైఁ జెప్పఁబోవుదానికి విరుద్ధమగును లీలా

విభూతిని నిర్దేశించు "ఇహ" అను పదముకూడ నీ యర్థమున కనుకూలింప దగియుం డెఱుంగుడు

> శిఱ్ఱూర్మన్ ముదలాగ చ్చెగ మన్నై త్తుమ్
> తిఱమ్బామ నడాత్తుగిన్ఱ ఇఱైవన్ కాఱుమ్
> పెఱ్ఱుళ్ళ శెల్వముమిరా జ్గరఙ్గ నాదన్
> పేరన్బే! మేన్మేలుమ్ పెరుక్క మాగ
> మఱ్ఱోఙ్గి వళర్న్దనవుమ్ గనత్త నవ్వుమ్
> మఙ్గళము మిలఙ్గునవుమ్ బాగ్గియత్తై
> ప్పెఱ్ఱనవుమ్ పావనము మఱముమ్ నిన్న
> పెరుఙ్గరుణై నోక్కిన్ తుళి ఐన్దా ణామే! (15)

శ్రీరంగనాథుని నిరతిశయ ప్రియురాలా! చిన్న గ్రామాధికారి మొదలు సర్వలోకంబులను నీతి నతిక్రమింపక నిర్వహించు బ్రహ్మదేవుని పర్యంతము పొందిన యుత్తరోత్తర గుణమైన యైశ్వర్యమును, మఱియు నున్నతమైనవియు, బరువైనవియు, మంగళకరమైనవియు, తేజోవంతములైనవియు, భాగ్యవంతములైనవియు, పావనములును, బుణ్యములును—ఇవన్నియును నీ కరుణా కటాక్షవీక్షణముయొక్క యైదాఱు బిందువుల చేతనే కలిగినవి (15)



అవతారిక — శ్రీదేవీ కటాక్ష మెట్లు ఐశ్వర్యమునకుఁ గారణమగుచున్నదో యట్లే యామె కటాక్షము లేమియే దారిద్ర్యమునకు హేతువని యనుచున్నారు

> ఏకో ముక్తాతపత్ర ప్రచల మణి ఘృణాతారకీమౌళి ర్మనుష్యః
> దృప్యద్దన్తావళస్థో న గణయతి నతాన్ యత్క్షణం క్షోణిపాలాన్ ।
> యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దన్తపఙ్క్తిం
> తత్తే శ్రీరఙ్గరాజ ప్రణయిని! నయనోదఞ్చిత
> న్యఞ్చితాభ్యామ్॥ ॥౧౬॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| శ్రీరఙ్గరాజ ప్రణయిని! | శ్రీరంగనాథుని ప్రియురాలా! |
| ఏకః | ఒక |
| మనుష్యః | మనుజుఁడు |
| దృప్యత్ | మదించిన |
| దన్తావళస్థః | ఏనుఁగుపైనుండిన వాఁడయ్యు |
| ముక్తాతపత్ర | ముత్యాల గొడుగులో |
| ప్రచల | కదలునట్టి |
| మణి | రత్నములయొక్క |
| ఘణాత్కారి | (రాపిడిచేత) గణగణ యని ధ్వనించుచున్న |
| మౌళిః | కిరీటమును దాల్చినవాఁడై |
| నతాన్ | నమ్రులైన |
| క్షోణిపాలాన్ | రాజులను |
| తృణం | తృణకాలమైనను |
| న గణయతి | లక్ష్యము చేయకయుం |
| (ఇతి) యత్ | డుటయనునదేదికలదో |

| | |
|---|---|
| తత్ | అదియు |
| అన్యః | వేఱొక మనుజుఁడు |
| అశరణః | వేఱు దిక్కులేనివాఁడై |
| కృపణం | తన దైన్యము గనఁబడునట్లు |
| తస్మై | ఆ యేనుఁగుపై నుండు వానికి |
| దన్తపఙ్క్తీః | పండ్ల వరుసలను |
| దర్శయన్ | చూపుచు |
| తిష్ఠతే యత్ | (తన భావమును బయలుపఱచి) నిలిచియున్నాఁడనుట యేదికలదో, |
| తత్ | అదియు |
| తే | నీయొక్క |
| నయన | నేత్రములయొక్క |
| ఉదఞ్చిత | తెఱచుటచేతను |
| న్యఞ్చితా | మూయుటచేతను |
| భ్యామ్ | (కలుగుచున్నవి) |

మనుష్యత్వము సామాన్యమైనను, నొకఁ డితరుల నందఱిని నలక్ష్యపఱచుచు మదపుటేనుఁగుపై నెక్కియుండుటయు, మఱియొకఁడు తన పండ్ల నిగిలించుచు దైన్యముతో మొదటి మనుష్యుని దయ నెదురుచూచి నిలుచుచుండుటయు, శ్రీదేవి కటాక్షమును బొందుటచేతను, బొందక పోవుటచేతను నని యిందులో నన్వయ వ్యతిరేకములు చూపఁబడినవి కటాక్షమును నైశ్వర్యముండుననుట యన్వయము, అది లేనిచో నైశ్వర్య ముండదనుట వ్యతిరేకము

ఈ శ్లోకమునందలి మొదటి రెండు పాదములలో నైశ్వర్యముయొక్క పరాకాష్ఠ చూపఁబడినది మూఁడవ పాదములో దారిద్ర్యముయొక్క పరాకాష్ఠ ప్రదర్శింపఁబడినది నాల్గవ పాదమున వీనికిఁ గారణము చూపఁబడినది.

"గజాన్త మైశ్వర్యమ్" కనుక ఐశ్వర్యోత్కర్షము తోఁప నేనుఁగుమీఁద నుండునట్లుగాఁ జెప్పిరి

గజముమీఁద స్వారిచేయునపుడు ముత్యాలగొడుగులో వ్రేలాడుచుండు రత్నములు కదలి కిరీటముపై నొఱసికొనుటచేత "ఘణఘణ" మనుశబ్దము గలుగుచున్నది

"యాచన నిన్ద్యము" (ఏబ్బొదు ఇగళ్చి) అనునట్లు తన నికర్ష దోఁప పండ్ల నిగిలించు స్థితి ఖేదతికముయొక్క పరాకాష్ఠగాఁ జెప్పఁబడినది

"తిష్ఠతే" అనుదానికి "ప్రకాశనస్థేయాఖ్యయోశ్చ" అను వ్యాకరణ సూత్ర ప్రకారము తన భావమును వ్యక్తపఱిచి నిలుచుట యని యర్థము

ఒరుముత్తు క్కుడై మణిగ ళురశ వరాలి
ఒలిప్ప "గణగణ" వెన్ఱ్ ఒరువన్ నిడనార్
కిరుమ త్త క్కరిమిశై పీఱ్ఱిరున్దే శఱ్ఱుమ్
కావలరే వణఙ్గిడినుమ్ గణిశి యామై
ఇరుప త్తి ప్పల్వరిశై యిళిత్తు మున్నే
ఇన్నొరువన్ పుగలిన్ఱి యేఙ్గుమ్ తన్నై
పురిపి త్త ట్కువై మ త్తై యే తిఱక్కు మూడుమ్
పొన్నరఙ్గర్ కాదలి! నిన్ కణ్గళ్ తామే. (16)

ఓ శ్రీరంగనాథుని ప్రియురాలా! ఒక పూజనీయుఁడైన మానవుఁడు నల్లని మదపు టేనుఁగుపై నెక్కి, కూర్చుండి, ముత్యాల గొడుగున వ్రేలాడుచున్న రత్నములు తన కిరీటముతో నొఱసికొని ఘణఘణమని ధ్వనించుచుండ, నతఁడు తన యెదుట నమ్రులై నిలిచియుండు రాజులను లెక్కచేయక యుండుటయు, మఱియొక మానవుఁ డశరణుఁడై దైన్యము దోఁప తన రెండు పండ్ల వరుసలను జూపించుచుండుటయుఁ గ్రమముగ నీ నేత్రములను దెఱచుటచేతను మూయుటచేతను గలుగుచున్నవి

---

అవతారిక — శ్రీదేవి కటాక్షముచేతఁ దమయంతట తామే ప్రవహించి చేరు మేళ్ళు నొకటిపై నొకటిగాఁ జెప్పుచున్నారు

రతిర్మతి సరస్వతీ ధృతి సమృద్ధి సిద్ధి శ్రియః
సుధాసఖి! యతోముఖం విచలిషేత్ తవ భ్రూలతా ।
తతోముఖ మథేన్దిరే! బహుముఖీ మహం పూర్వికాం
విగాహ్య చ వశంవదాః పరివహన్తి కూలఙ్కషాః ॥ ౧౭ ॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| సుధాసఖి! | అమృతమునకుం దోఁబుట్టువైన | ధృతి | ధైర్యమును |
| ఇన్దిరే! | ఓ లక్ష్మీ! | సమృద్ధి | సమృద్ధియు |
| తవ | నీయొక్క | సిద్ధి | కార్యసిద్ధియు |
| భ్రూలతా | లతను బోలిన కను బొమలు | శ్రియః | ఐశ్వర్యమును |
| యతోముఖం | ఎవరి నుద్దేశించి | బహుముఖీం | అనేక ప్రకారములుగ |
| విచలిషేత్ | చలింప నిష్టపడునో | అహం— పూర్వికాం | నేను ముందు, నేను ముందను తలంపును |
| తతోముఖం | వారి నుద్దేశించి | విగాహ్య | పొంది |
| రతిః | ప్రీతియు | వశంవదాః | లోఁబడియుండునట్లును |
| మతి | జ్ఞానమును | కూలఙ్కషాశ్చ | కట్టుదాఁటి పారలునట్లును |
| సరస్వతీ | విద్యయు | అథ | సంపూర్ణముగ |
| | | పరివహన్తి | ప్రవహించుచున్నవి |

శ్రీదేవి యెవరిని గటాక్షింపఁగోరునో యతనిని ప్రీతి, జ్ఞానము మొదలగునవి యన్నియుఁ దమంతట తామే మితిమీఱి వచ్చి చేరుననుట

దీనివలె రామానుజ నూత్తందాదిలో "పొరునియ శేషం పొఱైయుమ్ తిఱలుం ......శేర మెజ్ఞ శ్రీరామానుజనై యడైబవర్కే" అని యనుగ్రహింపం బడుటను లక్షింపుఁడు.

"యస్యాం యస్యాం దిశి విహరతే దేవి! దృష్టిస్త్వదీయా, తస్యాం తస్యా మహమహమికాం తన్వతే సంపదోఘాః" (ఓ దేవీ! ఏ యే దిశలలో నీ దృష్టి విహరించుచున్నదో, ఆయా దిశలలో నైశ్వర్య ప్రవాహములు పందెము వేసికొని చేరు చున్నవి) అని వేదాంతదేశికులును వచించిరి.

లోకము నుజ్జీవింపఁ జేయుటచేతను, భోగ్యమగుటచేతను "సుధాసఖి" యని సంబోధించిరి అమృతమునందు సారముగ నుద్భవించినది గదా లక్ష్మీ!

"యతోముఖం" అనుటచేత శ్రీదేవి కటాక్షమునకు వీరు వారను నియమము లేదని తోఁచుచున్నది

విచలిషేత్ తవ భ్రూలతా — శ్రీదేవికోరిక యామె భ్రూరేఖలయందారోపింపఁబడినది ఇష్టపడునపుడే యివ్విధమునఁ బ్రవహించుచుండఁ దిన్నఁగాఁ జూచినచో నవి యెట్లగునో!

అహంపూర్వికాం విగాహ్య — నేను ముందు, నేను ముందని పందెము వేసికొని రత్యాదులు ప్రవహించుచున్నవి — యని యనఁబడినదయ్యెను శ్రీదేవి

కటాక్షముచేత నేవి రావో యని మంచివిగావు కనుక "నేను మంచి కావలయును, నేను మంచి గావలయు" నని తమలో తాము పోటీ వేసికొని ప్రవహించుచున్నవని యొఱుఁగునది మేలు (మంచిది) ఒకటైనను నది ప్రవహించు ప్రకారము లనేకము లనుచు "బహుముఖీం" అనిరి మితిమీఱిన ప్రవాహ మగుటచేత కట్టలను మీఱి పొరలు ననిరి అయినను, కీడు వాటిల్లదని తెలుపుటకై లోఁబడునవి (వశంవదాః) యని వచించిరి

పరివహన్తి — నాల్గు వైపులను ప్రవహించుచున్నవనుట శ్రీదేవి యొవరిని గటాక్షింపఁ గోరునో వారి సంబంధ సంబంధికులను గూడ నీ మేళ్లు వచ్చి చేరునని తాత్పర్యము ఇఁక, "పరివహన్తి" యనుదానికి కలుజు ప్రవాహమని యర్థము చేసికొని, చెఱువు నిండఁగనే కలుఁజు వెంబడి ప్రవహించునట్లు, శ్రీదేవి భ్రూలతా చలనమునకుఁ బాత్రుఁడైనవానిని మేళ్లన్నియుఁ జేరి యతనిని నిండించి తరువాత నతని చుట్టును నివి పొరలుచున్నవని విశేషార్థమును చెప్పుదురు

ఇందులో రతి, మతి మొదలైనవన్నియు స్త్రీలింగములుగా నుండుటంజేసి శ్రీదేవి భ్రూచలనము ననుసరించి పనిచేయు పనికత్తెలని దోఁచు చమత్కారము' నెఱిఁగి సంతసించునది

కొందఱిట్లు అర్థము చెప్పెదరు — రతి=భక్తి, మతి=జ్ఞానము, సరస్వతి=ఈ రెండింటిని గుఱించిన వాక్కు, ధృతి=ఆనందము, సమృద్ధి=కైంకర్య సమృద్ధి, సిద్ధి=స్వరూప లాభము, శ్రీ=దాని కనుకూలమైన యైశ్వర్యము

అథ—సంపూర్ణముగ, "ప్రశ్న కార్త్స్న్యయో రథో అథ" అని యమరము కొందఱు "అథ" అనుదానికి తర్వాత అని యర్థముఁ గావించి, చిచలిషేత్-చలించుట కిష్టపడునో, అథ-తర్వాత అని వ్యాఖ్యానింతురు

నిన్బరు వజ్ఞ శార్ మేల్ నెళిన్దిడ విరుమ్బ మాజ్గే
అన్బుటి వాక్కుమ్ దీరమ్ అరుజ్గలై శెక్రిప్పు సిద్ధి
ఎన్బన పలవా ఉజ్గుమ్ ఇరుగరై మోకుమ్ శెల్వి!
ఇన్బుము దనైయాయ్! ముద్ది ముద్దియె న్త్రెయ్కు మాటే. (17)

ఓ ఈశ్వరీ! అమృత సఖీ! నీ భ్రూలత లెవరి నుద్దేశించి చలింపఁ గోరునో, వారిని ప్రీతి, జ్ఞానము, ఐశ్వర్యాది సమృద్ధి, కార్యసిద్ధు లనేక ప్రకారములుగా నొకొక్కటియు తానే ముందని పోటీ వేసికొనుచు చేర నది కిరువైపుల గట్లుల నొఱసికొనునట్లు ప్రవహించును (17)

అవతారిక — లోకమునందుండు సకల వస్తువుల యొత్కృష్టాపకర్షములు శ్రీదేవి కటాక్ష లబ్ధిచేతను, లేమిచేతను గలుగునని నుడువుచున్నారు

సహ స్థిర పరిత్రస వ్రజ విరిఞ్చనాకిఞ్చనై
రనోకహ బృహస్పతి ప్రబల విక్లబ ప్రక్రియమ్
ఇదం సదసదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతం
కటాక్షతదుపేక్షయో స్తవ హి లక్ష్మి! తత్తాణ్డవమ్॥ ॥౧౮॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| లక్ష్మి! | ఓ లక్ష్మి! | నిఖిలమేవ | అంతయును |
| స్థిరపరిత్రస | స్థావర జంగమముల యొక్క | సత్, అసత్ | మేలు, కీడునను |
| | | ఆత్మనా | రూపము చేత |
| వ్రజ | సముదాయము, | నిమ్నోన్నతం | మిట్ట పల్లములుగా నుండుననుట |
| విరిఞ్చన- | బ్రహ్మదేవుఁడు | | |
| అకిఞ్చనైస్సహ | ఏమియును లేనివాఁడు అను వీరితోఁగూడ | యత్ | ఏది కలదో |
| | | తత్ | అది |
| అనోకహ | చెట్టు | తవ | నీయొక్క |
| బృహస్పతి | గురువు | కటాక్ష | చూచుట |
| ప్రబల | బలిష్ఠుఁడు | తదుపేక్షయోః | చూడక పోవుట అను నీరెండింటి యొక్క |
| విక్లబ | దుర్బలుఁడు అను వీరి | | |
| ప్రక్రియం | ప్రకారము గలదియైన | | |
| ఇదం | ఈ ప్రపంచము | తాణ్డవం హి | నాట్యము కదా! |

శ్రీదేవి కటాక్షించుటచేత మేలైన వస్తువులును, కటాక్షింపక పోవుటచేతఁ గీడైన వస్తువులును గలుగు ననుట.

బ్రహ్మదేవుని జెప్పు "విరిఞ్చన" యను పదము "అకిఞ్చన" యను పదమునకు వ్యతిరేకముగా వచ్చినందున ఐశ్వర్య పరాకాష్ఠను జూపుచున్నది ఇట్లే "బృహస్పతి" యను పదము జ్ఞాన పరమావధిని జూపుచున్నది

సభలో గ్రంథము చదువలేని వానిని "చెట్టనిరి "లోకే వనస్పతి (చెట్లు) బృహస్పతి తారతమ్యమ్" అని ఈగ్రంథకర్త తండ్రియు నిట్లే విభజించి యుండుటను జూడుఁడు

సత్, అసత్ అనువానికి "చేతనము, అచేతనము" అనియు "నిత్యము, అనిత్యము" అనియు ననేక విధములుగా నర్థము చెప్పుదురు.

నిఖిలమేవ — ఏవకారము "దీనిలో నిమిడియుండని దేదియును లే"దనుటను జూపుచున్నది.

"తత్" అనుదాని కనుగుణముగ "యత్" అను పదము తెచ్చి పెట్టుకొనఁ బడినది

ఈ నిమ్నోన్నతము లన్నియు లీలయే యని తోఁచునట్లుగా "తాణ్డవం" అనిరి

ఇఁక, "సహ" అను పదమును విభజించి యవ్యయముగాఁ దీసికొనక సమాసములోఁ జేర్చియే యర్థము చెప్పినవారును కొందఱు గలరు "సహతే ఇతి సహః" అను వ్యుత్పత్తిఁజేసి "సహ" అనుటకు సహించు వస్తువనియు, "స్థిర" అనుదానికి స్థాయిగా నుండు వస్తువనియు, "పరిత్రస" యను పదమునకు భయపడు వస్తువనియు, "వ్రజ" అనుదానికి నాశమగు వస్తువనియు వ్యాఖ్యానించి, "సహ" అనుదానికి వ్యతిరేక పదము "పరిత్రస" యనియు, "స్థిర" యను దానికి వ్యతిరేక పదము "వ్రజ" అనియు వారు చూపిరి

పెయర్వన పెయర్ గిలాద పిరమనే శెల్వమిల్లాన్
ఉయర్ గురు మరనే మఱ్ఱుమ్ ఉఱుబల ముఱ్ఱోరఱ్ఱోర్
ఉయర్వన తాఴ్వ యావుమ్ నల్లతీ యననా యున్గణ్
అయర్విని నరుళ్ళిన్ నోక్క త్తాడు తాణ్డవ మణఙ్గే! (18)

ఓ లక్ష్మీ! జంగమములు, స్థావరంబులు, సర్వైశ్వర్యము గల బ్రహ్మదేవుఁడు నిర్ధనుఁడు, ఉత్కృష్ట జ్ఞానవంతుఁడైన బృహస్పతి, చెట్టువలె జ్ఞాన హీనుఁడు, బలిష్ఠుఁడు, దుర్బలుఁడు, మంచితనము చేత నుత్కృష్టములైన వస్తువులు, చెడ్డతనము చేత నపకృష్టములైన వస్తువులు నివి యన్నియు నీ నేత్రోన్మేష నిమేషములను నీ కన్నుదెఱచుట, మూయుట యను లీలయొక్క నర్తనము చేతనే కలుగుచున్నవి.

అవతారిక — ఇట్లు "జగత్ సమస్తం యదపాఙ్గ సంశ్రయమ్" అనినట్లు ప్రపంచము శ్రీదేవీ కటాక్షాధీనమని చెప్పుట పొసఁగునా? అది భగవదధీనము గదా! యనినచో లోక మీమె లీలకొఱకే భగవంతునిచే సృజింపఁబడినది. కనుక అది యీమె కటాక్షాధీనమే యను భావము గలవారై శ్రీదేవి లీలా విలాసార్థమే భగవంతుఁ డీ లోకమును సృజించె ననుచున్నారు

కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్య మాలిఙ్గతోః
భూతాహఙ్కృతి బుద్ధి పఞ్చకరణీ స్వాన్త ప్రవృత్తీన్ద్రియైః ।
అణ్డానా వరణైః సహాస్రమకరోత్ తాన్ భూర్భువ స్స్వర్వతః
శ్రీరఙ్గేశ్వర దేవి! తే విహృతయే సఙ్కల్పమానః ప్రియః॥ ॥౧౯॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గేశ్వరదేవి! | ఓ రంగనాథుని దేవి! | అహఙ్కృతి | అహంకార తత్త్వము |
| కాలే | సృష్టికిఁ బూర్వకాలము | బుద్ధి | మహత్ తత్త్వము |
| యోగ్యతాం | సృష్టికి అర్హతను | పఞ్చకరణీ | పంచ జ్ఞానేంద్రియములు |
| శంసతి | తెలియఁజేయుచుండఁగా | స్వాన్త | మనస్సు |
| చిత్ - | జీవ తత్త్వమును, | ప్రవృత్తి | కర్మేంద్రియములు |
| అచితోః | ప్రకృతి తత్త్వమును | ఇన్ద్రియైః | అను వీనితో |
| అన్యోఽన్యం | ఒకటితో నొకటి | ఆవరణైః | ఏడావరణములతో |
| ఆలిఙ్గతోః | కలసి యుండునపుడు | తాః | ప్రసిద్ధములైన |
| ప్రియః | నీ ప్రియుఁడు | భూర్భువః | భూలోకము, భువర్లో |
| సఙ్కల్పమానః | పుట్టించునట్లు సంకల్పించుకొని | స్వర్వతీః | కము, స్వర్లోకము వీనిని కలిగినట్టి |
| తే | నీయొక్క | సహస్రం | అనేకములగు |
| విహృతయే | లీలకొఱకు | అణ్డాః | అండములను |
| భూత | పంచ భూతములు | ఆకరోత్ | నిర్మించెను. |

రాజొకఁడు రాజభవనములను, ప్రాకారములను నిర్మించి తన భార్యను ఆనందింపఁ జేయునట్లు, శ్రీరంగనాథుఁడు ఈ యండములను, నావరణములను నిర్మించి శ్రీరంగనాయకని రంజిల్లఁ జేయుచున్నాఁ డనుట

కాలే శంసతి యోగ్యతాం —సృష్టికిఁ బూర్వకాలము సృష్టి కిదియే తగిన సమయ మని బోధించునపుఁ డనుట పక్వకాలము వచ్చినపు డని తాత్పర్యము.

సంహారకాలమందు ఆత్మవర్గములు ప్రకృతిలో లీనములై యుండుటఁజేసి "చిదచితోః ఆలిఙ్గతోః" అనిరి సృష్టికి ముందు ఆత్మలు తమ చైతన్యము ప్రకాశింపక రెక్కలు తెగిన పక్షులవలెఁ బ్రకృతిలోఁ లీనములై యుండునని శాస్త్రములు తెలుపును

ప్రకృతి తత్త్వము తాను కాక 23 తత్త్వములుగా మార్పుఁ జెందుచున్నది. మార్పుఁజెందు నా తత్త్వములును "భూతాహఙ్కృతి.........ఇన్ద్రియైః" అని నిర్దేశించినారు ప్రకృతి పరిణమించు విధమిది —సత్త్వము, రజస్సు, తమస్సు అని మూఁడు గుణములు గల ప్రకృతి తత్త్వము ఈ గుణములు హెచ్చు తక్కువ (విషమము) లగునపుడు పరిణమింపఁ దొడఁగును మొదటి మార్పు "మహాన్" అను తత్త్వమగును ప్రకృతియందలి త్రిగుణానుగుణంబుగ మహాతత్త్వము

మూఁడు తెఱంగులగును ఆ మహత్తత్త్వమునుండి యహంకార తత్త్వముద్భవించు చున్నది ఇదియు మూఁడుగుణముల ననుసరించి త్రివిధములగును. వానికి వరుసగా వైకారికము, తైజసము, భూతాది యని పేర్లు సాత్త్వికమైన వైకారికమునుండి వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థములను పంచకర్మేంద్రియములును, చెవి, త్వక్కు (చర్మము), కన్ను, నాలుక, నాసిక యను పంచ జ్ఞానేంద్రియములును, మనస్సును మొత్తముమీఁదఁ బదునొక్క యింద్రియము లుద్భవించుచున్నవి తామసాహంకారమైన భూతాదినుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి యను పంచ భూతములును, వాని మాత్రలును గలుగుచున్నవి "మాత్ర" యనఁగా భూతాదుల సూక్ష్మదశ రాజసాహంకారమైన తైజస మింద్రియములు, భూతములు పుట్టుటకు సహకార మొనర్చుచున్నది ఇట్లు ప్రకృతి, మహత్తు, అహంకారము 11 ఇంద్రియములు, 5 తన్మాత్రలు, 5 భూతము లని తత్త్వములు 24 అగుచున్నవి

ఈ శ్లోకమునందుఁ దన్మాత్రలు మాత్రము చెప్పఁబడలేదు తక్కిన 19 తత్త్వములును జెప్పఁబడినవి భూతముల సూక్ష్మాంశములైన తన్మాత్రలను భూతములలోనే చేర్పవచ్చునని యీ గ్రంథకర్త యాశయము గాఁబోలు! ఆవిధముగానే కొందఱు వ్యాఖ్యానించిరి

కొందఱు తన్మాత్రలను జేర్పక శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను పంచ విషయములను జేర్చి 24 తత్త్వములను లెక్కచేయుదురు "ప్రాజ్ఞైమ్బులనుమ్ పొఱి యైన్దుమ్ కరుమేన్దిరియ మైమ్బూదమ్ ఇఙ్గివ్వుయిరేయ్ పిరకిరుతి మానాఙ్కారమన ఙ్గళే" యని నమ్మాళ్వార్లీ విధముననే గణించియుండుటను గమనింపుఁడు

దీని ననుసరించియే యీ గ్రంథకర్తయు తన్మాత్రను విడిచిపెట్టెరనుటయు నగును శబ్దాది విషయముల నిచ్చట చెప్పక వదలిపెట్టుట పై శ్లోకములో విశేషించి చెప్పుటకొఱకే

అధ్యవసాయమును బుట్టించుటఁ బట్టి మహత్తత్త్వమును బుద్ధి యనిరి. బుద్ధి - అధ్యవసాయము ఔపచారిక ప్రయోగము "మహాన్ వై బుద్ధిలక్షణః" అనునదియు గుర్తింపఁదగును

<u>వక్ష్యత్కరణీ</u>—కరణమ్-ఇంద్రియము పై కర్మేంద్రియములు చెప్పఁబడినవి, గనుక నిచ్చట జ్ఞానేంద్రియము లని భావింపవలయును

ఈ తత్త్వములచేతఁ బదునాలుగు లోకములతోఁ జేరినవిగను, ఒక్కొటికంటె మఱియొకటి పది మడంగులు పెద్దదియై యుండు ఏడావరణములచేతఁ జుట్టఁబడి యుండునవిగను అనేక బ్రహ్మాండములను భగవంతుఁడు సృజించెను

<u>భూర్భువస్స్వర్లోకాః</u> —"భూర్భువః" యను వేదవాక్యము ననుసరించినది ఇది యన్ని లోకములకు నుపలక్షణము

భువర్లోకము భూలోకమునకుఁ బైగాను, సూర్యమండలమునకుఁ గ్రిందుగను నొక లక్ష యోజనముల యెత్తు గలిగి గంధర్వులు మొదలగువారు వసించు ప్రదేశము

స్వర్లోకము, సూర్యమండలమునకు పైగాను, ధ్రువ నక్షత్రమునకుఁ గ్రిందుగను, పదునాలుగువేల యోజనముల యెత్తు గలిగి యధికార పురుషులైన గ్రహములును, నక్షత్రములును నుండు ప్రదేశము

ఆవరణముల సంఖ్య నిర్దేశింపఁబడక యున్నను, ఇతర ప్రమాణములచేత నే దని గ్రహింపఁబడినది అండమునకంటెఁ బదిరెట్లు పెద్దదైన జలతత్త్వము దానిని జుట్టుకొనియున్నది ఇట్లే వరుసగాఁ బదిరెట్లు పెద్దవైన అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తమను ప్రకృతి అనునవి యావరణములై చుట్టుకొని యున్నవి విష్ణుపురాణము లోనగు గ్రంథములలో నీ విషయము విస్తరముగఁ జూడనగును.

ఇట్టి యండము లసంఖ్యాకములని యెంచి "సహస్రం" అని చెప్పిరి "అణ్డానాన్తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ" అనునది చూడుఁడు

లీలా నిమిత్త మండములు సృజింపఁబడినవనఁగా, అండములు లాటలాడుకొనుట కుపకరణము లైనవని యనఁబడినదయ్యెను మూఁడు గుణములతోఁ గూడిన యీ యండములు తెలుపు, ఎఱుపు, నలుపు వర్ణములుగల దారములచేతఁ జేయఁబడిన బంతివలె నాటలాడుకొను వస్తువగునని నుడివెదరు వేదాంత దేశికులు తమ శ్రీస్తుతిలో నండములను నెత్తపుఁ బలకగాను, *(Chess Board)* బ్రహ్మాదులను పాచికలుగను వర్ణించిరి

లీలా ప్రయోజనములకొఱకే యీ విధముగ లోకములను నిర్మించినది నీవు ఆటలాడు స్వభావము కలదియై శిరస్సున నెత్తిపెట్టుకొని కొనియాడునంతటి వాల్లభ్యముతో నుండుటం బట్టి యని "దేవి" యని సంబోధించిరి

ఇట్లు సృజించినది సంకల్పమాత్రము చేతనే! అది భగవంతునకుఁ బ్రయాసము గాదనుచు "సఙ్కల్పమానః" అనిరి "తదైక్షత బహుస్స్యాం ప్రజాయేయ" అనేకములుగా నయ్యెద (వు) అని యది (బ్రహ్మ) సంకల్పించె ననుశ్రుతి ననుసరించి యిట్లు చెప్పిరి "మనసైవ జగత్సృష్టిం" అనియు "నినైన్ద ఎల్లా ప్పొరుళ్ కట్కుమ్ విత్తాయ్ ముదలిల్చ్చిదైయామే, మనత్తాయ్ జ్ఞానత్తుక్కే పెరుమై" అనియు పెద్దలు వచించినది చూడుఁడు.

శ్రమ లేక సంకల్పమాత్రముచేతనే సృజించుటచేత వేలకొలఁది యండములను భగవంతుఁ డేకకాలమునందే సృజించునని గ్రహింపుఁడు

విస్తరముగఁ జెప్పఁబడు శాస్త్రార్థములను సంగ్రహించి చెప్పు నీ శ్లోకము హృదయంగమమై విశదీకరించు సొంపు కాన్పఁ యనీయమే!

కలన్దవుయిర్ శడప్పొరుళ్ యాక్క క్కాలమ్
కణ్ణఙ్గళ్ ఐమ్బూత మానా ఙ్గారమ్
పుల నుళ్ళమ్ కన్మేన్ది రియఙ్గ ళాలే
భూర్భువ-చ్చువర్లోక ముడైయ వణ్డమ్
పలవాయి రఙ్గళ్ మది ళ్ళైనోడుమ్
పడైత్తననా ల్ఫజ్కెప్పి త్తునదు కేళ్వాన్
ఇలఙ్గుతిరు వరఙ్గనగర్ క్కోనై వన్దేవి!
ఇన్బుఱ్ఱు నీవిళై యాట్టయర్వ దఱ్కే. (19)

ఓ దేవీ! ఆత్మవర్గము, అచేతనమైన ప్రకృతియు రెండును గలిసియుండఁగా సృజించుటకుఁ దగిన కాలము వచ్చినపుడు పంచ భూతములు, మహత్తు, అహంకారము, మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అను వీని చేత భూర్భువస్సువర్లోకములు గల యసంఖ్యాకములైన యండముల నే డావరణములతోఁ గూడఁ దన సంకల్పమాత్రముచేత నీవు హృదయానందంబుగా నాటలాడుకొనుటకై నీ వల్లభుఁడైన శ్రీరంగనాథుఁడు సృజించెను (19)



అవతారిక — ఈ ప్రకృతిచేతనే చేతనులకు వ్యామోహము గలిగించి భగవంతుఁడు శ్రీదేవికిఁ బరిహాసరసమును గలిగించుచున్నాఁడని చెప్పుచున్నారు.

శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం
వైష్ణవ్యా గుణమాయయాత్మ నివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్।
పుంసా పణ్యవధూవిడమ్బవపుషా ధూర్తానివాయాసయన్
శ్రీరఙ్గేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే॥ ॥౨౦॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గేశ్వరి! | ఓ శ్రీరంగనాయకీ! | ఆత్మనివహాన్ | ఆత్మవర్గములను |
| పూర్వః | ఆదిపూరుషుఁడైన | విప్లావ్య | వ్యామోహపఱచి |
| పుమాన్ | రంగనాథుఁడు | పణ్యవధూ | భోగపు స్త్రీని |
| దాస్యాత్మకం | దాస్యరూపమైన | విడమ్బ్య | పోలిన |
| విభవం | ఐశ్వర్యమును | వపుషా | వేషము ధరించిన |
| విస్మార్య | మఱపించి | పుంసా | పురుషుని చేత |
| శబ్దాదీన్ | శబ్దము మొదలుగాఁగల | ధూర్తానివ | కాముక పురుషులనువలె |
| విషయాన్ | విషయములను | ఆయాసయన్ | ఖేదపఱచుచు |
| ప్రదర్శ్య | చూపించి [ముగల | తవ | నీయొక్క |
| వైష్ణవ్యా | విష్ణువైన తనకు సంబంధ | పరీహాసాత్మనే | పరిహాస రూపమైన |
| గుణమాయయా | త్రిగుణయుక్తమైన | కేళయే | ఆటకొఱకు [న్నాఁడు |
| | ప్రకృతిచేత | కల్పతే | కల్పించి సమర్థుఁడగుచు |

<u>శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య</u> — చెవి మొదలగు నింద్రియములచేత గ్రహింపఁబడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు శబ్దాది విషయములనఁబడును

శబ్దాది విషయములే భగవంతు నొద్దకుఁ బోనీయక తమయందే మునిఁగి పోవునట్లు చేసి జీవులనుఁ జెఱచుచున్నవి "తప్పెట" యను వాద్యము తన కఠోర ధ్వనిని వినినతోడనే "అసుణ" యను పక్షిని నశింపఁజేయునట్లు ఈ శబ్దాది విషయములు చూచినతోడనే యాత్మవర్గములను నశింపఁ జేయును గనుక "అనుభవింపఁజేసి" యనక "చూపించి" (ప్రదర్శ్య) యనిరి ఇందుచేత వీని క్రూరత్వము వ్యక్తపఱుపఁబడినది. "పల నీ కాట్టి ప్పడుప్పాయో" అని స్వామి నమ్మాళ్వార్లనుగ్రహించిరి

<u>విభవం విస్మార్య దాస్యాత్మకం</u> —ఈ యాత్మకు నిజమైన యైశ్వర్యము దాస్యమే కనుక "దాస్యరూపమైన యైశ్వర్యము" (దాస్యాత్మకం విభవం) అనిరి. "కైంకర్య ధనినః" (దాస్య ధనికులు) అనునదియు గమనింపుఁడు

ఎల్లప్పుడు నీ యాత్మకు నీ దాస్యైశ్వర్యము సహజ ప్రాప్తమే అట్టి దాని నెప్పుడును నితనినుండి పోఁగొట్టుటకు వలను కాదు కనుక "పోఁగొట్టి" అని చెప్పక "మఱపించి" (విస్మార్య) యనిరి ఐశ్వర్యమున్నను దానిని మఱచిపోయిన యెడల ప్రయోజనమేమి? "ఆవిస్స్యాన్మమ సహజ కైఙ్కర్య విధయః" (స్వాభావికములైన కైంకర్య కృత్యములు నాకుఁ దోఁచును గాక) యని అష్టశ్లోకిలో నీ గ్రంథకర్తయే చెప్పియున్నారు, పుట్టునుగాక యని చెప్పమి గమనింపఁ దగినది

శబ్దాది విషయములను జూపి, దాస్యైశ్వర్యమును మఱపించి యను పాఠము ఉండినను, అర్థగౌరవము నుద్దేశించి దాస్యైశ్వర్యమును మఱపించి యను దానిని మొదటఁ బెట్టి వ్యాఖ్యానించితిమి ఆత్మ తన భగవద్దాస్యము నెఱుంగమిచే వ్యామోహమునకుఁ బ్రథమ హేతువని యెఱుఁగునది శబ్దాది విషయములందలి యాసక్తి యట్టి యజ్ఞానమును బలపఱుచుచున్నది కనుక దాస్యైశ్వర్యమును మఱపించి, దానిని బలపఱుచు శబ్దాది విషయములందలి యాసక్తిని పుట్టించి జీవులను భగవంతుఁడు వ్యామోహింపఁ జేయుచున్నాఁడని చెప్పఁబడినదయ్యెను

ఇఁకఁ దెలిసిన విషయమునకుఁ గదా విస్మృతి! అనాది కాలముగఁ దెలియఁబడని దాస్య విషయమున మఱపించునట్లు చెప్పుట యెట్లు పొసఁగును?—అనిన నోఁ జెప్పెదము దాస్యము స్వాభావికము గనుకఁ గ్రొత్తగాఁ దెలిసికొనఁ బడినదాని వలెఁ గాక, మఱచినదానిని మఱల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటవలె తోఁచుచున్నందున, మొదటఁ దెలిసియుండిన దాస్యము మఱచిపోవుటే గాని, తెలియక యుండినది లే దని తలంచి ఇట్లు నుడివిరి "మఱన్దే నున్నై మున్నమ్" అన్నట్లుగా దీని నర్థము చేసికొనఁదగును

వైష్ణవ్యా గుణమాయయా —"తనమాయచేత" అని చెప్పక వైష్ణవ మాయ చేత అని చెప్పుట, మాయ భగవంతునకు విశేషణంబై యతనికి సర్వదా లోఁబడి యుండుట తెలియుటకయి యని యెఱుఁగునది

మాయ జీవరాసులను మోహింపఁజేయు విధమును దెలియఁ జేయుటకై "గుణమాయ" అనుట సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడు గుణంబులు వరుసగా ననర్థమునందు పర్యవసించు నల్పసుఖమును గోరునట్లు చేసియు, అయథార్థ జ్ఞానమును బుట్టించియు, విపరీత జ్ఞానమును బుట్టించియు, బుద్ధిని మోహింపఁ జేయును "గుణమయీ మమమాయా" యని గీతయు, "గుణమాయా సమావృతః" యని జితంతే స్తోత్రమును వక్కాణించుచున్నది

మాయ యను పదము అచ్చెరువును గలిగించు వస్తువును దెలియఁజేయును అట్టి గుణము కలది గనుకఁ బ్రకృతి మాయ యనఁబడును. "మాయ ప్రకృతి, మాయగలవాఁడు మహేశ్వరుఁ"డని శ్రుతివాక్య మున్నది.

ఆత్మనివహాన్........పుమాన్— "త్రిభిర్గుణమయైర్భావై రేభి స్సర్వమిదం జగత్, మోహితం" అన్నట్లు బ్రహ్మ మొదలుకొని సర్వ ప్రాణికోటియు మోహము చెందును గనుక "ప్రాణి రాసులను వ్యామోహపఱచి" (ఆత్మనివహాన్ విప్లావ్య) యన్నారు "బ్రహ్మాద్యా స్సకలా దేవా మనుష్యాః పశవ స్తథా। విష్ణుమాయా మహావర్త మోహాన్ధ తమసావృతాః॥" (బ్రహ్మ మొదలగు సమస్త దేవతలు, మనుష్యులు, మృగములు విష్ణుమాయ యను గొప్ప సుడిచేతఁ గలిగిన మోహమను పెనుఁజీఁకటిచేతఁ జుట్టఁబడి యున్నారు) అని విష్ణుపురాణము వచించుచున్నది

బ్రహ్మాదులవలెఁగాక మాయను దన వశమునం దుంచుకొని యుండుటచేతఁ బుట్టని పురుషుఁడను నర్థమునకై "పూర్వః పుమాన్" అనిరి అనాది పురుషుఁడనుట

స్వామి నమ్మాళ్వార్లీ విధముగనే తన్ను భగవంతుఁడు మోహింపఁ జేసెనని అనుగ్రహించిరి "కూడు శా నటియావగై చ్చ్వుప్పొన్ గ్రియారై వరై క్కోట్టి యున్నడి పోప్పిదునా నణుగా వగై శెయ్దు పోదిక్కణ్డాయ్" అను శ్రీసూక్తిని లక్షింపుఁడు

<u>పుంసా పణ్యవధూ. ఆయాసయన్</u> — భోగపు స్త్రీ వేషమును ధరించిన పురుషుఁడు ధూర్తులను వంచించు విధమున భగవంతుఁడు చేతనులను వంచించుచున్నాఁడు అనుభవ యోగ్యత లేకున్నను ఆ వేషమును జూచి, పురుషుని స్త్రీయని యెంచి, ధూర్తులు మోహించునట్లు చేతనులును విషయముల యందు లేని భోగ్యత నున్నట్లెంచి మోహింతురు "పురుషుఁడు స్త్రీ వేషమును ధరించిన పురుషుని స్త్రీయని ఆ వ్యక్తి ననుసరించి వెనుకఁ బోవుటంబోలె శబ్దాది విషయములలో భోగ్యతా బుద్ధిచేత వానియందు నాశగొనుట యున్నది [ఆణ్ పిళ్ళైవేచ్చాళ్వియై (స్త్రీవేషం కొణ్డ పురుషనై స్త్రీ యెన్రు పిన్ తొడరు మాప్పోలే యిరుప్ప దొన్రిరే శబ్దాది విషయఙ్గళిలే భోగ్యతా బుద్ధి పణ్ణి ప్పిన్ తొడరుదైయాగిఱవిదు] యని పెరియవాచ్చాన్ పిళ్ళై పెరియ తిరుమొళి (1—8—1) వ్యాఖ్యానములో నీ గ్రంథకర్త ననుసరించి వ్రాసియున్నారు.

ధూర్తుని లక్షణము —'క్లిశ్నాతి నిత్యం దయితా మజ్ఞ-స్థామతి సుందరః। అఇచ్ఛత్యరక్తాం యత్నేన రక్తాం ధూర్తో విముఞ్చతిః" అని తన్ను కామించు స్త్రీని త్యజించి, తన్నుఁ గామింపని స్త్రీల నాదరించువాఁడు ధూర్తుఁడు

"పూర్వః పుమాన్" అనుదానికి నాటకములోఁ బ్రధాన పురుషుఁడని యర్థము చేసి యుపమానమును గొందఱు వివరించెదరు సూత్రధారుఁడు ఎఱుపు మున్నగు వన్నెలు గల తెఱను (గుణమాయను) వేసి స్త్రీ వేషము ధరించిన పురుష పాత్రలచేత మధురమైన శబ్దము (సంగీతము) లోనగు వానిని బ్రదర్శించి యైశ్వర్యమును మఱపించి (అనఁగా ధనమును అలక్ష్యముగా వ్యయపఱపించి) వంచించి ధూర్తుల నాయాసపఱచి పరిహాసము గలిగించును. ప్రేక్షకులకు సూత్రధారుఁడు హాస్య రసమును గలుగఁజేయునట్లు భగవంతుఁడు లక్ష్మీదేవికి హాస్య రసముఁ గలిగించుచున్నాఁడని భావము

ప్రతాపరుద్రీయ మను గ్రంథములో హాస్య రసమున కివ్విధముగానే ఉదాహరణము వర్ణింపఁబడి యుండుట తెలియఁదగును "విరోధి రాజులు కృత్రిమ స్త్రీ వేషమును ధరించి రాత్రులలో నంగడి వీధులలో సంచరించుచుండఁగా

ధూర్తులు వారిని వెంబడించి వారిని బట్టుకొని వారివేషమును లాగి, వారు స్త్రీలు కారని తెలిసికొని, అయ్యో! కష్టము! ఎంత పొరపాటు చేసితిమి? అని వారిని విడిచి పెట్టుదురు" ఇట్టు లా గ్రంథములో రసప్రకరణమున వర్ణింపఁబడి యున్నది

భగవంతుఁడు తనయందు లేశమైన నాసక్తి లేనివారి కీ విధముగ అన్యవస్తువులలో నాసక్తిఁ గలుగఁజేసి శ్రీదేవికి హాస్యరసము పుట్టునట్లుగా నాటలాడుచున్నాఁడని యీ శ్లోక భావము

అందఱి నాదరించు దయాసింధువైన భగవంతుఁడు జీవరాసులు తనయందుండి వేఱుపడి, దుఃఖించునట్లు చేసి లీలా వినోదము సలుపుట తగునా? అన్నచో భగవంతుఁడు తన్ను ఆశ్రయించి పొందుట కనియే జీవరాసుల కన్నిటికిని సామాన్యముగ శరీరమును, బుద్ధిని ప్రసాదించి యున్నను, వానిని కేవలము విరుద్ధముగఁ దన్ను జేరక వేఱుపడుటకుఁగాను ఉపయోగపడి తాను రక్షింపఁ బూనుకొనినను తిరస్కరించుచున్నట్టి వారి స్థితిని జూచి హాస్యరసముతో వినోదముగా నాటలాడునట్లు సంభవించున దనుట

"కొడుత్త చైతన్యన్దాన్ పొదువాయ్ రుచి భేదత్తాలే వ్యావిలజ్గిప్పోయ్ అనర్థత్తై విళైవిత్తుక్కొణ్డిరుక్కుఅబడియైక్కణ్డు, 'నామొన్ఱై నినైత్తు చ్చెయ్య ఇవై యొన్ఱై చ్చెయ్ దుక్కొణ్డబడి కణ్డాయే' ఎన్ఱు పిరాట్టి ముఖత్తై ప్పార్త్తు స్మితమ్ పణ్ణ అదు కోల్ విళ్లుక్కాట్టాలే లీలారసమ యొత్తలెక్కట్టుమ్" (తా నొసంగిన చైతన్యము సామాన్యముగ నుండఁగా రుచిభేదముచేతఁ బెడత్రోవలఁ ద్రొక్కి, జీవులు తమకు అనర్థములు గలిగించుకొనుచుండుటను జూచి మనమొకటి తలంచి చేయ వీరు (జీవులు) వేఱొకదానిని దమ పైకిఁ దెచ్చుకొన్న విధమును జూచితివా? యని భగవంతుఁడు శ్రీదేవి ముఖమును దిలకించి స్మితము సేయఁగా నది యదృచ్ఛగా లీలా రసమై పర్యవసించును) (3—10—7) అను ఈడు వ్యాఖ్యానమును దిలకించి తెలిసికొనుఁడు

పొల్లాద పులనైన్దుమ్ నన్గు కాట్టి
  ప్పొన్నడిమై త్తిఱత్తినై యే మఱక్క చ్చెయ్దు
తొల్లాది పురుడనుయిర్ గళై మయక్కి
  విణ్డుగుణ మాయైయినాల్ పొదువెన్ఱోల్లార్
నల్లార్ పోల్ నయవడివమ్ వ్రూణ్డా ఆణాల్
  నయక్కున్ఱ కాముకరై ప్పోల్ వరుత్తి
వల్లానాయ్ నినదు నగై చ్చువై యొట్టతిల్
  వళరరఙ్గ నాయకియే! విళఙ్గు గిన్ఱాన్ (20)

ఓ రంగనాయకీ! దుష్ట స్వభావము గల శబ్దాది విషయములను బాగుగఁ జూపి, ఉత్కృష్ట దాస్య వృత్తిని మఱపించి, అనాది పురుషుఁడైన విష్ణువు తన త్రిగుణాత్మక మైన మాయ చేత జీవులను వంచించి, వేశ్యావేషమును ధరించిన పురుషుని జూపి, కాముకుల నాయాసపఱచినట్లు ఆయాసపఱచి నీకు హాస్య రసమును గూర్ప సమర్థుఁడగుచున్నాఁడు (20)

---

అవతారిక — లీలా వినోదమున కుపయోగపడునట్టి యీ లీలా విభూతి మాత్రమే కాదు, నిత్యవిభూతియు శ్రీదేవికొఱకే యనుచున్నారు

యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతమ్
యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః ।
సాయుజ్యస్య యదేవ సూతి రథవా యద్దుర్గ్రహం మద్గిరామ్
తద్విష్ణోః పరమం పదం తవకృతే మాత
స్సమామ్నాసిషుః॥ ॥౨౧॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| మాతః | ఓ తల్లీ! | సురపురీ | దేవనగరమైన అమరావతియు |
| యత్ | ఏ ప్రదేశము | | |
| మనసః | మనస్సునకు | దుర్గతిః | నరకమో, |
| దూరే | దూరము గానున్నదో | యదేవ | ఏ ప్రదేశమే |
| | (తలంపనశక్యమైనదో) | సాయుజ్యస్య | మోక్షమునకు |
| యదేవ | ఏ ప్రదేశమే | సూతిః | పుట్టినిల్లో, |
| తమసః | ప్రకృతికి | అథవా | లేదా |
| పారే | వెలుపటిదో | యత్ | ఏ ప్రదేశము |
| యత్ | ఏ ప్రదేశము | మద్గిరాం | నా వాక్కులకు |
| అత్యద్భుతం | మిక్కిలి యాశ్చర్యకరమో, | దుర్గ్రహం | అందదో, |
| | | విష్ణోః | భగవంతునియొక్క |
| యత్ | ఏ ప్రదేశము | తత్ | ఆ |
| కాలాత్ | కాలము చేత | పరమం | ఉత్కృష్టమైన |
| అపచేళిమం | పక్వముఁ జెందదో, | పదం | స్థానమును-వైకుంఠమును |
| యత్ | ఏ ప్రదేశము నుద్దేశించి | తవ కృతే | నీకొఱకే |
| గచ్ఛతః | పోవువానికి | సమామ్నాసిషుః | పఠించిరి |

పరమపదమునకు వేర్వేఱుగ పెక్కు లక్షణములఁ జూపించి, యిట్టి పరమ పదము శ్రీదేవి కనియే యీ శ్లోకములో చెప్పుచున్నారు

ఒక్కొక్కటియుఁ బరమపదమునకు భిన్నభిన్న లక్షణమని తెలియుటకై "యత్" అను పదము ప్రతి వాక్యములోను జెప్పఁబడినది

ఈ గ్రంథకర్త తండ్రిగారు వైకుంఠస్తవమునందుఁ బరమపదమును గుఱించి యనేక శ్లోకము లనుగ్రహించిరి వానిలో ముఖ్యమైనవానిని వీరు క్రోడీకరించి యొక్క శ్లోకములోనే యనుసంధించుచున్నారు,

యద్దూరే మనసః — వాక్కున కందదనుటకు నిది యుపలక్షణము ఏలయన మనస్సుతోఁ గూడ వాక్కును వెనుదిరుగుచున్నదని శ్రుతి చెప్పుచున్నది "శ్రీమద్ వ్యోమ న సీమ వాఙ్మనసయోః" యని వీరే పరమాకాశము అవాఙ్మనస గోచరమని చెప్పినదానిని జూడుఁడు

"వీరి వారి మనస్సునకు" అని చెప్పనందున నతి సూక్ష్మబుద్ధి గల పరమ శివునకును, పూర్ణుఁడైన బ్రహ్మకునుగూడఁ దలఁపను శక్యముగాదని సూచితము "బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే" (బ్రహ్మ లోనగు వారి వాక్కునకును మనస్సునకును విషయము కానిది పరమపదము) అని స్వామి ఎంబెరుమానార్లు నుడివిరి "అస్త్యైరధన్య పురుషై ర్మనసాప్యనాప్యమ్" (భాగ్యహీనులు మనస్సుననైనను బొందరానిది) అని శ్రీ వైకుంఠ స్తవము

యదేవ తమసః పారే — పరమపదము ప్రకృతిమండలమునకు బయటనున్నది గుణమును నిర్దేశించు తమశ్శబ్దము ఆ గుణముగల ప్రకృతిని జూపుచున్నది "తమః" "రజః" అను గుణవాచకములచేత శ్రుతియుఁ బ్రకృతిని నిర్దేశించుట తెలియఁదగినది "యదేవ పరమం తమసః పరస్తాత్" అని వైకుంఠ స్తవము

"ఏవ" యనునది యవధారణార్థకము పరమపదము తప్పఁ దక్కిన స్థానంబు లన్నియుఁ బ్రకృతి మండలములోనివే యని తెలిసికొనవలయును ఇఁక "ఏవ" యనునది "పారే" అనుదానితోను అన్వయించును, అప్పుడు ప్రకృతి మండలమునకుఁ బైననేయున్నది, దాని సంబంధము లవలేశమును లేనిదని ఏర్పడినది.

యదత్యద్భుతం — మన భూలోకమునకంటె సత్యలోకమువంటివి యాశ్చర్య దాయకములే పరమపద మత్యంతాశ్చర్యావహ మనుట "అతి సుందర మద్భుతఞ్చ"యని శ్రీ వైకుంఠ స్తవము

యత్కాలాదపచేళిమం — "నకాలస్తత్ర వై ప్రభుః" అనునట్లు "కాలము చేతఁ బరిణమింపఁ బడనిది" యనుట. "కాలాతిగా" (కాలము నతిక్రమించునది) యని శ్రీ వైకుంఠ స్తవము.

సురపురీ. . దుర్గతిః — ఆనందావహమైన పరమపదమును జూచునపుడు స్వర్గమును నరకతుల్యమే యనుట "ఏతే వై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః" అను వచనమును దెలకింపుఁడు "అన్యదు సుఖోత్తరం" (తక్కినది దుఃఖమే యెక్కువగాఁ గలది) అని శ్రీ వైకుంఠ స్తవము

సాయుజ్యస్య యదేవ సూతిః — సాయుజ్య మనఁగా భగవంతునితో సమానములైన గుణములు గలిగియుండు స్థితి ఇదియే ముక్తి యనఁబడును ఐక్యమే సాయుజ్యమని కొందఱందురు సాదృశ్యమును జెప్పునట్టి యీ మాటకు ఆ యర్థము పొసఁగదు వేర్వేఱు వస్తువులకుఁ గదా పోలికను చెప్పవచ్చును! అనేక వస్తువుల కొక్కటికైన ధర్మమే సాదృశ్యము ఈ యాత్మను భగవంతునితోఁ దుల్యునిగాఁ జేయునదే పరమపదము ఎంత జ్ఞానవంతుఁడైనను ఈ దేహమును విడిచి యర్చిరాది గతిగాఁ బరమపదముఁ బొందిన తర్వాతనే సాయుజ్యము పొంద శక్యమగును — అని శాస్త్రముల తాత్పర్యము కనుక "సాయుజ్యస్య సూతిః" (సాయుజ్యమున కుత్పత్తి స్థానము) అన్నారు "సాయుజ్య ముజ్జ్వల ముశన్తి యదాపరోక్ష్యం" (పరమపద దర్శనమే సాయుజ్యము) అని శ్రీవైకుంఠ స్తవము అర్చిరాది మార్గముగా నేఁగి, పరమపదమును దర్శించినఁగాని సాయుజ్యము కలుగదు కనుక దర్శనమే సాయుజ్యమనుట ఔపచారికము

సాలోక్యము మొదలగునవి లీలావిభూతిలోని విష్ణులోకమునఁ బొంద శక్యములే యైనను, సాయుజ్యము పరమపదమునందే లభ్యము గనుక "యదేవ" యన్నారు

అథవా యద్దుర్గ్రహం మద్గిరామ్ — పెక్కు మాటలేల? నా వాక్కునకును అందనిది అనెడి యీ లక్షణమే చాలు ననుట ఇదివఱలో "యద్దూరే మనసః" అన్నది సామాన్యముగ బ్రహ్మాదులకుఁ గూడఁ దలంపను వర్ణింపను శక్యము కాదని, మఱి యిక్కడ నన్నచో శ్రీదేవి మధుర కటాక్షములచేఁ గవినైన నాకును వర్ణింప శక్యము గాదనుట

ఈవిధమైన వర్ణన కవధి యెక్కడ? వర్ణించి గట్టెక్కుటకు నావలన సాధ్యము కాదని చెప్పినట్లుగాను నర్థము చేయవచ్చును "వాచో యదీయ విభవస్య తిరస్క్రియాయై" (వర్ణింపఁ బూనుకొన్నఁ బరమపద మహిమను దగ్గించినట్లగును) అని శ్రీవైకుంఠ స్తవము

ఇఁక "యద్దూరే మనసః" అనుటలో మనస్సున కందనిది అని చెప్పఁబడినది ఇది వాక్కునకు దూరమైనదని చెప్పుచున్నది ఇట్లర్థము చేసిన యెడల "అథవా" అను పదమునకు "మఱియు" నని యర్థము చేయవలసి యుండునని కొందఱు వ్యాఖ్యానించిరి ఇది యనుచితము ఆ యర్థమున "మద్గిరాం" అను తమ వాక్కును విశేషించినందు కేమియుఁ బ్రయోజనము లేకపోవును.

"యదుర్గమం మద్గిరామ్" అని పాఠాంతర మున్నది అర్థ మొకటే! దీని కంటెను శ్రేష్ఠమైన ప్రదేశ మేదియు లేనందున "పరమం పదం" అన్నారు "విష్ణోః పరమం పదం" అని శ్రుతియుఁ జెప్పుచున్నది

ఇట్టి పరమపదము శ్రీదేవికే యున్నదఁట ఈమెను చెపట్టిన కారణము చేతనే భగవంతునకుఁ బరమపదము సొంతమయ్యెను "వైకుణ్ఠేతు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే" అని శ్రీదేవితోఁ గూడియే భగవంతుఁడు పరమ పదములో నుండుటచు జూడుఁడు భగవంతుఁడు శ్రియఃపతియై శ్రీవైకుంఠ నికే తనుఁ డయ్యెనని దెలిసికొనుఁడు

క్రింది శ్లోకమును ఈ శ్లోకమును శ్రీదేవియొక్క యుభయ విభూతి యోగమును దెలిపినవి

ఎదుమనత్తు క్కెట్టాదు తమసు క్కప్పాల్
ఎదువియప్పు క్కరియదెదు కాల త్తాలే
ఎదుమాత్తా దెదనై యడై గిన్ద్రా నుక్కే
ఇమైయోరి నెర్తినగరుమ్ నరకాయ్ త్తోన్ఱుమ్
ఎదుసాయు చ్చియ మళిప్ప దీదు నిఱ్క
ఎణ్ పేచ్చు క్కెదునిలమే యన్త్రో మాయో
నదువాన నప్పరమ పదము న్గూడ
అన్నాయ్! నిన్ తనక్కెన్ద్రే ఓది నారే. (21)

ఏది మనస్సుచేఁ దలంప నశక్యమో, ఏది ప్రకృతికి బహిర్భూతమైనదో, ఏది యత్యాశ్చర్య జనకమో, ఏది కాలాబాధితమో, దేనిని జెందినవానికి ఇంద్ర నగరమైన అమరావతియు నరకముగా నగపడునో, యేది సాయుజ్య మొసంగునో, మఱియు నేది నా వాక్కునకు విషయము కానేరదో అట్టి మహావిష్ణువుయొక్క పరమపదమును, ఓ తల్లీ! నీ కొఱకే యని పఠించిరి (21)



అవతారిక —ఇదివఱకుఁ జెప్పిన ఉభయ విభూతులును, వీనిలోని సమస్త వస్తువులును, భగవంతుఁడును శ్రీదేవియొక్క పరికరము లనుచున్నారు

హేలాయా మఖిలం చరాచర మిదం భోగే విభూతిః పరా
ధన్యాస్తే పరిచార కర్మణి సదా పశ్యన్తి యే సూరయః।
శ్రీరఙ్గేశ్వరదేవి! కేవలకృపానిర్వాహ్యావర్గే వయం
శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్ఫారణే॥ ॥౨౨॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| శ్రీరఙ్గేశ్వరదేవి! | శ్రీ రంగనాథుని దేవి! |
| అఖిలం | సమస్తమైన |
| ఇదం | ఈ |
| చరాచరం | జంగమ స్థావరాత్మకమైన లోకము |
| హేలాయాం | (నీ) లీలవిషయమై (ఉపయోగపడుచున్నది) |
| పరా | మేలైన |
| విభూతిః | నిత్య విభూతి |
| భోగే | భోగమునకు (ఉపయోగపడుచున్నది) |
| యే | ఎవరు |
| సదా | ఎల్లప్పుడును |
| పశ్యన్తి | చూచుచున్నారో |
| తే | ఆ |
| ధన్యాః | భాగ్యశాలులైన |
| సూరయః | నిత్య సూరులు |
| పరిచార కర్మణి | (నీ) కైంకర్యమునెడ (ఉపయోగపడుచున్నారు) |
| వయం | మేము |
| కేవలకృపా | నిర్హేతుక కృపచేత |
| నిర్వాహ్యవర్గే | నిర్వహింపఁ దగిన సమూహములో (ఉపయోగపడుచున్నాము) |
| పరమః పుమాన్ | పరమ పురుషుఁడు |
| శేషిత్వే | శేషి భావమందు (ఉపయోగపడుచున్నాఁడు) |
| తవ | నీయొక్క |
| స్ఫారణే | ప్రేమలో |
| ఏతే | వీరు |
| పరికరాః హి | పరికరములు గదా! |

రాజునకు ఛత్రచామరాదులవలె శ్రీదేవికి భగవంతుఁడాదిగాఁగల సమస్తము పరికరములని చెప్పుచున్నారు

ఈ లోకమునకు లీలా విభూతి యనియే పేరు ఇది శ్రీదేవి లీలకు నుపయోగింపఁబడు పరికరము లోకమును "ఇదం" మని కంటెకెదురుగా నుండు నట్లు చూపుటచేత దాని వైచిత్ర్యమును, "అఖిలం" అనుటచేత దాని మహత్త్వమును సూచించి యందుమూలముగ శ్రీదేవియొక్క లీలయు విచిత్రముగను, గొప్పదిగ నున్నదని చూపుచున్నారు

-- దీనికన్న మూఁడు రెట్లు పెద్దదని వేదము పఠించుటచేత నిత్యవిభూతిని "పరా విభూతిః" అనిరి రజస్తమస్సులచేత మిశ్రము కాక శుద్ధసత్త్వాత్మకమగు శ్రేష్ఠతనుబట్టి యీ విధముగ వర్ణించి రనుటయు నగును

నిత్యవిభూతి భోగమునకుఁ బరికరమగును భోగ్యముగను, భోగోపకరణముగను, భోగస్థానముగను నిత్యవిభూతి యుపయోగపడుచున్నది

నిత్యవిభూతిని "పరా" యని విశేషించుటచేత దాని భోగ్యతా మహిమ కనఁబడుచున్నది

నిత్యసూరులు కైంకర్యము చేయు పరికరములగుదురు భగవంతుని ప్రీతి కెల్లప్పుడు పాత్రులగుటంజేసి "ధన్యాః"యని వారిని విశేషించినారు "పుణ్యాః" అని పాఠాంతరమున్నది ఎల్లప్పుడును దర్శించి యనుభవించు సూరులు కైంకర్య మునకుఁ బరికరము లనుటచేత, అనుభవ జనిత ప్రీతికారితము కైంకర్య మనఁబడిన దయ్యెను

నిత్యసూరులకుఁ బ్రతిభటముగా సంసారముచం దల్లాడుచుండు మనమును శ్రీదేవికిఁ బరికరములమే కారణము లేకపోయినను కేవల కారుణ్యముచేత రక్షణకు మనమే కదా కావలయును! మనములేని యెడల శ్రీదేవి నిర్హేతుక కృప యెట్లు బయలు వెడలును? కనుక శ్రీదేవియొక్క స్వభావ సిద్ధమైన కరుణను బయలుపఱచుటలో మనమే పరికరముల మయ్యెదము

"కేవలకృపా" యనుటచేత కరుణ స్వాభావిక మనియు, "నిర్వాహ్యవర్గే" యనుటచేత నస్మదాదుల కది ఫలించిన దనియు తెలియుచున్నది

భగవంతుఁడు శేషిగా నుండుటచేతఁ బరికరమగునట్లు రాజున కతని తల్లి శేషియైనను "రాజమాత" యని యామెకు గొప్పతనము కలుగునట్లును, రాజ పరికరములలో నామెయుఁ జేరి యుండుటనుం బోలె, భగవంతునకు "శ్రియః పతి" యను గొప్పతనమును, శ్రీదేవీ పరికరములలోఁ జేరుటయును బొసఁగును

ఇందుచేత శ్రీదేవికి సాటిలేని భర్త యని భగవంతుని మహిమయు, అతనికి శేషభూతురాలై యుండుటచేత శ్రీదేవియొక్క పారతంత్ర్యమును దెలియుచున్నవి

విళైయాడ చ్చరాచర మివ్వనైత్తుమ్ బోగమ్
విళైత్తఱ్కు మేతక్క విభూతి యాగుమ్
కళియాడ చ్చదాకాణుం శెల్వ రాన
కామరు సూరిగళావర్ పణివిడైక్కే
ఉళనాగ్గ ళునదియల్లాం కరుణైయాలే
ఉఱుతుణైయా నీతాఙ్గ విణైమైక్కోర్
ఉళనరఙ్గ నాయకను క్కేఱ్ఱ దేవి!
ఉన్ పెరుమైక్కేఱ్ఱ పరికరఙ్గ ళమ్మా! (22)

శ్రీరంగనాయకున కనురూపనైన దేవి! ఈ చరాచరాత్మకమగు లోక మంతయు నీ లీలకు, నుత్కృష్టమైన నిత్యవిభూతి నీ భోగానుభవమునకు, సంతోషము గలుగునట్లు సదా దర్శించు భాగ్యశాలులైన నిత్యసూరులు నీ పరిచర్యకు, మేము నీ సహజ కరుణచేత నీవు తోడై నిర్వహించుటకు, ఈశ్వరుఁడు శేషిత్వ మునకు పరికరములు. ఆహా! ఇవి ఇట్లు నీపేర్మికిం దగిన పరికరములు. (22)

అవతారిక — నిత్య విభూతిలోని యయోధ్యా నగరము భగవంతునకును, శ్రీదేవికిని రాజధానిగా నున్నదనుచున్నారు

ఆజ్ఞానుగ్రహ భీమ కోమల పురీపాలా ఫలం భేజుషాం
యాయోధ్యేత్యపరాజితేతి విదితా నాకం పరేణ స్థితా ।
భావై రద్భుత భోగ భూమ గహనై స్సాన్ద్రా స్సుధాస్యన్దిభిః
శ్రీరఙ్గేశ్వరగేహలక్ష్మి! యువయో స్తాం రాజధానీం విదుః ॥౨౩॥

ప్రతిపదార్థము

| పదము | అర్థము |
|---|---|
| శ్రీరఙ్గేశ్వర గేహలక్ష్మి! | శ్రీరంగనాథుని యాలయమును వెలుఁగొందఁ జేయు దేవీ! |
| యా | ఏ నగరము |
| ఆజ్ఞా | ఉత్తరువుచేతను |
| అనుగ్రహ | అనుగ్రహము చేతను (వరుసగా) |
| భీమ | భయంకరులుగాను |
| కోమల | సుముఖులుగాను నుండు |
| పురీపాలా | నగర పాలకులు గలదైనదో |
| భేజుషాం | భక్తులకు |
| ఫలం | ప్రయోజనముగా నున్నదో, |
| అయోధ్యా ఇతి | అయోధ్యయని (ఎవరి చేతను యుద్ధము చేయబడని దనుట) |
| అపరాజితా ఇతి | అపరాజితయని (జయింపఁబడనిది యనుట) |
| విదితా | ఎఱుఁగఁబడినదో, |
| నాకం | పరమాకాశమునకు |
| పరేణ | పైన |
| స్థితా | ఉన్నదో, |
| సుధాస్యన్దిభిః | అమృతమును ప్రవహింపఁ జేయు (మధురములైన) |
| అద్భుత | ఆశ్చర్యకరములైన |
| భోగ | అనుభవములయొక్క |
| భూమ | అతిశయముచేత |
| గహనైః | నిండిన |
| భావైః | భావములచేత |
| సాన్ద్రా | నిండినదో, |
| తాం | ఆ నగరమును |
| యువయోః | మీ యిరువురియొక్క |
| రాజధానీం | ముఖ్య నగరముగా |
| విదుః | తెలిసికొనుచున్నారు |

ఆజ్ఞా . . పాలా — నిత్య విభూతిలోనుండు అయోధ్యా నగరపుఁ గావలివారు ఉత్తరువులచే భయపెట్టుచున్నారు ఉత్తరువు చేయునపుడు వారు భయంకరులేయైనను, స్వభావములో ననుగ్రహించు సుముఖులే యని భావము ప్రీత్యతిశయముచేతఁ గలవరపడి యీ పాలకులు భయపడ నవసరము లేని

యయోధ్యలోఁగూడ నెవరిచేత నేమి యాపత్తు సంభవించునో యని యుత్తరవుచే భయపెట్టుచున్నారు

ఫలం భేజుషాం — భక్తులు పొందు గొప్ప ప్రయోజనము పరమపదమే! విష్ణువుయొక్క పరమపదమే ముక్తుని గమ్యస్థానమని వేదము పఠించుచున్నది భక్తి — సాధన భక్తిని, సాధ్య భక్తిని — రెంటఁ దెలుపును కాన భక్తులకును, ప్రపన్నులకును నిదియే ప్రయోజన మగును

యా అయోధ్యా . . . విదితా — అయోధ్యా, అపరాజిత యను పేర్లు వేదములో నుండును. "విదితా" యను పదము వేదమునుండి తెలిసికొనఁ బడిన దని తెలియఁజేయుచున్నది

నాకం . . . స్థితా — "నాకం" అనుదానికి ప్రకృతి మండలమనియు నర్థము చేయుదురు "నాకం పరేణ" యని వేదములోని మాటలు ముందు వెనుకలుగా మాఱియున్నవి

భావైః . . . స్వాద్విభిః — అత్యాశ్చర్యకరములై భోగాతిశయముచేత మధురములైన వస్తువులు నిండియున్నవఁట యీ నగరిలో "సర్వదా అనుభూయమానై రపి అపూర్వవత్ ఆశ్చర్యం ఆవహద్భిః" (ఎల్లప్పుడు ననుభవించినను క్రొత్తవివలె నాశ్చర్యమును గలిగించునవి) యని ఎంబెరుమానార్లనుగ్రహించిన దానిని జూడుఁడు

ఇల్లాలు లేని యిల్లు పాడుపడును గనుక "గేహలక్ష్మి" యని సంబోధించిరి ఇట్టి మాహాత్మ్యము గలది మీ రాజధాని యని యనఁబడిన దయ్యెను

రాజధానీ — "ధీయన్తే అస్యాం ఇతి ధానీ, రాజా చ రాజ్ఞీ చ రాజానౌ, రాజ్ఞోః ధానీ రాజధానీ" అని వ్యుత్పత్తి (ప్రధాన నగరీ రాజ్ఞాం రాజధానీతి కథ్యతే" (రాజుయొక్క ముఖ్య నగరము రాజధాని యని చెప్పఁబడును)

అఱ్పుదమా మతియాన బోగమ్ తున్నుమ్
　　అముదోఙ్గు పొరుళ్ మలిన్దు భక్తరుక్కు
నఱ్పయనాయ్ నాకత్తి ల్కాప్పా ల్పట్టు
　　నాముఱుత్తు మాన్దై యుడ నరుళు మేవుమ్
పొఱ్పుడై యోర్ కావల్పూ ణ్డయోద్ది యెన్నుమ్
　　పుగలపరా జితై యెన్నుమ్ వేదమ్ పోఱ్ఱుమ్
నఱ్పురమే తలై నగరామ్ నాయగఱ్కుమ్
　　నళిరరఙ్గ కోయిలిల కుమియే! నిఱ్కుమ్. (23)

శ్రీరంగనాథుని మందిరమును వెలుగఁజేయు దేవీ! అద్భుతములై మధురములును, భోగ్యములును నగు వస్తువులతో నిండినదై, భక్తులకుఁ బరమ ప్రయోజనమై

పరమాకాశమునకుఁ జెందఁబడినదై భయంకరముగ నాజ్ఞాపించువారైనను అనుగ్రహము గల పాలకులచే రక్షింపఁబడునదై అయోధ్య యనియు, అపరాజిత యనియు వేదము కొనియాడు నగరమే నీనాథునకును, నీకును రాజధాని యగును (23)

అవతారిక — ఆ నగరములోనున్న దివ్యాస్థాన మండపము మీదే యనుచున్నారు

తస్యాఞ్చ త్వత్కృపావ న్నిరవధి జనతా విశ్రమార్హావకాశం
సజ్కీర్ణం దాస్యతృష్ణా కలిత పరికరైః పుమ్భి రానన్దనిఘ్నైః।
స్నేహా దస్థాన రక్షా వ్యసనిభి రభయం శార్ఙ్గ చక్రాసి ముఖ్యై
రానన్దైకార్ణవం శ్రీర్భగవతి! యువయో రాహు
రాస్థానరత్నమ్ ॥౨౪॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| భగవతి | సుగుణములు గల | స్నేహాత్ | ప్రీతి చేత |
| శ్రీః! | ఓ లక్ష్మీ! | అస్థాన | అక్కఱ లేనప్పుడును |
| తస్యాం | ఆ రాజధానిలో | రక్షా | రక్షించుటలో |
| త్వత్కృపావత్ | నీ కృపవలె | వ్యసనిభిః | ప్రయత్నించుచున్నట్టి |
| నిరవధి | హద్దులేని | శార్ఙ్గ | శార్ఙ్గము |
| జనతా | జన సమూహమునకు | చక్ర | చక్రము |
| విశ్రమ | అలసటఁ దీర్చుకొనుటకు | అసి | (నందకమను) కత్తి |
| అర్హ— | తగిన | ముఖ్యైః | ఇవి మొదలుగాఁగల దివ్యాయుధ పురుషులచేత |
| అవకాశం | చోటు గలదియు, | | |
| దాస్య | దాస్యమునందలి | | |
| తృష్ణా | కుతూహలముచేత | అభయం | భయములేనిదియు |
| కలిత | (చేతులతో) తీసికొనిన | ఆనన్దైకార్ణవం | కేవల ఆనంద |
| పరికరైః | చామరాది పరికరములు గలవారుగను | | సముద్రమున్నైన |
| ఆనన్దనిఘ్నైః | ఆనంద పరవశులుగను నున్న | ఆస్థానరత్నంచ | ఉత్కృష్టాస్థాన మండపముకూడ |
| పుమ్భిః | పురుషులచేత | యువయోః | మీదే యని |
| సజ్కీర్ణం | క్రిక్కిరిసినదియు, | ఆహుః | చెప్పుచున్నారు |

త్వత్కృపావత్ . . . అవకాశం — ఎందఱు జనులు వచ్చినను దాపము శమించి, విశ్రాంతి తీసికొనుటకుఁ జోటు నిచ్చునది యీ నగరిలోని దివ్యాస్థాన మండపము, అంత వైశాల్యము కలదనుట "సర్వాత్మ సాధారణ నాథ గోష్ఠీపూరేపి దుష్పూర మహావకాశం" (సర్వాత్మలకును సాధారణమైన భగవంతుని గోష్ఠిచేత నిండినను నిండని మహత్తైన యవకాశము కలది) అని శ్రీరంగరాజస్తవము లోను గలదు

ఈ మండపము వీరు వా రనక యెల్లరును వచ్చి విశ్రమింపఁదగ్గ శ్రీదేవీ కృపనుబోలి యుండునఁట స్వాభావిక కృపచేత జగన్మాతయైన శ్రీదేవి అందఱిని చల్లగా నుండునట్లు చేయుట యెల్లరు నంగీకరించినదే కనుక నా కృపను మంటపమున కుపమానముగా నుడివిరి

కృపయందును, మండపమునందును విశ్రమించుట కర్హతయున్నను అనేకులు వానిని పొందలేక యున్నారే యను పరమకృప యిచ్చట తోఁచుచున్నది

"కృపావత్" అను దానికి "కృపవలె" యని యర్థము చేయక "కృపగల" యని యర్థముచేసి, దానిని "జనతా" యను పదమునకు విశేషణముగాఁ గొందఱు గ్రహింతురు జనతా—"గ్రామ జన" అను విధి ప్రకారము సమూహార్థమున "తత్" ప్రత్యయము చేరినది

సజ్జీకృతం . . నిష్ఠైః — ఆ దివ్య మంటపమునందుండి మహానందము ననుభవించువారు పేర్కొనఁబడుచున్నారు దాస్య మొనర్పవలయునను నాశచేత చామరము, ఛత్రము లోనగు పరికరములను హస్తములయం దుంచుకొని, యానంద పరవశులై పలువు రక్కడ క్రిక్కిరిసి యున్నారు మాల కట్టుటకు దగిన తులసి తోడి గంపను భుజముపై నిడుకొన్న తొండరడిప్పొడి యాళ్వారులవలె దాస్య పరికరమును విడిచి పెట్టలేక యత్యాదరముతో వానిని చేతులయం దుంచుకొనియే యున్నారు "గృహీత తత్తత్పరిచార సాధనైః" (కైంకర్యమునకుఁ దగినట్టు లాయా పనులకుఁ గావలసిన సాధనములఁ జేకొనియున్నట్లుగా) అని ఆళవందార్లును, "శూట్టు నన్మాలైగళ్ తూయన ఏన్ది" (పరిశుద్ధములై సమర్పింపఁ దగినవైన మంచి మాలలను చేత నిడికొని) యని నమ్మాళ్వార్లును అనుగ్రహించి యున్నారు

అచ్చట నున్నవారి నందఱిని నానంద పరవశులుగా వర్ణించుటచే కైంకర్య ములో తారతమ్యమున్నను, ఆనందమున నది యించుకైనను లేదనుట.

స్నేహాత్ . . ముఖ్యైః — ఆయుధ పురుషు లా మండపమును గాచు చునే యున్నారఁట అచ్చట కొంచెమైనను భయపడుటకుఁ బ్రసక్తి లేక యుండినను భగవంతుని మీఁదను, శ్రీదేవి మీఁదను వారికి వర్ధిల్లుచుండు ప్రేమచేత వారట్లు కాపాడ యత్నించు చున్నారు ఇచ్చట నిర్భయమునకుఁ గారణము

రక్షణమందుఁ దమ జాగరూకతయే యను సాదృశ్య ధర్మముల ద్వారాయుధము లను పేరించి "అభయాం" అన్నారు

భగవంతుని యాయుధము లచేతనములైన సాధనములు గావు నిత్యసూరులే యాయుధాకారులై భగవంతునికి కైంకర్యము చేయుచున్నారని తెలిసికొనఁదగు "లోకములోని యాయుధములు తమ స్వామిచేత రక్షింపఁబడవలసినవి, ఇవియో తమ స్వామిని రక్షించుచున్నవి" అను నీ భావమును గుర్తింపుఁడు భగవంతుని యాయుధములు చేతనములు, పొంగుచున్న ప్రేమ గలవి యను విషయము "హేతిభిశ్చేతనావద్భి రుదీరిత జయస్వనమ్" (చేతనులైన యాయుధ పురుషులచేత జయపెట్టఁబడుచున్నవాఁడు) అని కాళిదాసుని వాక్యమువలనను దెలియనగును

ఆనన్దైకార్ణవం　　రత్నం — నిరతిశయానందము నిచ్చుట చేత "అనన్దైకార్ణవ"మని చెప్పిరి "ఆస్థాన మానన్దమయమ్" అని శ్రీరంగరాజస్తవము నందుఁగూడఁ గలదు "ఆనన్దమయమాన మణిమణ్డప" మని మణవాళ మహాముసుల సూక్తి మంటపస్థుల యానందమును "ఆనన్ద నిఘ్నాః" అనుటచేతఁ జెప్పిరి "ఆనన్దైకార్ణవ"మనుటచే వారిని నానందింపఁజేయున దీ వండపమన్నారు

ఆస్థానములో నిది శ్రేష్ఠమని యెంచి "ఆస్థాన రత్నం" అని వచించిరి "జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్న మితి కథ్యతే" (ఆయా వర్గములో నేది శ్రేష్ఠమో యది "రత్న" మనఁబడును

"తస్యాశ్చ" అనుచోట నుండు "చ"కారము "ఆస్థాన రత్న" మను దానితో నన్వయింపఁబడినది రాజధాని మాత్రమే కాదు, ఆస్థాన రత్నమును మీదే యనుట

అవ్వాయినిఁ కరుణై యెన చ్చన త్తిరళ్ గళ్
　అళవిన్ఱి యుళ్ళై ప్పాణి ఱ్కోడ ముడైత్తాయ్
అవ్వావకై క్కొడుకరువి యడిమై పూణుమ్
　ఆవలుడఁ ఉవగై మిగు న్దవర్కళై న్దు
తెవ్వలతా యినున్దెయ్వ ప్పడై క ళన్బిఱ్
　శిఱన్దు ముయన్ఱళి త్తిడవే బయన్దీ రిన్బ
ప్పవ్వమణి యాత్తాన మణ్డప త్తై
　ప్పగర్వర్ తిరు! బగవతి'ను మ్మిరువీర్ కుఱ్ఱమ్మే. (24)

భగవతీ! లక్ష్మి! ఆ కోట నీ కరుణవలె జనసమూహములు విశ్రమించుటకు నవకాశము గలదియు, దాస్యము చేయు నాశతో నా యా సాధనములను జేపట్టి యానంద పూర్ణులగు పురుషులు క్రిక్కిరిసి యుండునదియు, విరోధము లేకున్నను దివ్యాయుధము లధిక ప్రేమచే ప్రయత్నించి కాపాడుటచే భయము లేనిదియు, ఆనంద సముద్రమును అయిన యుత్కృష్టాస్థాన మండపముకూడ మీ యుభయుల సొమ్మే యని చెప్పుదురు (24)

---

అవతారిక —ఆ మండపమున శ్రీదేవి భగవంతునితోఁ గూడి యాదిశేషుని పై వైభవముగా కూర్చుండి యానందపఱచుటను జెప్పుచున్నారు

తత్ర స్రక్ స్పర్శ గన్ధం స్ఫురదుపరి ఫణారత్న రోచిర్వితానం
విస్తీర్యానన్త భోగం తదుపరి నయతా విశ్వమేకాతపత్రమ్ ।
తైస్తైః కాన్తేన శాన్తోదిత గుణ విభవై రర్హతా త్వా మసఙ్ఖ్యై
రన్యోఽన్యాద్వైత నిష్ఠా ఘనరస గహనాన్ దేవి!
బధ్నాసి భోగాన్ ॥ ౨౫॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | దేవీ! | నయతా | నడపించువాఁడును |
| తత్ర | ఆ మండపమునందు | తైస్తైః | ఆ యా (అనగా- ప్రసిద్ధములైన) |
| స్రక్ | పుష్పమాల వలె | అసఙ్ఖ్యైః | లెక్కలేని |
| స్పర్శ | మృదువైన స్పర్శమును | శాన్తోదిత గుణ విభవైః | శాన్తోదిత దశయందలి గుణముల అతిశయములచేత |
| గన్ధం | వాసనయు గలదియు | త్వాం | నిన్నుగూర్చి |
| స్ఫురత్ | ప్రకాశించుచున్న | అర్హతా | తగినవాఁడునైన |
| ఉపరి | పైనున్న | కాన్తేన | ప్రియునితో |
| ఫణారత్న | పడగ మణులయొక్క | అన్యోన్య- | ఒకరికొకరు |
| రోచిః | ప్రకాశ మను | అద్వైత నిష్ఠా | ఒక్కటిగా నుండు స్థితిచేత |
| వితానం | మేలుకట్టు గలదియునగు | ఘనరస | అధిక రసము |
| అనన్త భోగం | ఆదిశేషుని శరీరమును | గహనాన్ | నిండిన |
| విస్తీర్య | విస్తరింపించి | భోగాన్ | అనుభవములను |
| తదుపరి | దానిపై (కూర్చుండి) | బధ్నాసి | చెందఁజేయుచున్నావు |
| విశ్వం | లోకమును | | |
| ఏకాతపత్రం | ఏకచ్ఛత్రము క్రింద నుండులాగున | | |

స్రక్ స్పర్శ గన్ధమ్ — ఉండుటకు సింహాసనమగు నాదిశేషుని శరీరమందు గల వాసన గుణములను జూపుచున్నారు మృదుత్వము, సుగంధము నిచ్చుట పేర్కొనఁబడినవి పుష్పమాల నుపమించుటచేత చల్లఁదనము దోఁచుచున్నది "విస్తీర్య" "ఉపరి" అను పదములచె వరుసగా వైశాల్యమును, ఔన్నత్యమును తెలియుచున్నవి కనుక మార్దవము, గంధము, శైత్యము, వైశాల్యము ఔన్నత్యము అను వాసనగుణము లైదును దోఁచుచున్నవి ఆదిశేషున కుపమానముగాఁ జెప్పుట చేత "స్రక్" అను పదముచేఁ దెల్లని వర్ణముగల పుష్పమాలనే గ్రహింపవలయును "సుదామరుచిరమదిమసుగంధి" అని పుష్పమాల వంటి వర్ణమును, మార్దవమును, వాసనను గలిగినట్లు ఆదిశేషుని శరీరమును ఈ గ్రంథకర్త శ్రీరంగరాజస్తవమున వర్ణించియుండుట నిచట యెఱుఁగునది లోకములోని సర్పములకే యిట్టి గుణములు గలవనిన ఆదిశేషుని గుఱించి చెప్పవలయునా?

స్ఫురత్, వితానమ్ — ఆదిశేషుఁడు పైకెత్తిన ఫణములలోని మణుల కాంతులే మేలుకట్టుగా నగుచున్నవి ఆతని ఫణముల క్రింద వేంచేసి యుండుటే శ్రియఃపతి యీశ్వరత్వమును వెలుపఱచుచున్నది "శుడర్ప్పమ్బళై నంబరనై త్తిరుమాలై" (జ్వలించు నాదిశేషుఁడగు శయనముపై వేంచేసియున్న మన పరత్వము గల (శ్రియఃపతిని) అని పెద్దలు వచించిరి లోకములో నేదేని యొక చిన్నవానిపై సర్పమొకటి తన స్ఫటము నెత్తి నీడను గలిగించినచో, నా చిన్నవాఁడు రాజగునని చెప్పుదురు సహస్ర ఫణముల క్రింద నెల్లప్పుడు నమరియున్న వాని కీశ్వరత్వము గలిగియుండుటలో నాశ్చర్యము లేదుకదా!

విస్తీర్ణానన్త భోగమ్ — తన యిష్ట ప్రకారము సంకుచించి, విస్తరించునట్టి దేహమును బడసి యున్నవాఁడు గనుక ఆదిశేషుని శరీరమును విస్తరింపించి దానిపై నీశ్వరుఁ డమరియున్నాఁడు "నాన్తం గుణానాం గచ్ఛన్తి తేనానన్తోఽయ ముచ్యతే" యనునట్లు గుణముల కంతము లేకుండుటచె ననంతుఁడను పే రాదిశేషునకుఁ గలిగెను రక్షించుటలో భగవంతునకు, గుణముల కంతము లేదు కైంకర్యములో గుణముల కితని కంతము లేదు దేశముచేతను, కాలముచేతను, వస్తువులచేతను గొలుచుట కశక్యమగుటచే అనంతుఁడనఁబడు భగవంతునియు తనయం దణఁగి యుండుటఁబట్టి యనంతుఁడని ఆదిశేషుఁడు పేర్కొనఁబడుచున్నాఁ డనుటయుఁ దగును పెరియ తిరుమొఴి 7-8-1 వ్యాఖ్యానములో పెరియవాచ్చాన్ పిళ్లై యిట్లే యనుగ్రహించి యుండుటం జూడుఁడు భోగము=పాము దేహము

వైకుంఠములో శ్రీదేవితోఁగూడ వైభవముగ నాసీనుఁడై భగవంతుఁడున్నాఁ డను ప్రమాణము ననుసరించియు, ఏకచ్ఛత్రము క్రింద లోకమును నడుపుచున్నాఁ డను వర్ణనము ననుసరించియు "ఆసీనుఁడై" అను పదము తెచ్చి పెట్టఁబడినది

ఏకాతపత్రమ్ — ఈశ్వరత్వమున కితఁడు దప్ప వేఱొకరు లేనందున ఛత్ర మొకటే యయ్యెను "విశ్వ మేకాతపత్రయితు మస్మదనూన్ నిషణ్ణమ్"

(లోకము నొక్క ఛత్రముక్రింద నుండునట్లు చేయుటకు సింహాసనాసీనుఁడైయుండు మన ప్రాణముల పోలినవాఁడు) అని శ్రీరంగరాజ స్తవములోను గలదు గొడుగు చేత నొకఁడు తన దేహమును ఎండనుండి రక్షించుకొనునట్లు, ఆదిశేషుని ఫణా మండల చ్ఛత్రమువలనఁ దన దేహమైన లోకమును భగవంతుఁడు బాధలు లేక కాపాడుకొనుచున్నాఁడు, అనంతుఁడు లక్ష్మణుఁడుగాను, బలరాముఁడుగాను నవతరించి, ఈ లోకమును రక్షించిన యంశ మిచ్చట యనుసంధేయమని కొందఱి రసోక్తి "ఏకాధిపత్యమ్" అనియు నొక పాఠము గలదు అప్పు డొకే యాజమాన్యము గలుగునట్లు—అని యర్థము తాత్పర్య మొక్కటే.

కాన్తే —కాంతుఁడు, ప్రియుఁడు, సుందరుఁడనియు నగును

శాన్తోదిత గుణవిభవైః —భగవంతునకు శాంతోదితదశ యనియు నిత్యోదిత దశయనియు స్థితి ద్వయము గలదు ఒకటి పరవాసుదేవునియందును, రెండవది వ్యూహవాసుదేవునియందును నున్నవి శాంతోదిత దశ యనఁగా—భగవంతుఁడు కల్యాణ గుణములతోఁగూడిన తన్నుదానే యనుభవించుచు, నానందించి, నిస్తరంగ సముద్రమువలెఁ గదలక యుండు స్థితి నిత్యోదిత దశ యనఁగా—తన విభూతుల ననుభవించు దశ ఈ దశలను మార్చి చెప్పుటయుఁ గలదు సుందరబాహు స్తవమునందు "స్వ మహిమానుభవ ప్రభవత్ సుఖకృత నిస్తరఙ్గజలధీయిత నిత్యదశం" (తన మహిమ ననుభవించుటచేఁగలిగిన యానందముచేత, నిస్తరంగసముద్రముమాడ్కి నుండు నిత్యోదిత దశ గలవాఁడు) అని యీగ్రంథకర్త తండ్రిగారే మార్చి చెప్పుటఁ జూడుఁడు శ్రీరంగరాజ స్తవమునందు గుణములతోఁ గూడిన తన్నే యనుభవించుచు, నానందించి, కెరటములులేని కడలివలె నుండుట శాంతోదిత దశ యని యీగ్రంథకర్త చెప్పుచున్నారు (ఉత్తర శతకము 87_వశ్లోకమును జూడుఁడు)

తానే తనయందనుభవించు నా యా గుణముల శ్రేష్ఠతచే భగవంతుఁడు శ్రీదేవికిఁ దగిన భర్త యగుచున్నాఁడని చెప్పఁబడిన దయ్యెను ఇందుచేత శ్రీదేవీ కల్యాణగుణముల గొప్పతనము ప్రకటిత మగుచున్నది

ఇఁక "శాన్తోదిత గుణ విభవైః" అనుదానికి ఒకప్పుడు మఱిగియు మఱియొకపుడు బయటపడియున్న గుణముల వైభవముచే ననియు, అనుకూలముగాఁ జెప్పఁబడు గుణములు, విభవములు—వీనిచే ననియు అనేక రీతులుగా క్లిష్టార్థమును జెప్పువారును గలరు

త్వా మర్హా —"న లోకావ్యయ" యను వ్యాకరణము ప్రకారము షష్ఠీవిభక్తి రాలేదు.

అన్యోన్య .. భోగాః —ప్రీత్యతిశయముచేత ఒకరే యనునట్టి స్థితిని ఈ దివ్యదంపతులు పొందుదురనుట అద్వైతం=ఐక్యము అద్వైత నిష్ఠ యనఁగా

నేకాభిప్రాయముతో సమరసమై యుండగ స్థితి ప్రేమాధిక్యము గలవారై రామ సుగ్రీవులు కొనిన స్నేహమును—"ఐక్య" మెన్నకిన దని వాల్మీకి వర్ణించెను

ఇంక, "అహన్తా బ్రహ్మణస్తస్య" అనునటు, సకల జీవులకు నాత్మయైన "నేను" అని చెప్పదగిన భగవంతుని యహం (నేను అనుదానియొక్క ధర్మము) తాకారమై శ్రీదేవి యుండుటచేత, విభజింపజాలని యైక్యమును బొందు స్థితియే "అద్వైత నిష్ఠ" యనియు వ్యాఖ్యానింతురు

సమరసమైన స్థితిచేత మహానంద భరితములైన భోగములను శ్రీదేవి కూర్చుచున్న దనుట దివ్య దంపతుల సమాన స్థితియే భోగమునందు మహానందమును బొందుటకు హేతు వనబడిన దయ్యెను

ఈశ్లోకములో "లోకమును నడపించువాడు" డని కాంతుని విశేషించుటచేత రక్షణమునందు భగవంతునకే బాధ్యత గలదని తెలియుచున్నది భగవంతుడే రక్షకుడు శ్రీదేవి యతనికి సహాయినియే యని యెఱుంగుడు "లక్ష్మ్యా స్సహ హృషీకేశః రక్షకః" అను దానిలో శ్రీదేవి సాహాయ్యమును, భగవంతుని రక్షకత్వమును దెలుపబడుచున్నవి శ్రీదేవి సాహాయ్య మనగా బురుషకార మొనర్చుట "సహ" అనునది రక్షణములో శ్రీదేవికి గల యప్రాధాన్యమును జూపును రక్షణములో నప్రాధాన్య మనగా బురుషకారముగా నుండుటయే!

రక్షణములో శ్రీదేవికి బ్రాధాన్యము లేకున్నను, భోగమునం దామెకున్న ప్రాధాన్యమును విశదపఱచుటకై "కాన్తేన భోగాన్ బధ్నాసి" యనిరి "కాన్తేన" యనుచోట తృతీయావిభక్తి, "సహయుక్తేఽప్రధానే" అను వ్యాకరణము ప్రకారము భోగమునందు గాంతునకప్రాధాన్యమును జూపుచున్నది "అస్మిన్ మయా సార్థమ్" అను శ్లోకములో జలక్రీడయందు శ్రీదేవియగు సీతాదేవియే ప్రాధాన్యము వహించినట్లు శ్రీరామాయణమున శ్రీరాముడే చెప్పియున్నాడు. భగవంతుడును భోగమునందు బ్రాధాన్యము వహింపదగును, అయినను శ్రీదేవీ స్తుతి ప్రకరణమగుటచేత నామెకే ప్రాధాన్య మొసగి పలికిరని యెఱుంగునది

పూన్దెరియల్ పోలమణ గుణమ్ పోలిన్ద
  పొఙ్గుమణి యొళిమేలా ప్పడై యన్ద
ప్పాన్దళుడల్ విరిత్తదన్మేల్ పీళ్ గిరున్దు
  పల్లులగు మొరుకుడై కీళ్ ప్పడ నడాత్తి
చ్చాన్దముడన్ తానుగరుమ్ తనదెణ్ణిల్
  శాన్తోదిత గుణఙ్గ ళానిక్కుమ్
కాన్దనుడ నాఙ్గొరువర్ కొరుత్తర్ దేవి!
  కలన్దొన్ఱు దలిక్కునివాన్ భోగమ్ శేర్త్తి. (25)

ఓ దేవీ! ఆ మంటపమునందుఁ బూఁ మాలవలె సుగంధమును, మృదుత్వమును గుణమును గలదియు, వర్ధిల్లు ఫణారత్న కాంతులు మేలుకట్టుగాఁ గలదియు నైన యాదిశేషుని శరీరమును విస్తరింపించి, దానిపై వైభవముగాఁ గూర్చుండి, లోకముల నన్నింటిని ఏకచ్ఛత్రముక్రిందనగునట్లు నడపించి, శాంతముగాఁ దానె యనుభవించు తన లెక్కలేని శాంతోదిత దశా గుణములచే నీకనురూపుఁడైన కాంతునితోఁ బరస్పరము కలసి ఐక్యమగుటచేత రసఘనములైన భోగములఁ జేర్చెదవు (25)



అవతారిక — శ్రీదేవివలె నింకను ననేక పత్నులున్నను, సమరస స్థితికి లేశమైనను గొఱఁత లేదు, మఱియు నది పొరలి ప్రవహించుటకె కారణమగుచున్నారు

భోగ్యా వామపి నాన్తరీయకతయా పుష్పాఙ్గరాగై స్సమం
నిర్వృత్త ప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతాం ।
దేవి! త్వామను నీళయా సహ మహీదేవ్య స్సహస్రం తథా
యాభిస్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే॥ ౨౬॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | ఓ దేవి! | నీళయా సహ | నీళాదేవితోఁగూడ |
| వామపి | మీ యిరువురకును | మహీ | భూదేవియు |
| పుష్ప— | పుష్పములకును | తథా | అట్లే |
| అఙ్గరాగై | పూసికొను చందనా | సహస్రం | వేల సంఖ్యలు గల |
| స్సమం | దులకును సమముగ | దేవ్యః | పత్నులు (కలరు) |
| నాన్తరీయ | లేకుండ యుండలేని | త్వం | నీవు |
| కతయా | | యాభిః | ఏ దేవీ మణులచేత |
| భోగ్యాః | ప్రియములైనవారును | స్వాభిః | నీవియైన |
| నిర్వృత్త | నిండిన | స్తన | స్తనములు |
| ప్రణయ — | ప్రేమయొక్క | బాహు | చేతులు |
| అతివాహన | అధికమైన వెల్లువను ప్రవ | దృష్టిభిరివ | నేత్రములు—అను వీని |
| విధౌ | హింపఁజేయుటలో | | చేతవలె |
| పరీవాహతాం | కలుజుగానుండు స్థితిని | ప్రియం | నీ ప్రియుని |
| నీతాః | కలుగఁజేయఁబడినవారునై | శ్లాఘసే | శ్లాఘింపఁజేయు |
| త్వాం అను | నిన్ననుసరించి | | చున్నావో |

భోగ్యా　　　　నామసి —దివ్య దంపతు లందఱికిని భోగ్య భూతులు వారలు భోగ్య లేరని దేవీమణులు కొఱకౌటకై "భోగ్యానామసి" యనిరి

"నాన్తరీయకతా" యను దానిచేత ఎట్లు వీరు భోగ్యులగుదు రను విషయము వివరింపఁబడి యున్నది　అన్తరాభవం అన్తరీయం ("గహాది" యగుటచేత "ఛ" ప్రత్యయము వచ్చెను) లేకపోయినను సరిగా నుండున దని యర్థము పిమ్మట ప్రకృత్యర్థములోనే "క" ప్రత్యయముచేరి, "అంతరీయక"మైనది న—అన్తరీయకం—నాన్తరీయకం—లేకుండినయెడల అమరియుండనిది, దాని ధర్మము "నాన్తరీయకతా" లేకుండినయెడల నమరియుండమి—యనిన ట్లయ్యెను "యద్వినా యన్న భవతి తత్" (ఏది లేకుండ ఏది యుండనేరదో యది) నాన్తరీయకం—(లేకుండ యుండలేనిది) అని గ్రంథములు నుడువుచున్నవి

"అఙ్గరాగమ్" అనునది యందుకొనుట కర్హమైన చందనము లోనగు సువాసన వస్తువులను జూపుచున్నది

పుష్పము, చందనము మున్నగునవి యెట్లు రసమును బొందుటకావశ్యకంబులై ప్రియులకు భోగ్యతను వృద్ధిచేసి, తామును భోగ్య వస్తువు లగునో, అట్లే దేవీమణులును తాము లేకుండ ఉండలేని స్థితిని గలుగఁజేసి, భోగ్యతను వృద్ధిచేయుచు, తామును భోగ్యభూతులుగా నున్నారని యీ యుపమను విశదముగాఁ దెలిసికొనుఁడు ఇందుచేత భోగ్యతలో శ్రీదేవికే ప్రాధాన్యమనియుఁ దదితరులకుఁ గాదనియు విశదమగుచున్నది

పుష్ప, చందనముల నుపమించుటచేత దివ్యదంపతుల కితర దేవీమణులచేతనములవలెఁ బరతంత్రులుగా నుండు స్థితి దోఁచుచున్నది పుష్ప, చందనములు మధురములైన వస్తువులే కాని, రసమును దా మనుభవింపవు, దేవీమణులో రసము ననుభవింతురు కనుక భోగమును పెంచి తామా భోగములోఁ జేరని పుష్ప చందనాదులచేత రస మతిశయించుచున్నను, దేవీమణులు భోగమునందును కలియుటంబట్టి శ్రీదేవీ మనస్సు కలతఁజెంది శాత్రవమును బొందనేరదా? అన్నచోఁ దెలిపెదము దేవీమణులు తమకని యే ప్రయోజనము కోరని పరతంత్రలగుటచేత తామే యెప్పుడును భోగమునందు పాల్గొనరు దివ్యదంపతుల ప్రేమరసము కట్టలను మీఱి, పొరలి ప్రవహించి సహింపరాని స్థితిలో దానికి కలుజులవలె దేవీమణులుపయోగింపఁబడుచున్నారు కనుక దివ్యదంపతులు ధరించి నిలుచుటకే దేవీమణులత్యంత సాహాయ్యమై యుండుటచే శ్రీదేవికి శాత్రవము గలుగు ప్రసక్తియే లేదు ఈ విషయమును రెండవ పాదమునందు హృదయానందకరముగా గ్రంథకర్త వర్ణించియున్న సొంపుఁ జూడుఁడు.

నిర్వృత్త　　పరీవాహతామ్ — చెఱువు నిండి పొరలునట్లుగా నీళ్ళు పైపైఁగా వచ్చినయెడల ఆ గొప్ప వెల్లువ కొక మార్గము కల్పించి పోవునట్లుగాఁ జేసినగాని చెఱువు నిలుచుటకు మార్గము లేదు అట్లే యీ దివ్య దంపతులును జెఱువులలోఁ బ్రవహించివచ్చు ప్రణయరస ప్రవాహము ఈ దేవీమణుల మూలముగా

బయటకు వెడలినఁగాని అవి యుండుటకు మార్గము లేదు గనుఁగా నీ దేవీమణుల భోగము లేనియెడల దివ్యదంపతులు దానిని ధరించి యుండుటకు శక్యము గాదనుట మితిమీఱి ప్రవహించినను అది మహా ప్రవాహము గనుక దేవీమణుల భోగమున కే మాత్రమును గొఱఁత గలుగదు

భగవంతుని ననుభవించుట వలనఁ గలుగు ప్రేమరసము కూలంకషముగా వర్ధిల్లినపుడు శ్రీదేవి యితర దేవీమణులతో సంవృత్తమైన తన భోగమును గుఱించి సంప్రతించి, హర్షించి, ధరించును శ్రీదేవి ననుభవించుటచేఁ గలిగిన ప్రేమరస మతిశయించి పొరలినపుడు భగవంతుఁ డితర దేవీమణులతోఁ జేరి యానందించి ధరించునని దెలిసికొనుఁడు

ప్రణయమ్ — పరస్పరానుభవముచేఁ గలుగు ప్రేమ

దేవి . తథా — "త్వాం అను" అనుటచేత శ్రీదేవికి భూదేవి లోఁబడి యుండుటయును, "నీళయా సహ" యనుటలో "సహ" యని యుండుటచే భూదేవికి నీళాదేవి లోఁబడి యుండుటయును దోఁచుచున్నవి

వేయిమంది దేవీమణులలో వీరలు చేరియున్నను, మహిషులను ప్రాధాన్యము నుద్దేశించి వేఱుగాఁ జెప్పఁబడిరి "కప్పుఱొ్క్కవలర్ మడప్పావైయుమణ్మగళుం తిరువుమ్" (శ్రీదేవి, భూదేవి, నీళాదేవి యను నీ ముగ్వురు) పట్టమహిషులని యెఱుఁగునది

యాభిస్త్వం శ్లాఘసే — దీనిచేత శ్రీదేవి కితర దేవీమణులయందు శాత్రవము లేకుండుటయే కాక, వారు భగవంతుని కౌఁగిలించినచో నీయమ మనసులో మహానందము పొంగుచున్న దనఁబడిన దయ్యెను వారు భగవంతుని కౌఁగిలించినచో తన యవయవములచేఁ బ్రియుని ఆశ్లేషించినట్లు శ్రీదేవి దలంచునఁట! ఇతరు లవయవములు, శ్రీదేవి యవయవి — అనుటచేఁ బరస్పరము అసూయాదులకుఁ బ్రసక్తి లేదని చూపినవారైరి శ్రీదేవి తన యవయవములచేత కాంతుని కానందము గలుగఁజేయునట్లు ఇతర దేవీమణులచేత పతిని సంతసింపఁ జేయుచున్నదనుట

ఈ భావము

"తిరుమగళుం మణ్మగళుం మాయ్మగళుం శేర్న్దాల్
తిరుమగట్కే తీర్న్దవా ఱెన్కొల్ — తిరుమగళ్ మేల్
పాలోదమ్ చిన్దప్పడనాగణైక్కిడన్ద
మాలోద వణ్ణర్ మనమ్"

(క్షీరాబ్ధియందున్న చిన్న తుంపరలు పడునట్లు ఫణము లెత్తిన ననంతుని పైఁ బవ్వళించిన సముద్రవర్ణము గల భగవంతుని శ్రీదేవియందుఁగల హృదయము, శ్రీదేవియు, భూదేవియు, నీళాదేవియు సంశ్లేషించిన శ్రీదేవియందే లయించుట యెట్లో!) అను పొయ్గై ఆళ్వారుల శ్రీసూక్తిలో విశదము.

"పిరాట్టి యోడు కలన్దబోదు ‘పుష్పాఙ్గ రాగై స్సమం’ ఎన్గిఱ బడియే అల్లాద పిరాట్టిమార్ ఉపకరణ కోటియిలే నిఱ్పర్గళ్ అల్లాద పిరాట్టిమారోడు పరిమాఱుంబోదు ఇవళ్ తన్ ఇడైయిలుం ములైయిలుం కలన్దాళ్ప్పోలే యిరుక్కుమ్ భోగన్దాన్ ఉత్కృష్టకమ్ (అళవుగడత్తల్) ఆనాల్ వృత్త కీర్తనా (సడనడైక్కుఱుదల్) దిగళుక్కు క్కుట్టమాయ్ నిఱ్పర్గళ్" [శ్రీదేవితో సంశ్లేషించినచో ‘పుష్పాఙ్గ రాగై స్సమం’ అనునట్లు ఇతర దేవీమణులు ఉపకరణ కోటిలో నుందురు ఇతర దేవీమణులతోఁ జేరినపు డీమె తన జఘనములోను, స్తనముల లోను గలిసిన ట్లుండును భోగము మితిమీఱియుండఁగా వృత్త కీర్తనాదులతో నన్వయించుదురు] అను పై పాశుర వ్యాఖ్యానము నిచట నెఱుంగఁదగును

అల్ప సుఖములైన శబ్దాది విషయములను బలువురకు విషయము చాలమి నేకాకిగా నుండియే యనుభవింపవలయును ఇది యపరిమిత సుఖమైన విషయము గనుక ఏకాకిగా నుండి యనుభవింపరాదు గోష్ఠిగోష్ఠిగా నుండియే యనుభవింప వలయును కాన విషయము చాలదే యని కోపించి యనుభవమునఁ దనతోఁ జేరిన యితరులయందుఁ బగ నొందుటకుఁ బ్రసక్తియే లేదని యెఱుఁగునది

తిరువిరుత్తములో శ్రీదేవియు, భగవంతుఁడును బాన్పుపై నుండుటను జూచి భూదేవి యేడ్చిన ట్లొక పాశురము గలదు

"అఱ్ఱైక్కుమ్ కరుఙ్గడల్ వెణ్డిరైక్కే కొణ్డు పోయలర్వాయ్
మఱ్ఱైక్కణ్ మడన్దైయరవణై యేణముఱ్ మాద ర్వాణ్వాయ్
అఱ్ఱైత్తు ప్పులమ్బ ములై మలై మేలిన్దు మాఱుగళాయ్
మఱ్ఱైక్కణ్ణ నీర్ తిరు మాల్ కొడి యానెన్ను వార్కిన్ఱదే"

(తామర పూవున నున్నదై, చల్లని కన్నులు గలదైన శ్రీదేవి పోరుపెట్టు నల్లవన్నె గల కడలియందలి తెల్లనైన కెరటములపైకి నాయకునిఁ దీసికొని పోయి, యాదిశేషుఁడను శయ్యపై నెక్కినపుడు, భూదేవి యాకాశమను తన నోటచే శ్రియఃపతి క్రూరుఁడని ధ్వనిచేసి, ప్రలపించి, యేడ్చి, పర్వతము లను స్తనముల మీఁదనుండి వర్షధార యను గన్నీళ్ళను నదులుగాఁ బ్రవహింపఁజేయుచున్నది)

అవయవి యైన శ్రీదేవి పాన్పు నెక్కఁగా, అవయవమైన భూదేవి దుఃఖించుట పొసఁగునా? యనిన దీని కుత్తర మీ గ్రంథకర్తయే పై పాశుర వ్యాఖ్యానమునందుఁ జెప్పియుండుటను జూడుఁడు "అనుపపన్నమా యిరుప్ప దొరు అర్థత్తై చ్చొల్లవే ఇరఙ్గనే కూడుంబ ఎన్ఱు తలైమగళ్ నెఞ్జిలే పడుమ్ అవళ్ విచారిత్తు నిర్ణయిక్కుఙ్గాట్టిల్ అవన్ వన్దు కొడు నిఱ్కుమ్ ఎన్నుమ్ విస్రంభత్తాలే (నంబిక్కైయాలే) శొన్నార్గళాగ వమైయుఙ్గాణ్ ఎన్ఱు (భట్టర్) అరుళిచ్చెయ్దార్" [అనుపపన్నమైన యొక విషయము చెప్పఁగా నిదెట్లు

పొసఁగునని నాయిక సంశయముసఁ బడును ఆమె విచారించి నిర్ణయించునంతలో నతఁడు (నాయకుఁడు) వచ్చి నిలుచు నను నమ్మకము చేతఁ జెప్పినారనుట సమంజస మని (భట్టరు) అనుగ్రహించిరి] అనునది పై పాశుర వ్యాఖ్యాన శ్రీసూక్తి

స్తనబాహు దృష్టిభిః —ద్వంద్వ సమాసమునందు ప్రాణ్యంగముల కేకవచన ప్రయోగమే యుండవలయును ఇచ్చట బహువచనము ప్రయోగింపఁబడినది ఇందులకు మేము చెప్పు సమాధాన మిది "స్తనౌ చ బాహూ చ స్తనబాహు, స్తనబాహు చ దృష్టీచ - స్తనబాహు దృష్టయః, తాభిః స్తనబాహు దృష్టిభిః" అని వ్యుత్పత్తిఁ జేసకొనుఁడు కాఁగా "స్తనబాహు" అనునది ప్రాణ్యంగముల సముదాయమునే చెప్పుటచేతఁ బ్రాణ్యంగము గామిచేఁ బ్రాణ్యంగములకు వచ్చిన ద్వంద్వ సమాసము కాదిది కాఁగా బహువచన ప్రయోగము సరియైనదే! ద్వంద్వ సమాసమునందలి యన్ని పదములును బ్రాణ్యంగ వాచకములుగ నుండు చోటనే ఏకవచనమును ప్రయోగింపవలయునని తెలిసికొనుఁడు

ఇరువీర్కుమనుభవిత్తఱ్కినియ రాగి
ఇన్దియమ్మై యాదుమలర్ సాన్దు పోల
ప్పెరుకార్కుమ్ పిరేమత్తిన్ వెళ్లమ్ కేడు
పిఱప్పియా వాఱమైత్త మఱుకా లాయ్నిన్
పొరువార్కుమ్ పువిమడన్దై యోడు నీళై
పోన్రవా యిరన్దేవి మార్గళ్ళార్
ఇరుపార్కుమ్ విళ్తికొణ్డై కై కొణ్డెన్న
ఏన్దలై నీ యవరాల్ పుఱుత్తి దేవి! (26)

దేవీ! మీ యిరువురకును (భగవంతునకును, నీకును) చందన కుసుమాదులవలె భోగ్యులై, పరిపూర్ణ ప్రణయ ప్రవాహముచేతఁ జెఱుపు కలుగనియట్లు అమరిన కలుజులై, నీకు సదృశ యైన భూదేవితో నీళాదేవిఁ బోలిన వేయిమంది దేవీమణు లున్నారు నీవు నీ రెండు నేత్రములు, స్తనములు, బాహువులు అను వీని చేతవలె వారిచేత భగవంతు సానందపఱచుచున్నావు (26)

అవతారిక — ఈ విధముగ సపత్నుల విషయమును దెలిపి, దాస్యవర్గమును గుఱించి చెప్పుచున్నారు

తే సాధ్యా స్సన్తి దేవా జనని! గుణవపుర్వేష వృత్త స్వరూపైః
భోగై ర్వా నిర్విశేషా స్సవయస ఇవ యే నిత్య నిర్దోషగన్ధాః।
హే శ్రీః! శ్రీరఙ్గభర్తు స్తవ చ పదపరీచారవృత్త్యై సదాపి
ప్రేమప్రద్రాణ భావావిల హృదయ హఠాత్కార
కైఙ్కర్య భోగాః॥ ॥౨౭॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| జనని! | తల్లియైన | ప్రద్రాణ | కరఁగిన |
| హే శ్రీః | ఓ లక్ష్మీ! | భావ | మనోవికారముచేత |
| యే | ఎవరు | ఆవిల | కలఁతఁ జెందిన |
| గుణ | గుణములచేతను, | హృదయ | హృదయముతో |
| వపుః | దేహములచేతను | హఠాత్కార | బలాత్కారము కల |
| వేష | వేషములచేతను | కైఙ్కర్య | కైంకర్యములను చేయుటలో |
| వృత్త | నడతలచేతను | భోగాః | ఇంపు గలవారో |
| స్వరూపైః | స్వరూపములచేతను | తే | ఆ |
| భోగైర్వా | అనుభవములచేతను | సాధ్యాః | సాధ్య దేవతలు—అనఁగా |
| నిర్విశేషాః | భేదములు లేనివారో, (కనుకనే) | దేవాః | నిత్యసూరులు |
| సవయస ఇవ | మిత్రుల వంటివారో | శ్రీరఙ్గ భర్తుః | రంగనాథుని యొక్కయు |
| నిత్య | ఎల్లప్పుడును | తవ చ | నీయొక్కయు |
| నిర్దోషగన్ధాః | దోషగంధము కూడ లేనివారో, | పద | చరణముల |
| సదాపి | కాలమంతయు | పరీచారవృత్త్యై | కైంకర్య వృత్తికిఁగాను |
| ప్రేమ | ప్రీతిచేత | సన్తి | ఉన్నారు |

సాధ్యా స్సన్తి దేవాః — వేదవాక్యమందున్నది యథాతథముగ ప్రయోగింపఁబడినది. "సాధ్యాః" అనునది నిత్యసూరుల పేరు అడియార్గళ్ కుళ్ఙాఙ్గళై ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో" (దాసుల గోష్ఠిని జేరుట యెప్పుడో) అన్నట్లు ముముక్షులు వీరినే (నిత్యసూరులనే) ప్రయోజనముగా నెన్నుచుందురు కనుక వారికి "సాధ్యాః" అను పేరు గలిగినదని చెప్పుదురు

గుణ......భోగైర్వా — వారికిని, భగవంతునికిని గుణములు లోనగువానిలో లేశమైనను భేదముండదు గుణములు = అపహత పాప్మత్వాద్యష్ట గుణములు, జ్ఞానము మొదలగు గుణములును నగును దేహము = అప్రాకృతమైన దివ్యమంగళ విగ్రహము వేషము = శఙ్ఖ చక్రాదులను ధరించుట నడత = కర్మలకు వశము గాకుండఁ జేయుపనులు స్వరూపము = జ్ఞానానంద అమలత్వాది యగు నాత్మ స్వరూపము భోగము=విభూతితోఁగూడిన పరమాత్మ స్వరూపమును సాక్షాత్తుగాఁ జూచుట "వా" అనునది వికల్పార్థకము కాదు సముచ్చయార్థకము

"సవయసః" అనునది మిత్రత్వముతో సమాన వయస్సును దెలుపును సమానమైన వయస్సు గలవారనియు అర్థమగును అచ్చటివారిరువదియైదు వత్సరముల ప్రాయము గలవారని శాస్త్రములు తెలియఁ జేయుచున్నవి నిత్యసూరుల కి వయస్సు పెరుగుటచేతఁ గాక భగవంతుని నిత్య సంకల్పముచేత నిత్యముగ నమరియున్నదని తెలియునది

నిత్య నిర్దోషగన్ధాః — ఈవఱకుఁ జెప్పినవి ముక్తులకును సమన్వయించును ఇందులో వారలకు లేని శ్రేష్ఠతయును జెప్పఁబడుచున్నది ముక్తులిప్పుడు దోష గంధరహితులైనను పూర్వమందు దోష భూయిష్ఠులే, నిత్యసూరులో యెప్పుడును నిర్దోషులే అని భేదమును గ్రహింపుఁడు

దోషము — క్లేశ కర్మ విపాకాశయములు "హతాఖిల క్లేశమలైః స్వభావతః" అని యాళవందార్లును అన్నారు "అవిద్యాస్మితా రాగ ద్వేషాభినివేశాః క్లేశాః" అనునట్లు అజ్ఞానము, అహంకారము, రాగము, ద్వేషము, అభినివేశము అను నీయైదును క్లేశము లనఁబడును కర్మము వీనికిఁ గారణకార్యములైన పుణ్యపాపములు విపాకము = జాతి, ఆయుస్సు లోనగునవి ఆశయము = పూర్వానుభవముచేతఁ గలిగిన మనస్సునందలి సంస్కారము

ఇది భగవంతునికిని సమన్వయించును అతనికి లేని యతిశయము కడపటి రెండు పాదములలోఁ దెలుపఁబడుచున్నది. కైంకర్య మహారసము ఆనందమయుఁడైన భగవంతునికిని లేనిది ఒకటి, అది దాసులకే ప్రాప్తమైనదని యనుట

లోకములోఁ జేయఁబడు పనులవలెఁ గాక ప్రీతిచేతఁ గరఁగి చిత్తవృత్తి కలఁత నొంది చేయకుండ నిలుపరాక మనఃపూర్వకముగాఁ జేయు కైంకర్యము కనుక ఇది యానందావహంబైన దనుట

"తిరుమాలుక్కాట్టే యాట్చెయ్యా" (శ్రియఃపతికే దాస్యము చేయి) "అడిమై శెయ్వార్ తిరుమాలుక్కే" (శ్రియఃపతికే దాస్యమొనర్తురు) అనునట్లు కైంకర్యము దంపతులకిరువురకిని జేయవలసినది గనుక "రంగనాథునకును నీకును" అనియున్నారు

శేషత్వరసము నెఱింగి చేయు దాస్యమని తెలియుటకుఁగాను "చరణముల కైంకర్య వృత్తి" అని మర్యాదతోఁ జెప్పినారు

ఉన్ ఱార్ పో నట్పురిమై యుడలమ్ కోలమ్
ఉయిరినిలై శెయల్ భోగమ్ పణ్పాడాణ్డిల్
శన్ ఱేనుమాఱిన్ఱి కున్ ఱ మెన్ఱుమ్
సారాదు సాత్తియ దేవర్గళెన్న
ప్పిన్ ఱార్గ ళుళ్ళురుగి కుఴమ్బి యెణ్ణమ్
ప్రేమైయినా ల్పెఱువిత్త పణియిఱ్ పున్ ఱోర్
కున్ ఱేవ ఱ్కుళరిన్ఱోయ్! తిరువే! యెన్ఱుమ్
కుళిరరఙ్గ క్కోనోడున్నన్ కురై కఴఱ్కే. (27)

తల్లియైన శ్రీదేవీ! "సాధ్యదేవు" లనఁబడు నిత్యసూరులు మిత్రుల వలె దేహము, వేషము, ఆత్మస్వరూపము, పని, భోగము, వయస్సు అనువీనిలో లేశమైనను భేదము లేక సామ్యము గలవారై, యెల్లప్పుడును దోష గంధ రహితులై, మనస్సు కరఁగి, భావము గలఁతపొంది ప్రతిచేఁ బొందింపఁ బడిన కైంకర్యానందము గలవారై శ్రీరంగనాథునియొక్కయు, నీయొక్కయుఁ బాద కైంకర్యము కొఱకే సదా యుందురు (27)

---

అవతారిక — శ్రీదేవి లేక భగవంతుని నిరూపించుట యశక్యమని చెప్పుచున్నారు

స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే!
త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్ష సమయే।
త్వమాసీ ర్మాత శ్శ్రీః! కమితు రిద మిత్థన్త్వ విభవః
తదన్తర్భావాత్ త్వాం న పృథ గభిధత్తే శ్రుతిరపి॥ ॥౨౮॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| చన్ద్రవదనే | చంద్రునివంటి ముఖముగల | ఇదం | ఈ |
| | | స్వరూపం | స్వరూపమును |
| మాతః | తల్లియైన | స్వాతన్త్ర్యం | స్వతంత్రత్వమును |
| శ్రీః! | లక్ష్మీ! | త్వత్ | నీయొక్క |
| నిష్కర్ష సమయే | తీర్మానించునపుడు | ఆశ్లేష | సంబంధముయొక్క |
| | | ఉత్కర్షాత్ | అతిశయముచేత |
| భగవతః | భగవంతునియొక్క | భవతి ఖలు | కలుగుచున్నది కదా! |

| | | | |
|---|---|---|---|
| కమితుః | భర్తకు | త్వామపి | నిన్నుఁగూడ |
| త్వం | నీవు | తదస్తర్భా | ఆతఁడు—అట్టివాఁడు |
| ఇదమిద్ధన్త్వ | ఆతఁడు అట్టివాఁడుగా | వాత్ | అని పేర్కొనఁబడు |
| విభవః | నుండుటయను | | గొప్పతనములో |
| | గొప్పతనముగా, | | నణఁగియుండుట చేత |
| ఆసీః | అయితివి | పృథక్ | వేఱుగా |
| శ్రుతిః | వేదము | నాభిధత్తే | చెప్పలేదు |

"ఇతఁడు భగవంతుఁడు" అని భగవంతుని మనము తెలిసికొనఁ గోరినచో లక్ష్మిని పురస్కరించుకొనియే తెలిసికొనవలయును "పేఱక్కరుమాలై ప్పొన్నిని కాట్టాముళ్ కాట్టుమ్ తిరుమాలై నజల్ తిరు" అనునట్లు శ్రీదేవియే పరతత్త్వమును నిరూపించుచున్నది కాఁగా శ్రీదేవిని భగవంతునికి "స్వరూప నిరూపిక" యని శాస్త్రజ్ఞులు సెప్పుదురు (స్వరూప నిరూపిక = స్వరూపమును జూపించునామె) స్వరూపము - నిరూపించు ధర్మముచేత విశేషింపఁబడు ధర్మము గలది బ్రహ్మ మొదలగు నితరులనుండి భగవంతుని వేఱుపఱచి నిరూపించుటచే శ్రీదేవి స్వరూప నిరూపిక యైనదని యనుట

స్వరూప నిరూపక ధర్మమనియు, నిరూపిత స్వరూప విశేషణ ధర్మమనియు ధర్మము రెండు విధములు ఏ ధర్మము లేక ఒక వస్తువుయొక్క స్వరూపము తెలియఁజాలరో ఆ ధర్మము స్వరూప నిరూపక ధర్మమగును ఒక వస్తువుయొక్క స్వరూపము తెలియఁబడిన పిమ్మట దానిని విశేషించు ధర్మములు "నిరూపిత స్వరూప విశేషణ ధర్మము" లౌను ఘటమును దెలిసికొన వలసినపుడు నోరుగను, ఉదరముగను నమరియుండు (ఘటత్వ జాతిని) సంస్థానమును దెలిసికొనిననే గాని ఘటస్వరూపము బోధపడదు కాఁగా ఆ సంస్థానము స్వరూప నిరూపకధర్మమైనది. ఘటమును దెలిసికొనిన పిమ్మట నల్లని ఘటము, ఎఱ్ఱని ఘటము—అని దానిని విశేషించు నలుపు, ఎఱుపు గుణములు నిరూపిత స్వరూప విశేషణ ధర్మములైనవి ఒక వస్తువును "ఇది" యని చూపునట్టి ధర్మము "స్వరూప నిరూపక ధర్మమనియు, "ఇట్టిది" అనుట కుపయోగించు ధర్మములు నిరూపిత స్వరూప విశేషణ ధర్మము లనియు నెఱుంగునది

శ్రీదేవి లేక భగవంతుని నిరూపింప సాధ్యము కాదు శ్రీదేవిని విడిచి వేఱుగా నుండు స్థితి భగవంతునకులేదు శ్రీదేవియును, భగవంతుఁడును జంద్రికా చంద్రులవలె నుందురు

"ప్రభేవ దివసేశస్య జ్యోత్స్నేవ హిమదీధితేః ।
అహన్తయా వినాహం హి నిరూపాఖ్యో న సిద్ధ్యతి॥
అహన్తా బ్రహ్మణస్తస్య సాహమస్మి సనాతనీ ।
అహమర్థం వినా హన్తా నిరాధారా న సిద్ధ్యతి॥"

సూర్యుని వెలుతురువలెను, చంద్రుని వెన్నెలవలెను అహంత లేక అహమనునది సిద్ధింపదు అహమను నాధార వస్తువు లేక అహంత సిద్ధింపదు ఆ పరతత్త్వమునకు నేను (లక్ష్మి) నిరంతమైన అహంతగా నుందునని శ్రీదేవియే యనుగ్రహించియుండుట నిచట తెలియుగునది

ఇంతవఱకుఁ బరతత్త్వమును "ఇది" యని చూపించునట్టి ధర్మముగ శ్రీదేవి యున్నదని చెప్పఁబడినది ఇఁక "ఇటువంటిది" యనుటను జూపించు ధర్మముగాను శ్రీదేవియే యున్నదని చెప్పఁబడుచున్నది శ్లోకములో స్వరూపము అనునది "ఇదం" అంశమును జూపుచున్నది స్వాతంత్ర్య మనునది "ఇత్థం" అను అంశమును జూపుచున్నది ఇత్థం అను అంశముగ శ్రీదేవి యుండుట "స్వాతంత్ర్య రూపా సా విజ్ఞేః" అను అహిర్బుధ్న్య సంహితా ప్రమాణ మూలమున మనకుఁ దెలియుచున్నది శ్రీదేవి స్వాతంత్ర్య రూపముగా నుండుటయే "ఇత్థం" అంశమనుట.

పరతత్త్వము శ్రియఃపతిగానే తోఁచుటచేతను, అట్లు తోఁచిన తత్త్వము లక్ష్మీవల్లభుఁడై, స్వతంత్రుఁడై (స్వాతంత్ర్యమువలెనె సర్వ గుణములను గలిగి యుండుటయు గ్రహించునది) యుండుటచేతను శ్రీదేవి "ఇదం" అంశముగాను, "ఇత్థం" అంశముగాను ఉన్నట్లు గ్రహింపుఁడు శ్రీదేవి లేనియెడల భగవంతుని స్వరూపమునుగాని, గుణములను గాని నిరూపించుట సాధ్యము కాదని తాత్పర్యము

ఇఁక స్వరూపమును "ఇదం" అంశముగాను, స్వాతంత్ర్యమును "ఇత్థం" అంశముగాను అంగీకరింపక స్వరూపమనుదానికి స్వాతంత్ర్యమునకు విశేషణముగాఁ గొని కొందఱు వ్యాఖ్యానింతురు ఆ పక్షమున స్వంరూప్యతే అనేనేతి స్వరూపం అని వ్యుత్పత్తిఁ జేసి తన్ను (భగవంతుని) నిరూపించు స్వాతంత్ర్య మనియు, స్వాతంత్ర్య మనునది అన్ని గుణములకును ఉపలక్షణమనియు "ఇద మిత్థన్త్వ విభవః" అనుదానికి "ఇదం" అనుదానిచేఁ జెప్పఁబడు స్వరూపముయొక్క "ఇట్టిది" యను ధర్మమగు విభవమనియు నర్థము చేయుదురు

త్వదాశ్లేషోత్కర్షాత్ —ఆశ్లేషమున కుత్కర్షము వేఱుపఱచుట కశక్యమై ఒకే తత్త్వ మనునట్లుగఁ జేరియుండుట

నిష్కర్ష సమయే —నిష్కర్షమనఁగా నొక్కటిగా నుండు దివ్య దంపతుల స్థితిని నిశ్చయముగా తెలియుట

"త్వమాసీరాతశ్శ్రీః" అనునది పాఠాంతరము. "అతః" అనుదానికి "అందుచేత" యని కొంద ఱర్థము సేయుదురు "క్రిందఁ జెప్పఁబడిన వాక్యము చేత" యని మఱికొందఱందు కర్థము సేయుదురు "అప్రగృహ్య స్మృతా వాక్యే" అని యమర నిఘంటువు

తదన్తర్భావాత్ —క్రిందఁ జెప్పిన ప్రకారము ఇద మిత్థంత్వాంశములలో నణఁగి పోయినందున-అనుట ధర్మిని జెప్పునపుడు ధర్మము దానిలో నణఁగి

యుండును గదా! అహిర్బుధ్న్య సంహితలో నున్న నారాయణః పరం బ్రహ్మ శక్తి ర్నారాయణీ చ సా వ్యాపికా పతి సంశ్లేషాత్ ఏక తత్త్వ మివ స్థితా" (నారాయణుఁడు పరతత్త్వము ఆ నారాయణి—శక్తి వ్యాపించునది భర్తతో సంశ్లేషించుటచే ఒకే వస్తు వనఁదగునట్లు వారున్నారు) అను శ్లోక మిచ్చట నొక రీతిగా నొప్పియుండుట చూచునది

<u>త్వాం</u> — "అపి" అనుదానిని "త్వాం" అనుదానితో నన్వయించుకొన వలయును త్వామపి=నిన్నుఁగూడ ("అపి" ఉత్కర్షసూచకము) ముఖ్యముగాఁ జెప్పవలసిన నిన్నుఁగూడ అనుట మఱియు, నున్నచోటనే దానిని గొని యర్థము చేసికొనవచ్చును "యథాభూతవాది హి శాస్త్రం" అని ప్రసిద్ధిపొంది సత్యమునే గాని అసత్యమును దెలుపని వేదముకూడ నిన్ను వేఱుగాఁ జెప్పలేదని యభిప్రాయము

<u>పృథక్ నాభిధత్తే</u> — శ్రుతి "విష్ణుపత్నీ" యనియు, "లక్ష్మీ నీ భార్యా" అనియు నీమెను నిర్దేశించుచున్నది పృథక్కై స్వతంత్రముగాఁ జెప్పలేదు విశేషణముగానే యీమె యుండుటంబట్టి యని తాత్పర్యము

"విశేష్యమగు భగవంతుని జెప్పిన యెల్లయెడలను విశేషణమగు శ్రీదేవియుఁ జేర్కొనఁబడినది" అనుట భగవంతుఁడు కారణముగాఁ జెప్పఁబడునప్పుడు లక్ష్మీపతియే యుద్దేశింపఁబడునని యెఱుఁగునది

ఇన్దవిత్తై మైయురిమై ఎమ్బిరాఱ్కు
    యిఱుక్కుమా నీతఘ్రువు మేఱ్పత్తాలే
వన్దనవా మివై తమ్మై మనత్తి లెణ్ణి
    వరై యఱుక్క పుగిన్మలరి న్మగళే! తాయే!
ఇన్దుముఖి! యేన్దలుడై యిదువా న్దనైత్త
    ఇనై యదా న్దనైత్తయవా మేఱ్ప మావాయ్
అన్దముత్తై యడఙ్గుదలా లవను కుళ్ళై
    అరుమత్తైయు మునై వేఱా యత్తైన్ద దిల్లై. (28)

తల్లీ! ఇందుముఖీ! భగవంతుని శేషిత్వము, స్వాతంత్ర్యము, నీ సంబంధాతిశయముచేతనే భగవంతునికి లభించెను వీనిని బర్యాలోచించి నిర్ణయింపఁగా భగవంతుని స్వరూప నిరూపికయు, నిరూపిత స్వరూప విశేషణ ధర్మము నీవేయై యుండుటచేత నీ వతనిలో నణఁగి యంతర్భూతవై యున్నావు అందుచేత వేదమును నిన్ను వేఱుగాఁ జెప్పలేదు.

అవతారిక:— 'మఙ్గళం మఙ్గళానాఞ్చ" అనునట్లు భగవంతుని మంగళ మని చెప్పుట శ్రీదేవీ సంబంధముచేతనే! శ్రీదేవికి మంగళ స్వరూపముగ నుండుటయే స్వభావము, అది కారణముచేత లభించినది కాదని చెప్పుచున్నారు.

తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మఙ్గళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీ రసి యతః।
ప్రసూనం పుష్యన్తీ మపి పరిమళర్ధిం జిగదిషుః
నచైవన్త్వా దేవం స్వదత ఇతి కశ్చి త్కవయతే॥ ॥౨౯॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| కమలే! | లక్ష్మీ! | శ్రీః | మంగళముగనే |
| తవ | నీయొక్క | అసి | (నీవు) ఉన్నావు |
| స్పర్శాత్ | సంబంధముచేత | ప్రసూనం | పుష్పమును |
| మఙ్గళపదం | మంగళమను పదము | పుష్యన్తీం | అతిశయింపఁజేయు |
| ఈశం | భగవంతుని | పరిమళర్ధిమపి | వాసనా సమృద్ధియును |
| స్పృశతి | స్పర్శించుచున్నది. (చెప్పుచున్నది) | జిగదిషుః | చెప్పుటకుఁ గోరు |
| | | కశ్చిత్ | ఒకఁడు |
| ఇదం | ఈ మంగళమను పదము | ఏవన్త్వాత్ | ఇట్లుండుటచేత |
| తవ | నీకు | ఏవం | ఈ విధము (వాసనా సమృద్ధి) |
| ఉపాధేః | ఏ కారణముచేతను | | |
| న ఉపనిపతితం | కలుగలేదు | స్వదతే ఇతి | రసవంతమై యున్నదని |
| యతః | ఎందువలన ననఁగా | నచ కవయతే | వర్ణించుట లేదుగదా! |

"శ్రీః" అను శబ్దము మంగళ మను అర్థము గలది శ్రీదేవి మంగళ స్వరూప గనుక ఆమె కిది నామముగా నమరెను "మఙ్గళం కిమపి యల్లోకే స దిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీనమేవ యదతశ్శ్రీ రిత్యభేదేన వా, యద్వా శ్రీమ దితీదృశేన వచసా దేవి! ప్రథామశ్నుతే" (మంగళ వస్తువులు లక్ష్మికి వశమైనవి ఎల యనఁగా "శ్రీ" యని యైక్యపఱచి చెప్పుటచేతనో, "శ్రీమత్" అని వేఱు పఱచి చెప్పుటచేతనో ఆమె సంబంధముచేత నవి ప్రసిద్ధిఁ జెందుటచే) అని ఆళ్వానులు ప్రసాదించిన రీతిగ, మంగళవస్తువు లన్నియు శ్రీయను నీమె పేరిటనే వ్యవహరింపఁబడుచున్నవి భగవంతుడు నీమె సంబంధముననే మంగళ వస్తు వయ్యె నని యెఱుంగునది. ఈమె యట్లు మఱియొకని సంబంధముచేతఁ గాక సహజముగ మంగళ స్వరూప యని చూపుటకై "శ్రీరసి యతః" అని యన్నారు.

"శ్రియశ్శ్రీః" అని శ్రీ శబ్దముచేత భగవంతుని వీగె వ్యవహరించినది, లక్ష్మిచే నాశ్రయింపఁబడువాఁ డను నర్థములో, మంగళ మను అర్థమునందుఁ గాదని యెఱుంగునది

అతిశయము, అతిశయమును సంపాదించుటయును "శ్రీ" అను మాటకు అర్థమని కొందఱు వచింతురు

దృష్టాంతముచేతఁ గ్రింద నుడివినదానిని తేటపఱచుచున్నారు "ప్రసూనం" ఇత్యాది వాసనచేత పుష్పమున కతిశయము కలుగును, వాసన కతిశయమో స్వాభావికము అది వేఱొక కారణముచేత వచ్చినది కాదు అట్లే భగవంతుఁడు మంగళమగుట శ్రీదేవిచేతనే, శ్రీదేవి మంగళమగుటయో స్వాభావికమే వేఱొక కారణమువలన వచ్చినది కాదని తెల్లమగుచున్నది

"హి" అనుదాని యర్థములో "చ" అనునది వచ్చినది, కదా! యనుట

పరిమళర్ధి మపి — పుష్పమును మాత్రమే పేర్కొనఁ గోరుటయే గాక దాని వాసనాతిశయమును బేర్కొనఁ గోరువాఁడనుట

పుష్పమును, వాసనను దృష్టాంతముగాఁ జూపుటచేత వేఱుపఱుపరాని స్థితియు, శ్రీదేవికి భగవంతునిఁ బట్టియే స్థితి గలుగుటయుఁ దోఁచుచున్నవి "ప్రభయుఁ బ్రభావంతుఁడును వలె, పుష్పము గంధమువలె వేఱుపఱచు స్థితిలేదు" (అగ ప్పిరిత్తు నిలై యిల్లై, ప్రభైయైయుం ప్రభావనైయుం, పుష్పత్తైయుం మణత్తైయుం పోలే) అను ముముక్షుప్పడి వాక్యమిచట ననుసంధేయము

ఇఁక వాసనచే నతిశయము పొందియున్నను, బుష్పములను, సౌరభముండుట చేతఁ బ్రేమించుచున్నామని చెప్పువారు లేరు కారణముఁ దెలుపక జాజిపుష్పము కోరఁదగినదే యని యందురు. అట్లే శ్రీదేవిచేత భగవంతుఁడు మంగళమయుఁ డైనను ఆ కారణమునుజూపి మంగళమయుఁడని యెవ్వరును జెప్పరు భగవంతుఁడు మంగళస్వరూపుఁ డనియే చెప్పుదురు ఇట్లును గొంద ఱుత్తరార్థమునకు భావమును వక్కాణింతురు అది సరసమగునేని దానిని గ్రహింపవచ్చును

కవయతే — ఈ పదమునకు నిష్పత్తి విచారింపఁ దగినది వర్ణించుట అను నర్థములో "కవతే" అనియే యుండవలయును ఇఁక "కవిరివ ఆచరతి" (కవివలె నటించుచున్నాఁడు.) అను నర్థముచేసి నిర్వహింపఁ జూచినను "కవయతి" అనియే కావలయును "కవయతి" అను పదము చాల చోట్లలో వ్యవహరింపఁబడి

యున్నది ఈ గ్రంథమున నే "ప్రయతామహే కవయితుం" అని యుపయోగిం చుటను గమనించునపుడు అక్కడ కవివలె నటించుట కను నర్థము చక్కఁగాఁ బొసఁగి యుండుటను గుర్తించునపుడు "కవయతే" అను ప్రయోగము వేఱు యెక్కడైన నున్నదా? యని వెదకి చూడవలయును ఇఁక "కు శబ్దే" అను ధాతువునుండి నిష్పన్నమైన "కవ" అనుదాని పైని "తత్కరోతి తదాచష్టే" అను విధిప్రకారము "ణిచ్" ప్రత్యయము వచ్చి "కవయతే" అని యైనదని దీని కుపపత్తి చెప్పవచ్చునని దోఁచుచున్నది ప్రాజ్ఞులు విమర్శింతురు గాక!

మఙ్గళ ప్పెయ రీశఱ్కు వన్దదున్ తోడర్పా నిఱ్కో
అఙ్గన న్ఱుదియదైక్కు యల్లైయో తిరునీ? అల్లి
నఙ్గైయే! శిఱ ప్పులర్కు నఱుమణత్తాల దఱ్కుమ్
ఎఙ్గనమ్ శిఱప్పా క్కేతు వియమ్బువన్ కవిఙ్ఞన్ మాదో (29)

ఓ కమల నివాసిని! భగవంతునికి మంగళ మనుపేరు నీ సంబంధము చేతనే లభించినది నీకో యట్లుగాక యది స్వభావ సిద్ధమైనది నీవు శ్రీవి కావా? పుష్పమున కతిశయము సువాసన చేత, ఆ సువాసనకును అతిశయమునకు హేతువు నొక కవి యెట్లు చెప్పును? (29)



అవతారిక —శ్రీదేవిచేత భగవంతుఁడు మంగళ మగుట మాత్రమే కాదు, ఈశ్వరత్వముకూడ నీమె పూర్ణకటాక్షము చేత లభించిన దనియు, స్వల్ప కటాక్ష మునకుఁ బాత్రులయిన వారు ఇంద్రాదులైరనియు, కనుక భగవంతుని, ఇంద్రాదులను సంబంధించిన వేదము పర్యవసానమున లక్ష్మినే వర్ణించిన దనియుఁ జెప్పుచున్నారు

అపాఙ్గా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్
అమీ యత్ర ద్విత్రా స్స చ శతమఖాది స్తదధరాత్ ।
అతశ్శ్రీ! రామ్నాయ స్తదుభయ ముశంస్త్వాం ప్రణిజగౌ
ప్రశస్తి స్సా రాజ్ఞో యదపి చ పురీ కోశ కథనమ్॥ ॥30॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీః | లక్ష్మీః | అభూత్ | ఆయెను, |
| భూయాంసః | అధికములైన | అతః | అందువలన |
| అపాఙ్గాః | కటాక్షములు | తత్ | ఆ |
| యదుపరి | దేనిపైని (పడుచున్నవో) | ఉభయం | పరబ్రహ్మము, ఇంద్రాదులు—అను వీరిద్దఱిని |
| తత్ | అది | | |
| పరం బ్రహ్మ | పరబ్రహ్మముగా | ఊశే | పేర్కొను |
| అభూత్ | అయినది, | ఆమ్నాయః | వేదము |
| యత్ర | ఎవరిపైని | త్వాం | నిన్ను |
| అమీ | ఇవి (కటాక్షములు) | ప్రణిజగౌ | బాగుగాఁ జెప్పెను, |
| ద్విత్రాః | రెండు మూఁడు (పడినవో) | పురీ | నగరముయొక్కయు |
| | | కోశ | బొక్కసముయొక్కయు |
| స చ | అతఁడును | కథనం | వర్ణన యనునది |
| తదధరాత్ | ఆ బ్రహ్మమునకుఁ దక్కువయైన | యదపి | ఏది గలదో |
| | | సా చ | అదియును |
| శతమఖాదిః | ఇంద్రుఁడు లోనగువారుగ | రాజ్ఞః | రాజుయొక్క |
| | | ప్రశస్తిః | పొగడుటయే (యగును). |

ఏదేని ఒక వస్తు వుండుగాక, శ్రీదేవి కటాక్షమును బూర్ణముగాఁ బొందిన యెడల నదియే పరబ్రహ్మ మగును. ఈ గ్రంథకర్తయే "చిదైక్యాన్త దాత్రి" అను తిరువిరుత్త వ్యాఖ్యాన వ్యాఖ్యానములో "ఈమె పాదముల స్పర్శము గలిగిన యినుక పరబ్రహ్మము కాదా?" అని ప్రసాదించినారు అట్లే, ఈమె పూర్ణ కటాక్షమునకుఁ బాత్రమైన వస్తు వేదయినను నది పరతత్త్వ మగునని గ్రహింపునది

నిత్యము శ్రీదేవి పూర్ణ కటాక్షము పొందుటచేత భగవంతునకు నిత్యముగ శేషిత్వము సిద్ధించుచున్నది "మలరాళ్ మణనోక్కు ముణ్డానే" (శ్రీదేవి కటాక్షమే భగవంతునికి ధారకము) అని తిరుమంగై యాళ్వారుల సూక్తి "న జీవేయం క్షణమపి వినా తా మసితేక్షణాం" — శ్రీదేవి కటాక్షము లేక క్షణమైనను జీవింపఁ జాలనని భగవంతుఁ డన్నాఁడు

"శ్రద్ధ (లక్ష్మీ) చేతనే దేవుఁడు దేవత్వమును జెందుచున్నాఁడు" అను శ్రుతి వాక్యముయొక్క యర్థమును గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నారు. "తిరువిన్ఱ పక్కం తిఱవిదు" అని తిరుమళిశై ఆళ్వారుల సూక్తి

పూర్ణ కటాక్షము లభింపక, రెండు మూఁడు కటాక్షములను మాత్రమే పొందినవారు భగవంతునికి లోఁబడిన ఇంద్రాది దేవతలైరి నూఱు అశ్వమేధ యాగములు చేసి పొందఁ దగిన యింద్ర పదవియొక్క ఔన్నత్యమును "శతమఖ" అను పదము చూపుచున్నది ఇంద్రునిఁ జెప్పుట బ్రహ్మాదులకును నుపలక్షణము

"బ్రహ్మాద్యాశ్చ సురాస్సర్వే మునయశ్చ తపోధనాః।
ఏధన్తే త్వత్పద చ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి!"

అని బ్రహ్మాదులకు గొప్పతనము గలుగునది శ్రీదేవివలననే యని తెలియు చున్నది

ఇచటఁ బైనుండు పరబ్రహ్మమును, క్రిందనుండు ఇంద్రాదులను చెలుపుటచేత వీరి మధ్యనుండు బ్రహ్మాదు లందఱు పేర్కొనఁబడిన ట్లనుటయు నగును

"అపి" అనుటచేతఁ గటాక్షమే కొంచెము దూరముగా నుండుట తెలుపఁ బడుచున్నది ఆ కటాక్షము సాధారణముగ దుర్లభమని తాత్పర్యము

అధరాత్ —అన్వయము

శ్రీదేవిచేతఁ బేర్మిఁ బొందిన పరబ్రహ్మమును, ఇంద్రాదులను వర్ణించు వేదము చివర పేర్మిని బొందఁజేసిన శ్రీదేవినిగుఱించి వర్ణించుటలోనే యుద్దేశము కలదని మూఁడవ పాదముయొక్క తాత్పర్యము

ఒక రాజుయొక్క పురమును ధనాగారమును వర్ణించిన, ఆ వర్ణన రాజు విషయముగనే పర్యవసించునటుల, పరబ్రహ్మమును, ఇంద్రాదులను వేదము వర్ణించిన, అది శ్రీదేవియందే పర్యవసించు నని నాల్గవ పాదముయొక్క యర్థము

రాజువలె శ్రీదేవి, నగరమువలెఁ బరబ్రహ్మము, బొక్కసమువలె నింద్రాదులు అని విభజింపుఁడు సర్వమునకు నాధారముగ నుండుటనుబట్టి పరబ్రహ్మము నగరమువంటిది పరబ్రహ్మమునందే యావిర్భవించి అందులోనే యుండుటచే నింద్రాదులు బొక్కసమువంటివా రగుచున్నారు

సా చ — "చ" విధేయ సముచ్చాయకము రాజును సాక్షాత్తుగా శ్లాఘించుటవలె నతని నగరమును బొక్కసమును బొగడుటయు నతని ప్రశస్తియే యనుట.

యదపి — "అపి" ఉద్దేశ్య సముచ్చాయకము రాజును గుఱించిన వర్ణనతోఁ బాటు నగర, కోశముల వర్ణనయు నని యర్థము.

ప్రశస్తిస్సా — ఇచ్చట విధేయము ననుసరించి తచ్ఛబ్దము స్త్రీలింగమైనది

"స్వరూపం" అను శ్లోకములో శ్రీదేవి భగవంతుని ధర్మము గనుక ఆమెను గుఱించి వేదము వేఱుగాఁ బఠింపలే దన్నారు ఈ శ్లోకములోఁ దత్త్వమును విమర్శించి చూడఁగా వేద మామెను వర్ణించియే యున్నదని యొకరీతిగ సమర్థించి నారు ఇచ్చట సామాన్యార్థము విశేషార్థమును సమర్థించుటచేత అర్థాంతర న్యాసాలంకార మని వ్యాఖ్యానించి యున్నారు ఇచట "ప్రతివస్తూపమ" యని తోఁచుచున్నది

కడై క్కణాల్ తిరు! నీ మిక్కు క్కణ్డదు పరబ్బిరమ్మమ్
పడై త్తన విన్దిరాది పార్వైగ ళిరణ్డు మూన్ఱే
ఎడుత్తిరు పొరుళు మోడి ఇయమ్బియ దున్నై యే వేదమ్
పడిత్తిడి నగర్ శెల్వజ్గళ్ పార్థివ్ పుగర్ద్ వా గాదో? (30)

శ్రీదేవి! నీ క్రేఁగంటి కటాక్షములకు సంపూర్ణ పాత్రమైనది పరబ్రహ్మము రెండు మూఁడు కటాక్షములే యింద్రాదులను సృజించెను పరబ్రహ్మమును, ఇంద్రాదులను వర్ణించిన నిన్నే వర్ణించినది నగర కోశములను బొగడిన రాజును బొగడుట గదా! (30)



అవతారిక — భగవంతుని శేషిత్వమునకు శ్రీదేవి యాధార మగునెడల, నతనికి నైసర్గికాతిశయము లేదనుట కాదా? యను వారి కీ శ్లోకమున దృష్టాంత ముతో సమాధానము వచించుచున్నారు

స్వతశ్శ్రీ! స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వేఽప్యభవ దపరాధీన విభవః ।
స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం
న కుణ్ఠస్వాతన్త్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్॥ ॥31॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీః | లక్ష్మీ! | అభవత్ | అయి యున్నాఁడు |
| త్వం | నీవు | రత్నం | రత్నము |
| విష్ణోః | భగవంతునికి | స్వయా | తనదైన |
| స్వతః | స్వభావముగనే | దీప్త్యా | కాంతిచేత |
| స్వం | సొత్తుగా | మహార్ఘ్యం | గొప్ప విలువ గలదిగా |
| అసి | ఉన్నావు | భవత్ అపి | అయినను |
| తత ఏవ | అందుచేతనే | విగుణం | గుణహీనము |
| ఏషః | ఈ | న | కాదు |
| భగవాన్ | రంగనాథుఁడు | కుణ్ఠ- | ముఖ్యత్వము తగ్గి |
| త్వదాయత్త- | నీ కధీనమైన | స్వాతన్త్ర్యం | పోయినట్టిది గాను |
| బుద్ధిత్వేఽపి | శ్రేష్ఠత గలవాఁడుగా నున్నను | న | కాదు |
| | | అన్య | మఱియొకదానిచేత |
| అపరాధీన | మఱియొకరిచేత నేర్పడని | ఆహిత | ఏర్పడిన |
| విభవః | వైభవము కల వాఁడుగా | గుణం చ | శ్రేష్ఠత గలిగినది |
| | | న చ భవతి | అగుటయు లేదు |

సదా భగవంతునికిఁ జేరిన సొత్తు శ్రీదేవి ఆమెచేతఁ గలుగు నతిశయము భగవంతునికిఁ గొఱఁత కానేరదు సొత్తు స్వామికి నతిశయమును గలిగించును స్వత్వము లేక స్వామిత్వ మెట్లు కలుగును? కాఁగాఁ దన్నుఁ జేరిన సొత్తువలనఁ గాక వేఱు వస్తువుచేత శ్రేష్ఠత గలిగినట్లయిన నది కొఱఁతయే! తన సొత్తుచేఁ గలుగు నతిశయము తన ప్రాధాన్యమున కనుగుణమే యనుట

“స్వత్వ మాత్మని సఞ్జాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితం” అనునట్లు భగవంతుఁడు స్వామి యనియు, శ్రీదేవి లోనగు సకలాత్మవర్గములు సొత్తనియుఁ దెలిసికొనుఁడు

తన గుణములచేత నేర్పడు నతిశయమువంటిదే! తన సొత్తైన శ్రీదేవిచేత నేర్పడు నతిశయముకూడ నని యనుచు “భగవాన్” అనెదరు భగవాన్ = గుణములు గలవాఁడు

దీనిని గడపటి రెండు పాదములచేత దృష్టాంత మూలముగా విశదపఱచుచున్నారు “రత్నము కాంతిచేత వెలగలది యైనచో, నది యన్యాయత్తము కాదు కదా!” (రత్నం ఒళియినాలే విలై పెఱ్ఱాల్ అన్యాయత్త మాగాదిఱే) అని నంబిళ్లై వచించినారు కాంతి తనదే యైనందున, దీనిచేత రత్నము వెల గలిగినదైనను దాని మహిమ తగ్గదు వెలను గలుగఁజేయు కాంతికె ప్రాధాన్యము. రత్నమున కది లేదని చెప్పుటకు వీలులేదు కాంతిచేత నయ్యేనే గాని కేవల

రత్నమునకు మహిమ లేదని చెప్పుటయు సరికాదు అట్లే శ్రీదేవిచేత నతిశయము పొందినను నతని మహిమ కెట్టి కొఱంతయు లేదు ఆతని ప్రాధాన్యమునకును హాని లేదు స్వాభావిక మహిమ లేదనియుఁ జెప్పుటకుఁ జోటు లేదు—అని తెల్లమగుచున్నది

"స్వతః" అనుదానికిఁ దన యిచ్ఛచేత అని యర్థము చేసినవారును గలరు శ్రీదేవికి శేషత్వము ఇతర జీవులకు వలె స్వరూపముచేత వచ్చినది కాదు. ఇష్టపడి తాను పత్నిగా నుండుటనుబట్టి వచ్చినదని వారి యభిప్రాయము కనుక ఆ విధముగా వారు వ్యాఖ్యానము చేసిరి

"స్వరూపం" అను శ్లోకములో వివరించిన విధమున భగవంతుని స్వరూపము లోనే యంతర్భూతమై యుండుటవలన శ్రీదేవి పృథక్కైన వస్తువు కాదు కాఁగా మఱియొక వస్తువుచేత వచ్చిన మహిమ యని భగవంతునియెడఁ గొఱఁత చెప్పుటకు మార్గము లేదని భావము

ఇయల్బిని ఓ్ఱ్చత్తా మున్నాల్ ఇత్తై శిఱప్పెయ్‌ది నాలుమ్
అయల్పారు శాలే యాగుమ్ అదిశయ ముడైయ నాగా
నుయ ఒళి తులక్కు మేనుం తూమణి గుణ మఱ్ఱాన్ఱాల్
ఉయర్ద్నదు తిరు! ముదన్మై ఒళిన్దదే ఉరైక్కప్పోమో? (31)

శ్రీదేవీ! భగవంతునికి స్వభావసిద్ధముగా సొత్తైన నీచేత నతఁడు అతిశయము నొందినను, తనకంటె వేఱుగా నుండు వస్తువుచేత నతిశయము పొందినవాఁడు కాఁడు గుణహీనుఁడు కాఁడు ప్రాధాన్యము లేనివాఁడు కాఁడు కాంతిచేతఁ బ్రకాశించు రత్నము అ కాంతి తనకు సొంతమైనందున రత్నము గుణరహితమును ఇతర వస్తువుచేత నతిశయము పొందినదియును, ప్రాధాన్య రహితమును అని చెప్పవచ్చునా? (31)

---

అవతారిక —ఇట్లు శ్రీదేవి స్వరూపమును ఇంతవఱకు ననుసంధించి, ఇఁక స్వరూపమందును, దివ్యమంగళ విగ్రహము నందును ఉండు సుగుణములను వర్ణించువారై భగవంతునియొక్కయు, శ్రీదేవియొక్కయు సామాన్య గుణములను వర్ణించుచున్నారు

ప్రశకన బల జ్యోతిర్ జ్ఞా నైశ్వరీ విజయప్రథా
ప్రణత వరణ ప్రేమ క్షేమఙ్కరత్వ పురస్సరాః।
అపి పరిమళః కాన్తి ర్లావణ్య మర్చిరి తీన్దిరే!
తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః॥ ॥32॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| ఇన్దిరే! | శ్రీదేవీ! | పురస్సరాః | మున్నుగునవియు, |
| ప్రశకన | శక్తి | అపి | మఱియు |
| బల | బలము | పరిమళః | సువాసన |
| జ్యోతిః | తేజస్సు | కాన్తిః | సౌందర్యము |
| జ్ఞాన | జ్ఞానము | లావణ్యం | లావణ్యము |
| ఐశ్వరీ | ఐశ్వర్యము | అర్చిః | మెఱుఁగు |
| విజయ | వీర్యము | ఇతి | అనునట్టి |
| ప్రథా | ప్రసిద్ధి | ఏతే | ఈ |
| ప్రణత వరణ | ఆశ్రితులను వరించుట | గుణరాశయః | గుణసమూహములును |
| ప్రేమ | ప్రీతి | తవ | నీకును |
| క్షేమఙ్కరత్వ | క్షేమములను కలుగఁ జేయుట (ఇవి) | భగవతశ్చ | భగవంతునకును |
| | | సాధారణాః | సామాన్యములైనవి |

ఈ శ్లోకమునందు మొదటి భాగమున దివ్యదంపతులయొక్క సాధారణములైన ఆత్మగుణములను, మూఁడవ పాదములో సామాన్యములైన దివ్యమంగళ విగ్రహ గుణముల ననుసంధానము చేయుచున్నారు

ప్రథమ పాదములోఁ జేర్కొనఁ బడిన యాఱు గుణములును "షాడ్గుణ్యం" అనఁబడును ఇవి యితర గుణములకు ఊటవలె మూలంబై యుండుటచేత ముఖ్యమైనవి కనుకనే షాడ్గుణ్యము మొట్టమొదటఁ జేర్కొనఁబడినది. "జ్ఞానాది షడ్గుణమయీ" అని శ్రీదేవి పేర్కొనఁబడుట చూచునది

"ప్రశకనం"=ఉత్కృష్టమైన శక్తి యని యర్థము శ్రుతిలోను "పరాశక్తి" యని చెప్పఁబడియున్నది ప్రశకన మనఁగాఁ బ్రవర్తించు చేతనులకు శక్తినొసంగి ప్రవర్తింపఁజేయునట్టి ధర్మము దీనిని వేఱు విధముగను వివరింతురు.

బలము—తన సంకల్పముచేత సకల వస్తువులను ధరించియుండు శక్తి

జ్యోతిస్సు—తేజస్సు, పరాభిభవన సామర్థ్యము ఏ కార్యమునందును సహాయము నెదురుచూడనిది కూడ నగును

జ్ఞానము — సర్వము నొకప్పుడే సర్వకాలములందును ఉన్నదున్నటులే తెలిసికొనుట,

ఐశ్వరీ—తన యిష్టప్రకార మన్నింటిని నియమించుట.

విజయము—వీర్యము, విశేష జయము - విజయము జయములో విశేష మనఁగాఁ బ్రయాస లేక జయమును బొందుట ఈపదము ఆయాసమునకు హేతు వుండినను ఆయాసము లేకుండుట యని వీర్యమును లక్షించుచున్నది ఆఱు గుణములను నిర్దేశించు ప్రకరణము గావున నీవిధముగనే యర్థము చేసికొనవలయును వీర్యం—సర్వమును ధరించి నియమించి యుండగా భ్రూస్థలములో స్వేదము కలుగ కుండు అనాయాసము.

ప్రథా—"ఎన్నై యాక్కి ఎనక్కే తన్నై తన్ద కఱ్పక" మన్నట్లు దాసులనుజేసి, వారికి తన్నే యిచ్చుకొనుట చేత లభించు గొప్ప కీర్తి

ఇక "విజయప్రథా" అని ఏక పదముగా గ్రహించి "జయముచేత లభించిన కీర్తి" యని చెప్పువారును గలరు,

ప్రణత వరణము—దాసుల నంగీకరించుట, ప్రణతులు అని వరణము అని యర్థము చేసి యాదృచ్ఛిక సుకృత లేశమును గలిగించి, తన యభిప్రాయముచే దాసు లని యంగీకరించుట యను సరసమైన వివరణమును గలదు

ప్రేమ—దాసుల వియోగమును సహింపకుండు ప్రీతి

క్షేమఙ్కరత్వం—దాసుల కనిష్ట నివారణమును, ఇష్టప్రాప్తిని జేయుట

ఇంతవఱకు ఆత్మ గుణములను వర్ణించి, యిఁక దివ్యమంగళ విగ్రహగుణములను వివరించుచున్నారు

లావణ్యముతోఁ గూడఁ బరింపఁబడినందునఁ గాంతి యిచ్చట సౌందర్యము, సౌందర్యము—అవయవ శోభ, లావణ్యము—సముదాయ శోభ

ప్రకాశనము మొదలగు గుణము లుండుటచేత వచ్చిన పేర్మిచేత భగవంతుని "భగవతః" అని నిర్దేశించుచున్నారు

ఒక్కొక్క గుణమును వేఱువేఱుగా నిర్దేశించి, చివర ఈ గుణము లని చెప్పక, ఈ గుణరాసులని జెప్పుటవలన ఒక్కొక్కటే వృద్ధిపొంది రాశి రాశిగా నున్నదని తోఁచుచున్నది

సామాన్య గుణపట్టికలో "క్షేమంకరత్వము" చెప్పఁబడినను బ్రమాణముల ననుసరించి ఈ గుణము భగవంతుని యొద్ద సాక్షాత్తుగా నున్నదనియు భగవంతుని మూలముగా శ్రీదేవియం దున్నదనియుఁ దెలియునది

ఇట్లే యీ గుణములు భగవంతునికి స్వాధీనముగాను, అనఁగా వేఱొకరి సంకల్పము చేత గాక ఏర్పడిన వనియు, లక్ష్మికిఁ బరాధీనముగా — అనఁగా భగవంతుని సంకల్పము చేత నేర్పడిన వనియు గ్రహింపుఁడు లక్ష్మి గుణములును స్వాధీనములే యని కొందఱి మతము,

మిగుమాఱ్ఱల్ బలమ్ తేశు మెయ్యుణర్ తల్
విజయమ్ శేర్ పుగళుడనే ఐశువర్యమ్
అగవాయి లన్బుడైమై యణ్డినారై
ఆదరిత్తు వయమాక్కల్ కాత్తలాది
మగిళ్ వేఱ్ఱు ముయిర్గుణను ముఱుప్పిల్ మేవుమ్
వనప్పు మణమ్ ఒళిమేని యఴగెఱిన్న
భగవానుమ్ నీయుమేయి ప్పణ్పి నజ్గళ్
పరమేశువరి! పొదువాయ్ పడైత్తు ళీరే. (32)

ఓ పరమేశ్వరీ! పరాశ క్తి, బలము, తేజస్సు, జ్ఞానము, వీర్యము, కీర్తి, ఐశ్వర్యము, ప్రేమ, ప్రణతుల నాదరించి వశపఱచుకొనుట, క్షేమంకరత్వము లోనగు నాత్మగుణములును, మఱియు నవయవశోభ, సౌరభము, ఉజ్జ్వలత, లావణ్యము అనునట్టి దివ్యమంగళ విగ్రహ గుణములును నీవును భగవంతుఁడును సామాన్య గుణములుగఁ బడసి యున్నారు (32)



అవతారిక —మఱియు యౌవనము మొదలగు గుణములు ఉభయుల కుండు సామాన్య గుణములని వర్ణించి, దంపతులకుఁ బరస్పరము గుణములు భోగ్యంబులుగా నుండుటను దెలుపుచున్నారు

అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః
శ్రీరఙ్గ మఙ్గళ విజృంభణ వైజయన్తి!
తస్మింస్తవ త్వయి చ తస్య పరస్పరేణ
సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే॥ ॥33॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గ | శ్రీరంగమునందు | యౌవన | యౌవనము లోనగు |
| మఙ్గళ | మంగళములను | ముఖా అపి | గుణములును |
| విజృంభణ | విస్తరింపఁజేయు | యువయోః | మీ యుభయులకు |
| వైజయన్తి! | ధ్వజమువంటిదానా! | సమానాః | సమానములుగ నుండి |
| అన్యే | ఇతరములైన | | నవై |

| | | | |
|---|---|---|---|
| తవ | నీయొక్క (గుణములు) | దర్పణే ఇవ | అద్దమునందు వలె |
| తస్మిన్ | అతనియందును, | పరస్పరేణ | అన్యోన్యము |
| తస్య | అతనియొక్క (గుణములు) | సంస్తీర్య | వ్యాపించి (ప్రతిఫలించి) |
| | | ప్రచురం | ఎక్కువగా |
| త్వయిచ | నీయందును | స్వదన్తే | రసవంతములుగానున్నవి |

భగవంతుని గుణము లద్దమునందుఁ గానఁబడు తన గుణములే యని యెంచి శ్రీదేవి సంతోషపడుచున్నది ఇట్లే శ్రీదేవి గుణములను అద్దములోఁ జూచి తన గుణములని యెంచి భగవంతుఁడు హర్షించుచున్నాఁడు—అనుట

ఒక్కటియే యనఁదగినట్లు అంతయును సమానముగా నుండుటంజేసి ఒకరి గుణములను మఱియొకరు తమ గుణములేయని తలంచి హర్షించుచున్నారని భావము

తన సౌందర్యమును దానే సాక్షాత్తుగాఁ జూచుకొనుటకంటె దర్పణములోఁ జూచుట యెట్లు సంతోషావహమో, అట్లె తన గుణమును దాను సాక్షాత్తుగాఁ జూచుకొనుటకంటె నితరుల యెడఁ జూచుట (శ్రీదేవి భగవంతుని యందును, భగవంతుఁడు శ్రీదేవి యందును) యత్యానంద దాయకమగునని యెంచి "ప్రచురం స్వదన్తే" అని యన్నారు

అపి—సముచ్చయార్థకము, ఇది యిదివరలోఁ జేర్కొనిన ప్రశంసము లోనగువానిని సూచించును

"యౌవన ముఖాః" అనుటచేత ఆర్జవాదులగు నాత్మగుణములును, మార్దవాదులగు దివ్యమంగళ విగ్రహ గుణములును గ్రహింపఁ దగినవి.

"శ్రీరఙ్గ మఙ్గళ" అనునది శ్రీరఙ్గనాథునిఁ జెప్పుచున్నదై, అతని కతిశయమును గలుగఁజేయు ధ్వజము వంటిదానా! అనియు నర్థము నుడివెదరు

ఇన్నము మిరువర్ తఙ్గళ్ ఇళమై ముఖ్ న్నిట్ట పణ్బు
మన్నియే పొదువాయ్ మాఱి మాఱి మఱ్ఱవరిఱ్ఱోన్ఱి,
నన్నిలై క్కణాడి యిఱ్పోల్ ననితిగళ్ న్దళిక్కు మిన్బమ్
మన్నుతెన్నరఙ్గత్తోఙ్గు మఙ్గళక్కొడి పోల్ వాళే! (33)

శ్రీరంగమునందు ఉన్నతమైన మంగళ ధ్వజమువలె నుండు లక్ష్మీ! మీ యుభయులయందుండు యౌవనము మొదలగు గుణములు సామాన్య గుణములుగా నుండి, పరస్పరము మాఱిమాఱి తోఁచి నిలువుటద్దమునందు గోచరించునట్లు ఎక్కువ యింపును గలిగించును. (33)

**అవతారిక** — ఇట్లుభయులకు సామాన్యములైన గుణము లుండినను విలక్షణమైన రసానుభవమునకై స్త్రీకే యుండఁదగిన గుణములును, పురుషునికే యుండఁదగిన గుణములును గలిగినవారై దంపతులుగా మీరు వేఱుగా నుందురని విభజించు నాత్మగుణముల ననుసంధించుచున్నారు

యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతా శత్రు శమన
స్థిరత్వాదీన్ కృత్వా భగవతి, గుణాన్ పుంస్త్వ సులభాన్।
త్వయిస్త్రీత్వైకాన్తాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా
క్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా॥ ॥38॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| యువత్వాదౌ | యౌవనము మొదలైనవి | మ్రదిమ | మనోమార్దవము |
| తుల్యే అపి | సమానముగా నుండినను | పతిపారార్థ్య | పతికిఁ బరతంత్రముగా నుండుట |
| భగవతి | భగవంతు నెడ | కరుణా | దయ |
| పుంస్త్వ సులభాన్ | పురుషత్వమునకై తగిన | క్షమా— | ఓర్పు |
| అపరవశతా | స్వాతంత్ర్యము | ఆదీన్ | లోనుగాఁ గల |
| శత్రుశమన | శత్రువులను శమింపఁ జేయుట | గుణాన్ | గుణములను |
| స్థిరత్వ | దృఢముగా నుండుట | కృత్వా వా | అనుసంధించియు |
| ఆదీన్ | లోనగు | భోక్తుం | అనుభవించుటకు |
| గుణాన్ | గుణములను | యువయోః | మీయుభయులయొక్క |
| కృత్వా | అనుసంధించియు | ఆత్మని | స్వరూపములో |
| త్వయి | నీయందు | భిదా | భేదము |
| స్త్రీత్వ— ఏకాన్తాన్ | స్త్రీత్వమునకే తగిన | భవతి | ఏర్పడుచున్నది |

ఒక విధముగానే రసము ననుభవించుటకంటె వేర్వేఱు రసములను గలిపి యనుభవించు టెట్లు రసవంతమో, యట్లే యొకే విధమైన గుణములతోఁ బాటు వేర్వేఱు గుణములను గలిపి యనుభవించుటకుఁగాను మీలో నొకరు పురుషుఁడుగాను, మఱియొకరు స్త్రీగాను వేర్వేఱుగా నున్నారనుట ఈ విలక్షణమైన గుణభేదము లేనిచో మీ స్వరూప భేదము నిష్ప్రయోజనమైన దగును.

ఇఁక మీయందు వేర్వేఱు గుణములను బృథక్కుగా మీ దాను లనుభవించుటకు మీలోని యాత్మభేద ముపయోగపడుచున్నదని కొందఱు వచింతురు వారు "అనుభవించువారికి" (అనుభవితౄణాం) అను మాటను దెచ్చి పెట్టుకొని యట్టి యర్థము సేయుదురు "పరస్పరేణ స్వదన్తే" అని యిదివఱకు "హరౌ త్వయి చ

. ..."నిర్విశసి" అని వెనుకఁ జెప్పఁబడినందు కుచితముగ, ఇచటను దంపతుల యనుభవమే గ్రంథకర్త యాశయమని తోఁచుచున్నది

యువత్వాదౌ తుల్యేఽపి — ఇదివఱకు నుడివిన యౌవన ముఖాః అను దాని నితర విశేష గుణములను దెల్పుటకై యనువదించిరి

స్థిరత్వము—స్థిరముగా నుండుట అనఁగా నెట్టి విఘ్నములు సంభవించినను దాసులను విడనాడక యుండుట శ్రీదేవి విషయములో నిర్దేశించిన "మ్రదిమ" అను గుణమునకు వ్యతిరేకముగ నిది నిర్దేశింపఁబడి యుండవచ్చును—అని తోఁచుచున్నది "మ్రదిమ" మనోమార్దవమును జూపునట్లు ఇది మనఃకాఠిన్యమును జూపును శత్రుశమన మనుదానికిఁ దర్వాతఁ గఠిన హృదయమును జెప్పుట సమంజసమే! శత్రుశమనము—దండ ధరత్వము మనః కాఠిన్యమే దండ ధరత్వమునకు హేతువు మనః కాఠిన్యము లేక "మర్దయా మిహ దుర్బలా" అనునట్లు మృదువైన హృదయముగల శ్రీదేవికి దండధరత్వ ప్రసక్తి లేదు శ్రీదేవియొద్ద లేని స్థిరత్వము నిచటఁ బేర్కొనవలసినది గనుక ఇట్లర్థము చేయుటయే పొసఁగును

ఆది శబ్దమున శౌర్యాదులను గ్రహించునది

"మ్రదిమ" మృదుత్వము ఆత్మగుణ ప్రసక్తిలో వచ్చియున్నది గాన మనస్సునందలి మృదుత్వమని యర్థము గ్రహింపుఁడు

క్షమాదీన్ — ఆది శబ్దముచేత వాత్సల్యాదులను గ్రహించునది

"వా" — వికల్పార్థకము కాదు సముచ్చయార్థకము

ఇచట పురుషత్వమున కుచితమైనదిగా నిర్దేశింపఁబడిన శత్రుశమనము శ్రీదేవియందును నున్నట్లుగాఁ దెలియుచున్నది "దైత్యదానవమర్దినీ" అను దానిని జూడుఁడు ఇఁక స్త్రీత్వమున కుచితమైనవిగా నిర్దేశింపఁబడిన కరుణ, క్షమ మున్నగునవి భగవంతునియందును నున్నవి కాఁగా వీని నిచ్చట విశేష గుణంబులుగా గ్రహించుటెట్లు పొసఁగును? అన్నచో సమాధానము చెప్పెదము శ్రీదేవియొక్క శత్రుశమన మనఁగా భగవంతుఁ డట్టి కార్యము నిర్వహించునపు డామె యాటంకపఱుపక యూరకుండుటయే! పరతంత్రయైన శ్రీదేవి స్వయముగ శత్రుశమనముఁ జేయదు

"అసన్దేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్ ।
న త్వా కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా ॥"

రాముని యాజ్ఞ లేమిచేతను, పాతివ్రత్య ధర్మమును రక్షించుకొనవలసి యుండుటచేతను, ఓ రావణా! నీవు భస్మము గావలసి యున్నవాఁడవై యున్నప్పటికిని, నా తేజస్సు చేత నిన్ను బూడిదగాఁ జేయలేదని సీతాదేవి రామాయణములో నుడివినదానిని లక్షింపుఁడు కాఁగా, శ్రీదేవియందుండు శత్రుశమనము పారతంత్ర్య మిశ్రమైనందున నుత్కృష్టము కాదు. పారతంత్ర్య మిశ్రము కాని పరిశుద్ధమైన శత్రుశమనము భగవంతునియందే యున్న దనుట

ఇట్లే భగవంతునియం దుండు కరుణా మున్నగు గుణములు స్వాతంత్ర్య మిశ్రితంబు లగుటంజేసి యుత్కృష్టములు గావు స్వచ్ఛమైన కరుణ మొదలగు గుణములు శ్రీదేవియందే యున్నవి శత్రుశమనమునకుఁ బారతంత్ర్యము ఆటంకి మనియుఁ గరుణ మొదలగు వానికి స్వాతంత్ర్యము అడ్డనియుఁ దెలియనది

కాఁగా, భగవంతుఁడు లేక పరతంత్ర యగు శ్రీదేవికి శత్రుశమనము లేదు లక్ష్మి లేక కరుణాదులు స్వతంత్రుఁడైన భగవంతునియందు గోచరింపవు శత్రుశమనము భగవంతునియందే యుండునదనియుఁ గరుణాదులు శ్రీదేవియందే యుండున వనియు నెఱుంగునది

పగర్న్దన పొదువె న్ఱాలుం పగై తెఱల్ తిరమ్బి అఱ్ఱాట్
పుగున్దిడ లిన్మై యిన్న పురుడర్ సన్నిధై యిల్ వైత్తుమ్
మగిழ் నరు క్కాదల్ మెన్మై పొఱై యరుళ్ మగట్పు ణ్బున్ద
అగముఱ వైత్తు న్తుయ్య అఱైన్దుళీ రాన్మ భేదమ్ (34)

క్రిందఁ జేర్కొనఁబడిన గుణము లుభయులకు సామాన్యములైనను, శత్రునిగ్రహము, స్థిరత్వము, స్వాతంత్ర్యము అను నిట్టి పుంస్త్వ గుణములు భగవంతునియందుంచియు, భర్తృవశత, మార్దవము, క్షమ, కరుణ అనునిట్టి స్త్రీత్వ గుణములు తనయందుంచియు ననుభవమునకై మీ రిర్వురును స్వరూప భేదమును పొంది యున్నారు (34)

అవతారిక —స్వరూపమందలి వేర్వేఱైన గుణములను గ్రింది శ్లోకములో నిరూపించి ఈ శ్లోకములో దివ్యమంగళ విగ్రహమునందలి వేర్వేఱు గుణముల నను సంధించుచున్నారు

ఘన కనక ద్యుతీ యువదశామపి ముగ్ధదశాం
యువతరుణత్వయో రుచిత మాభరణాది పరమ్ ।
ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్య హరా
త్వయి చ కుశేశయోదర విహారిణి! నిర్విశసి॥ ॥35॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| కుశేశయ | తామర పూవుయొక్క | ద్యుతీ | కాంతివంటి కాంతియు, |
| ఉదర | నడుమ | యువదశాం | యౌవన ప్రాయమును |
| విహారిణి | విహరించుదానా | ముగ్ధదశామపి | లేఁబ్రాయమును |
| ఘన | మేఘముయొక్కయు | యువతరుణ | యౌవనమునకును |
| కనక | బంగారముయొక్కయు | త్వయోః | లేఁబ్రాయమునకును |

ఉచితం — తగినదియు,
అసమాన — వేర్వేఱు
దేశ — ప్రదేశములలో
వినివేశి — అమరి యున్నదియు,
పరం — శ్రేష్ఠమైనదియు నగు
ఆభరణాది — ఆభరణాదికమును
హరౌ — భగవంతునియందును
త్వయి చ — నీయందును
విభజ్య — విభాగము చేసి
నిర్విశసి — అనుభవించుచున్నావు,
ధ్రువం — నిశ్చయము

దివ్య మంగళ విగ్రహముయొక్క వర్ణమును, ప్రాయమును, లింగమును వీనికిఁ దగినట్లు వేర్వేఱు విధములగు నవయవములందు ధరించు ప్రాయమునకుఁ దగిన యుత్కృష్ట భూషణములను భగవంతునియందును, నీయందును విభజించి వేర్వేఱుగా ననుసంధించుచు ననుభవించుచున్నావనుట

ఘన కనక ద్యుతీ — "నీల ముణ్డ మిన్నన్న మేనిప్పెరుమాళ్" అనునట్లు మేఘకాంతి భగవంతునియం దున్నదనుట వేదము కూడ నీలతోయదము నుపమించుటను జూడుఁడు బంగారపుఁ గాంతి శ్రీదేవియం దున్నది వేదము కూడ హిరణ్య వర్ణమును గలది యనుటను జూడుఁడు "ఘన కనక ద్యుతీ" యని సమాసముగాఁ జెప్పుట యీ యుభయ జ్యోతులు సేరిన సొంపును మన కన్నులకుఁ గట్టినట్లు తెలుపుచున్నది

"యువదశామపి ముగ్ధ దశాం" — యౌవన దశ భగవంతుని దనియును, ముగ్ధదశ శ్రీదేవి దనియును విభజింపవలయును ముగ్ధ దశ యనఁగా బాల్య యౌవనమ్ముల సంధి "నూతే! శైశవ యౌవన వ్యతికరః" అని 43-వ శ్లోకములో శ్రీదేవి కీ దశయే చెప్పఁబడి యుండుటను జూడుఁడు

యువ . . . . పరం — "ఇట్లు దశలలో నుండు వేఱుపాటు దంపతుల సాదృశ్యమున కుచితమేమో?" యను సంశయమును దీర్చుటకై, మఱియు ఆ దశలను జేర్చి "యువ తరుణ ద్వయోః" అని సమాసముగఁ జెప్పుచున్నారు దంపతుల కొకే దశయైన నది సరికాదు దశలలో వేఱుపాటుండుటయే సాదృశ్యమున కుచితమని గ్రంథకర్త యాశయము "తుల్య శీల వయో వృత్తాం" అను రామాయణ శ్లోకము సీతారాముల కొకే వయస్సని తెల్పదు ఇఁక దంపతుల కుచితమైన వయస్సనియే తెల్పును ఈ విషయమును శరణాగతి గద్య వ్యాఖ్యానములో వేదాంత దేశికులు వివరించి యున్నారు

ఆభరణాది, — "ఆది" శబ్దముచేతఁ బురుషునకే యసాధారణములైన యవయవ సన్నివేశములు, స్త్రీలకే యసాధారణములైన యవయవ సన్నివేశములు మున్నగునవి గ్రాహ్యంబులు

పరం — విలక్షణమనియు అర్థము

అసమాన దేశవినివేశి — ఆభరణములు నానావిధములు గనుక వేఱువేఱు చోటులలో నమరినవి పురుషులు ధరింపవలసిన యాభరణములు వేఱురీతిగానుండా భగవంతుని దివ్యావయవములలో నమరినవి స్త్రీలు ధరింపవలసిన యాభరణములు అట్లే వేఱు విధములగు శ్రీదేవి దివ్యావయవములలో నమరిన వనుట

సమానం=ఏకం=ఒకటి అసమానం=అనేకము=భిన్నము, వేఱు అనుట

ప్రాధాన్యమునుఒట్టి భగవంతుని యనుభవమును జెప్పక "నిర్విశసి" యని శ్రీదేవి యనుభవమును మాత్రమే చెప్పిరి శ్రీదేవికి వశుఁడైయున్న భగవంతుఁడు ఈ గ్రంథకర్తకుఁ బ్రధానముగఁ దోఁచలేదు దీనిచేత శ్రీదేవి "స్వాధీన పతిక" యను నాయిక యని తెలియుచున్నది "ఆసన్నాయత్తరమణా స్వాధీన పతికా స్మృతా" యనునట్లు వశుఁడైన భర్తను సమీపమునం దుంచుకొని యుండుట స్వాధీన పతికకు లక్షణము

కరుముగి ల్తొప్పెన్ని న్నాఱ్ఱి కట్టెళిఙ్గాఱ్ఱై మఞ్ఞై
ప్పురువమ న్నిలై క్కేఱ్ఱప్ప ప్పొల్ వగై వెవ్వేఱాన
ఉరువిని లొళిరు నణ్ణాన్ ఉఱుది నీ తుయ్త్తి మఱ్ఱుమ్
అరిమిన్సై పిరిత్తు న్నీదుం అమ్బుళ త్తాడువాళే! (౩౫)

తామర పుష్పమునం దాటలాడుదానా! నీలమేఘకాంతి, స్వర్ణకాంతి, యౌవనము, లేఁబ్రాయము — వీని కనుగుణములుగా లింగభేదముచే వేర్వేఱుగా నుండు నవయవములలోఁ బ్రకాశించు నుత్కృష్టాభరణములు మున్నగు వానిని భగవంతునియందును, నీయందును, విభజించి నీ వనుభవించుచున్నావు ఇది నిశ్చయము (35)



అవతారిక — ఇఁక మూఁడు శ్లోకములచేత దివ్యమంగళ విగ్రహమును వర్ణించుచున్నారు దీనిలోఁ బాలసముద్రపు సారము నంతయు నొక్కటిగాఁ జేరి శ్రీదేవి దివ్యమంగళ విగ్రహమైనది నిస్సారముగాఁ జేయఁబడిన పాలసముద్రము లోని వస్తువులైన చంద్రుఁడు మొదలగునవి యన్నియుఁ బిప్పియైనవని వర్ణించి, నిత్యమైన యప్రాకృత దివ్యమంగళ విగ్రహము నిట్లు వర్ణించుట తగదని చెప్పుచున్నారు

అఙ్గన్తే మృదు శీత ముగ్ధ మధురోదారై ర్గుణై ర్గుమ్భితః
క్షీరాబ్ధేః కిమృజీషతా ముపగతా మన్యే మహార్ఘాస్తతః!
ఇన్దుః కల్పలతా సుధా మధు ముఖా ఇత్యావిలాం వర్ణనాం
శ్రీరఙ్గేశ్వరి! శాన్త కృత్రిమ కథం దివ్యం వపుర్నార్హతి॥36॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గేశ్వరి! | శ్రీరంగేశ్వరీ! | ఋజీషతాం | రసము పిండిన పిప్పిగా నుండు స్థితిని |
| తే | నీయొక్క | ఉపగతాః కిం | పొందినవా ఏమి? |
| అఙ్గం | విగ్రహమును | తతః | అందుచేత |
| మృదు | మృదుత్వము | మహార్ఘాః | (అవి) ఎక్కువ వెల గలవి యని |
| శీత | చల్లదనము | మన్యే | తలంచుచున్నాను, |
| ముగ్ధ | సౌందర్యము | ఇతి | అని |
| మధుర | మాధుర్యము | ఆవిలాం | కలతపడిన |
| ఉదారైః | గొప్పతనము అను నీ | వర్ణనాం | వర్ణనకు |
| గుణైః | (సారములైన) గుణములను గ్రహించి | శాన్తకృత్రిమ | కల్పితమను దానికే |
| గుమ్భితః | కూర్చుచున్న | కథం | ప్రసక్తి లేనట్టి |
| క్షీరాబ్ధేః | పాలసముద్రమునకు | దివ్యం | అప్రాకృతమైన |
| ఇందుః | చంద్రుడు | వపుః | (నీ) దివ్యమంగళ విగ్రహము |
| కల్పలతా | కల్పలత | న అర్హతి | తగినది కాదు |
| సుధా | అమృతము | | |
| మదు ముఖాః | మధువు మొదలగునవి | | |

నిత్యమై యెవరిచేతను నిర్మింపబడని నీ దివ్య మంగళ విగ్రహమును పాల సముద్రము తనయందున్న చంద్రుడు లోనగు మంచి వస్తువుల సారముచేత నిర్మింపబడినదని వర్ణించుట యనుచితము—అనుట

ఇట్లు వర్ణించి యావర్ణన తగదని దానిని నిరాకరించుటవలని ప్రయోజన మేమనగా—చంద్రుడు లోనగు ననేక వస్తువులయందుగల సుగుణము లన్నియు శ్రీదేవీ దివ్య మంగళ విగ్రహమున సహజముగను, అమితముగను గోచరమగుచున్న వని తెలుపుటయే

“మృదు” ఇత్యాది పదములకు మృదుత్వమని యీ విధముగా నర్థము చేసికొనవలయును ఇక, ధర్మ్యర్థకముగానే కాని గుణైః అనుటకు దన

యవయవములచేత నని కొందఱ అర్థము సేయుదురు చంద్రునిలో నున్న సౌందర్యము, శీతలత్వము, మృదుత్వము అను గుణములను దీసికొనియు, కల్పలత యొక్క యౌదార్య గుణములను దీసకొనియు, అమృతమునుండి మాధుర్యము నెత్తికొనియు, మధువునుండి శీతలత్వమును దీసికొనియు శ్రీదేవి దివ్య మంగళ విగ్రహమును నిర్మించినందున ఈ చంద్రాది వస్తువు లన్నియుఁ పిప్పిగా నైనవి ఈ గుణము లన్నియుఁ బడసియున్న శ్రీదేవి వీనికంటె మిక్కిలి వెల్గుచున్నదని భావము

ఇప్పుడు చంద్రుఁడు లోనగు వస్తువుల కేర్పడిన విలువ యంతయు శ్రీదేవి యొక్క శ్రేష్ఠమైన దివ్య మంగళ విగ్రహ నిర్మాణమునకుఁ దమ సారమంతయు నొసంగి యుపయోగింపఁబడినవి యను కారణముచేతనే అనుచు "మన్యే మహార్ఘా స్తతః" అని యన్నారు

తమ గుణముల నిచ్చివేయుటచే నిస్సారములైన వనుటయు, ఆ కారణము చేతనే యవి విలువగలవిగా నెంచుదునని చెప్పుటయు నుత్ప్రేక్షాలంకార మగును ఇట్టి వర్ణన తగ దనుదానిని "కాన్త కృత్రిమ కథం దివ్యం" అను పదములు సమర్థించి యుండుటఁజేసి కావ్యలింగాలంకార మగును

శ్రీదేవీ విగ్రహము నిత్యమైనదని తెలిసికొనక చేసిన వర్ణనము గనుక నది కలఁత నొందిన దయ్యేను జ్ఞానముయొక్క కలవరమును వర్ణనయం దారోపించి చెప్పుట యౌపచారికము

కాంత కృత్రిమ కథం — కల్పితమని చెప్పుట కాంతి మాత్రమును విలు లేదనుట దివ్యం = అప్రాకృతమనుట

అమృతము మొదలగు వస్తువులవలె శ్రీదేవి క్షీరాబ్ధిలో పుట్టలేదు, అచ్చట ప్రాదుర్భావమే యని యెఱుంగునది

"అన్యే మహార్ఘా స్తతః" అని కొందఱు పఠించెదరు "తతః" అను పదమును క్షీరాబ్ధికి విశేషణముగా నన్వయించి "కలిగిన" అను నొక పదమును దెచ్చి పెట్టుకొని గుణములచే నీ యంగములను గూర్చుచున్న క్షీరాబ్ధినుండి కలిగిన, ఎక్కువ మదింపు గల చంద్రుఁడు లోనగునవి పిప్పిగా నైనవా యేమి? అని వ్యాఖ్యానించినవారును గలరు

మదియముదు మదు కల్పవల్లి మానుమ్
మాణ్పొరుళ్గళ్ తణ్మై యట్టు గినిమై వణ్మై
మెదుమై యెనుమ్ గుణజ్గళ్ విళజ్గు మజ్గమ్
వెణ్డిరుప్పా ఱ్కడల్ తోప్ప తోఁడాయ్ నిన్నై

అదికమది ప్పదనాలే యడ్డెన్న పోలుమ్
అవై యెనవే అగజ్జలజ్జి వరుణి త్తిట్టాల్
అదుదివియ మామాక్క త్తెచ్చే యగ్‌నా
ఆరుడమ్బు క్కడుక్కుమో? శ్రీ రరజ్గత్తాళే! (36)

ఓ శ్రీరంగనాయకీ! పాలసముద్రము—చంద్రుఁడు, అమృతము, మధువు, కల్పలత—వీనివంటి ఉత్కృష్ట వస్తువులయొక్క శీతలత, సొంపు, మాధుర్యము, ఔదార్యము, మార్దవము అను గుణములఁగొని నీయొక్క వెలుఁగుచున్న విగ్రహమును గూర్చినది, కావున నవి పిప్పియై యందుచే సెక్కువ మదింపు పొందినవా యేమి? అని హృదయములోఁ గలఁతపడి వర్ణించినయెడల ఆ వర్ణన దివ్యమై, కల్పితమను మాటకే ప్రసక్తి లేనట్టి నీ దివ్య మంగళ విగ్రహమునకుఁ దగునా? (36)



అవతారిక—కొంచెము తల వంగియు, నడుము కృశించియు నుండు శ్రీదేవి విగ్రహము మనకు వాచామగోచరమైనదని యనుచున్నారు.

ప్రణమదనువిధిత్సా వాసనా నమ్రమగ్రే
ప్రణయి పరిచిచీషా కుఞ్చితం పార్శ్వకేన
కనక నికష చఞ్చచ్చమ్పక స్రక్ సమాన
ప్రవర మిద ముదారం వర్ష్మ వాచా మభూమిః॥ ॥37॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అగ్రే | శిరస్సున | కనక నికష | మేలిమి బంగారునకును |
| ప్రణమత్ | ప్రణమిల్లువారి | చఞ్చత్ | ప్రకాశించుచున్న |
| అనువిధిత్సా | అనుసరించు కోరికయొక్క | చమ్పకస్రక్ | చంపక మాలకును |
| వాసనా | వాడుక చేత | సమానప్రవరం | సరియైన గోత్రమునకుఁ జేరినదియునైన (సమమైన) |
| నమ్రం | వంగినదియు, | ఇదం | ఈ |
| పార్శ్వకేన | ప్రక్కప్రదేశముచేత | ఉదారం | గంభీరమైన |
| ప్రణయి | ప్రియునియొక్క | వర్ష్మ | నీ విగ్రహము |
| పరిచిచీషా | మచ్చికపడు కోరికచేత | వాచాం | మాటలకు |
| కుఞ్చితం | సంకుచించినదియు, | అభూమిః | అగోచరమైనది. |

ప్రణమత్ . . . . . అగ్రే—శ్రీరంగ నాచ్చియారు శిరస్సు కొంత వంచియు, నడుము సంకుచించియు, దర్శన మిచ్చుచున్నది కదా! ఆ స్థితికిఁ గారణము నుత్ప్రేక్షించుచున్నారు

ఉత్తమ స్త్రీలు కొంచెము వంగియుండుట సహజమే అట్లుండుట తన యెదుటఁ దలవంచువారి ననుసరించు కోరిక యొక్క వాసనచేతఁ గలిగినది గాఁబోలు అనుచున్నారు అనుసరించుట యనఁగా నమస్కరించువారి ననుగ్రహించుట

అనుసరించు వాంఛయే యెప్పుడును శ్రీదేవి మనస్సులో స్థాయిగా నుండుట చేత "వాసన" అని యన్నారు "సదానుగ్రహ సమ్పన్నా" (సర్వదా అనుగ్రహముతోఁ గూడినది) అను దానిని లక్షింపుఁడు

అలక్ష్యముగా గర్వించి నిలుచు స్థితివలెఁ గాక ప్రణామము నంగీకరించి ప్రణమిల్లువారి ననుసరించి యుండు స్థితిని శ్రీదేవి కొంచెము తలవంచి నిలిచి యుండుట తెలుపుచున్నదనుట

<u>ప్రణయి . . పార్శ్వకేన</u>—ఇట్లే నడుము సన్నగిల్లి యుండుట ప్రియుని మచ్చికయుండు వాసనచేతఁ గలిగినదికాఁబోలు ననుచున్నారు ముగ్ధయగు శ్రీదేవి తన ప్రియునితోఁ బరిచయపడునపుడు సిగ్గుపడి సంకోచమునొందుట స్వాభావికమే కదా! భయభక్తుల చేత సంకోచము గలిగియున్నదని చెప్పువారును గలరు

పురుషకారమునకుఁ గావలసిన ఆశ్రితుల ననుసరించుటయుఁ, ప్రియుని సంశ్లేషించుటయు వరుసగా మొదటి రెండు పాదములలోఁ జెప్పఁబడినవి

<u>కనక. ప్రవరం</u>—మేలిమి బంగారమును ఉపమానముగాఁ జెప్పినందున కాంతియు, చంపకమాల నుపమించుటచేతఁ గాంతితో సౌరభమును దోఁచుచున్నవి

<u>ఉదారం</u>—గొప్పతనము గలది దాతృత్వము కలదియును

<u>ఇదం వాచామభూమిః</u>—అప్రాకృతమైన దివ్యమంగళ విగ్రహ మర్చారూపమై, మన నేత్రములకుఁ గనఁబడుచున్నది, అయినను వాచామగోచరముగా నున్నదే!

వణఙ్గినార్ క్కైయుమ్ ఎణ్ణిల్ వాసనై యదనాల్ మీదు
వణఙ్గియల్ బనై నెరుఙ్గుమ్ వాఙ్చైయాల్ ఉళ్ళడై శురుఙ్గి
మణఙ్గమళ్ శెణ్బకప్పూ మాలై యొడురై పొన్ననన్న
గుణఙ్గొళి వ్వణ్మై మేని కూఱుద ఱెళిదో అమ్మా! (37)

ప్రణమిల్లిన వారి ననుసరించు మనోభావముయొక్క వాసనచేత శిరమును వంచియుఁ, ప్రియునితో మచ్చికపడు వాంఛచేత పార్శ్వభాగము సన్నగిల్లియు, సౌరభము గల సంపెంగమాల, మేలిమి బంగారము-అను వీని గుణములు గల ఉదారమైన ఈ దివ్య మంగళ విగ్రహము వర్ణించుటకు సులభమైనదా? ఆహా! (37)



**అవతారిక** — కరుణా కటాక్షము లను కెరటములు వీచు ముఖమండలము గలదై, కమలనివాసిని యైన శ్రీదేవి నొక రెప్పపాటు కాలమైనను వ్యవధి లేక చూచి, నిరంతరముగా ననుభవించెదము గాక! అని యనుచున్నారు

ఏకం న్యఞ్చ్య నతిక్షమం మమ పర ఞ్చాకుఞ్చ్య పాదామ్బుజం
మధ్యేవిష్టరపుణ్డరీక మభయం విన్యస్య హస్తామ్బుజమ్ ॥
త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్య కూలఙ్కష
స్ఫారాపాఙ్గ తరఙ్గ మమ్బ మధురంముగ్ధం ముఖంబిభ్రతీమ్॥ ॥౩౮॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అమ్బ! | తల్లీ! | నిషేదుషీం | ఆసీనురాలై యుండినదియు |
| మమ | నాకు | కారుణ్య | కరుణ చేత |
| నతిక్షమం | నమస్కరించుటకుఁ దగిన విధమున | కూలఙ్కష | నిండిన |
| ఏకం | ఒక | స్ఫార | విశాలమైన |
| పాదామ్బుజం | (దక్షిణ) చరణ కమలమును | అపాఙ్గతరఙ్గం | కెరటములు వీచు క్రేగంటి చూపులు గలదిగాను |
| న్యఞ్చ్య | వ్రేలాడ వేసియు | మధురం | ఇంపుగాను |
| పరం | రెండవ (వామ) చరణ కమలమును | ముగ్ధం | సౌందర్యము గలదిగాను నుండు |
| ఆకుఞ్చ్య | మడత పెట్టియు | ముఖం | ముఖమును |
| హస్తామ్బుజం | హస్త కమలమును | బిభ్రతీం | ధరించియుండునదియునైన |
| అభయం | అభయముగను జూపునట్లుగా | త్వాం | నిన్ను |
| విన్యస్య చ | ఉంచియు | ప్రతికలం | ప్రతిక్షణము |
| మధ్యే విష్టర పుణ్డరీకం | పద్మాసన మధ్యమున | పశ్యేమ | దర్శించెదము |

శ్రీదేవి యాసీనురాలైయున్న స్థితిని ఉన్నదున్నట్లే మన యంతర చక్షుస్సునకు గోచరింపఁజేయు నీ శ్లోక మొక ధ్యాన శ్లోకముగా నమరి యున్నది

**నతిక్షమం మమ** — తాను నమస్కరించుటకే శ్రీదేవి యొక పాదమును ఆసన పద్మముక్రింద వ్రేలాడవేసినట్లుగ గ్రంథకర్త యుత్ప్రేక్షించుచున్నారు "ములై యుణాయే" (స్తన్యము త్రాగుము) అను తల్లివలె శ్రీదేవియుఁ దన బిడ్డయైన భట్టరునకుఁ బ్రాప్తమైన తన పాదకమలమును జూపించి "నీవు నమస్కరింపుము" అని పిలుచుచున్నది కాఁబోలు ననుట

<u>మధ్యేపుష్కరిణీకం</u> — ఒకే పదము "పారే మధ్యే షష్ఠ్యా వా" అను విధి ప్రకారము "మధ్యే" అనునది యవ్యయమై యుండి సమాసమైనది. దీనికి అవ్యయీభావ సమాస మని పేరు. "పద్మే స్థితాం పద్మవర్ణాం" "వికాసి కమలే స్థితా" అని తామర ఆసనముగఁ జెప్పఁబడుచున్నది.

<u>ప్రతికలం</u> — అనుభవించువారిని అప్పటికప్పుడు తనివి దీరని యమృతముగా నుండుటచేత నొక క్షణముకూడ విడిచిపెట్టఁ దగదని భావము.

<u>అమ్బ</u> — బిడ్డఁడు తల్లిని జూచుట యానందావహము కదా!

<u>పశ్యేమ</u> — "మమ" యని యేకవచనము ప్రయోగించి యిచ్చట బహువచన క్రియను బ్రయోగించినారు. దీనివలన ఆశ్రయించినది తా మొక్కరే యైనను పొందు లాభములో (అనుభవించుటలో) అందఱిని జేర్చుకొను స్వభావము దోఁచుచున్నది. "అడియేన్ సెయ్యుం విణ్ణప్పం యాముతామై" (మే మందఱము అనర్థము పొందకుండు నట్లుగా దాసుఁడనైన నే నొక్కఁడను జేయు విన్నపము) అనుదానివలె దీనిని గ్రహింపుఁడు.

నళినమల ర్త్తాళొన్ఱు నాలవిట్టు
నాన్వణఙ్గ మఱ్ఱుమొరు తాళ్ మడక్కి
నళిర్ కమల క్కరమబయం నల్గవైత్తు
నాప్పణలర్ తామరై మేల్ వీఱ్ఱిరుప్పాయ్!
అళికరై యి ఱ్ఱొరువు మగిళ్ కడైక్క ణోక్కమ్
అలై యెఱియు నని యినియ ఎళిల్ ముగత్తాయ్!
కళిపెరుగ క్కణక్కొన్ఱి యున్నాయ్ ఉన్నై
క్కణ్డోఱుమ్ కణ్డోఱుమ్ కాణ్బో మియామే. (38)

నేను నమస్కరించుటకు నీ పాదకమలమునొకదానిని వ్రేలాడవేసి మఱియొక పాదమును మడిచిపెట్టి, శీతలమైన కమల హస్తముచే నభయ మిచ్చుచు తామర పువ్వుపు మధ్యమం దాసీనురాలవై కెరటములు తీరముపై మోదునట్లు కరుణాకటాక్ష వీక్షణము లుప్పొంగ మాధుర్యమును, సొగసును వెదజల్లు ముఖముగల నిన్ను ఓ తల్లీ! ఒక క్షణకాలమైనను విచ్ఛిన్నము లేక దర్శించి యానందింతుము గాక! (38)

అవతారిక — ఇట్లు శ్రీదేవి వేంచేసియున్న వైభవమునకుఁబరవశులై యామె చరణకమల ద్వయముపైఁ బడుచున్నారు

సురభిత నిగమాన్తం వన్దిషీయేన్దిరాయాః
తవ కమల పలాశప్రక్రియం పాదయుగ్మమ్ ।
వహతి యదుపమర్దైర్వైజయన్తీ హిమామ్భః
ప్లుతిభిరివ నవత్వం కాన్తబాహోన్తరాళే॥ ॥౩౮॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| ఇన్దిరాయాః | ఐశ్వర్యవతియైన | వన్దిషీయ | నమస్కరించెదను, |
| తవ | నీయొక్క | యదుపమర్దైః | ఏ చరణముల త్రొక్కుడులచేత |
| సురభిత | పరిమళించునట్లు కావింపఁబడిన | కాన్తబాహోన్తరాళే | కాంతుని వక్షఃస్థలము నందు |
| నిగమాన్తం | వేదాంతము గలదిగను | వైజయన్తీ | వనమాల |
| కమల పలాశ | తామర పూరేకు యొక్క | హిమామ్భః | మంచునీటిచేత |
| ప్రక్రియం | ప్రకారము గలదిగను నుండు | ప్లుతిభిరివ | చల్లుటలచేతవలె |
| | | నవత్వం | క్రొత్తఁదనమును |
| పాదయుగ్మం | చరణ ద్వయమును | వహతి | వహించుచున్నదో |

సురభిత నిగమాన్తం — శ్రీదేవీ చరణ యుగ్మమును గుఱించి చెప్పుటచేత వేదాంతము లుత్కృష్టము లైనవని యనుట తామరపూవును బోలినవి గనుక నా పాదములు వేదాంతములను పరిమళింపఁ జేసినవి

వన్దిషీయ — వేదపురుషునివలెఁ దాము గూడఁ బాదకమలములను శిరమున ధరించి పరిమళించుట కాశపడుచున్నారు "యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి .....పాదారవిన్ద మరవిన్ద విలోచనస్య"—కమలాక్షుని చరణ కమలములు నా శిరస్సుమీదను, వేదశిరస్సుమీఁదను వెలయుచున్నవని యాళవందార్లనుగ్రహించినది యిచట స్మరణీయము వన్దిషీయ=స్తుతించెద ననియు నగును

ఇన్దిరాయాః—"ఇది పరమైశ్వర్యే" అను ధాతువునుండి యీ పదము పుట్టినది గొప్ప యైశ్వర్యము గలది యని యర్థము. (ఇన్దతీతి ఇన్దిరా) ఇచ్చట శ్రీదేవి నిందిర యనివ్యవహరించుట యత్యంత రసావహము ఈశ్వరేశ్వరుఁడైన భగవంతునికిని ఈశ్వరియై యతని వక్షస్స్థలమం దెక్కి యాసీనురాలై యుండుటయే శ్రీదేవియొక్క శ్రేష్ఠమైన యైశ్వర్య మనుట "కా చాన్యా త్వామృతే దేవి! సర్వయజ్ఞ మయం వపుః। అధ్యాస్తే దేవదేవస్య యోగిచిన్త్యం గదాభృతః॥"

అని విష్ణు పురాణములో లక్ష్మి తప్ప మఱి యెవరును భగవంతుని మేనిపై నుండ లేరని చెప్పఁబడి యుండుటఁ జూడుఁడు శివుఁడును, బ్రహ్మయు భగవంతుని విగ్రహములోఁ గొన్ని సమయములందు ఉందురే కాని, లక్ష్మివలె నిరంతరముగా వాసము చేయరు—అని యెఱుఁగునది

కమల పలాశ ప్రక్రియం—తామరపూవు రేకు విధము—అనఁగా సౌరభము, మార్దవము మొదలగునవి వీనిని శ్రీదేవి చరణకమలములు గలిగియున్నవి కమల దళమును బోలిన పాదయుగ్మ మని యనుట దళములం బోలిన వ్రేళ్లనియుఁ గొందఱు వచింతురు

కలిసియుండు రెండు పాదముల సొబగును జూచి "పాదయుగ్మం" అని యన్నారు

వహతి... అన్తరాళే,—శ్రీదేవి పాదకమలములచేతఁ ద్రొక్కఁబడినను వైజయంతి యను మాల వాడదఁట మఱియు మంచు నీళ్లు చల్లినట్లుగా నది క్రొత్తఁదనము పొందునఁట ఆ పాదకమలములు అంత మృదుత్వమును, శీతలత్వ మును బడసి యున్నవి!

మాటిమాటికి మంచి నీరు చల్లుచుండుట వలె, భోగ్యములైన పాదకమల ములచేఁ ద్రొక్కఁగాఁ ద్రొక్కఁగా నా వనమాల నవత్వమును బొంది యింకను ఎక్కువగా శోభించుచున్నది "ఉపమర్దైః" అను బహువచన ప్రయోగము ఈ యర్థమును దెలుపుచున్నది

వక్షస్స్థలమును "బాహోన్తరాళం" అనుచున్నారు రెండు భుజములమధ్య ప్రదేశమని యర్థము ఇట్లు వక్షస్స్థలమును వర్ణించుట లక్ష్మి తన యిష్ట ప్రకార మాటలాడి సంచరించునట్టి వైశాల్యము కలదని తోఁచుటకు

పైన్దాదై పనినీర్ పెయ్యుమ్ పానైమ్మయిల్ మిదిత్తు ప్పల్గాల్
మైన్దనిఙ్ విరిన్ద మార్బిల్ వైజయన్తియై యలర్తిల్
ఇన్దిరై! మఱైయన్దత్తై ఇన్మణమ్ పుణర్తుమ్ పూవిఙ్
శన్దమా రిదళ్ప్ యన్ నిన్దఙ్ తాళిణై వన్దిప్పేనే. (39)

పుష్పమాలపై మంచునీరు చల్లు విధమున నీ ప్రియుని విశాలమైన ఱొమ్ము నలంకరించియుండు వైజయంతిమాలను మాటిమాటికిఁ ద్రొక్కి వికసింపఁజేయుచు, వేదాంతమునకును సువాసన గలిగించుచు తామరపూవుయొక్క చక్కని రేకులవలె నుండు నీ చరణ యుగ్మమును మ్రొక్కుదును (39)

అవతారిక — దాసుల విషయమైన కటాక్షముయొక్క మహిమను తెలుపుచున్నారు

త్వత్ స్వీకార కలావలేప కలుషా రాజ్ఞాం దృశో దుర్వచాః
నిత్యం త్వన్మధుపాన మత్త మధుప శ్రీ నిర్భరాభ్యాం పతిమ్ ।
దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం వేదో విదామాస తే
సాక్షాల్లక్ష్మి! తవావలోక విభవః కాక్వా కయా వర్ణ్యతే? ॥౪౦॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| లక్ష్మి! | ఓ లక్ష్మీ! | మధుప | తుమ్మెదలయొక్క |
| రాజ్ఞాం | రాజులయొక్క | శ్రీ | శోభచేత |
| దృశః | నేత్రములు | నిర్భరాభ్యాం | నిండినవైన |
| త్వత్ | నీయొక్క | దృగ్భ్యాం ఏవ హి | కన్నులచేతనే గదా |
| స్వీకార | అంగీకారముయొక్క (కటాక్షముయొక్క) | తే | నీయొక్క |
| కలా | లేశముచేతఁ గలిగిన | పతిం | భర్తను |
| అవలేప | గర్వముచేత | వేదః | వేదము |
| కలుషాః | కలఁతఁ జెందినవై | పుణ్డరీకనయనం | కమలాక్షునిగా |
| దుర్వచాః | వర్ణింప నశక్యములుగా (అగుచున్నవి) | విదామాస | తెలిసికొనెను, |
| | | తవ | నీయొక్క |
| నిత్యం | ఎల్లప్పుడును | అవలోకవిభవః | కటాక్ష వైభవము |
| త్వత్ | నీవనునట్టి | కయా | ఏ |
| మధు | తేనెను | కాక్వా | ప్రకారముచేత |
| పాన | త్రాగుటచేత | సాక్షాత్ | నేరుగా |
| మత్త | మదించిన | వర్ణ్యతే | వర్ణింపనగును? |

త్వత్ స్వీకార.........దుర్వచాః — శ్రీదేవి యొక్క కటాక్షలేశము పొందిన మాత్రముననే కలిగిన గర్వముచేత ధనమదము దోఁచునట్లు కలఁత పొందిన రాజుల నయనములే కవులచే వర్ణింప నశక్యములుగా శోభించుచున్నవనుట.

నిత్యం త్వత్ ..... విదామాస.—భగవంతుఁడు పుణ్డరీకాక్షుఁడుగా నగుట నిరంతరము లక్ష్మియొక్క సుందర విగ్రహమును జూచుచునే యనుభవించుట చేతనే యని భావము

శ్రీదేవి తేనె, భగవంతుని కన్నులు తుమ్మెదలు ఈ తేనెను ఆతుమ్మెదలు త్రాగుచున్నవి కనుక నవి మదించి దేహము ఎఱుంపుబారి నిశ్చలముగా నిలిచి యున్నవి శ్రీదేవిని వింతపొంది చూచుచునే యుండుటచేత భగవంతుని కన్నులు చలింపక యెఱుపుగా నుండుటను గ్రంథకర్త యిట్లు వర్ణించిరి మఱియు శ్రీదేవి యొక్క దేహకాంతి వ్యాపించి కన్నులెఱ్ఱనైనవని కొంద ఱనెదరు

శ్రీదేవి ననుభవించి శోభించుచున్న నేత్రములచేతనే వేదము పరదేవతను బుండరీకాక్షుఁడుగా గుర్తించెను ఈ విధమైన శ్రీదేవి యనుభవ మితరులకు లభింపదు గనుక వారి నేత్రములు శోభింపనివి యైనవి ఈ నేత్రముల సొగసు భగవంతునికే కలదు "తామ్ పిఱ్ వార్" అను కుఱళ్ లో "తామరై క్కణ్ణాన్" (పుండరీకాక్షుఁడు) అనునది శ్రియఃపతికే యసాధారణ నామమని వ్యాఖ్యానించి యుండుటను లక్షింపుఁడు

ఛాందోగ్యోపనిషత్తులో సూర్యునిచేత వికసింపఁజేయఁబడిన పుండరీకమును బోలిన నేత్రములను అసాధారణమైన గుర్తుగాఁ గొని, పరతత్త్వ నిర్ణయము చేయఁబడి యుండుట యిచ్చట ననుసంధేయము

మధుపానము చేయు తుమ్మెదవలె నానందాతిశయము గల నేత్రములని చెప్పఁబడినందున "పుండరీకాక్షుఁడు" అను పేరు రూఢము మాత్రమే, యౌగికము కాదు——అని చెప్పువారి (శైవ) వాదము నిరాకరింపఁబడినట్లయినది, ఇది యోగరూఢమని యెఱుఁగుఁడు

లక్ష్మీ సంబంధము లేనివారి కన్నులు పెక్కు దుఃఖములచేతఁ గుదించుకొని పోవునే గాని భగవంతుని నయనములవలె వికసించి యుండ వనుట

సాక్షాత్ . . . వర్ణ్యతే——నీచేత లేశమాత్రము కటాక్షింపఁబడిన భాగ్యవంతుల కన్నులు వర్ణనాతీతంబులై యంత యుత్కర్షను బొందుచున్నవి నిన్నే తిలకించుచుండు నీ భర్త నేత్రములు శేషిత్వమునకు గుర్తుగా వెలయుచున్నవి నీవు చూచిన మాత్రముచేత, నిన్ను దర్శించిన మాత్రముచేత, వారి కన్ను లంత యుత్కృష్టతను బొందినచో నీయొక్క కన్నుల మహిమ నీ విధమనఁ గాక సాక్షాత్తుగా వర్ణించుట యసాధ్యమని భావము

కాక్వా కయా వర్ణ్యతే——ఏ విధముచేతను వర్ణింప వీలుకాదు—అనుట

నీశిటిదే కడైక్కణిప్ప నిరుపర్ కణ్గళ్
నిలవుమద త్తాఅక్కలజ్గి నిలమేయల్ల
పేశిడఉక్కణ పతికణ్గళ్ నాళుమ్ నీయామ్
పిరస త్తై ప్పురుగి మదమ్ పిడిత్తవణ్డిణ
తేశుడనే తిగళ్లువదాల్ అవనై వేదమ్
శెజ్గమల కణ్ణనెన త్తెరిన్ద దన్తే
పేశువది జ్గిలక్కుమియే! నేరే నిన్దణ
పీడుపెఱు పార్వైయినై యెవ్వాఱో దాణ? (40)

నీ కటాక్ష లేశము పడిన మాత్రమున రాజుల నేత్రములు మదించి, కలంతం బొంది వర్ణనాతీతములే యగును నీ భర్త కన్నులు సదా "నీవు" అనునట్టి తేనెను త్రాగిమదించిన తుమ్మెదలశోభతో వెలుఁగుటచేత వేద మతనిని బుండరీకాక్షునిగాఁ దెలిసికొనినది గదా! ఓ లక్ష్మి! నీయొక్క మహిమ గల కటాక్షమును సాక్షాత్తుగా వర్ణించుట యెట్లో? (40)



అవతారిక,—వర్ణింప నశక్యంబులే యైనను తన యాతురత నడంచుకొనలేక శ్రీదేవీ కటాక్ష స్వరూప స్వభావములను వర్ణించి, వానిచేతఁ దన్ను రక్షింప వలయునని వేఁడుకొనుచున్నారు

ఆనన్దాత్మభి రీశమజ్జన మద క్షీబాలసై రాగల
ప్రేమార్ద్రైరపి కూలముద్వహ కృపా సమ్ప్లావితాస్మద్దృశైః ।
పద్మే! తే ప్రతిబిన్దుబద్ధ కలిక బ్రహ్మాది విమృగ్యకై
రైశ్వర్యోద్గమ గద్గదై రశరణం మాం పాలయాలోకితైః ॥౪౧॥

## ప్రతిపదార్థము

| | |
|---|---|
| పద్మే! | లక్ష్మి! |
| తే | నీయొక్క |
| ఆనన్దాత్మభిః | ఆనంద స్వరూపములు గాను, |
| ఈశ | భగవంతుని |
| మజ్జన | ముంచుటచేఁ గలిగిన |
| మద | సంతోషముచేత |
| క్షీబ | మదించి |
| అలసైః | అలసటఁ జెందినవియుఁ గాను |
| ఆగళ | కంఠము వఱకును |
| ప్రేమ | ప్రీతిచేత |
| ఆర్ద్రైః | తడిసినవిగాను, |
| అపి | మఱియు |
| కూలముద్వహ | కట్టపొరలి ప్రవహించు |
| కృపా | దయచేత |
| సమ్ప్లావిత | స్నానము చెయింపఁబడిన |
| అస్మాదృశైః | నావంటివారిని గలిగి యుండునవిగాను, |
| ప్రతిబిన్దు | ఒక్కొక్క బిందువు నందును |
| బద్ధకలిక | కలహించు |
| బ్రహ్మాది | బ్రహ్మ మొదలగు |
| విష్కమ్భకైః | ముఖ్యమైనవారు గలవిగాను, |
| ఐశ్వర్య | ఐశ్వర్యముయొక్క |
| ఉద్గమ | ఉత్పత్తిచేత |
| గద్గదైః | తొట్రుపాటుతో నడచునవిగానునుండు |
| ఆలోకితైః | చూపులచేత |
| అశరణం | శరణహీనుఁడనైన |
| మాం | నన్ను |
| పాలయ | రక్షింపుము |

ఆనన్దాత్మభిః — ఆనందమును గలుగఁజేయు కటాక్షములను ఆనందరూపముగానే వర్ణించుట ఔపచారికము. శ్రీదేవీ కటాక్షము లెల్లరకు ననుకూలములే కనుక ఆనందావహము లైనవి అనుకూలజ్ఞానమే ఆనందము

ఈశ . . . అలసైః — కటాక్షములు భగవంతుని ముంచివేయుచున్నవి. అనఁగా భగవంతునిఁ బూర్ణముగా విషయీకరించుచున్న వనుట పరిపూర్ణకటాక్షమునకు విషయము భగవంతుఁ డొకఁడే యనుదానిని బూర్వము "అపాఙ్గా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్" అని చెప్పియుండుటను గమనింపుఁడు

మదించి, అలసటఁజెంది యుండుట శ్రీదేవీ కటాక్షములకు సహజము. దానిని సర్వోత్కృష్టుఁడగు భగవంతుని ముంచివేసిన యానందముచేఁ గలిగినట్లు వచించుట హేతూత్ప్రేక్ష

"భగవంతుని మించుటచేత" అని యనక "భగవంతుఁడు మనుఁగుటచేత కలిగిన" దని కొంద ఱందురు

ఆగల. ...ఆర్ద్రైః —కంఠమువఱకుఁ బ్రీతి తడిపినట్లు చెప్పుటచేతఁ గటాక్షమును పరిపూర్ణముగాఁ బ్రీతిని తమలో నణఁచి యుంచుకొనుట తెలియుచున్నది

కూల ... అస్మాదృశైః — ప్రీతి కంఠమువఱకు నణఁగి యుండునట్లు చెప్పిన గ్రంథకర్త, కృపలో నణఁగలేక పొంగి బయటఁ బ్రవహించునట్లుగా వర్ణించిరి ఇందుచేతఁ బ్రీతికంటె దయాప్రవాహముయొక్క యాధిక్యము చూపఁబడినది విస్తృతమగు ప్రేమయే దయ గనుక, ప్రేమకంటె దయాధిక్యము చెప్పుట పొసఁగి యుండుటను జూడుఁడు సంబంధము గలవారిపైఁ గలుగునది ప్రీతి యనియు, సంబంధముచేఁగాక సహజముగనే జీవరాసు లందఱిపైఁ గలుగునది దయ యనియు నెఱుంగునది

అస్మాదృశైః —వీరు, వారు—అనక, యెట్టి హద్దులు లేక సహజముగాఁ బ్రవహించు దయకుఁ దాను బాత్రుఁడైనట్లు దోఁచుటకై యిట్లు చెప్పఁబడినది ఇదివఱకుఁగూడ "కేవల కృపా నిర్వాహ్యా వర్గేవయం" అని నుడివిరి నావంటి వారనఁగా, భక్తి మొదలగు సాధనములు లేక స్వాభావికమైన దయకుఁ బాత్రభూతములగునట్లు పేదఱికము (ఆకించన్యము) గలవారు

దయా ప్రవాహముచేత బాగుగా స్నానము చేయింపఁబడినట్లుగాఁ జెప్పుట మాలిన్యము కొంచెమైన నంటక కర్మసంబంధము వదలి తన పరిశుద్ధమైన స్థితిని దెలుపుచున్నది "తేయ్త్తు క్కిడక్క నానొట్టేఱ్" అని, తల్లి మాలిన్యమంతయు బాగుగాఁ బోవునట్లుగా స్నానము చేయించె ననుట మనంతట మనమే జ్ఞాన మను నీటిలో స్నానముచేసి మన మాలిన్య మంతయు పోఁగొట్టుకొనుట యశక్యము

ప్రతి బిన్దు.. ...విప్రుష్కికైః —శ్రీదేవీ కటాక్షలేశమును బొందునపుడెల్లను బ్రహ్మాదులైన పెద్దలుకూడఁ దమ గొప్పతనమును మఱచి "ఇది నా కొఱకే, ఇది నా కొఱకే" యని కలహించుచుందురఁట

"బద్ధకలి" అనునది ప్రకృత్యర్థమున "క" ప్రత్యయముచేరి "బద్ధకలిక" అని యయ్యెను కలి=కలహము "కలిస్స్యాత్ కలహే శూరే" యని విశ్వనిఘంటువు మావంటి యకించనులను గూలంకషముగాఁ బ్రవహించి స్నానము చేయించు కృపా ప్రవాహములో నొక బిందువునకే గదా బ్రహ్మాదు లంత పాటు పడుట!

ఇఁక, "కలికా" యనునది యొక పదముగాను, "ఉత్కలికా" యను నర్థమున నుపయోగింపఁబడినదిగాను నెంచి, శ్రీదేవి కటాక్షముయొక్క ప్రతి బిందువులోను బ్రహ్మాదులు తమ మనోరథమును బూర్తి చేసికొనుచున్నారని కొందఱు అర్థము చెప్పెదరు ఉత్కలికా=ఉత్కంఠ, ఇచ్చట మనోరథము బద్ధ=పొందిన, కలికా=మనోరథము గలిగినవారగు (బ్రహ్మాదులు) అని యర్థము చేయుదురు

కోట తలుపు గడియ యని యర్థము నిచ్చు "విష్కంభ" పదము నగర రక్షణమునకై ముఖ్యమైన యొక వస్తువును దెల్పునదైనను, ఈ విశేషమును గైకొనక యిచ్చట "ముఖ్య" మను నర్థమున గౌణముగాఁ బ్రయోగింపఁబడినది

పైపైని ఐశ్వర్యములను గలిగించుచునే యున్నందున ఆ భారమును భరింప నేరక తొట్రుపాటుతో శ్రీదేవియొక్క కటాక్షములు నడుచుచున్నవఁట!

ఐశ్వర్యమును గలిగించుటచేత నుల్లాసముగాఁ దొట్రుపాటుతో నడచుచున్నవని యర్థము చేయువారును గలరు సకలైశ్వర్యంబులకును శ్రీదేవీ కటాక్షంబులే హేతువులని భావము

<u>అశరణం మాం</u> —గతిలేని దాసుఁడను భగవంతుఁడును నాకు రక్షకుఁడు గాని స్థితిలో నీవే నన్ను రక్షింపవలయునని యనుట సర్వలోక శరణ్యుఁడు మమ్ముఁ గాపాడకుండ విడిచినను, విడువక రక్షించునది శ్రీదేవియే కదా!

<u>పాలయాలోకితైః</u> —నన్నుఁ గాపాడుటకు భగవంతునివలె దండెత్తవలెనా? కటాక్షించినఁ జాలదా? అనుచున్నారు

<u>పద్మే తే</u> —ఇచ్చట "పద్మే" యను సంబోధన పదమునకుఁ దర్వాత "తే" యనునది రాకూడదను వ్యాకరణ నియమము ననుసరించి "పద్మేతే" యను దానిని ఒకే సమస్త పదముగాఁ గొని (పద్మ + ఇతే) తామరను జేరినదానా! అని యర్థము చేసి కొందఱు నిర్వహింతురు ఇచ్చట నిట్లు చెప్పినను "శ్రీరఙ్గేశ్వరి దేవి! తే విహ్వృతయే" యనుచోట వేఱొకదైనను నుపపత్తిఁ జెప్పవలసియే యుండును కాఁగా "నఞ్ ఘటిత మనిత్యం" అను పరిభాష ననుసరించి యీ విధి యనిత్యమగుటచేత "తే" రావచ్చునని యంగీకరించుటయే సమంజసమని మఱికొందఱి యభిప్రాయము వాస్తవముగ "సర్వదా రక్ష దేవ నః" అనునట్లుగానే దీనిని గ్రహించునది ఇఁక "తే" యనుదాని నవ్యయముగా గ్రహించినయెడల నీ చర్చకుఁ బ్రసక్తియే యుండదు

పూర్వ శ్లోకములో నిట్లు సాక్షాత్తుగా వర్ణింప శక్యమగునని చెప్పి, యీ తరువాతి శ్లోకములోనే కటాక్షములకు నొక రూపమునొసంగి, వాని స్వరూపమును స్వభావములను, కృత్యములను మనోహరముగా, సాక్షాత్తుగా వర్ణించియుండుట విస్మయావహము. ఎట్లు వర్ణించుట? అనునది యితరులకే కాఁబోలు!

ఇన్బువడి వాయిత్తైవ న్ద్రనై ముగ్గుకుక్కుమ్
ఎక్కళిప్పి న్గిమిర్త్తు మడి స్గీరమాగి
అన్బినిమ్డ ఉళవాక వళవు మిాఱుమ్
అరుళ్ వెళ్ళ న్దనిలెమ్మ నోర్త్తై యాట్టి
మున్బిడఙ్గా ళయర్జ ముదలోర్ తివళై దోఱుమ్
మున్ గినశై కలహామిడ మూళుమ్ శెల్వ
వన్బొత్తై యి నడై యిడఱు నోక్కి శాక్కాప్పాయ్
మఱుపుగలి లడియేనై మలరి నాళే! (41)

ఓ శ్రీదేవీ! ఆనంద స్వరూపములై భగవంతుని మంచివేయు మదముచే నలసట పొంది, ప్రేమచేఁ గంఠముపట్టకును దడావఁబడి, మితిమీఱిన కృపా ప్రవాహమువలన మావంటి వారిని స్నానము చేయించి, ప్రధానులైన బ్రహ్మాదులు నొక్కొక్క బిందువునందును అత్యాశ కలవారై కలహము చేయునట్లు—కలుగు సంపదల భారముచేఁ దొట్రుపాటుతో నడచు కటాక్షములచే గతిశూన్యుఁడను, దాసుఁడను అగు నన్ను బాలింపుము (41)

---

అవతారిక —దివ్య విగ్రహ మార్దవ మనిర్వాచ్యమైనదని యనుచున్నారు

పాదారున్తుదమేవ పఙ్కజరజశ్చేటీభృశాలోకితైః
అఙ్గగ్లానిరథామ్బ! సాహసవిధౌ లీలారవిన్దగ్రహః ।
డోలా తే వనమాలయా హరిభుజే హా కష్ట శబ్దాస్పదం
కేన శ్రీ రతికోమలా తనురియం వాచాం విమర్దక్షమా ॥౪౨॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| అమ్బ | తల్లియైన |
| శ్రీః! | లక్ష్మీ! |
| పఙ్కజరజః | కమలధూళి |
| తే | నీయొక్క |
| పాదారున్తుద మేవ | పాదతలమును బాధించుచున్నదియే (యగుచున్నది.) |
| చేటీ | పనికత్తెలయొక్క |
| భృశాలోకితైః | తేఱిచూచు చూపులచేత |
| అఙ్గగ్లానిః | దేహము వాడిపోవుట (కలుగుచున్నది) |
| అథ | మఱియు |
| తే | నీయొక్క |
| లీలారవిన్దగ్రహః | విలాసార్థము కమలమును బట్టుకొనుట |

| | |
|---|---|
| సాహసశిక్షా | సాహస కార్యములో (అగుచున్నది) |
| తే | నీయొక్క |
| హరిభుజే | భగవంతుని మహాహస్తమున |
| వనమాలయా | వైజయంతి యను వనమాలచేత |
| డోలా | ఊఁగులాడుట |
| హా కష్ట శబ్దాస్పదం | "అయ్యో! కష్టము" అని చెప్పుటకు స్థానమగుచున్నది |
| అతి కోమలా | మిక్కిలి మృదువైన |
| ఇయం | ఈ |
| తనుః | (నీ) విగ్రహము |
| కేన | ఏ కారణముచేత |
| వాచాం | పలుకులకు |
| విమర్దక్షమా | మర్దించుటకుఁ దగినదిగా [నగును? |

పాదారున్తుదమ్... రజః—తనకుఁ బ్రాప్తమైన చరణముల మార్దవమును మొట్టమొదట వివరించుచున్నారు తామరపూవులో నివసించునని లక్ష్మి సర్వదా వసించి పరిచితమైన తామర పుష్పాదియే యీమె పాదములను ముల్లవలె బాధించు నెడల ఆ పాదముల మృదుత్వము నేమని వర్ణింపవచ్చును? తామరకంటె ఎక్కువ మృదువైన వస్తు వేదియు లేమింజేసి గత్యంతరములేక అచ్చట వసించుచున్నదే కాని, పుష్పాదివలన బాధ లేకపోవుటచేఁ గాదు-అనుచు "పాదారున్తుదమేవ" యని యన్నారు

"పాదం" చరణములయొక్క క్రింది భాగము

"అరుర్ద్విషత్" ఇత్యాది విధి ప్రకారము "ముమ్" ఆగమము వచ్చి, "అరున్తుదం" అని యాయెను

చేటీ.... మ్లానిః —విగ్రహ మార్దవమును వర్ణించుచున్నారు శ్రీదేవీ సౌందర్యము పరిచితులగు పనికత్తెలనుగూడఁ జేటి చూచునట్లు చేయుచున్నది మదింపు నెఱిఁగిన పనికత్తెలు చూచునపుడే విగ్రహము వాడినచో నితరులు చూచుట వలన నేమి కలుగునో! చూపులచేతనే విగ్రహము వాడిన యెడల రూపవంతములగు వస్తువుల స్పర్శములచేతనే పాటు పడునో! తాఁకినచో ఒక పచ్చియాకు వాడును, వాసన చూచినచో నొక పూవు వాడిపోవును చూచినచో వాడిపోవునట్టి యీ విగ్రహ మార్దవమునకు లోకములో సాటి యేది యున్నది?

సాహస. ... గ్రహః —ఈ మృదువైన విగ్రహము చేయు సాహస కృత్యమును నుడువుచున్నారు భగవంతుని గోవర్ధనోద్ధరణముకంటెను నీమె చేతిలోఁ దామరపూవును మోయుట సాహస కృత్యమని యీ గ్రంథకర్తకుఁ దోఁచుచున్నది.

డోలా......ఆస్పదం — భగవంతుని వక్షస్స్థలమందలి వనమాలచేత నిషెయూఁగులాడుట దర్శించిన అయ్యో! కష్టము! అని చెప్పవలసి యున్న దనుట "భుజం" అనునది భుజములతోఁ జేరిన వక్షస్స్థలమును లక్షించుచున్నది (ఇది అజహల్లక్షణ) ఇందు చేత భుజము లను స్తంభములలో వనమాల యను నూయెల తగిలింపఁబడినదని తెలియుచున్నది

శత్రు బాణములకు లక్ష్యమై, మిట్ట పల్లములు గల వక్షస్స్థలమునందు, కఠిన మైన వనమాలచేత వేగముగ నుయ్యెల లూఁగుటను జూచిన "అయ్యో! కష్టము! ఏమి సంభవించునో" యని వెఱపు గలుగుచున్నదనుట

"హా" అనుదానిని ప్రత్యేకించి గ్రంథకర్త "అయ్యో!" అనుచున్నారవి కొందఱర్థము సేయుదురు

కేన.... క్షమా — "చూపులను దాళని యీ విగ్రహము, పలుకులకు ఓర్చునా?" అనుచున్నారు శ్రీదేవీ విగ్రహమును వర్ణించిన, దానిని మర్దించి నట్లగునే కాని యథాస్థితిని వివరించినట్లు కాదనుట ఈ మృదువైన విగ్రహమును గఠినములగు పలుకులచేత స్తుతించుట తగదని తాత్పర్యము

పజ్గయత్తూళ్ పడుమేనుమ్ పాదమ్ తున్బ
 ప్పడుపదువే చేడిమా రుణ్బ ప్పారిక్కల్
అజ్గమద ప్పోహుదన్నాయ్! వాడి ప్పోగుమ్
 అరుణ్బయలే విళ్లై యాడు మలర్ శుమత్తల్
తోజ్గుమరి తోళిల్ వనమాలై యానీ
 తుయరన్దో! ఎనక్కిడమా మూజ్ఞలాడల్
ఎజ్గనమా ఇమ్మిగమె ల్లియలుడమ్బై
 ఇలక్కుమియే! వాశకత్తాల్ కసక్కలాగుమ్? (42)

తల్లీ! లక్ష్మీ! పంకజ ధూళి సోఁకఁగనే నీ పాదతలము బాధపడును. పనికత్తెలు తేటిచూచుటచే విగ్రహ మప్పుడే వాడిపోవును కేళీ పుష్పమును ధరించుట సాహస కృత్యమే. హరి భుజములనుండి వ్రేలాడుచున్న వనమాలచేత నూయెల లూఁగుట అయ్యో! కష్టము! అనుటకుఁ జోటగును అత్యంత మృదువైన యీ విగ్రహము నెట్లు పలుకులచేత మర్దింపనగును? (42)



అవతారిక — ఇట్లు విగ్రహ మార్దవమును జెప్పి ఈ శ్లోకములోఁ బరువమును గుఱించి వివరించుచున్నారు

ఆమర్యాద మకణ్టకం స్తనయుగం నాద్యాపి నాలోకిత
భ్రూభేద స్మిత విభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః ।
సూతే శైశవ యౌవన వ్యతికరో గాత్రేషు తే సౌరభం
భోగస్రోతసి కాన్తదేశిక కరగ్రాహేణ గాహక్షమః॥ ॥౮౩॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| స్తనయుగం | (లక్ష్మీ! నీ) చనుగవ | భోగ స్రోతసి | అనుభవ ప్రవాహములో |
| ఆమర్యాదం | ఉండవలసిన హద్దులకు | కాన్త | ప్రియుడను |
| ఆద్యాపి | ఇప్పుడును | దేశిక | గురువుయొక్క |
| ఆకణ్టకం | అడ్డులేనిదిగా | కర | హస్తమును |
| న | లేదు, | గ్రాహేణ | పట్టుటచేత |
| ఆలోకిత | చూపులయొక్కయు, | గాహ | దిగుటలో (మునుగుటలో) |
| భ్రూభేద | కనుబొమల ముడి పాటులయొక్కయు, | క్షమః | అర్హమైన |
| స్మిత | చిఱునవ్వులయొక్కయు | శైశవ | శిశుత్వము |
| విభ్రమాః వా | విలాసములును | యౌవన | యౌవనప్రాయము-వీనిని |
| నైసర్గికత్వ | స్వాభావికములనుటచేఁ గలిగిన | వ్యతికరః | సంధించుట |
| | | తే | నీయొక్క |
| అయశః | అపకీర్తిని | గాత్రేషు | అవయవములలో |
| అద్యాపి | ఇప్పుడును | సౌరభం | సువాసనను |
| న జహాతి | విడువలేదు, | సూతే | కలిగించుచున్నది |

"ఘన కనక ద్యుతీ" అను శ్లోకములోఁ జెప్పఁబడిన తారుణ్య మిచ్చట వివరింపఁబడుచున్నది బాల్యాంత యౌవన ప్రారంభముల సంధి తారుణ్య మనఁబడును

3-వ పాదము తప్ప మిగిలిన మూఁడు పాదములలోను బాల్య యౌవనముల సంధి వర్ణన మానందకరమై యున్నది

స్తనములు పెంచునది యౌవనము అది ముదిరిన వృద్ధి ముగియును. బాల్య దశ అనువర్తించుచుండుట చేత శ్రీదేవి యౌవనము ముదురునది కాదు కాఁగా నుపక్రమించు యౌవనముచేత స్తనములు పెరుగుచున్నవి, అనువర్తించు బాల్యమ్ము దానిని బూర్తిగా పెరుగనీయలేదు ఇట్లు స్తనములవృద్ధి చెప్పుటచే యౌవనమును,

పూర్ణవృద్ధికి అడ్డుండునట్లు చెప్పుటచేత శైశవమును మొదటి పాదములో సూచింపఁబడినవి వృద్ధి కాటంకము శైశవమే యనుట

<u>అమర్యాదం</u>—హద్దు అనునది పెరుగుటయొక్క సీమను జూపును

వృద్ధిని దెలుపు మాటను ఉపయోగింపకయే అర్థము విశదమగు విధమున నిచ్చుట సంగ్రహముగాఁ బదములను గూర్చియున్న సొగసు మనోహరముగ నున్నది

<u>అకణ్టకం న</u>—రెండు వ్యతిరేకములు ప్రకృతార్థమును దృఢపఱచుచున్నవి

<u>అద్యాపి</u>—"అపి" ఉక్తానుక్త సముచ్చాయకము ఇందువలన నిప్పటివఱకేకాక ముందును వృద్ధికి నాటంకము (శైశవము) ఉండునదియే యనఁబడినదయ్యెను ఈ ప్రాయము శ్రీదేవికి నిరంతర ముండునది కదా! ఇఁక యౌవనము వచ్చిన తర్వాతనుగూడ—అనియు నర్థమగును

మధ్యమ దీప న్యాయము ననుసరించి "అద్యాపి" అను దానిని ముందును, వెనుకను అన్వయించుకొనఁదగును.

యౌవనమునకు ఉచితముగా భావగర్భములైన శ్రీదేవి కటాక్షాదులు నైసర్గికములా అనియు తలంచునట్లు ఉన్నవని రెండవ పాదముయొక్క అర్థము జవ్వనులగు స్త్రీల చూపులు మొదలగువానిక నేదో భావము లేదో సది కొఱఁతయే యనుచు "అయశః" అని ప్రయోగించిరి

వీక్షణము లోనగు విలాసములను జెప్పుటచేత యౌవనమును, అవి సహజత్వమును విడువలేదనుటచేత శైశవమును వరుసగా రెండవ పాదములో సూచింపఁబడినవి

ఇఁక, భోగవిషయములో లేఁతప్రాయము గలది యగుటచేత ఇట్లు భోగము ననుభవింప వలయునని ప్రియుఁడు నేర్పఁగా, నట్లే నడచుకొనవలసిన ప్రాయమని నాల్గవ పాదముయొక్క భావము

మితిమీఱిన భోగమని తెల్పుటకై "భోగస్రోతసి" (అనుభవ ప్రవాహమున) అని యన్నారు

భోగములోనికి దిగుట స్వాతంత్ర్య గలది యనుటచేత యౌవనమును, తనంతట తానుగాక ప్రియుని కరావలంబనముచేతనే దిగునట్లు వర్ణించి యుండుట వలన శైశవమును వరుసగా నాల్గవ పాదమున సూచింపఁబడి యున్నవి

రెండు ప్రాయములు కలసి యుండుటచేత శ్రీదేవీ విగ్రహము పరిమళించుచున్నది అనఁగా శ్రేష్ఠముగా నున్నదని మూఁడవ పాదముయొక్క అర్థము ఇదివఱకే శ్రేష్ఠమైన శ్రీదేవి విగ్రహము స్వర్ణకమలము సువాసన పొందునట్లు అతిశయించి యీ ప్రాయముచేత వెల్గుచున్నదని యనుట "సజ్జ్వర్ణే ఖల్వియం వయసి వర్తతే" అని మురారి కవియు నీ రెండు ప్రాయముల సంధిని వర్ణించినది చూడుఁడు.

ముఴువదు కొఙ్గై ముఱ్ఱ ముడిన్దిల తిడై ఇచ్చ లిన్నుమ్
విఴివగై పురువ లీలై విట్టిల ఇయఱ్పుఴిప్పై
కుఴవు యౌవనజ్గళ్ కూడుమ్ వాసము న్మేని కూఱుమ్
ఇఴ్గైది నీ భోగ వెళ్ళత్తు ఏన్దలిఙ్ కర మ్పిడిత్తే. (43)

యౌవన ప్రాప్తి యైన తరువాతను నీ స్తనములు పూర్ణముగ వృద్ధిపొందుటకు అడ్డు (శైశవము పోలేదు కటాక్షములు, స్మితము, భ్రూభంగములు, సహజముగా గల్గుచున్నవను అపకీర్తి విడవలేదు బాల్య యౌవనముల సంధివలనఁ గల్గు సువాసన నీ విగ్రహమున వర్ధిల్లుచున్నది నీవు భోగప్రవాహములోనికిఁ గాంతుని హస్తమును బట్టుకొనియే దిగుచున్నావు (43)



అవతారిక —సౌరభము, శైత్యము, సౌందర్యము లోనగు మంచి గుణములతోఁ గూడిన శ్రీదేవీ విగ్రహమును నొక పుష్పమాలగా రూపించి దానిని భగవంతుని వక్షస్థలమునకు అలంకారముగా వర్ణించి, మృదువైన విగ్రహము నిట్లు వర్ణించుటయా? యని తన్ను దానే నిందించుకొనుచున్నారు

ఆమోదాద్భుతశాలి యౌవనదశా వ్యాకోచ మమ్లానిమత్
సౌన్దర్యామృత సేక శీతల మిదం లావణ్య సూత్రార్పితమ్।
శ్రీరఙ్గేశ్వరి! కోమలాఙ్గ సుమనస్సన్దర్భణం దేవి! తే
కాన్తోరః ప్రతియత్న మర్హతి కవిం ధిఙ్మామకాణ్డాకులమ్॥౪౪॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గేశ్వరి! | శ్రీరంగనాచ్చియారైన | సౌన్దర్య | సౌందర్యమను |
| దేవి! | ఓ దేవీ! | అమృత | అమృతమును గొని |
| ఆమోదాద్భుత | వాసనచేత నాశ్చర్యముగ | సేక | తడుపుటచేత |
| శాలి | వెలయుచున్నదియు, | శీతలం | చల్లనైనదియు, |
| యౌవన దశా | యౌవనదశ యను | లావణ్య | లావణ్యమను |
| వ్యాకోచం | వికాసము గలదియు, | సూత్ర | దారములో |
| అమ్లానిమత్ | వాడనదియు, | అర్పితం | గ్రుచ్చఁబడినదియునగు |

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ | ప్రతియత్నం | అలంకారముగాఁ |
| తే | నీయొక్క | అర్హతి | దగియున్నది, |
| కోమలాఙ్గ | మృదువైన యవయవము [లని | అకాణ్డ— | తగని మార్గమున |
| సుమనః | పూలయొక్క | ఆకులం | కలఁతపడిన |
| సన్దర్భణం | మాలిక యనునది | కవిం | కవినైన |
| కాన్త | ప్రియునియొక్క | మాం | నన్ను |
| ఉరః | ఱొమ్మునకు | ధిక్ | నిందింపవలయును |

శ్రీదేవీ విగ్రహ మొక పుష్పమాలగా వర్ణింపఁబడుచున్నది. మృదువులగు అవయవములె మాల కట్టుటకుఁ బుష్పములుగా సమరినవి. దశచే వికసించియుండు ఆ పూలు దేహమాద్యంతము వ్యాప్తమై యున్న లావణ్యము (అందము) అను దారములో గ్రుచ్చఁబడి యున్నవి. ఆ మాల సౌందర్యము (అవయవ శోభ) అను అమృత జలముచేఁ దడుపఁబడి శీతలముగ నున్నది. వాడక యాశ్చర్యకరమైన సౌరభమును వెదఁజల్లుచున్నది. అది భగవంతుని వక్షస్స్థలమున కలంకారముగాఁ దగియున్నదను వర్ణన యెంత యింపుగా నున్నది! వక్షస్స్థలమందున్న లక్ష్మి నిట్లు వర్ణించుట యెంత పొసఁగి యున్నది! "మార్వత్తు మాలై నఙ్గై" (వక్షస్స్థలమునకు మాలగా నుండు శ్రీ) అను పెద్దల సూక్తి యిచ్చట స్మరణీయము.

ఆమోదాద్భుతశాలి —ఆశ్చర్యమైన వాసనచేత శోభించుచున్న దనియుఁ గొందఱర్థము సేయుదురు.

యౌవన దశా వ్యాకోచం —"ధాన్యేన ధనవాన్" (ధాన్యమైన ధనమును గలిగిన వాఁడు) అనునట్లుగా "దశయా వ్యాకోచం" అని విగ్రహము చేసి, యౌవన దశ యను వికాసము గలది యనియు నర్థము చేయుటయుఁ గలదు. వ్యాకోచం—వికాసము—వికసించినదియు నగును. "వ్యాకోశం" అని అమరములో పద మున్నది.

"ప్రతికర్మ ప్రసాధనం" అను నిఘంటువు ననుసరించి ప్రతికర్మ శబ్దము యొక్క పర్యాయ మగు ప్రతియత్న శబ్దము, అలంకార మను నర్థములో వ్యవహరింపఁబడినది.

ఇఁకఁ బ్రియుని వక్షస్స్థలమునకు ఈ మాల యలంకారమని యర్థము సేయక, వక్షస్స్థలముచేత నీ మాల కలంకార మని కొందఱర్థము చేయుదురు.

ఇఁకఁ, "ప్రతియత్నో ఉపగ్రహ లిప్సా" యనునట్లు పొందు కోరిక నీ పదము చెప్పుటయు నగును. అప్పుడు ప్రియుని వక్షస్స్థలముయొక్క పొందు కోరికకు ఈ మాల తగినదే యనుట. అనఁగా భగవంతుని వక్షస్స్థలమీ హారమును బొందనాశఁగొనుట యుచితమే యని భావము.

ఇట్లు మధురముగా వర్ణించిన గ్రంథకర్త యన్నులోఁ గొన్ని యుత్కృష్ణ లుదయించినవి పుష్పాదియే పాదములను బాధించునా యేమి, హస్తమున పుష్పమును ధరించుట సాహస కార్యమని యెంచి, బుష్పమునకంటె మార్దవముగలదిగ వర్ణించిన మేమే యిచట యామె దేహమును బుష్పమాలగా వర్ణించుట విరుద్ధము కదా! అట్టి వర్ణనతో నిలుపక యా మాల యసుర, రాక్షసుల బాణములకు గుఱియై గాయపడిన భగవంతుని కఠినమైన వక్షస్థలమునందుఁ దగిలినది వర్ణించుట యెంత సాహసము!

అవును, మే మిట్లు వర్ణించినది భ్రాంతి మూలకమే తప్పు చేసితిమని "కవిం ధిక్ మా మకాణ్డాకులం" అని తమ్ముఁ దామే నిందించుకొనుచున్నారు

తన మార్దవమునకుఁ గొంచెమైనను దగని ప్రదేశమైనను భగవంతునియందుండు ననురాగముచేతను, ఈశ్వర స్వాతంత్ర్యమును, చెలనాపరాధమును జూచి, వక్షస్థల మును వదలిపెట్టలేనిదై యుండుటచేతను శ్రీదేవి యచ్చటనే నిరంతర వాసము చేయుచున్నదని తెలిసికొనునది

అజ్ఞమెను మెన్మలర్క శిరియ గన్దమ్
ఆచ్చరియ మాయ్క్కుమ్ఱు వాడాదెన్రుమ్
తజ్ఞియ యావన మలర్చ్చి యుడును ఉవ్పేర్
తణ్ణముదా ఉక్కుళిర్న్దు మిగ విలా వణియమ్
ఎన్గిన్ర నూల్ దన్నిల్ ఇమైయెయ కోత్త
ఇన్దొడై యె లెనవన్బర్ మార్బుక్కేఉవ్వు
తఞ్ఞినై శీరరఙ్గత్తిల్ తయ్యై వి! దేవి!
తగ విన్ని కక్కులజ్ఞి యఙ్ఞ శార్ఙ్గినేనే! (44)

శ్రీరంగనాచ్చియారైన ఓ దేవీ! అవయవము లను మృదువులైన పుష్పము లాశ్చర్యముగాఁ బరిమళింప, ఎల్లప్పుడును, వాడక నిరంతరమగు యౌవన మను వికాసములో నవయౌవ సౌందర్య మను నమృత జలముచేఁ జల్లఁబడి, లావణ్య మను దారములోఁ దగునట్లు గ్రుచ్చఁబడిన మాలవలె నీవు ప్రియుని వక్షస్థలమున నను గుణముగ వసించుచున్నావు ఇట్లు కలంత పొంది యనుచితంబుగ వర్ణించితినే! (44)



అవతారిక — కలయిక చేత శ్రీదేవి భగవంతు నానందింపఁ జేయుచున్నదని వర్ణించుచున్నారు

మర్మస్పృశో రస సిరా వ్యతివిధ్య వృత్తైః
కాన్తోపభోగ లలితై ర్లులితాఙ్గయష్టిః ।
పుష్పావళీవ రసిక భ్రమరోపభుక్తా
త్వం దేవి! నిత్య మభినన్దయసే ముకున్దమ్ ॥౪౫॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | ఓ దేవీ! | అఙ్గయష్టిః | కోయ్యవంటి తనువుగలదై |
| మర్మ | మర్మమును | రసిక | రసము గ్రహింప నేర్చిన |
| స్పృశః | తాఁకునట్టి | భ్రమర | తుమ్మెదచేత |
| రససిరాః | రసనాడులను | ఉపభుక్తా | అనుభవింపఁబడిన |
| వ్యతివిధ్య | తాఁకి | పుష్పావళీ ఇవ | పూలవరుస (మాల) వలె |
| వృత్తైః | జరగిన | త్వం | నీవు |
| కాన్త | ప్రియునియొక్క | ముకున్దం | ప్రియుఁడైన ముకుందుని |
| ఉపభోగ | అనుభవముయొక్క | నిత్యం | ఎల్లప్పుడును |
| లలితైః | విలాసములచేత | అభినన్దయసే | ఆనందింపఁ జేయు |
| లులిత | నలిగిన | | చున్నావు |

"శురుమ్బు తుళైయి శ్చెన్దూద అరుమ్బుమ్" (భ్రమరము రంధ్రములోనికి వెళ్లి యూఁదగా వికసించు) అన్నట్లు, మధువు స్రవించు నాడిని దెలిసికొని భ్రమరము ఊఁది పుష్పమును బీల్చులాగున భగవంతుఁడు లక్ష్మియొక్క యింపు గలిగించు నాడులను తాఁకి యాస్వాదించుచున్నాఁడనుట

"ముక్తావళి" ముక్తాహారమును జెప్పునట్లుగా "పుష్పావళి" పూలమాలను జెప్పుచున్నది.

శ్రీరంగరా జను దివ్య భ్రమరము నలిపిన పూలమాలయే శ్రీదేవి యనుట దీనిచేత భోగవిషయమునందు భగవంతుని సామర్థ్యము, శ్రీదేవియొక్క సడలమియుం గోచరించుచున్నవి

శ్రీదేవి పుష్పావళి వంటిదని యనుటచేత నామె ప్రియునికే భోగ్యమైన దని **వివక్షితము.**

దాని కనుగుణముగఁ గలయికలోఁ దాను రమించునట్లు చెప్పక, భగవంతుని రమింపఁ జేయునట్లు నుడివిరి పతియొక్క భోగమునే ముఖ్యముగా నెంచుట యుత్తమ స్త్రీ లక్షణము "భుఙ్క్తే స్వభోగ మఖిలం పతిభోగ శేషమ్" అనునది వేదాంత దేశికుల సూక్తి "నిత్య కంకరుఁడనై సంతోషించెదను" అని చెప్పక "సంతోషింపఁజేసెదను" అను ఆళవందారుల సూక్తి యిచ్చట స్మరణీయము తాను బురికొల్పిన కైంకర్యము నంగీరించి యానందించునట్లు, తాను జరుపు లీలకు శ్రీదేవి తగుల్పడి యుండుటను జూచి భగవంతుఁడు మిక్కిలి సంతసించు చున్నాఁడని యనుట

పూర్వపు శ్లోకమున శ్రీదేవిని బుష్పమాలగా వర్ణించుట యనుచితమని తిన్నగర్హించుకొన్న గ్రంథకర్త యీ శ్లోకములో శ్రీదేవి పుష్పమాలవంటిదని చేసిన వర్ణనను లక్షింపుఁడు

సముచితమైన మాలగా శ్రీదేవి వక్షస్థలము నలంకరించుచున్న దనుటలోనే తప్పు మాలవలె నానందింపఁ జేయుచున్న దనుటలోఁ దప్పు లేదని భావము కాఁబోలు!

చువై తరు నరమ్బు మర్మమ్ తొడువన తొట్టుత్తాక్కి
నవై యఱ లీలై నాదఱ నడత్త నీ దువణ్డు మేని
చువై యఱి శురుమ్బు శేర్న్దు తుదైత్త పూన్దొడై యల్ పోల
ఉవగై యిల్ ముకున్దనై నీ ఉయ్త్తి యెన్నాళుమ్ దేవి ! (45)

దేవీ! మర్మములను దాఁకునట్టి రసనాడులను దాఁకి నీ ప్రియుఁడు సరసముగా లీలగావింప విగ్రహము నలిగి, రసిక భ్రమరము చేరి యనుభవించిన పూలమాలవలె నీ వెల్లప్పుడును ముకుందు నానందింపఁ జేయుచున్నావు (45)



అవతారిక —దివ్యాభరణ సన్నివేశ సౌందర్యము ననుభవించుచున్నారు.

కనక రశనా ముక్తా తాటఙ్క హార లలాటికా
మణిసర తులాకోటి ప్రాయై ర్జనార్దనజీవికే।
ప్రకృతిమధురం గాత్రం జాగర్తి ముగ్ధ విభూషణైః
వలయ శకలై ర్దుగ్ధం పుష్పైశ్చ కల్పలతాయథా ॥౪౬॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| జనార్దన | భగవంతునకు |
| జీవికే! | బ్రతికించునట్టి యోషధి లతా! |
| కనక రశనా | బంగారపు టొడ్డాణము |
| ముక్తా తాటఙ్కా | ముత్యాలకర్ణాభరణము |
| హార | ముత్యాల హారము |
| లలాటికా | లలాటమందు వ్రేలాడు నగ |
| మణిసర | మణుల మాల |
| తులాకోటి | కాళ్ల గజ్జెలు-అను నివి |
| ప్రాయైః | మొదలుగాఁ గల |

| | |
|---|---|
| ముగ్ధవిభూషణైః | అందములైన ఆభరణము |
| ప్రకృతి | స్వభావముగనే [లతో |
| మధురం | సుందరమైన |
| తే | నీయొక్క |
| గాత్రం | విగ్రహము |
| వలయ శకలైః | చక్కెర ముక్కలతోడి |
| దుగ్ధం యథా | పాలవలెను, |
| పుష్పైః | పూవుల చేత |
| కల్పలతా | కల్పలత వలెను |
| యథా చ | |
| జాగర్తి | వెలయుచున్నది |

చక్కెర కలిసిన పాలవలెను, బుష్పములతోఁ గూడిన తీగవలెను, నీ శరీర మాభరణములతోఁ గూడి విశేషముగా శోభిల్లుచున్నది యనుట సహజ సౌందర్య ముతోఁ గాల్పనిక సౌందర్యము కూడఁ జేరి శోభిల్లుచున్నదని భావము

జీవికే —"జీవన్తి జీవనీ జీవా" అను నిఘంటువు ప్రకారము, బ్రతికించు నోషధి లతను దెల్పు "జీవా" యను పదము "క" అను ప్రత్యయమును గొని "జీవికా" అని యాయెను దాని సంబోధన వాచకము "జీవికే"

కనకమే కలై ముత్తారమ్ కాదణి శిలమ్బు చుట్టి
ఇనమణి చ్చరమె న్ఱిన్న ఎళ్లిలిఙ్గై యణిన్ది యత్తేర్
ఉనదుడల్ మలరిల్ కల్పు వొణ్గొడి కణ్డిల్ పాలుమ్
ఎన వొళిర్ తిరుజ్జనార్దన ఇన్నుయి రేడువాయ్! (46)

జనార్దనుని జీవితుఁ జేయు నో దేవీ! స్వభావ సుందరమగు నీ విగ్రహము, బంగారపు టొడ్డాణము, ముక్తాహారము, కర్ణాభరణము, కాలిగజ్జెలు, లలాటపు నగ, మేలైన మణుల సరము-ఇట్టి యాభరణముల ధరించి, పుష్పములతోడి కల్పలతవలెను కలకండతోడి పాలవలెను వెలయుచున్నది. (46)



అవతారిక:—ఇకఁ గౌస్తుభము, వైజయంతి అను భూషణములును ఈ జాతిలోనే గణింపఁదగిన పంచాయుధములును, శ్రీదేవికిని సంబంధించి యుండియు, భగవంతుఁడే ధరించియుండుటకుఁ గారణమును నుడువుచున్నారు

సామాన్య భోగ్యమపి కౌస్తుభ వైజయన్తీ
　పఞ్చాయుధాది రమణ స్స్వయమేవ బిభ్రత్ ।
తద్భార ఖేదమివ తే పరిహర్తు కామః
　శ్రీరఙ్గధామ మణిమఞ్జరి! గాహతే త్వామ్॥　　॥౮౨॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గ ధామ | శ్రీరంగ విమానము యొక్క | భార | మోయుటచేతఁ గలిగిన |
| మణి మఞ్జరి | రత్నముల గుత్తివంటి దానా! | ఖేదం | ప్రయాసను |
| సామాన్య | సాధారణముగ | తే | నీకు |
| భోగ్యమపి | అనుభవింపఁ దగినవియై | పరిహర్తు | లేకుండఁ జేయు కోరిక |
| కౌస్తుభ | కౌస్తుభ రత్నము [నను | కామ ఇవ | కలవాఁడై కాఁబోలు |
| వైజయన్తీ | వనమాల | స్వయం ఏవ | తానే |
| పఞ్చాయుధ + ఆది | పంచాయుధములు మొదలగువానిని | బిభ్రత్ | మోసికొని |
| తత్ | అవి | రమణః | నీ ప్రియుఁడైన రంగనాథుఁడు |
| | | త్వాం | నిన్ను |
| | | గాహతే | అనుభవించుచున్నాఁడు. |

ఇదివఱకే ధరించియుండు ఆభరణములకుఁ బైని ఇవియుఁజేరి బరువై శ్రీదేవి ప్రయాస పడకూడదే యను నభిప్రాయముతోఁ గాఁబోలు భగవంతుఁడు తానే వీనిని వహించుచున్నాఁడని చెప్పుట హేతూత్ప్రేక్ష. పంచాయుధములు మొదలగునవి శ్రీదేవియొద్ద లేనందులకుఁ గారణ మిట్లు కల్పింపఁబడినది. అవి లేకుండుటకు బాధ్యత లేకుండుట కారణము కాదు—అని గ్రహించునది

"శ్రీరఙ్గధామ" అనుదానికి రంగనాథుఁడనియు నర్థము.

సౌందర్యముతోఁ గూడఁ గాంతియుఁ గలిగి యుండుటంబట్టి "మణిమఞ్జరి" అని సంబోధించిరి

రమణ బిభ్రత్ —ప్రేమ ప్రభావముచేత భగవంతునకు బరువు తెలియుట లే దనుట

గాహతే —గాహనం = మునుఁగుట ఇచ్చట బాగుగా ననుభవించుట బరువుచే మునిఁగెను గాఁబోలు! నా బరువును జేర్చి మోయునట్లు, ఇది యెంత ప్రేమయో యని శ్రీదేవి నిరుగాఁ గరఁగుచున్నది, అందులో భగవంతుఁడు మునుఁగు చున్నాఁడనుట

ఏదిన్మై న్దగల మేన్దు మెత్త్రిల్మణి వైజయన్తి
ఆదినీ తాజ్గిక్ తున్బ మామెన ప్పొదు వానాలుమ్,
కాదలక్ష్మీమన్దు తానే కనమ్ కరు దాద రజ్గమ్
పోదరు మణిప్పూ జోక-త్తే! పుకమున్నై త్తుయ్ప్ప దఱ్కే. (47)

శ్రీరంగములో వేంచేసియుండు రత్నముల గుత్తివంటిదానా! పంచాయుధములు! అందమైన కౌస్తుభమణి, వైజయంతి మాల మొదలగునవి మీ యుభయులకు సాధారణములైనను, నీవు వహించినచో బరువుచేతఁ బ్రయాసపడుదువని భగవంతుఁడు తానే భారమును లక్ష్యము చేయక ధరించి, నిన్ననుభవించుటకే యవగాహించుచున్నాఁడు (47)



అవతారిక —ఈవిధముగ దివ్యాభరణములును, దివ్యాయుధములను శ్రీదేవికిని సంబంధించినవే యనుటచే దివ్యదంపతుల యానురూప్యము చూపఁబడినది ఈ యానురూప్యము నింతవఱకుండు దశలలో మాత్రమే కాదు, క్రొత్తగా నెత్తు అవతారములలోఁ గూడఁ జూడవచ్చును అనురూప్యముతో శ్రీదేవి తానుగూడ నవతరింపని యెడల భగవంతుని యవతారము విరసమే యగునని యనుచున్నారు

యది మనుజ తిరశ్చాం లీలయా తుల్యవృత్తేః
అనుజను రనురూపా దేవి! నావాతరిష్యః।
అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః!
దరదళదరవిన్దోద న్తకాన్తాయతాక్షి!॥ ॥౪౮॥

### ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దర | కొంచెముగా | తిరశ్చాం | తిర్యక్కులకును |
| దళత్ | వికసించు | తుల్య | సమానములైన |
| అరవిన్ద | తామరయొక్క | వృత్తేః | కృత్యములు గల |
| ఉదన్త | మాట గలదియై | నాథస్య | ప్రియునియొక్క |
| కాన్త | అందమైనదిగాను | అనుజనుః | అవతారము లన్నిటియం[దును |
| ఆయత | దీర్ఘముగాను నుండు | అనురూపా | తగినదిగా |
| అక్షి | కన్నులు గల | న అవాతరిష్యః | అవతరించక పోయినచో యది |
| మాతః | తల్లియైన | | |
| దేవి! | ఓ దేవీ! | నర్మ | (నాయకుని) విలాసము |
| లీలయా | లీలచేత | అసరసం | విరసముగ |
| మనుజ | మనుష్యులకును | అభవిష్యత్ | అయి యుండెడిది |

ఓ శ్రీదేవీ! నీవును ప్రియునితోఁ బాటు అనురూపముగా నవతరించుటచేత నతని యవతార లీలలు రసవంతములగుచున్నవి అట్లు కానియెడల నవి యన్నియు విరసములే యై యుండు ననుట

ఎవరికి విరసమగునని విశేషించి చెప్పనందున అనుభవించు భక్తులకును, అవతరించు ప్రియునకును విరసముగా నుండునని వివక్షితము సీత యవతరింపక యుండినయెడల రామావతారము మనకు సరసముగాఁ దోఁచదు సీత యను పాత్ర లేక రాముని కథను గొంచెము చింతించినచో ఈ తత్త్వము విశదమగును. భగవంతునికిని గలసియుండి యాటలాడు నీమె లేకపోయినచో "క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాత్" అనునట్లు సరసమై యుండ దనుట

"అన్ని యవతారములలోను" అనుటచేత శ్రీదేవి లేక భగవంతుఁ డవతార మెత్తుటయే లేదని విశదమగును

వామనుఁడై తాను బ్రహ్మచారిగా నవతరించినపుడును, ఆ దశకుఁ దగిన విధమున చిన్న దేహముతో వక్షస్స్థలమునందుఁ బ్రకాశించు లక్ష్మిని జింక చర్మముతోఁ జేయఁబడిన ఉపవీతముచేతఁ గప్పిపెట్టినట్లుగాఁ జెప్పఁబడి యున్నది "పూమేయ శెమ్మాదై నిన్మార్బిల్ శేర్విత్తు ప్పారిడన్ద అమ్మా!" అను నమ్మాళ్వారుల సూక్తి ధోరణిలో వరాహావతారమందును శ్రీదేవి వక్షస్స్థలమున నుండినదని తోఁచుచున్నది.

"పరిపాడల్" అను ద్రవిడ గ్రంథము నందును,
"శెయ్యోళ్ శేర్ న్దని్ మాశి లకలమ్
ఉళ్లివ దుదై పోప్ప దుదై యొడు శిఅన్దఱ" (2-35)
అని చెప్పఁబడి యుండుట నిచట గ్రహించునది

కాఁగా శ్రీదేవి వక్షస్స్థలమున నుండుటయే గాక సీతవలెను, రుక్మిణివలెను వేఱు రూపములు గ్రహించి యవతారములలోఁ దోఁచుట యొక రీతి, అట్లుగాక వక్షస్స్థలమునం దుండియే ఆ యా యవతారములను జక్కఁజేయుట మఱియొక రీతి ఎట్లయినను శ్రీదేవిని విడిచి, యెత్తిన యవతార మేదియును లేదని యెఱుఁగునది. దీనినే పరాశర మునియు "రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని। అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ॥" (రాముఁడుగా నవతరించినపుడు సీతగాను, కృష్ణుఁడుగా నవతరించినపుడు రుక్మిణిగాను నవతరించెను ఇతరావతారముల యందును నీమె (లక్ష్మి) విష్ణువును విడిచి యుండలేదు) అని వక్కాణించిరి

ఇఁక రాముని చరితమును సీత రసవంతముగా జేసినట్లు, వామనుని చరితమును రసవంతముగాఁ జేయుటకు శ్రీదేవి వేఱొక రూపమును ధరింపక పోయినను వక్షస్స్థలమునందుండి చక్కఁబఱచుచు నతని నడతను రసవంతముగా నొనర్చెనని గ్రహించునది ఆమె లేనియెడల "దేవియై ప్పిరిన్ద పిన్నర్ తిగై త్తనై పోలుమ్ శెయ్గై" (సీతను ఎడబాసినపుడు నీ చర్యలలో కృత్య విమూఢుఁడవైతివి గాఁబోలు!) అనునట్లు భగవంతుని చర్యలు విరసము లగు ననుట నిస్సంశయము

అవతారమునందు శ్రీదేవి అనురూపగానుండుట "తుల్య శీలవయో వృత్తాం ......రాఘవోఽర్హతి వైదేహీం" అని శ్రీరామాయణమునందు ప్రసిద్ధము

"అనుజను రనురూపరూప చేష్టా న యది పరాగమ మిన్దిరాకరిష్యత్। అసరస మభవాఽప్రియం భవిష్ణోః ధ్రువ మకరిష్యత రఙ్గరాజనర్మ" అను శ్రీరంగరాజస్తవ శ్లోకము నీ భావమేకలదిగా ఈగ్రంథకర్తయే యనుగ్రహించియుండుటఁ జూడుఁడు

"మనుజ తిరశ్చామ్" అని మనుష్య జన్మములను, తిర్యగ్జన్మమును జెప్పుట దేవజన్మములకును, స్థావర జన్మములకును నుపలక్షణము

భగవంతుఁడు ఉపేంద్రుఁడై దేవజన్మములోను, రాముఁడై మనుష్య జన్మము లోను, మత్స్యాదులై తిర్యగ్జన్మములోను, మామిడి వృక్షమై స్థావర జన్మములోను నవతరించి యుండుట గ్రాహ్యము

ఇట్లు జన్మము లెత్తుట మనవలెఁ గర్మముచేఁ గాదు. తన యిచ్ఛచేత నవి కావలసిన విధముగ గ్రహింపఁబడినవే యనుచు "లీలయా" అనిరి

అవతరించిన జాతి ధర్మమును "తుల్యవృత్తేః" అనుటచేతఁ జెప్పుచున్నారు మానహీనమైన వరాహముగా జన్మించినపుడు తుంగముస్తెలను భుజించుట తుల్య వృత్తియే కాదా!

కావునక భగవంతునితోఁ గూడ శ్రీదేవి యవతరించుట యాటలాడు స్వభావముచేతను, మాతృత్వముచేతను, పూర్ణ కరుణచేతను—అనుచు వరుసగా దేవి! మాతః! కాంతాయతాక్షి! అని సంబోధించినారు

దేవి–ఆటలాడునది నేత్రములకు అందము కరుణ

ఉద.. . అక్షి —ఈ నేత్రములను దర్శింపఁగనే వానిని బోలిన తామరను గూర్చిన ప్రస్తావన వచ్చినందున దాని ప్రస్తావమును గలవిగా ఈ నేత్రము లయినవి ఉదన్తః=సమాచారము, ప్రస్తావము ఇది అరవిందముయొక్క ఉదంతము గలది యను బహువ్రీహి గర్భ బహువ్రీహి సమాసము అరవిందమను ఉదంతము గల– అని కొంద అర్థము చేయుదురు

ఇఁక వృత్తాంతమును జెప్పు "ఉదంత" శబ్దము లోపలి పత్రములను లక్షించు చున్నది, కాఁగా, ఉదంతమును (లోపలి పత్రమును) బోలి అందమై దీర్ఘములైన నేత్రములను గలది యని ఒకే బహువ్రీహిగా వీరరాఘవాచార్యులు వ్యాఖ్యానము చేసిరి "ఉదంత" యనుదానికిఁ బ్రకాశించు నంతఃప్రదేశమని యర్థము చేసి దానిని బోలిన కన్నులు గలది యని వ్యాఖ్యానించినవారును గలరు అంతఃప్రదేశ మను నర్థములో నవ్యయము గాక అకారాంతమైన "అన్త" శబ్దమును గలదని వారి ఆశయము కాఁబోలు!

వేణ్డియే విళైయా డఱ్కు విలఙ్గుమా నిడ ప్పిఱప్పై
పూ్పణ్డిడు న్దోఱు మేఱ్ప పోన్దనీ తోన్ఱిడాయేల్
యాణ్డుని న్నన్బన్ తాయే! ఇన్బనాం? శిఱదలర్న్దు
కాణ్డగు కమలమ్ పోలుమ్ కవినుఱు కణ్ణాయ్! దేవి! (48)

తల్లీ! కొంచెము వికసించి, దర్శనీయమైయున్న కమలములఁ బోలిన అందములైన కన్నులు గల దేవీ! నీ ప్రియుఁడు క్రీడకొఱకుఁ దిర్యక్కుల జన్మములను, మనుష్య జన్మములను దన యిచ్ఛచేత ఎత్తినపుడెల్లను నీవు అనుగుణముగా నవతరింపనియెడల నతఁ డెట్లానందము గలవాఁడగును? (48)

---

అవతారిక —ఒక్కొక్క యవతారములోను ఆనందింపఁ జేయుట కతనితో నవతరించుట మాత్రముకాదు భగవంతుని శ్రమను బరిహరించుటకు నవతరించుటయుఁ గలదని క్షీరాబ్ధిలో శ్రీదేవి యవతరించుట ననుసంధించుచున్నారు

స్ఖలిత కటక మాల్యైర్దోర్భి రబ్ధిం మురారేః
భగవతి! దధిమాథం మథ్నత శ్శ్రాన్తి శాన్త్యై।
భ్రమదమృతతరఙ్గావర్తతః ప్రాదురాసీః
స్మిత నయన సుధాభి స్సిఞ్చతీ చన్ద్రికేవ॥ ॥౪౯॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| భగవతి! | సుగుణ సంపత్తి గల లక్ష్మీ! | శ్రాన్తి శాన్త్యై | అలసటఁ దీర్చుకొనుటకై |
| | | స్మిత | చిరునవ్వు |
| స్ఖలిత | జారిన (ఆటంకములైన) | నయన | దృష్టి (అను) |
| కటక | హస్తాభరణములు | సుధాభిః | అమృత ధారలచేత |
| మాల్యైః | మాలలు-వీనితోఁ గూడిన | సిఞ్చతి | తడుపుచు |
| దోర్భిః | చేతులచేత | చన్ద్రికా ఇవ | వెన్నెలవలె |
| అబ్ధిం | సముద్రమును | భ్రమత్ | తిరుగుచున్న |
| దధి మాథం | పెరుగు చిలుకునట్లు | అమృత తరఙ్గ | అమృతపు టలలయొక్క |
| మథ్నతః | మథనము జేయు | ఆవర్తతః | సుడిలోనుండి |
| మురారేః | భగవంతునియొక్క | ప్రాదురాసీః | ఆవిర్భవించితివి |

లోకము నమృతముచేతఁ జల్లగాఁ జేయుచు, వెన్నెల సముద్రమునుండి దోఁచునట్లు, సముద్ర మథనము వలనఁ గలిగిన భగవంతునియొక్క శ్రమ పోవునట్లు చిరునవ్వులు, చూపులు — అను వీనిచేత నతనికిఁ జల్లఁదనము కలుగునట్లు చేయుచు, శ్రీదేవియు సముద్రమునుండి ప్రాదుర్భవించిన దనుట

సముద్ర మథనమును నలక్ష్యముగా నెంచి తన కటకములను, మాలలను దీయక యుండినందున నవి యాటంకములైనవి

"దోర్భిః" అను బహువచన ప్రయోగముచేతఁ దన సహస్ర హస్తములతో సముద్రమును మథించెనని తెలియుచున్నది

ఉపమానార్థములో "ణముల్" ప్రత్యయముచేరి "దధిమాథం" అని యయినది కుండలోని పెరుగును జిలుకులాగున భగవంతుఁడు సముద్రమును మథించెననుట

ప్రీత్యతిశయముచేత నా కార్యముగూడ శ్రమమని తోఁచి, యా శ్రమను బోఁగొట్టుటకై తోఁచిన వెన్నెలవంటిది శ్రీదేవి యని నుడివిరి

భ్రమ దమృత . . . ప్రాదురాసీః .— పెరుగు కుండలో వెన్న చేరునట్లు సముద్రములో నమృతము చేరునపుడు కలిగిన యలల సుడిలో శ్రీదేవి యవతరించె నని యర్థము అమృత సారమే శ్రీదేవి యని తాత్పర్యము "అముదిల్ వరుమ్ పెణ్ణముదు" (అమృతములో నుద్భవించు వనితామృతము) అని యాళ్వారుల సూక్తి "మధుర రసేన్దిరాఖ్యా మధ సున్దర దోః పరిఘమ్" అని యాళ్వారుల వచనము

నిత్యయైన శ్రీదేవి పాలసముద్రమునఁ గ్రొత్తగాఁ బుట్టలేదు ప్రాదుర్భవించుట మాత్రమే యని తెలుపుటకు "ప్రాదురాసీః" అని యనిరి.

కడకముమ్ తోడై యలుమ్ కఱల కైక్కొఙ్గళాల్
కడై యిత్తై తయిరెన క్కళైప్ప నీజ్గిడ
ప్పడు నిల వెనన్గై పార్త్వాయి ల్పగవతి !
కడలము దళైచ్చుళ్ళి కాణ వన్దనై. (49)

ఓ భగవతీ! కటకమును, మాలయూ జాఱునట్లుగా చేతులచేత పెరుగు చిలుకునట్లు సముద్రమును మథించుచున్న భగవంతుని శ్రమమును బ్రసరించు వెన్నెలవలె స్మితముచేతను, గటాక్షములచేతను. శ్రమను బోఁగొట్టునట్లు సముద్రమునం దమృతపు అలల సుడిలో నుండి కనఁబడునట్లు తోఁచితివి (49)



అవతారిక — సీతావతారమునందు వెలసిన శ్రీదేవియొక్క నిరుపమానమైన క్షమ, మహాపరాధులమైన మనకు సుఖము గూర్చును గాక' యని చెప్పుచున్నారు

మాతర్మైథిలి! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా
రక్షన్త్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।
కాకం తఞ్చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమా రక్షతః
సా నస్సాన్ద్రమహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ ॥౫౦॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| మాతః | తల్లీ! | పవనాత్మజాత్ | వాయుసూనుఁడైన హనుమంతునినుండి |
| మైథిలి! | జనకుని కుమార్తెగా నవతరించినదానా! | రక్షన్త్యా | కాపాడిన |
| త్వయి | నీ విషయములో | త్వయా | నీచేత |
| తదైవ | అప్పుడే | శరణం ఇతి | శరణ మని |
| ఆర్ద్రాపరాధాః | తప్పులను చేయుచునే యుండిన | ఉక్తి క్షమా | చెప్పుటకు శక్తిగల |
| | | కాకం | కాకాసురుని |
| రాక్షసీః | రాక్షస స్త్రీలను | తం | ప్రసిద్ధుఁడైన |

| | | | |
|---|---|---|---|
| విభీషణం | విభీషణునిఁగూడ | ఆకస్మికీ | నిర్హేతుకమైన |
| రక్షితః | కాపాడినట్టి | తవ | నీయొక్క |
| రామస్య | రామునియొక్క | క్షాన్తిః | ఓర్పు |
| గోష్ఠీ | పరిషత్తు | సాన్ద్రీ— | దట్టమైన |
| లఘుతరా | మిక్కిలి తేలికగా | మహాగసః | గొప్పతప్పులతోఁ గూడిన |
| కృతా | చేయఁబడినది, | నః | మమ్ము |
| సా | అట్టి | సుఖయతు | సుఖింపఁజేయునుగాక! |

అపరాధముల నొనర్చు బిడ్డల నోర్పుతో నాదరించి యానందింపఁ జేయు స్వభావము గలది గనుక "మాతః" అని సంబోధించిరి తల్లి యోర్మి కావున తండ్రి యైన భగవంతుని యోర్మికంటె నతిశయించిన దనుట ఎక్కువ క్షమ గలవాఁడనుటనుబట్టి భగవంతుని "పెఱ్ఱ తాయ్ నీయే" (కన్నతల్లివి నీవే) యని చెప్పినప్పటికి, వాస్తవముగా పురుష వ్యక్తియైన యతని క్షమలోఁ గొంచెము కాఠిన్యము గలదని తెలిసికొనునది ఔపచారికమగు మాతృత్వముకంటె స్వాభావికమైన మాతృత్వము ఉత్కృష్టము గదా!

స్వాభావికమైన గుణ సంపత్తితో, నీ జన్మమున లభించిన గుణములును జేరి మిక్కిలి యెక్కువైనవని తోఁపఁజేయుటకు "మైథిలీ" యనియు సంబోధించిరి

శ్రీరాముఁడు ఒక కాకమును, విభీషణుని మాత్రమే రక్షించెను, మైథిలియో అనేక రాక్షస స్త్రీలను రక్షించెను "సర్పజాతి రియం క్రూరా" అనునట్లు రాక్షస జాతియే నిర్మూలము గావింపఁ దగినది నేరములు చేయనిచో నొకవేళ విడిచిపెట్టవచ్చును అట్లును కాదు చేసిన నేరములు చిరకాలము క్రిందటివైనచో మఱచిపోవచ్చును మఱియు, వారు తనవారి విషయములోఁ గాక తనయెడలనే నేరములు చేయుచునే యున్నారు అయినను రాక్షస స్త్రీలను రక్షించినదే! "ఇది యెంత క్షమయో!" అని మొదటి పాదమందు నుడువుచున్నారు

"తదైవ" అనఁగా రావణుని వధను విన్నవింప నాంజనేయుఁడు వచ్చిన సమయముననే యని యర్థము రావణుని మరణమును ఏకాక్షి మున్నగు రాక్షస స్త్రీలెఱుఁగమిచేత నాంజనేయుఁ డా సమాచారము చెప్పుటకు వచ్చినప్పుడును వారామెను హింసించుచునే యుండిరి "తథైవ" అని పాఠాంతరము "ఆ విధముననే" యని యర్థము రావణ వధమునకుఁ బూర్వకాలమున నెట్లు నేరములొనర్చిరో యట్లే యనుట

రామునినుండి రక్షింపవచ్చును, పట్టిన పట్టును వదలని మర్కటమునుండి రక్షించుట యరుదు కదా! యను భావమును విశదపఱచుటకుగాను "పవనాత్మజా

ద్రక్ష్యన్త్యా" యని నుడివిరి. తన తండ్రియైన వాయువువలె, తన్నడ్డగించుటకు సాధ్యము కాని వాఁడని సూచించుటకై "పవనాత్మజ" యని యాంజనేయునిఁ బేర్కొనిరి

సాక్షాత్తుగా రామునిఁ జెప్ప వెనుదీసి, రామగోష్ఠి మిక్కిలి తేలికగాఁ జేయఁబడెనని పలికిరి

కాకం...తఞ్చ రక్షతః — శ్రీరాముఁడు చిత్రకూటమునందుఁ గాకమును రక్షించెను దుష్ట రావణుని తమ్ముఁడైన విభీషణుని, ఆక్షేపణలను సరకుగొనక యంగీకరించెను ఈ విషయము లెక్కువగా శ్లాఘింపఁబడుచున్నవి అయితే, కాకమును, విభీషణుని రక్షించుటకుఁ గారణముగలదు వీరుభయులు గత్యంతరము లేక రాముని శరణుఁ జొచ్చిరి "త్రీన్‌లోకాన్ సమ్పరిక్రమ్య తమేవ శరణం గతః" (మూఁడు లోకములలోను వెదకి వేసారి యతనినే శరణము నొందెను) అనియు "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః" (ఆలు బిడ్డలను త్యజించి రాఘవుని శరణుఁ జొచ్చినాను) అనియు, వరుసగా కాకమును, విభీషణుఁడును శరణుఁ జొచ్చినట్లుగా రామాయణమునందుఁ జెప్పఁబడుటఁ జూడుఁడు కాఁగా, శరణమని చేరిన కారణముంబట్టి క్రూర కాకమునను, రావణుని సహోదరుని నోర్పుతో స్వీకరించి, రక్షించిన రామునికంటె, శరణమనక, ఇంకను హింసలనే కలిగించుచున్న నిర్దయలైన రాక్షస స్త్రీలను నిర్హేతుకముగా దయఁ దలఁచి యోర్చుకొని, కోపావిష్టుఁడై యుండు మర్కటమునుండి కాపాడిన సీత మహిమ వర్ణనాతీతము కదా!

నేరములు చేయుచునే యుండినను, నిర్హేతుకమైన క్షమను గలిగి యుండుట శ్రీదేవి స్వభావము కొంచెమేనియు గుణముండినయెడల భగవంతుఁడు నేరములను క్షమించును ఈ వ్యత్యాసము లక్షింపఁ దగినది

"బలి భుజి......గుణలవ సహావాసాత్ త్వత్క్షమా సఙ్కుచన్తి" (కాకమునందుఁ గొంచెము గుణముండినందున నీయొక్క క్షమ సన్నగిల్లెనని యీ గ్రంథకర్తయే శ్రీరంగరాజ స్తవమునందుఁ జెప్పుటయు నిచ్చటఁ దెలియునది రాక్షస స్త్రీలవద్ద నేమాత్రము గుణము లేకుండుటచే శ్రీదేవి క్షమ సన్నగిలక విస్తరించియే యున్నదనుట.

రామాయణములోఁ గాకమును, విభీషణుఁడును శరణుఁ జొచ్చినట్లుగాఁ జెప్పఁబడి యున్నను, విభీషణునివలెఁ గాకము శరణమని చెప్పినట్లు కనఁబడదు ఇచ్చట భట్టరు ఉభయులను జేర్చి "శరణ మిత్యుక్తిక్షమౌ" అనినదెట్లు పొసఁగునని సందేహము కొందఱికి గలుగవచ్చును వారు "ఉక్తిక్షమౌ" (చెప్పుట కర్హత గలిగినవారు) అనియే భట్టరు చెప్పియుండుటను గమనింపవలయును. "చెప్పినవారు" అని నుడువమిని గుర్తించునది శరణుఁ జొచ్చిన కాకమునకును "శరణం" అని చెప్పుట కర్హత యుండుననుట

ఇఁక, "కాకముగూడ శరణమని చెప్పెను" అనుటయు నగును  శరణాగతిఁ జేసెనని చెప్పుటలోనే "శరణము కమ్ము" అని ప్రార్థన చేసెనని చెప్పఁబడినదని గ్రహించునది "విత్తకనే ఇరామావో! నిన్నభయమ్ ఎన్ఱ్రైప్ప" అని పెరియాళ్వార్లు కాకము అభయ మని నోరు తెఱచి కోరినట్లుగా నుడువుటను జూడుఁడు

ఈ పక్షమున "ఉక్తి క్షమా" అను దానికి "ఉక్తౌ క్షమా" (చెప్పుటలో నర్హత కలవారు) అని యర్థము చేయరాదు  "ఉక్త్యా క్షమా" చెప్పుటచేత (రక్షించుటకు) అర్హత గలిగినవారని యర్థము చేసికొనవలయును

జయంతుఁ డింద్రుని కుమారుఁడై యుండియు, సీతయెడలఁ గీడొనరించుటకై తన దేవత్వమును విడిచి, నీచమైన పక్షిగా నైనందున నతని క్రూరత్వమును దోఁచుటకై కాకమనిరి  ఆళవందారులును అతనిని వాయసముగా నిర్దేశించిరి

జయంతుఁడు శ్రీదేవిని జూచి, కామవశుఁడై, కాకి రూపముఁ దాల్చి, స్తనములను తన నఖములచే గీరి హింసించెనని పద్మపురాణము చెప్పుచున్నది  శ్రీరామాయణములో మాంసేచ్ఛ కలిగి యుండెనని మాత్రము చెప్పఁబడియున్నను, వక్షస్స్థలమును పొడిచినందున నది కామపరవశమై యుండెనని చెప్పుట కవకాశము గలదు

ఇఁక, వేదాంత దేశికులు "జయంతుఁడు కామ పరవశుఁడై వచ్చినట్లు రామాయణమునఁ జెప్పఁబడలేదు, కనుక వాలివలెనే ఇంద్రునకుఁ బుట్టిన యొక బలశాలియైన కాకియే యిది" అని స్తోత్రరత్న భాష్యములోఁ దెలిపిరి

కాకము శరణుఁ జొచ్చెనను కారణముచేత రాఘవుఁడు దానిపై దయను జూపెనని యాళవందారులును అనుగ్రహించి యున్నారు  "రఘువర! యద భూస్త్వం తాదృశో వాయసస్య ప్రణత ఇతి దయాళుః" అనునది వారి శ్రీసూక్తి  దానికి వేదాంత దేశికులు "కాకం తఞ్చ" అని యుపక్రమించు నీ శ్లోక పాదము నెత్తి వ్యాఖ్యానము చేసి యుండునదియు నిచట లక్షింపఁ దగినది, దానికి ఆంధ్రమున భాషాంతరీకరణ మిట్లగును — "సతం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతం" అని చెప్పఁబడుటచేత ప్రణత శబ్దము ఎక్కువ నమ్రత యను ప్రపత్తిని దెలుపును  "కాకం తఞ్చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమా రక్షతః" అని యభియుక్తులచేతఁ జెప్పఁబడియు నున్నది.

ఇట్లు వక్కాణించుట చేతఁ గాకము శరణుఁ జొచ్చెనని తోఁచినను, దత్త్వమును బరిశీలించి చూచిన నది శరణుఁ జొరలేదనియే గ్రహింపవలయును  చేష్టలుడిగి పడియుండు స్థితియే శరణాగతి యనఁబడుచున్న దని తెల్లము.

శ్రీరామాయణములో శ్రీరాముని యభిప్రాయమునననుసరించి కాకాసురుఁడు శరణాగతుఁడుగాఁ జెప్పఁబడెను  "ప్రణత ఇతి దయాళుః అనుటకు "పడినవానిని

శరణాగతుఁడని యెంచి, దయఁజూపి" యని యర్థము  ఈ యర్థముకూడ స్తోత్ర రత్న భాష్యమునందుఁ జెప్పఁబడియున్నది

శరణాగతుఁడని చెప్పఁబడిన కాకియు, "న నమేయం" (వంగను) అని ధిక్కరించు రావణుఁడును శ్రీదేవియెడ అపచార మొనర్చు విషయములో సరి సమానులే! ఇఁకఁ జేసిన నేరముల నాలోచించిన రావణునికంటెఁ గాకియే క్రూరము  అయిన నది తప్పించుకొనెను  కారణము ప్రపత్తి కాదు  నిశ్చేష్టిత తప్ప మఱేదియు దానియందు లేదు  ఇఁక నిశ్చేష్టితయుఁ గారణము కానేరదు ఏలయన—రావణుఁడును యుద్ధములో వింటిని జాఱవిడిచి నిశ్చేష్టుఁడై నిలిచి యుండెను  కనుక అతఁడును రక్షింపఁబడవలసినవాఁ డయియే యుండును అయితే కాక మెందుచేత రక్షింపఁబడె ననఁగా—శ్రీదేవి సాన్నిధ్యముచేతనే, అది లేనందున రావణుఁడు నశించెను  కాఁగా "శరణాగతిచేత కాకము జీవించినది, తల వంచనందున రావణుఁడు నశించె" నని చెప్పుట నిరర్థకమే యనుట  ఈ విషయము (6-10-10) ఈడు గ్రంథములోను, దాని ననుసరించిన మూముక్షుప్పడిలోను విశదీకరింపఁబడి యున్నది  ఇట్లాచార్యులు చేసిన నిష్కర్షమునుండి కాకము శరణాగతి చేయలే దనుట స్పష్టము

ఆళవందార్లు "రఘువర! యదభూ స్త్వం" అను శ్లోకమునను, ఈ గ్రంథకర్త యగు భట్టరు "బలిభుజి శిశుపాలే" అను శ్లోకమునను కాకమును, ప్రపత్తి చేయక తుదివఱకుఁ బూర్ణముగా నేరములనే చేయుచుండిన శిశుపాలుని గుదిఁ గూర్చి పలుకుట చేతను—మఱియు భట్టరు, కాకము ఎదుట అలసిపోయి పడుటను, శిశుపాలుఁడు భగవన్నామములనుచ్చరించి త్వంకరించుటను (నీవు-నీవు-అని ఏకవచన ప్రయోగము చేయుట) గుణలవముగాఁ జెప్పియుండుటచేతను గాకము శరణాగతి చేయలేదనుటయే యీ గ్రంథకర్తల యభిప్రాయమని వ్యక్తమగును  భూమిపైని తలయు, ఒడిలోఁ గాళ్లు నుండునట్లు పడినవానిని శరణాగతుఁడని యెట్లు చెప్పఁ దగును? కాకము చేసినది ప్రపత్తి యన్నచో "గుణలవ" మనుట యుక్తమగునా?

కాఁగా "గుణలవం" అను తన వచనము విరోధింపనట్లు ఈ శ్లోకమునందు "శరణ మిత్యుక్తి క్షమా" అను పదమును కాకమునకును, విభీషణునికిని బొసఁగు నట్లు ప్రయోగించుట హర్షింపఁ దగినది  విభీషణుఁడును, గాకమును "శరణము" అను మాటను బలుకుచు వచ్చిరి  ఈ యంశములో నుభయులును సమానులే! ఒకని పలుకు మహావిశ్వాసముతో మనఃపూర్వకముగా వచ్చెను, మఱియొకనిదో యట్లుగాక భయప్రేరితంబై నాలుకచివరినుండి వచ్చెను—అనుట వేఱు విషయము

పెరియాళ్వార్లు కాకము శరణుఁ జొచ్చెనను భావము కల్గునట్లు "విత్తగనే ఇరామావో నిన్నభయ మెన్ఱ్డైయ" (ఓ విస్మయనీయుఁడవగు రామా! నీ యభయము అని శరణము పొంద) అనక, "అఴైప్ప" (మొఱపెట్ట) అని యనుట

దాని శరణాగతి వాజ్మాత్రముననే యుండు స్థితిని వ్యక్తపఱచుచున్నది దాని ననుసరించియే ఇచ్చట గ్రంథకర్త "ఊక్తి క్షమా" అని ప్రయోగించినారు

భగవంతుఁడు మనల నంగీకరించుటకు మనయొద్ద నుండు ఎట్టి యర్హతయుఁ గారణము కానేరదు ఎన్ని కొఱఁతలున్నను, అవి యతఁ డంగీకరించుట కాటంకములు కానేరవు. విభీషణుని యర్హతను జూచి రాముఁ డతనిని స్వీకరించెనని చెప్పుటకు శక్యము కాదు. అర్హత లేని కాకమును స్వీకరించుటయే దానికిఁ గారణము కనుక భగవంతుఁ డొకనినంగీకరించునపుడు మిత్రభావమే చాలుననుట కుచితముగ నల్పమైన యేదో యొకదానిని వ్యాజముగఁ దీసికొనును "రాఘావో నిన్నభయం" అను కాక శబ్దమును "స్వరేణ మహతా" యనునట్లు ధ్వనిని వినగానే మనసు కరఁగునట్లు ఘోషించిన విభీషణుని శబ్దమును, వ్యాజముగాఁగొని హృదయమును బరిశీలింపక శ్రీరాముఁడు రక్షించెననుట కాఁగా మాటను వ్యాజముగాఁ గొని రక్షణ మొనర్చిన భగవంతునికంటెను వ్యాజము లేకయే రక్షించు శ్రీదేవి గొప్పదని చెప్పఁబడిన దనుట ఈ యభిప్రాయమును గొనియే "శరణం అను పలుకు చేత అతఁడు శరణ్యుఁడు సంబంధమునే హేతువుగాఁ గొని యీమె శరణ్యా" అని గద్య వ్యాఖ్యానమునందు పెరియవాచ్చాన్ పిళ్లై యనుగ్రహించి యున్నారు

కాకము కంటిని అస్త్రముచే ఛేదించిన రాముని రక్షకుఁడని చెప్పుట యుక్తమా? అన్నదో శిరశ్ఛేదము చేయఁదగియుండిన కాకము నట్లు చేయక విడిచినది రక్షణమే యగు ననుట అప్రతిహతమగు బ్రహ్మాస్త్రమునకుఁగాను దాని యొక్క నేత్రమును ఛేదించినను, మిగిలియుండు నొక్క నల్లగుడ్డె నేత్రద్వయమునకు నుపయోగపడునట్లు చేయుటచె రక్షణములోఁ గొంచెమైనను గొఱఁత లేదని తెలిసికొనునది.

శ్రీదేవి యగు సీతాదేవిని విశ్లేషింపించిన రాక్షసుని తమ్ముఁడైన విభీషణుని శ్రీరాముఁడు రక్షించెను "భ్రాతా స్వా మూర్తి రాత్మనః" (సహోదరుఁడు తన శరీరమే) యనునట్లు రావణుని వేఱొక శరీరము కదా విభీషణుఁడు! అట్టివానిని గూడ హృదయ పరీక్ష చేయక రక్షించిన గొప్పతనము తోఁచునట్లు "తఞ్చ విభీషణం" అని యన్నారు తం-రావణుని తమ్ముఁడని ప్రసిద్ధి నొందిన వానిని అని యర్థము "అనుజో రావణాస్యాహం విభీషణ ఇతి శ్రుతః" (నేను రావణుని తమ్ముఁడను అని ప్రసిద్ధుఁడైన వాఁడనని తన్ను దానే వివరించుకొనుటను లక్షింపుఁడు ఇఁక "ధర్మాత్మా" అని ప్రసిద్ధి పొందిన అని "తం" అనుదానికిఁ గొంద ఱర్థము చేయుదురు

సానః... ..ఆకస్మికీ·—నేరములను చేయుచునేయుండు రాక్షస స్త్రీలను రక్షించిన శ్రీదేవియొక్క స్వాభావికమైన క్షమ, మహాపరాధులమైన మమ్మును సుఖపఱచును గాక! అనుచున్నారు

ఆకస్మికీ-నిర్హేతుకము  రాక్షస స్త్రీల విషయమై శ్రీదేవి చూపిన ప్రేమ స్వభావసిద్ధమైన దనుట

"శ్రీదేవిని శరణు పొందుఁడు, శరణు పొందినయెడల ఆయమ యనుగ్రహించును" అని రాక్షస స్త్రీలకుఁ ద్రిజట యుపదేశింప, వారు దానిని నిరసింప కుండుటనే ఆధారముగాఁ గొని రక్షించెనని కొందఱందురు  అగునో నిరసింప కుండుట అను ప్రాతికూల్య నివృత్తి కలిగిన రాక్షస స్త్రీలు తర్వాతను శ్రీ దేవిని హింసించి యుండుట తగునా? అని చింతింపవలయును

ఇఁకఁ ద్రిజట చేసిన శరణాగతికిఁగాను ఆమెకు శరీర సంబంధముచేత మనవారే యని కలిగిన దయకుఁ బాత్రలైన రాక్షస స్త్రీలను శ్రీదేవి రక్షించినదని యనుటయుఁ జింతింపవలసినదే! శరీర సంబంధముచె ద్రిజటకుఁ గలుగు దయ రావణాదులయెడ ఏల కలుగలేదో తెలియకున్నది  విభీషణునితోఁగూడ వచ్చిన నల్గురు రాక్షసులవలెఁ ద్రిజటతోఁగూడ నుండు రాక్షస స్త్రీలను రక్షించుట న్యాయముగా తోఁచలేదు  రాక్షసులు నల్గురును వేఱుగా శరణు పొందకున్నను విభీషణునితోఁగూడ బయలుదేరి యతని మార్గమునుండి తప్పియుండలేదు  రాక్షస స్త్రీలో త్రిజట ననుసరింపక యామె మార్గమునుండి తప్పి ప్రతికూలలుగా పైపైని హింసించుచునే యుండిరి

శిష్యుఁడనుకూలముగా లేనియెడల అతనికై ఆచార్యుఁడు చేయు ప్రపత్తియు నిష్ఫలమగునని పెద్దలు వచింతురు  "ఆచార్యనాలుం పశైయిల్లై యిఱే, తాన్ సత్ప్రకృతి యన్రాగిల్" (శిష్యుడు సాత్విక ప్రకృతి కలవాఁడు కానియెడల నాచార్యుఁ డేమియుఁ జేయఁజాలఁడు) (పెరియ తిరుమొఴి 8-2-2 వ్యాఖ్యానము) అను పెరియవాచ్చాన్ పిళ్లై శ్రీసూక్తి యిచ్చోట స్మరణీయము  కాఁగాఁ ద్రిజట చేసిన ప్రపత్తి అసత్ప్రకృతులైన రాక్షస స్త్రీలయెడల ఫలించుట కవకాశ ముండునా? అను విషయము విమర్శింపఁ దగినదే!

మఱియు నీ విధముగ రాక్షస స్త్రీల విషయమై సీతాదేవి చూపిన క్షమకుఁ గారణము కల్పించినచో రామునకును సీతకును వ్యత్యాసమేమియును లేకుండపోవు నను విషయము గమనింపఁదగినది  రామునికంటె సీత గొప్పదనియు, ఆమె క్షమ నిర్హేతుక మనియు నిరూపించు నీ శ్లోకము విరోధించుటయు సూక్ష్మముగఁ బర్యాలోచింపఁ దగినది

రాక్షస స్త్రీలను శరణు పొందఁ జేయుటకై త్రిజట "ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా" (జనకుని కుమార్తెయగు మైథిలి తన్ను మ్రొక్కుటచేత నను గ్రహించునది) అని యుపదేశించెనే కాని మ్రొక్కుటచేత మాత్రమే యనుగ్రహించునని యామె స్వభావమును జెప్పలేదని గుర్తింపుఁడు.

ఇఁక త్రిజటయొక్క అభిమానము తన ఉపదేశమునకుఁ బాత్రులైన రాక్షస స్త్రీల పర్యంతమె పర్యవసించెను లేనియెడల రాక్షస స్త్రీలు మాత్రమే రక్షింప బడుట యెట్లు? కార్యమునుండి కారణము నెఱుంగవలయును గనుక రక్షింపఁ బడని రావణుని విషయమై త్రిజట యభిమానము వ్యాపింపలేదు—అని తీర్మానింప వలయును త్రిజట యొనర్చిన శరణాగతిలో నణఁగినవారను వ్యాజమును నంగీక రింపనిచో నిర్హేతుకముగ రాక్షస స్త్రీలను గాపాడినట్లు ఇతరుల నందఱిని శ్రీదేవి కాపాడ సమకట్టెనేని సర్వముక్తి ప్రసంగము కలుగును ఇఁక శరణాగతి కనంతరమును రాక్షసస్త్రీలు నేరము లొనర్చుట ప్రపన్నుఁడు బుద్ధిపూర్వకముగాఁ బాపము లొనర్చుట వంటిది "లఘుర్దణ్డః ప్రపన్నస్య రాజపుత్రాపరాధవత్" అనునట్లు ప్రపన్నునకు స్వల్పదండన విధించునట్లు రాక్షసస్త్రీలకును దమ్ము నాంజనేయుఁడు ధ్వంసము చేయుచున్నాఁడను భీతి గలుగఁజేసి, కత్తిని పైకెత్తి, భయపెట్టి విడుచునట్లు ఆటంకపఱచుటచేత దండలేశము కూడ సిద్ధమని యొక పక్షమువారు వాదింతురు కాఁగా వ్యాజమును గొని శ్రీరాముఁడు రక్షించును అట్లుగాక స్వభావముగానే రక్షించునది సీతాదేవి ఈ వ్యత్యాసమును బట్టి ఈ శ్లోకమునందు హెచ్చుతగ్గులు నిరూపింపఁబడినవని తలంపరాదు వేఱు విధముననే వానిని గ్రహింపవలయునని వారి యభిప్రాయము

శ్రీదేవి నిర్వ్యాజముగా రక్షించుట అకించన్యము (ఉపాయ హీనత) కలిగిన వారికే కనుక సర్వముక్తి ప్రసంగమునకుఁ బ్రసక్తియే లేదని యితరాచార్యుల యభిప్రాయము

అన్నాయ్ శీఱ్ఱైమదిలియే ! అరక్కియర్కళ్
అనైత్తుక్కుమ్ పైజుక్కుఱ్ఱమ్ పురియా నిఱ్ప
అన్నారై యళిత్తనుమణ్ అళియా వణ్ణమ్
అళిత్తనై యా లిరామనదు కుఱువిణ్మేన్మైశ్
తన్నాని ఱ్చిరణమెన త్తగుది వాయ్న్ద
దశముకనిణ్ తమ్బియొడు కాక జ్కాత్త
తెన్నావదు ? ఇరుజుక్కుఱ్ఱ మిఴైక్కి న్ఱోము
క్కిన్బమున దియల్బాన పొఱుమై నల్గ ! (50)

జనకుని కుమార్తెవైనదానా! తల్లీ! అప్పుడును (రావణుఁడు యుద్ధములో హతుఁడైన యనంతరము కూడ) క్రొత్త నేరము లొనర్చుచునే యున్న యట్టి రాక్షస స్త్రీల నాంజనేయుఁడు ధ్వంసము చేయకుండునట్లు కాపాడి, రామగోష్ఠి

మహిమను చిన్నబోవునట్లు చేసితివి. తన వాక్కు చేత శరణమనుట కర్హత గలిగిన దశముఖానుజుని, గాకమును రక్షించినందులో నేమి గొప్పతనమున్నది? మహాప రాధములను జేయుచుండెడి మాకు నీ స్వభావసిద్ధమైన (నిర్హేతుకమైన) క్షమ సుఖముల నొసంగుగాక! (౫౦)



అవతారిక — ఇట్లు క్షమించి కాపాడుచున్న మేము శ్రీదేవికి సంబంధించినవారము. ఆమె సంబంధమును పురస్కరించుకొనియే భగవంతుని సంబంధమును మేము వేడుకొనుచున్నామని — అనుచున్నారు

మాతర్లక్ష్మి! యథైవ మైథిలజన స్తేనాధ్వనా తే వయం
త్వద్దాస్యైకరసాభిమాన సుభగై ర్భావై రిహాముత్ర చ ।
జామాతా దయిత స్తవేతి భవతీ సంబన్ధ దృష్ట్యా హరిం
పశ్యేమ ప్రతియామయామచపరిచారాన్ ప్రహృష్యేమచ॥ ॥౫౧॥

ప్రతిపదార్థము

| | |
|---|---|
| మాతః | తల్లియైన |
| లక్ష్మి! | ఓ లక్ష్మీ! |
| తే | నీకు |
| మైథిలజనః | మిథిలాజనులు |
| యథైవ | ఎట్లో |
| తేన అధ్వనా | ఆ మార్గముగానే (ఆ రీతిగానే) |
| వయం | మేమును (నిన్ను జేరిన వారము) |
| త్వత్ | నీయొక్క |
| దాస్య | దాస్యమునందు |
| ఏకరసాభిమాన | ముఖ్యప్రీతి, ముఖ్యాభిమానములచేత |
| సుభగైః | సొగసైన |
| భావైః | అభిప్రాయములతో |
| ఇహ | ఇక్కడను (లీలా విభూతిలోను) |
| అముత్ర చ | అక్కడను (పరమ పదములోను) |
| జామాతా | అల్లుడును, |
| తవ | నీయొక్క |
| దయితః | ప్రియుడును |
| ఇతి | అని |
| భవతీ | నీయొక్క |
| సంబన్ధ దృష్ట్యా | సంబంధపూర్వముగనే |
| హరిం | భగవంతుని |
| పశ్యేమ | దర్శించెదము, (అతనిని) |
| ప్రతియామ | శరణుజొచ్చెదము |
| పరిచారాన్ | (అతని) కైంకర్యములను |
| యామ చ | పొందుదుము, |
| ప్రహృష్యేమచ | సంతసించెదముకూడ. |

మిథిలా నగరపుఁ బ్రజలు తమ రాజైన జనకుని యల్లుఁడనియు, జానకి భర్త యనియు, సీతాదేవి సంబంధమును బట్టియే రాముని౯ గొనియాడినట్లుగా మేమును లక్ష్మీ సంబంధమునుబట్టియే భగవంతుని౯ గొనియాడుదు మని యనుట. జనకరాజు యొక్క ప్రజలవలె మేమును ప్రపన్నరాజైన పెరియాళ్వార్లను జేరినవారము. వారు జనకునియొక్క జామాత యనునట్లుగా మేము పెరియాళ్వార్లయొక్క జామాత యని దర్శించుచున్నాము. వారు సీతాదేవి భర్త యనునట్లు మేము గోదాదేవి భర్త యని దర్శించెదము. వారు రాముని దర్శించునట్లు మేము శ్రీరంగనాథుని దర్శించెదము అను విశేషార్థములను గొందఱు నుడువుదురు. గోదాదేవిని శ్రీరంగనాయకిని అభేదముగా నుపచరించి వారట్లు నుడివిరి కాఁబోలు!

ఇచ్చట, "భట్టరు భగవంతుని దాసుఁడనైన నన్ను శ్రీదేవి స్త్రీధనముగా వచ్చిన వాఁడ నని భావించుటకును, నేనును, ఈతఁడు మన శ్రీదేవి వల్లభుఁడని, ఆ రీతిగా "సౌమ్య జామాతృదేవుఁడు" అని భావించుటకును అనుగ్రహింపవలయు నని వేఁడుకొనిరి" అను ఈడు శ్రీసూక్తి (7-2-9) అనుసంధేయము.

అంతఃపురమునకు సంబంధించినవారు నేరము చేసినను, దాని నేదో వ్యాజ మిడి రాజులు సహించునట్లు, మనము శ్రీదేవీ సంబంధుల మగుటచే మన గొప్ప యపరాధములను భగవంతుఁడు క్షమించు ననుట ఈ శ్లోకమందలి యాంతరంగికాభిప్రాయమని వేదాంతదేశికులు తమ రహస్యత్రయ సారమున ద్వయాధికారమునందుఁ జెప్పి యున్నారు.

త్వద్దాస్యైక.... సుభగైః —భగవంతునకు దాస్యము చేసినను శ్రీదేవి కొనర్చిన దాస్యమనియే ప్రీతియు, అభిమానమును కలుగవలయుననుట. ఇఁక దాస్యములోనే రసవంతమైన అభిమానము అని అర్థమును జెప్పువారును గలరు.

ప్రతియామ —ప్రతిపత్తి చేయఁగలవారమని యర్థము. ప్రతిపత్తియనఁగా అధ్యవసాయమను శరణాగతియే! దగ్గరచేరెద మని వ్యాఖ్యానించిన వారును గలరు.

పరిచారా౯ యామ —కైంకర్యము చేయఁగలవార మని యర్థము.

ప్రహృష్యేమ చ —మేము కైంకర్యమునొనర్పఁగా నీవు సంతసింప దానిని జూచి మే మానందింపవలెనని భావము. "ని౯ తిరువుళ్ల మిడఱ్ గెడున్దోఱుమ్ నాజ్గళ్ వియక్క ఇన్బుఱుదుమ్" "ప్రహర్షయిష్యామి సనాథ జీవితః" అను పరమాచార్యుల వచనములను జూడుఁడు.

"భవతీ సంబన్ధ దృష్ట్యా" అనునది చింతనీయము, "భవదేకవృత్తి" (నైషధము 3-105) అను దానివలె "భవత్సంబన్ధ దృష్ట్యా" అని యుండవలయునని యందురు. "భవతీ పాదలాక్షా రసాఙ్కమ్" (శ్రీస్తుతి) "భవతీ ప్రసాదాత్" (దేవీ మాహాత్మ్యము) అనువానివలె దీనిని గ్రహింపుఁడు.

తాయాగు మిలక్కుమియే! జనక నూరిల్
జనఙ్గళైన యాముస్నై యే శార్వో మావోమ్
నీయేఱ్కుమ్ పణివిడై యి నిప్ప మొన్రై
నిన్నై యు మన త్తిలగు కరుత్తోడు నిలత్తుమ్
చేయామ్ విణ్ణాత్తుమణ మగని నక్కు
త్తిరుక్కణవ నెన్నవుముణ్ తోడర్పి ఱ్కాణోమ్
మాయోనై వణఙ్గిడువో మిన్న మేవల్
పురిన్దిడువో మనమిగవు మగిఴ్వు వోమే. (51)

తల్లియైన లక్ష్మీ! జనకరాజుయొక్క నగరములో నుండు ప్రజలవలె మేము నిన్నే చేరినవారమగుదుము, నీచే నంగీకరింపఁబడిన కైంకర్యముయొక్క ఆనంద మాత్రమునే ఉద్దేశించు హృదయమున వెలయు భావముతో లీలా విభూతియందును, బరమాకాశమునందును అల్లుఁడు-అనియు, నీయొక్క భర్త-అనియు, నీ సంబంధమును గొనియే దర్శించెదము భగవంతుని శరణుఁజొత్తుము మఱియు కైంకర్యము చేయుదుము ఆనందించెదము (51)

---

అవతారిక — శ్రీదేవీ సంబంధమును బురస్కరించుకొని మనము భగవంతుని జేరుటకుఁగారణము-ఆమెయొక్క మాతృత్వమేయని దానిని నుపపాదించుచున్నారు

పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే
హితస్రోతో వృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః।
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వ ముచితైః
ఉపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః॥ ॥౫౨॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| జనని! | తల్లీ! | కదాచిత్ | ఎప్పుడైనను |
| త్వత్ప్రేయాన్ | నీ ప్రియుఁడు | కలుషధీః | కలఁతపొందిన మనస్సు గలవాఁడై |
| పరిపూర్ణాగసి | నేరములు నిండిన | | |
| జనే | జనుల విషయమై | భవతి చ | అగుచు నున్నాఁడు, |
| పితా ఇవ | తండ్రివలె | కిం ఏతత్? | ఇది ఏమి? |
| హితస్రోతో | హిత పరంపరలో | ఇహ | ఈ |
| వృత్త్యా | నుండుటచేత | జగతి | లోకమునందు |

అవతారిక — ౫౨-వ శ్లోకమందు "క్రిమే తన్నిర్దోషః" అనుటలో "నకశ్చిన్నాపరాధ్యతి" (తప్పు చేయని వాఁడెవఁడు లేఁడు) అని ఆంజనేయులను జూచి సీతాదేవి చెప్పిన వచనము గర్భితమై యున్నది ఆంజనేయుని క్షమింపఁ జేయు నామె తన మాటకు వశ్యుఁడైన భగవంతుని క్షమింపఁజేయుట వేఱుగాఁ జెప్ప నేల? అట్లు క్షమింపఁ జేయు నామె ప్రియునితో నీ లోకమునం దవతరించి పడరాని పాట్లన్నియుఁ బడుట తలంచి, అనుకంపించి, అవతారమునకు హేతువులైన కరుణను, మితిమీఱిన స్వాతంత్ర్యమును నిందించుచున్నారు

"మాతా తదసి నః" అను దాని కుచితముగ నూతిలోఁ బడిన బిడ్డతోఁగూడ దూఁకి పైకెత్తు తల్లివలె నీ భూమిలో నవతరించుటను దలంచి, తపించి వచించుచున్నారని జెప్పుటయు నగును.

నేతుర్నిత్యసహాయినీ జనని! నస్త్రాతుం త్వ మత్రాగతా
లోకే త్వన్మహిమావబోధబధిరే ప్రాప్తా విమర్దం బహు।
క్లిష్టంగ్రావసు మాలతీ మృదుపదం విశ్లిష్య వాసో వనే
జాతోధిక్కరుణాం ధిగస్తు యువయోఃస్వాతన్త్ర్యమత్యఙ్కుశమ్॥౫౩॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| జననీ! | ఓ తల్లీ! | మాలతీ | జాజి పుష్పమువలె |
| త్వం | నీవు | మృదు | మృదువైన |
| నేతుః | నాయకునికి | పదం | పాదము |
| నిత్యసహాయినీ | నిరంతరము తోడై | గ్రావసు | రాతిబండలలో |
| నః | మమ్ము | క్లిష్టం | క్లేశపడినది, |
| త్రాతుం | కాపాడుటకు | వనే | అడవిలో |
| త్వత్ | నీయొక్క | విశ్లిష్య | ఎడబాటు పొంది |
| మహిమ | మహిమను | వాసః | నివాసము |
| అవబోధ | తెలిసికొనుటలో | జాతః | కలిగినది, |
| బధిరే | చెవిటిదైన | యువయోః | మీ యుభయుల |
| అత్ర | ఈ | | యొక్క |
| లోకే | లోకమునందు | కరుణాం | దయనుగూర్చి |
| ఆగతా | అవతరించినదానవై | ధిక్ | నింద కలుగును గాక! |
| విమర్దం | ప్రయాసను | అత్యఙ్కుశం | మితిమీఱిన |
| బహు | అధికముగా | స్వాతన్త్ర్యం | స్వతంత్రతను గూర్చియు |
| ప్రాప్తా | పొందితివి, | ధిగస్తు | నింద కలుగును గాక! |

గట్టిక్కఁదెలియని మాబోటివారిని కాపాడుటకై కష్టములను సరకుగొనక, సౌకుమార్యమును కనుఁగొనలేని యీ పాదు భూమిలో నవతరించినది చాలదా? ఆపైని పడిన కష్టము లెన్నియో?

“కొన్నవిలుమ్ వెజ్ఞానత్తూడు కొడుజ్కుదిరోఞ్ఞ
తున్ను వెయిల్ వఱుత్త వెమ్బరల్ మేల్ పఞ్చడియాల్”

[భయంకర శబ్దములుగలిగి వేడిమి గల యడవిలో నుగ్రకిరణుఁడగు సూర్యుని యొక్క ఆతపము తపించునట్లు చేయు బండరాతిపయి మృదువైన పాదములతో] నడచుట సంభవించినదే! విడిచిపోనను స్థితి మాత్రి, విడిచిపోవుటయు సంభవించినదే! అయ్యో! ఇట్లవతరించి పడరాని కష్టములు పడుటకుఁ గారణము కరుణయే కదా! అట్టి కరుణ యెందుకు? అట్టి కరుణ యుండిన నుండు గాక! అచ్చట నుండియే రక్షింపరాదా? ఇచ్చట నవతరించియే కావలయునా? ఏల వచ్చితివి? మమ్ముల నడుగ వారెవరు? అను స్వాతంత్ర్యమే యిందులకుఁ గారణము అదలించు వారు లేనియట్టి స్వాతంత్ర్యము త్యాజ్యమే అని భావము

కరుణ యుండినను, స్వాతంత్ర్యము లేనిచో రక్షణ విషయమే, ప్రవృత్తి లేక యుండును గనుక స్వాతంత్ర్యము కూడ నిందార్హ మనుటయు నగును

శ్రీదేవికిఁ బారతంత్ర్యమే స్వరూపమయ్యును దనతో నుండు భగవంతుని స్వాతంత్ర్యము నీమెయం దారోపించి వచించిరి ఇది ఛత్రి న్యాయము (ఒక సమూహములోఁ గొందఱే గొడుగు పట్టుకొని పోవుచున్నను, గొడుగు గలవారలు వెళ్లుచున్నారని చెప్పుట ఛత్రిన్యాయ మనఁబడును) “యువయోః స్వాతన్త్ర్యం” అను దానిని లక్షింపుఁడు

నిత్య సహాయినీ త్రాతుం ఆగతా — “లక్ష్మ్యా సహ..... రక్షకః” లక్ష్మితో రక్షించునతఁడు — అనుదానినిఁ జూడుఁడు.

లోకే త్వన్మహిమావబోధ బధిరే, — ఎంత చెప్పినను నీ మహిమ యీ లోకవాసుల చెవుల కెక్కదు మూఢ లోక మనుట

“అత్యఙ్కుశం” అను దానిని “అత్యఙ్కుశాం” అని మార్చి కరుణతో నన్వయించి, మితిలేని కరుణ అనియు అర్థము చెప్పనది

జరిగిపోయిన కష్టములకు మనను కరఁగుటయు, ఆ కష్టములకుఁ గారణము లయిన గుణములను గర్హించుటయుఁ బ్రతీత్యతిశయముచేత యుక్తమే యని యెఱుంగునది.

ఇత్తై యోను క్కెన్నాళుమ్ తుణ్ణై వి! యున్దన్
ఏన్ఱిమెలా మెడుత్తోన స్తియమ్మి నాలుమ్
ఇత్తై యేనుమ్ శెపియేఱా ఇన్న లోక
త్తైమె యేఱ్కు వన్దునీ పదుమ్ పాడన్నే!
అత్తై మీాదు నడన్దడిమెల్ లబన్ గళ్ వాట్టమ్
అడ్డై స్దనకాణ్ కాన్పిరిన్దు తున్బ ఱ్ఱాయ్
నిత్తై కరుణై యొడు తాయే! నీయిర్ కొణ్డ
నెఱి కడన్ద సుదన్దిరముమ్ నిన్దై శెయ్వామ్ (53)

భగవంతునికి నిరంతర సహాయిని! జననీ! నీ మహిమ నెంత యెత్తి చెప్పినను గ్రహింపలేని యీ లోకములో నీ వచ్చి పడినపాట్లు ఎన్నియో? పుష్పము వంటి మృదువైన నీ పాదములు బండరాళ్లపై నడచి వాడినవి కాననములోఁ బ్రియుని విశ్లేషించి కష్టపడితివి నిండిన మీ కరుణను, మితిమీాఱిన మీ యిరువురి స్వాతంత్ర్యమును నిందించెదము (53)



అవతారిక — శ్రీదేవి భగవంతునికిఁ దోడై, అతని మూలముననే మనలను రక్షింపవలసి యుండినను, నాయకుడుగా నతఁ డరుదైన కార్యములు చేయుచుండుట చేత మనలను రక్షించుట యొక్క గొప్ప కార్యమా? అని యనుచున్నారు

అధిశయితవా నబ్ధిం నాథో మమన్థ బబన్ధ తం
హరధనురసౌ వల్లీభఙ్గం బభఞ్జ చ మైథిలి!
అపి దశముఖం లూత్వా రక్షఃకబన్ధ మనర్తయత్
కిమివ న పతిః కర్తా? త్వచ్చాటుచుఞ్చు మనోరథః ॥౫౪॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| మైథిలి! | ఓ జానకీ! | అబ్ధిం | సముద్రమున |
| అసౌ | ఈ | అధిశయితవాన్ | శయనించెను, |
| నాథః | శ్రీరంగనాథుఁడు | మమన్థ | మథించెను కూడ, |
| త్వచ్చాటు చుఞ్చు | నీవు ప్రియమొనర్చు టతోఁ గూడిన | తం | దానిని |
| మనోరథః | కోరిక గలవాఁడై | బబన్ధ | బంధించెను కూడ; (దానిపై సేతువుకట్టెను) |

| | | | |
|---|---|---|---|
| హర ధనుః | శివ ధనుస్సును | [illegible] | రాక్షసుని చెండెను |
| వల్లీభఙ్గం | లతను త్రెంచినట్లు | ఆసప్తాయిత్, అపి | ఆడించెను కూడ, |
| బభఙ్క్త్వ చ | త్రెంచెను కూడ, | పతిః | నీ భర్త |
| దశముఖం | పది ముఖములను | కిమివ | ఏ కార్యమును |
| లూత్వా | ఖండించి | న కర్తా | చేయకుండును? |

శ్రీదేవికై భగవంతుడు చేసిన కృత్యముల నీ శ్లోకములో వచించిరి. సముద్రము శ్రీదేవి జన్మించిన చోటు కనుక అచ్చట శయనించెను ఆమెను పొందుటకై సముద్రమును మథించెను ఆమె కొఱకె దానిపై సేతు నిర్మాణము చేసెను "తవ ప్రియం ధామ యదీయ జన్మభూః యదర్థ మమ్భోధి రమన్థ్యబన్ధి చ" "(ఏ శ్రీదేవి పుట్టిన చోటు ప్రియమైనదో, ఎవరికై సముద్రము మథింపఁబడెనో, సేతువు కట్టఁబడెనో)" అను ఆళవందారుల సూక్తి యిచ్చో స్మరణీయము

శివ ధనుస్సును విఱిచినది యీమె మృదువైన భుజముల నాశ్లేషించుటకే దుష్ట రావణుని తలలు తెగవేసినది యీమె కనియే శ్రీదేవిని ఆనందింపఁ జేయుటకై భగవంతుఁ డెట్టి కార్యమునైనను జేయును—అని యరుట

శ్రీరామాయణమునందు ఈ విశాలనేత్రములు గల సీతకై, రాముఁడు సముద్ర పర్యంతము భూమిని దలక్రిందుగాఁ జేసినను అది తగునను తాత్పర్యము నిచ్చు "యది రామ స్సముద్రాన్తాం మేదినీ పరివర్తయేత్ । అస్యా హేతో ర్విశాలాక్ష్యా యుక్త మిత్యే వమే మతిః॥" అను ఆంజనేయుని వచనమును గ్రహింపుఁడు.

శ్రీదేవి తనకై యేదియైనను జేయ సమర్థుఁడైన భర్తను గలిగియున్నది ఇట్లుండఁగా మనలను రక్షించుట యరుదైన పనికాదు అని భావము

<u>వల్లీ భఙ్గం</u>—"ఉపమానే కర్మణి" అను విధిననుసరించి ఉపమానార్థములో "ణముల్" ప్రత్యయము చేరినది

<u>త్వచ్చాటు చుఞ్చు మనోరథః</u>—"చాటు అను పదము "చుఞ్చుప్" అను ప్రత్యయము గలిగి యున్నది "తేన విత్తశ్చుఞ్చుప్ చణపౌ" అని వ్యాకరణ సూత్రము

తడజ్కడ ఱ్ఱాయ్న్దాఞ్ సేతు శమైత్తనఞ్ కడైన్దా నాదఞ్
కొడియెన వరన్దఞ్ వల్విల్ కుఱైత్తన నరక్కఞ్ పత్తు
ముడితడి న్దడల మాడ మున్నమర్ కణ్డాఞ్ సీతే!
ముడిన్దిడ ఉఞ్ విరుప్పుమ్ మున్దుమఞ్ ముడియా నెన్నో? (54)

నీ భర్త విశాలమైన సముద్రములో శయనించెను దానిపైని సేతువును నిర్మించెను దానిని మథనము చేసెను లతను ద్రెంచునట్లు అనాయాసముగా శివ ధనుస్సును విరుగఁగొట్టెను రాక్షసుఁడగు రావణుని పది తలలను ఖండించి, కబంధ నర్తనమును యుద్ధమునఁజూచెను సీతా! నీ మనోరథములను నెఱవేర్చుటకు ముందంజవేయు భర్త నీకుఁగాను ఏ కార్యము నెఱవేర్పకుండును? (54)



అవతారిక — శ్రీదేవి ననుభవింప సర్వశక్తుఁడైన భగవంతుఁడు విశ్వ రూపములు ధరించుట మొదలగునవి యేమేమి చేసినను, అవి యామెయొక్క సొగసైన యొక్క చిన్న లీలా విలాసమునకుఁ జాలదని వచించుచున్నారు

దశశత పాణి పాద వదనాక్షి ముఖై రఖిలైః  
అపి నిజ వైశ్వరూప్య విభవై రనురూప గుణైః ।  
అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే!  
క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే॥ ॥౫౫॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| కమలే! | ఓ లక్ష్మీ! | నిజ | తనయొక్క |
| కమితా | నీ ప్రియుఁడు | వైశ్వరూప్య | విశ్వరూప స్థితియొక్క |
| దశశత | వేలకొలఁది | విభవైః అపి | మహిమలచేతను, |
| పాణి | చేతులు | అతైః | అవి కానట్టి |
| పాద | పాదములు | అవతరణైః చ | అవతారములచేతను |
| వదన | ముఖములు | రసయన్ | అనుభవించుచు |
| అక్షి | నేత్రములు | తవ | నీయొక్క |
| ముఖైః | ఈ లోనగువానిని కలిగినవియు | విభ్రమభ్రమి ముఖే | విలాసమను సుడిగల ద్వారములో |
| అఖిలైః | కొలఁతలేనివియు | క్వచన | ఒక మూలలో |
| అనురూపగుణైః | ఉచితమైన గుణములు గలవియు నగు | విని మజ్జతి హి | మునిఁగిపోవు చున్నాఁడు కదా! |

శ్రీదేవికిఁ గాను భగవంతుఁ డేది చేసినను జేయుటకు హేతువు ఆమె భోగ్యతయే యని యీ శ్లోకములోఁ దెలుపుచున్నారు.

అనేకావయవములుగలిగిన విశ్వరూపము ధరించియు, లెక్కలేని అవతారము లెత్తియు, అనుభవించినను శ్రీదేవియొక్క యొక విలాస లీలనుగూడ సర్వశక్తుఁడైన భగవంతునిచేత ననుభవింప సాధ్యపడదు నీళ్లు మ్రింగినట్లుగా నెక్కడనో ఒక మూలలో మునిఁగి పోవుచున్నాఁ డనుట శ్రీదేవి భోగ్యత మితిమీఱినదని తాత్పర్యము,

అనుభవించువానియందు లేమియుఁగొఱఁతలేదు, వేలకొలఁది కరణములు గలవని "దశశత పాణిపాద వదనాక్షి ముఖైః" అని తెలిపిరి ఇట్లగుట వికారముగా లేక శ్రీదేవి కుచితముగానే యున్నదని "అనురూప గుణైః" అనుటచేఁ దెల్పిరి ఇఁక "అనురూప గుణైః" అను దానిని విశేషణముగాఁ దీసికొనక "తగిన గుణముల చేతను" అని అర్థము చేయుటయుఁ గలదు

వేలకొలఁది యవయవములు మాత్రమే కావు అసంఖ్యాకములైన అవతారములనెత్తి నానా విగ్రహములతో ననుభవింపఁ బూనినను, ఆ శక్తిని జూపుటకై "అవతరణైః" అని యన్నారు "బహూని మే వ్యతీతాని జన్మాని" అని గీత, అవతారములు లెక్కకు మించినవని చెప్పుటను జూడుఁడు

అతైః అవతరణైః —"తత్" శబ్దముతో వ్యతిరేకార్థము నిచ్చు "న" చేరినది క్రిందఁ జెడివిన విశ్వరూపముచేతనే కాదు, అదికాక వేఱైన యవతారములచేతను అని యనుట ఇఁక "అతైః" అనుదానికిఁ గ్రిందఁజెప్పిన విశ్వరూపము అవతారములు కాక వేఱగు వ్యూహమూర్తి మొదలగువానిచేతను అనియు అర్థము చేయవచ్చును "రతైః" అని పదవిభాగముచేసి భోగములచేతను అని చెప్పుట సమంజసము కాదు

అనుభవము నుద్దేశించి యిట్లు పలు విధములుగా నుద్యమించుటకుఁ గారణము భగవంతుఁ డీమెయందుఁ బ్రీతి కలవాఁడుగా నుండుటయే యని చూపుటకు "కమితా" అని చెప్పిరి ఇది పరికరాంకురాలంకారము

విభ్రమభ్రమి ముఖే —విభ్రమము-ప్రియులకు మధురమైన లీల విభ్రమమును నొక సుడిగా రూపించుటచేత శ్రీదేవిని నొక గొప్ప రస ప్రవాహముగా గ్రహించు నది ఇది ఏకదేశరూపకాలంకారము.

వినిమజ్జతి — "ని" అను ఉపసర్గముచేత లోతులో మునుఁగుటయును, "వి" అను నుపసర్గముచే నితరములైన మునుఁగుటలకంటె ఇంపులో దీని శ్రేష్ఠతను, వర్తమాన కాలముచేత నింకను మునుఁగుచునే యుండునట్లు గాఢత్వమును దోఁచుచున్నవి

ఆయిర మాయిరమాన వడిగళ్ కైగళ్
ఆననఙ్గ ళయనఙ్గ ళాది యేయ్న్దు
మాయిరుమై వాయ్న్దతన విశువ రూప
మహిమైయినా లేఱ్ఱుడైయ కుణఙ్గ ళాలుమ్
శేయొరు తామరై వాళ్వాయ్! శనిత్త లాలుమ్
సిఙ్గార నలన్దుయ్ప్పా నినదు నేర్ఙ
పోయొరు మూలై యిల్ మూళ్గి ప్పోగి న్ఱానిఙ్
పురిలళిత లీలై యెను ఇచ్చుళివాయ్ ప్పట్టే. (55)

ఓ కమలవాసినీ! వేలకొలఁది పాదములు, హస్తములు, ముఖములు, నేత్రములు, ఈ మొదలగువానిని గలిగి గొప్పదైన విశ్వరూప మహిమ చేతను, ఉచితములైన గుణముల చేతను, అవతారముల చేతను నీ ప్రియుఁడు శృంగార రసము ననుభవించువాఁడై, నీ మధుర లీలా విలాసమను సుడిలోఁ బడి ఒక మూలలో మునిఁగిపోవుచున్నాఁడు (55)



అవతారిక — అస్మదాదులను రక్షించుటకుఁ దగిన చోటుగా నుండుట చేత ఇతర ప్రదేశములకంటె శ్రీరంగములో నెక్కువ ప్రీతితో శ్రీదేవి వేంచేసి యున్నట్లు చెప్పుచున్నారు

జననభవనప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే
జనని! దయిత ప్రేమ్ణా పుష్ణాసి తత్పరమంపదమ్।
ఉదధిపరమవ్యోమ్నో ర్విస్మృత్య మాదృశ రక్షణ
క్షమమితి ధియా భూయశ్శ్రీరఙ్గధామని మోదసే॥ ॥౫౬॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| జననీ! | తల్లీ! | దయితప్రేమ్ణా | భర్తయందలి యను రాగము చేత (మెట్టినింటి ప్రీతి చేత) |
| జనన భవన ప్రీత్యా | పుట్టిన యింటియందలి ప్రేమచేత | | |
| దుగ్ధార్ణవం | క్షీర సముద్రమును | తత్ | ప్రసిద్ధమైన |
| బహుమన్యసే | గౌరవించుచున్నావు, (అందు వసించుచున్నావు) | పరమం పదం | పరమపదమును |
| | | పుష్ణాసి | వర్ధిల్లఁ జేయుచున్నావు; |

| | | | |
|---|---|---|---|
| ఉదధి పరమ | అట్టి క్షీరాబ్ధి పరమ | ఇతి | అను |
| వ్యోమ్నోః | పదములను | ధియా | తలంపుచేత |
| విస్మృత్య | మఱచి | శ్రీరఙ్గధామని | శ్రీరంగ క్షేత్రములో |
| మాదృశ | నావంటి ప్రజలను | భూయః | ఎక్కువగా |
| రక్షణ | రక్షించుటకై | మోదసే | ఆనందించుచున్నావు |
| క్షమం | తగిన చోటు | | |

స్త్రీకిఁ బుట్టింటిలోఁ దల్లిదండ్రులయందుఁ బ్రేమయుఁ దరువాత భర్తయం దధిక ప్రేమయు, అటు పిమ్మటఁ గన్నబిడ్డలయం దత్యంత ప్రేమయుఁ గలుగుట సహజమే! అట్లే శ్రీదేవి ప్రీతి మొదట బహుమానమనియు, పిదప నెక్కువ పోషణ యనియు, అటు పమ్మట నానందమనియు వర్ణింపఁబడి యుండుట రసవంతమై యున్నది "జనని" అను సంబోధనము "మాదృశ" (నావంటివారు) బిడ్డలము అని చూపుచున్నది భర్తయందలి ప్రీతికన్న బిడ్డలయందలి వాత్సల్యమే తల్లి కెక్కువగా నుండునట్లు శ్రీదేవికి మనపై నుండు వాత్సల్యమే యధికమని యనుట నావంటివా రనినది తమ్ము రక్షించుకొనుట కెట్టి మార్గమును లేని యాకించన్యమును సూచించుచున్నది

"విష్ణోః పరమం పదం" అని వేదమునందలి ప్రసిద్ధి తోఁచుటకు "తత్ పరమం పదం" అని నుడివిరి

జ్ఞాన శక్తులచేఁ బరిపూర్ణులైన వా రుండు ప్రదేశములవలెఁ గాక, అకించనుల మైన మావంటివారిని రక్షించుట కుచితముగా నుండుటచేత శ్రీరంగమే శ్రీదేవిని ఆనందింపఁ జేయునది యగును క్షీర సముద్ర పరమపదములకంటె శ్రీదేవిని సంతసింపఁజేసి నాట్యమొనర్చునట్లు చేయు చోటగుటచేత నీ స్థలము శ్రీరంగమని పేరు వడసెను "అవ్వూరిల్ పేరుమ్ పెరియ పిరాట్టియారుక్కు నృత్తస్థానమ్" (ఆ యూరిపేరు శ్రీరంగనాయకికి నృత్యస్థానము) అను పెరియవాచ్చాన్ పిళ్లై శ్రీసూక్తిని (నాచ్చియార్ తిరుమొళ్రి 11-9) గమనింపుఁడు (శ్రీ = శ్రీరంగ నాయకికి, రంగం = నృత్తస్థానము) ఇట్లు శ్రీరంగ పదమునకుఁ జేయు నర్థమును గొనియే యీ శ్లోక మవతరించినది

<u>ఉదధి పరమవ్యోమ్నోః</u> —ద్వితీయార్థములో షష్ఠి వచ్చినది

పుట్టింటి కూర్మి గారాబములు పరిపూర్ణానందమును గలిగించు వైకుంఠవాసుని భోగమును మఱచునట్లు శ్రీదేవిని శ్రీరంగము సంతోషింపఁ జేయుచున్నది అట్లు మఱచి సంతోషించుటకు హేతువు మాతృత్వముచేఁ గల్గు పుత్ర వాత్సల్యమే యని యనుట

పిఱన్దగ త్తన్బి నాలే పిఱపా ఱ్కడఱ్పెరుత్తి
శిఱన్దగ మున్దణ్ శెమ్మ లన్బినా ల్పెరుక్కిప్పుత్తి
మఱన్దగ మన్దై మగిళ్న్దు మక్కళై మ్మనోర్రై క్కాక్క
చ్చిఱన్దగ మ్మిం॰దే యెన్ఱు శెననీ! శీరరఙ్గిల్ వాళ్తి (56)

ఓ జననీ! పుట్టింటి యందలి ప్రేమచేత క్షీరాబ్ధి కతిశయము గలుగఁజేయుచున్నావు భర్తయందలి ప్రేమచేతఁ బరమాకాశమును వర్ధిల్లఁ జేయుచున్నావు వానిని మఱచి సంతోషముతో మావంటి బిడ్డలను రక్షించుట కుచితమగు స్థలమని శ్రీరంగములో నీవు వైభవముగ వసించుచున్నావు (56)

---

అవతారిక — మాబోటి వారిని బురుషకారముగ నుండి రక్షించుటకుఁ గావలసిన గుణము లన్నియు శ్రీరంగమునందే శోభించుచున్నవని వచించుచున్నారు

ఔదార్య కారుణికతాశ్రితవత్సలత్వ
పూర్వేషు సర్వ మతిశాయిత మత్ర మాతః! ।
శ్రీరఙ్గధామ్ని యదుతాన్య దుదాహరన్తి
సీతావతారముఖ మేత దముష్య యోగ్యా॥ ॥౫౭॥

ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| మాతః | ఓ తల్లీ! | సర్వం | (పురుషకారమగుట కుపయుక్తములైన గుణములు) అన్నియు |
| ఔదార్య | దాతృత్వము | | |
| కారుణికతా | కరుణ | | |
| ఆశ్రిత వత్సలత్వ | ఆశ్రయించినవారియందు వాత్సల్యము | శ్రీరఙ్గధామ్ని | శ్రీరంగక్షేత్రమునందు |
| | | అత్ర | శ్రీరంగనాయకిగానుండు ఈస్థితిలో |
| పూర్వేషు | ఈ మున్నగు సుగుణములలో | అతిశాయితం | అతిశయముగాఁ గూరఁబడినవి. |

| | | | |
|---|---|---|---|
| ఉత | మఱియు | | కోటుగా నితిహాస |
| అన్యత్ | ఈ అర్చాస్థితికంటె వేఱైన | | పురాణాభిజ్ఞులు) |
| | | | ఉదాహరించు |
| యత్ | ఏ | | చున్నారో |
| సీతావతార ముఖం | సీతావతారము మొద లగువానిని | ఏతత్ | ఈ సీతావతారము మున్నగు నవియు |
| ఉదాహరన్తి | (ఇదివఱకు చెప్పిన గుణ ములను వెంయు | అముష్య | ఈ అర్చాస్థితికి |
| | | యోగ్యా | అభ్యాసము చేయుటయే! |

విభవమగు సీతావతారము మొదలగు వానికంటె అర్చామూర్తిగాఁ గోయిలలో వేంచేసి యున్న శ్రీరంగనాయకియందే సకలగుణములు నతిశయించి ప్రకాశించుచున్నవి—అని యనుట

ఔదార్యము —స్వార్థత లేక యితరుల వాంఛలను నెఱవేర్చుట సిద్ధోపాయమైన భగవంతుని నే ఒసంగుటయు నగును

కారుణికతా —కరుణా శీలుని స్థితి అనఁగాఁ గరుణ అనఁగాఁ బర దుఃఖా సహిష్ణుత

ఆశ్రిత వత్సలత్వం —దాసుల నేరము గుణముగా నెంచుట

"పూర్వ" అనుటచేతఁ బారతంత్ర్యము, అనన్యార్హత అను పురుషకార త్వోపయుక్తములైన గుణములను గ్రహింపుఁడు

ఆతిశాయితం —ణిజంతము అతిశయము పొందింపఁబడిన దని యర్థము

ఉత —మఱియు "ఉతాప్యర్థ వికల్పయోః" అని నిఘంటువు దీని "ప్రత్యుత" అని యర్థము చేసి "ఇఁక ఏమన" అని అర్థము చెప్పుటయుఁ గలదు ఈ అర్చామూర్తియందు గుణము లతిశయింపఁ జేయఁబడినవిగాఁ జెప్పుట యెట్లు? సీతావతారమునందుఁ గదా ఇవి యతిశయించి ప్రకాశించినవి? అని ప్రశ్నించు వారికి "అట్లు కాదు, మఱెట్లన్న ఈ యర్చాస్థితిలో గుణముల నతిశయింపఁ జేయఁబడుటకు నభ్యాసమాత్రముగా నుండినదే సీతావతారము" అని యుత్తరమిచ్చు చున్నారని యనుట

తన పురుషకారత్వోప యుక్తములైన గుణములును, పురుషకారత్వమును ప్రకాశింపఁ జేయుటకై ఎత్తిన యవతారము కనుక సీతావతారము నుదాహరించిరి

యోగ్యా — సాధన "యోగ్యా గుణనికాభ్యాసః" అని నిఘంటువు "యోగ్యం" అను పాఠము గాని ఈ అర్చారూపమునకు సీతావతారాదులు సమమని కొందఱు వచింతురు

సీతాద్యవతారములలో మిక్కిలి యభ్యస్తములైన గుణము లతిశయించి యుండు స్థితియే శ్రీరంగనాయకిగా నుండు నీ యర్చాస్థితి యనుటయే ఈ శ్లోకాభిప్రాయము

శ్రీదేవి లోకము నుజ్జీవింపఁ జేయుటకై యనేక పర్యాయము లవతరించి యభ్యాస మొనర్చిన దని యనుట భగవంతుఁడును అర్చారూపిగా శ్రీరంగము మొదలగు స్థలములలో నభ్యాసము చేసినట్లు భూదత్తాళ్వార్లు "పయిన్దదరఙ్గం" అను పాశురమునందు అనుగ్రహించి యుండుటను జూడుఁడు

> వణ్మైయుమ్ ఉణ్మైయుమ్ వాత్సల్య ముదలన
> ఉణ్మైయి లరఙ్గత్తే యునక్కొప్పిలై యనాయ్ !
> పెణ్మణి జానకి పోలున పిఱవిగళ్
> ఎణ్ణిడి లిన్నిలైక్కేన్ఱ నఱ్పయిఱులే. (57)

ఓ తల్లీ! ఈవి, కరుణ, వాత్సల్యము మున్నగునవి యుండుటలో శ్రీరంగ మునం దర్చారూపముగా నుండు నీకు సమాన మేదియు లేదు పారతంత్ర్యము తలయెత్తి ప్రకాశించుటచే స్త్రీరత్నమగు సీతాదేవి లోనగు నవతారములు— పరిశీలించునెడ, ఈ యర్చావతార స్థితికిఁ జేసిన యభ్యాసములే! (57)



అవతారిక — ఆ గుణములలో ఔదార్యము మితిమీఱిన యతిశయము గలదని వచించుచున్నారు

> ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
> కస్మైచి దఞ్జలిభరం వహతే వితీర్య ।
> అస్మై న కిఞ్చిదుచితం కృత మిత్యథాంబ!
> త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః! ॥౫౮॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అంబ! | తల్లీ! | అద | ఇంకను |
| త్వం | నీవు | అస్మై | ఇతనికి |
| అఞ్జలిభరం | అంజలియను బరువును | ఉచితం | అంజలికిఁ దగినది |
| వహతే | మోయుచున్న | కిఞ్చిత్ | ఏమియు |
| కస్మైచిత్ | ఎవరికైనను (అతని యధికారమునకుఁ దగినట్లు) | న కృతం | చేయఁబడలేదే |
| | | ఇతి | అని |
| | | లజ్జసే | సిగ్గుపడుచున్నావు |
| ఐశ్వర్యం | ఐశ్వర్యమునో, | అయం | ఈ |
| అక్షరగతిం | కైవల్య ఫలమునో, | ఉదారభావః | ఉదార గుణము |
| పరమం పదం వా | మోక్షమునో | కః | ఎటువంటిది? |
| వితీర్య | ఒసంగి | కథయ | చెప్పుమా! |

చేయునది స్వల్పమైన యంజలి మాత్రమే, పడయునవియో గొప్ప ఫలములని చెప్పఁబడినదయ్యెను

“శ్రేయో నహ్యరవిన్దలోచన మనః కాన్తా ప్రసాదాదృతే, సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్” అని యాళవందార్లు వ్యతిరేకరీతిగాఁ జెప్పినదాని నీ గ్రంథకర్త యీశ్లోకములో అన్వయరీతిగాఁ జెప్పుచున్నారు

ధర్మార్థకామములలో నణఁగినదై కోరఁబడున దేదియైనను అది ఐశ్వర్యమే! అక్షర మనఁగాఁ బ్రత్యగాత్మానుభవమైన కైవల్యము గతి = బడయునట్టి ఫలము ఇఁక, అక్షరగతి యను దానికి నాశరహితమైన గతి యనియు నర్థమగును అక్షరం = నాశరహితమైనది ఇందుచేతఁ గైవల్యము నిత్యమనియు, ఐశ్వర్య మనిత్య మనియు దెలియుచున్నది భగవదనురూపమైన మోక్షముకూడ నిత్యమే యయ్యెను, కైవల్యమువలెఁ దక్కువయైనవి కాదు, శ్రేష్ఠమైనదే యని యనుచు “పరమం పదం” అని యనుచున్నారు పరమం - తనకంటె ఎక్కువైనది మఱి యొకటి లేనట్టి నిరతిశయమైనదని యనుట

మన మనోరథముల ననుసరించి, ఒసఁగు ఫలములను “వా” అనుటచేత వికల్పించిరి, దేహాభిమానికి ఫలము ఐశ్వర్యము, స్వతంత్రాభిమానికి ఫలము కైవల్యము. దాసునిగాఁ దన్నభిమానించువానికి ఫలము పరమ పదము అని విభజించునది

ఒక పర్వతమును మోయునట్లు మన యంజలిని శ్రీదేవి తలంచుచున్నది కాన నామె భావమున కుచితముగ అంజలిని ఒక బరువుగా నుడివిరి “తే భూయిష్ఠాం నమ ఉక్తిం” “అదు శుమన్దార్ కట్కే” అని సంస్కృత ద్రావిడ వేదములు వచించుచున్నవి

అంజలి యను బరువును మోయునతఁ డెవఁడైనను సరే, జాతి వృత్తుల నియమమేదియును లేదని బోధించుటకై "కస్మైచిత్" అని యన్నారు

"ఉన్నడియార్ కళ్ ఎజ్ఞ శెయ్యార్ ఒన్న్ఱుతిన్నీ" అనునట్లు పర్వతము (అంజలి) మోయు నతనికిఁ దా నొసఁగు మోక్షముకూడ నల్పముగాఁ దోఁచుటచేత శ్రీదేవి లజ్జించుచున్నదఁట దానిని జూచి "యిదేమి యౌదార్యమా!" అని గ్రంథకర్త విస్మయము నొందుచున్నారు

"శ్రియం లోకే దేవజుష్టా ముదారాం" అను శ్రుతిలోని "ఉదారా" శబ్దమునకు భట్టరు వ్యాఖ్యానము చేసిరని వేదాంతదేశికులు వచించిరి దీనిచేత మోక్ష ప్రదత్వ రూపమైన ఉపాయత్వమును శ్రీదేవికిఁ గలదని వారి యభిప్రాయము శ్రీదేవి పురుషకారమైనఁగాని భగవంతుఁడు పనిచేయఁడు కనుక పరంపరగా నీ శ్లోకము (భగవంతుని మూలముగా) మోక్షప్రదత్వమును నిరూపించుచున్నదని ఇతరాచార్యులు వచించెదరు

అఞ్జలి ప్పక్కర మాక్కమో అమ్మనాయ్!
అఞ్జలి శుమప్పవర్ క్కరుళియు మేప్పయా
ఎఞ్జలి వీకల నెనత్తలై కునిదియేల్
కొఞ్జమో? కూఱుది అమ్మ! నీ కొడైత్తిఱ (58)

తల్లీ! అంజలి మోయువారికి మోక్షమో, కైవల్యమో, ఐశ్వర్యమో వారి వారికిఁ దగిన ట్లొసంగి యుండియుఁ బూర్ణముగ నీయలేదని లజ్జించుచున్నావో, నీ ఫలప్రదత్వము కొంచెమా? చెప్పవమ్మా! (58)



అవతారిక —రాఁబోవు రెండు శ్లోకములచేఁ దాము నైచ్యానుసంధానము చేయుచున్నారు

జ్ఞాన క్రియా భజనసంప దకిఞ్చనోఽహా
మిచ్ఛాధికార శకనానుశయా నభిజ్ఞః ।
ఆగాంసి దేవి! యువయోరపి దుస్సహాని
బధ్నామి మూర్ఖచరిత స్తవ దుర్భరోఽస్మి॥ ॥౫౯॥

### ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| దేవి! | ఓ దేవి! | సంపత్ | సంపదచేత |
| ఇచ్ఛా | ఫలముపొందు ఆశయు, | అకిఞ్చనః | హీనుఁడనై |
| అధికార | ఆఫలమును బడయుటకుఁ | అనభిజ్ఞః | తెలియనివాఁడను(అగుట |
| | గాను, విహితములు | అహం | నేను [చేత) |
| | చేయునట్లు | యువయోః | భగవంతుఁడు, లక్ష్మి |
| | ప్రేరేపింపఁబడు | అపి | యగు మీ యుభ |
| | యోగ్యతయు, | | యులకుఁ గూడ |
| శకన | చేయుటకు శక్తియు, | దుస్సహాని | ఓర్వలేని |
| అనుశయ | "విహితము నింతకాలము | ఆగాంసి | నేరములను |
| | చేయకుంటిమే" | బధ్నామి | చేయుచున్నాను, |
| | యను ననుతాపమును | మూర్ఖచరితః | చెడ్డ నడతగల నేను |
| జ్ఞాన | జ్ఞానయోగము | తవ | నీకు |
| క్రియా | కర్మయోగము | దుర్భరః | భరింపరాని వాఁడనుగా |
| భజన | భక్తియోగము అను నీ | అస్మి | ఉన్నాను |

ఈ శ్లోకములోని పూర్వభాగమున ఆనుకూల్య హీనతయును, ఉత్తర భాగములోఁ బ్రాతికూల్యము నుండుటయును జెప్పుచున్నారు

ఇచ్ఛ = మోక్షరుచి, ముముక్షుత్వము అధికారము=బ్రాహ్మణ్యాదులు శకనము=విధుల నెఱిఁగి యనుష్ఠించు శక్తి ఇవి నాయందు లేవు అని చెప్పుటయు సరికాదు, ఇటువంటివి కొన్నియున్నవి—అను జ్ఞానముకూడ నాకు లేకపోయెనే! మఱియు మంచివేవియు లేకపోవుటయే గాక చెడ్డవన్నియు నావద్ద చేరి గుమిగూడి నన్ను చేరుచునున్నవిగదా! ఏ విధమున నీవు నన్ను రక్షింతువో? అని శ్రీదేవిని దిలకించి దైన్యముతోఁ జెప్పుచున్నారు.

ఇచ్ఛలో నవికూడ లేమిచే జ్ఞానయోగాదులు భావికాలములోనైన నుండుట కేమియుఁ బ్రసక్తి లేదనుట ఇందుచేత ఆకించన్యము చూపఁబడినది

దోషమును గుణముగా గ్రహించు స్వభావము నుద్దేశించి "యువయోరపి" అని యనిరి

భగవంతునికి భరింప నలవికానివాఁడ నను విషయ మటుండ, "క్షాన్తి స్త వాకస్మికీ" యన్నట్లు అతిశయముగాఁ జెప్పఁబడు నీకును నేను భరింప వీలుకాని వాఁడనైతి నని వివరించుటకై "తవ దుర్భరోఽస్మి" అని వచించిరి దీనిచేత "అహమస్మ్యపరాధానా మాలయః" దోషములకు నేను నిలయము నని తమ దోషముల ననుసంధించుచున్నారు

"దుర్భరోఽస్మి" అనుటకు ఏ విధముచేతనైనను నీవు నన్ను రక్షింప వలయు నని భావము.

శఱ్ఱుమే యఱివు కన్మం బత్తియా ఇచ్చెప్పు త్తిల్లై
కఱ్ఱిలే నిచ్చె పెఱ్ఱి కవుశల మిరజ్గల్ దేవి!
కుఱ్ఱమే పురియా నిఱ్పేన్ కొదిక్కను మ్మిరువీ రుళ్ళుం
ముఱ్ఱుమే మూర్కనేనై ముడియుమో తాజ్గనీదాన్ (59)

ఓ దేవీ! నాకు జ్ఞాన, కర్మ, భక్తి, సంపత్తులు కొంచెమైనను లేవు అధికారము, సామర్థ్యము, అనుతాపము — వీనిని నే నభ్యసింపను లేదు మీ యిరువురి మనసులును దపించునట్లు నేరములనే యొనర్చుచున్నాను కేవలము మూర్ఖుఁడనైన నన్ను రక్షింప నీకు శక్యమగునా? (59)



అవతారిక — ఇట్లు నైచ్యానుసంధానము చేయుటయు, మనఃపూర్వకముగాఁ గాదు; పూర్వులను వాఙ్మాత్రముగా ననుసరించుట మాత్రమే, కనుక నీ స్వాభావికమైన కరుణతో నన్ను రక్షింపుమని వేఁడుకొనుచున్నారు

ఇత్యుక్తికైతవశతేన విడమ్బయామి
తానంబ! సత్యవచనః పురుషాన్ పురాణాన్ ।
యద్వా న మే భుజబలం తవ పాదపద్మ
లాభే త్వమేవ శరణం విధితః కృతాసి॥ ॥౬౦॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| అంబ! | ఓ తల్లీ! | యద్వా | లేదా |
| ఇతి | ఇదివఱలోఁ జెప్పిన | మే | నాకు |
| | ప్రకారముగ | తవ | నీయొక్క |
| ఉక్తికైతవశతేన | వంచనగా నూర్లకొలఁది | పాదపద్మలాభే | పాదపద్మములను |
| | చేయు నైచ్యాను | | బడయుటలో |
| | సంధానములచే | భుజబలం | సామర్థ్యము (సాధనము) |
| తాః | ప్రసిద్ధులును, | న | లేదు, |
| సత్యవచనాః | నిజమునే చెప్పువారును, | విదితః | కరుణచేత |
| పురాణాః | ప్రాచీనులు నగు | త్వమేవ | నీవే |
| పురుషాః | ఆచార్యులను | శరణం | శరణముగా |
| విడమ్బయామి | అనుకరించుచున్నాను, | కృతా అసి | చేయఁబడియున్నావు |

నైచ్యానుసంధానము చేసితిరి కదా! ఆళ్వారులవలెను, ఆచార్యులవలెను నీవును ఆత్మగుణ పరిపూర్ణుఁడవై గట్టెక్కవచ్చును గదా! యని శ్రీదేవియొక్క భావమని తలంచి దాని కీ శ్లోకమున మొదటి రెండు పాదములలోఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నారు నిజము పలుకునట్టి వారివలెనా నేను? అసత్యమే నుడివి వారి ననుకరించు (వంచించు) నేను ఉజ్జీవింప దారి కలదా? అని చింతించుట

ఇఁక "మీవద్ద యోగ్యత లేనివో కోల్పోవలసినదే కదా!" అని శ్రీదేవిని ప్రశ్నింప సాధనముచేతనే పొందవలసినట్లు నీ స్థితియందున్నదో? నిర్హేతుక కృపచే నీవే నాకు శరణము కాలేదా? అని కడపటి రెండు పాదములచేత ననుచున్నారు సాధన హీనుఁడనైన నాకు నీ నిర్హేతుక కృపయే శరణమని నిర్ణయించుట నెఱుఁగునది

అనృతమే యైనను పూర్వుల ననుసరించిన కారణముచేత రక్షింపవలయునని పూర్వార్ధమునకు భావముచెప్పి, రక్షించుటకు మఱియొక హేతువు (నిర్హేతుక కృపను) ఉత్తరార్థములో వచించిరని కొందఱు వ్యాఖ్యానించిరి

<u>భుజబలం</u> — ఫలమును బొందించు సామర్థ్యము, స్వప్రయత్నమనుట

విధి:—"విది వాయ్క్కిన్ఱు కాప్పారార్" (మీఱరాని విధిని పోలిన కరుణ లభించుచో ఎవ్వరడ్డుదురు?) అనునట్లు గట్టుపొరలి ప్రవహించు కరుణను జెప్పుచున్నది విధితః కుతో౽పి" అను పాఠములో నిర్హేతుక కృపచేత అని యర్థము

శరణం —"భవేయం శరణం హి వః" అని రాక్షస స్త్రీలను జూచి శరణమయ్యెదవను శ్రీదేవి ఆంజనేయుని కోపమును మార్చి శరణమైనందున శ్రీదేవి శరణ మగుట యనఁగా దండింపవలయునను తలంపును మార్చుటయే యగును అనఁగాఁ బురుషకార మగుట

కరుణను విధి యనుట కుచితముగ శరణమైతి వని యనక, శరణముగఁ జేయఁబడితి వని చెప్పిరి విధి యెవరిచేత జయింపఁబడును?

తొల్లైవర్ శ్మెయ్యే శొల్లుమ్ తూనెఱి తొడరు వేన్పోల్
ఎల్లైయి ల్లామ లిజ్ఞ్ఞ ఇయమ్బినఞ్ఞ చలజ్ఞ శన్డో!
అల్లదు తాయే! ఉన్ఱ్ఞ అడిమలర్ ప్పెఱవెఞ్ఞ కై యిల్
వల్లమై యిల్లై యదఱ్కు వల్లైనీ విదియినానాయ్. (60)

తల్లీ! పూర్వులు సత్యముగా నైచ్యానుసంధానము చేసిన మార్గము ననుసరించువానివలె అయ్యో! లెక్కలేని కపటోక్తుల నిట్లు చెప్పితిని నీపాద పద్మములను బొందఁ నాకే సాధనము లేదు నీవే కృపచే సమర్థురాలవయితివి (60)



అవతారిక — ఉపసంహారములో శుభముల నాశాసించుచు నీ యరుదైన స్తుతిని బూర్తి చేయుచున్నారు

శ్రీరఙ్గే శరదశ్శతం సహసుహృద్వర్గేణ నిష్కణ్టకం
నిర్దుఃఖం సుసుఖం చ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధింపరామ్।
యుష్మత్పాద సరోరుహాన్తరరజ స్స్యామ త్వమంబా పితా
సర్వంధర్మమపిత్వమేవ భవన స్స్వీకురు ర్వకస్మాత్కృపామ్॥ ॥౬౧॥

## ప్రతిపదార్థము

| | | | |
|---|---|---|---|
| శ్రీరఙ్గే | శ్రీరంగమునందు | అన్తర | లోపలనుండు |
| శతం | నూఱు | రజః | పుప్పొడిగా |
| శరదః | సంవత్సరములు | స్యామ | అగుదుము గాక! |
| సుహృద్వర్గేణ సహ | స్నేహితులతోఁ గూడ | త్వం | నీవే |
| | | అంబా | తల్లివి, |
| నిష్కణ్టకం | నిర్విఘ్నముగను | పితా | తండ్రివియు, |
| నిర్దుఃఖం | దుఃఖము లేనట్లును | త్వమేవ | నీవే |
| సుసుఖం చ | ఎక్కువ సుఖముగను | నః | మాకు |
| దాస్యరసికాం | దాస్యానందముగల | సర్వం | సమస్తమైన |
| పరాం | అతిశయమైన | ధర్మమపి | ధర్మమునుగా |
| సమృద్ధిం | సమృద్ధిని | భవ | అగుము, |
| భుక్త్వా | అనుభవించి | అకస్మాత్ కృపాం | నిర్హేతుక కృపను |
| యుష్మత్ | మీయొక్క | | |
| పాద సరోరుహ | పాద కమలములయొక్క | స్వీకురు | అంగీకరింపుము |

శ్రీరఙ్గే.....పరాం — పురుషాయుస్సు నూఱు వత్సరములు గనుక "శరదశ్శతం అని యన్నారు సుహృద్వర్గం శ్రీరంగనాథుని ముంగిటిలో నుండు ఆనందపరవశులగు దాసుల సమూహము పరాం సమృద్ధిం—శ్రేష్ఠమైన శ్రీరంగ శ్రీని, భుక్త్వా=ఆనందపరవశమైన దాస గోష్ఠితో నిష్టగోష్ఠిగా నుండి యనుభవించి, నిష్కణ్టకం=ఉపద్రవము లేక, కాఁగా "శ్రీరఙ్గశ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ" అని చెప్పుట యైనది

యుష్మత్..... స్యామ —భగవంతునిఁ జేర్చి "యుష్మత్" అను బహువచనము ప్రయోగింపఁబడినది దీనిచేత పాదపద్మముల నీడలో తన జీవితము జరుగుట కాశాసించిరని గ్రాహ్యము కాఁగా దృష్టాదృష్టములు రెండును (ఇహాముత్ర ఫలములు) శ్రీరంగములోనే ఆశాసించినట్లయినది

త్వమంబా పితా —దీనిచేత ఐహికఫల మిచ్చుటకు హేతువు చెప్పఁబడినది. ఇది యితర సంబంధములకును ఉపలక్షణము

సర్వం ధర్మమపి —దీనిచేత నాముష్మిక ఫలము నిచ్చుటకుఁ గారణము చెప్పఁబడినది కర్మయోగాద్యుపాయానుష్ఠానము మాయందు లేకున్నను వాని స్థానములలో పురుషకారముగా నీవే యుండి భగవంతునిచేత మా మనోరథము లీడేరునట్లు దయచేయవలయు నని తాత్పర్యము.

అట్లు దయచేయుటయు నీ నిర్హేతుక కృపచేతనే కావలయును నా యోగ్యత నుద్దేశించి దయచేయుట నీ కృపకు అతిశయమును గలిగింప దనుటకై "స్వీకురుష్వ కస్మాత్కృపాం" అని వచించిరి

"సర్వం చ త్వమసి త్వమేవ భవ నః స్వీకురుష్వ కస్మాత్కృపాం" అని పాఠాంతరము సర్వం చ=అన్ని సంబంధములు, త్వం=నీవే, అసి=అగుదువు నః=మాకు, త్వమేవ=నీవే, భవ=(ఉపాయముగానో, ఉపేయముగానో) అగుమా! అని పాఠాంతరమున కర్థము చేయుదురు. పై శ్లోకము "ద్వయము" యొక్క పూర్వ ఖండార్థమును ఈ శ్లోకము ఉత్తర ఖండార్థమును జెప్పునట్లుగా వారు వ్యాఖ్యానించిరి

నిత్యముక్తులును శ్రీరంగమునందే వచ్చి కైంకర్యము చేయుటచేతను, ఇది ప్రత్యక్షమైన పరమపదముగ నుండుటచేతను, బరమపదమును దిగఁద్రోసి వచ్చెదమని చెప్పునట్లు అంతటి భోగ్యముగా నుండుటచేతను, ఇహాముతోఁబాటు పరమును శ్రీరంగ క్షేత్రములోనే వేడుకొని యీ స్తోత్రమును ముగించిరి

తిరువరఙ్గ నగర్ తనిలే నణ్బ రోడే
 శేర్ న్దిడై యూ ఱుఱుదుయరమిన్ఱి నూఱు
వరుడఙ్గళ్ సుకమాగ వడివై యిన్బం
 వాయ్న్ద పెరు వళ్ఱ తుయ్త్తు వాళ్ న్ద పిన్నర్
ఇరువరుమా ముమదుపద మలర్ త్తూ ళావోమ్
 ఈన్ఱోయు మెన్దైయునీ శెయ్యుమెల్లా
ద్దరుమమునీ యెన్దమక్కుత్తానే యాగి
 చ్చాదనమ క్ క్రియల్పాన దయైశెయ్ వాయే (61)

శ్రీరంగ నగరములో నూఱు వత్సరములు మిత్రులచే నిరుపద్రవముగా, దుఃఖరహితముగా సుఖముగాఁ గూడియుండి దాస్యానందము గల మహా సమృద్ధి ననుభవించి తదుపరి మీ యిద్దఱి పాదకమలములలోని పుష్పాడిగా నగుదుము నీవే మాకు తల్లివియుఁ, దండ్రివియు, సమస్తమైన ధర్మమును నీవే అయి నీ స్వాభావికమైన నిర్హేతుక దయను అనుగ్రహింపుము (61)

తిరువినై నవిలుమ్ బట్టర్ తేమొఴి తమ్మిఱక్కుమ్
తిరువినై యమైత్తు నన్నర్ త్తిరుమలై నల్లాఱయాత్త
తిరువినై యిదనై యోర్న్దే యిన్బమిఴ్ వల్లీర్ ! ఉళ్ల
త్తిరువినై నీఙ్గుమ్ వణ్ణ మెణ్ణినీ రియమ్బు వీరే.

ద్రవిడ భాషా నిపుణులారా! భట్టరు శ్రీ కోశ స్తోత్రమును తిరుమలై నల్లాన్ అను వతఁడు సంస్కృత గ్రంథమునందలి సొంపును జక్కఁగా సమర్చి, గాథా రూపముగాఁ జేసిన యీ యుత్తమ కృతిని [illegible] ఉజ్జీవ్యము పోవునట్లు అనుసంధించి పఠింతురు గాక ॥

> శీర్ పరాశర బట్టర్ శెగత్తు క్కన్ద
> శిరిగుణర త్తినకోశమ్ తెఱిప్పు దఱుక్క
> ప్పార్ పుగళ్రుమ్ తిరుమలై నల్లాను రైత్తు
> ప్పుణ్ణినవి ప్పొన్ శ్రీజవు కోలై ప్పారిర్
> శీర్ మేవు మరతనజ్గళ్ శెక్కిక్క ప్పెఱ్ఱు
> చ్చిదఱామ లణిన్దుయ్ వీర్ శెప్పా గిన్దేన్
> కార్ మేగ క్కణ్ణనరుళ్ కమల చ్చెల్వి
> కణ్ణినరుళ్ కరై పురళుమ్ కాణ్మి నీరే

శ్రీ పరాశర భట్టరు జగత్తున కొసంగిన శ్రీగుణరత్న కోశమును దెఱచుటకు శ్లాఘనీయులైన తిరుమలై నల్లాన్ వలన గీటుపెట్టి వేయఁబడిన బంగారపు బీగపుఁ జెవిని (సువర్ణ కుంచికను) జూడుఁడు ఉత్కృష్టములగు రత్నములును, బూర్తిగఁ బొంది, చెదరక, అలంకరించి ఉజ్జీవింపుఁడు నీలమేఘ శ్యాముఁడగు రంగనాథుని కృపయు లక్ష్మియొక్క కటాక్ష కృపయు కూలంకషముగా మీయెడఁ బ్రవహించును మీరే గమనింపుఁడు ఇది నిశ్చయము

సంపూర్ణము.

భట్టరు తిరువడిగళే శరణం

# శ్రీ గుణరత్నకోశ శ్లోకానుక్రమణిక


| శ్లోక సంఖ్య | శ్లోకానుక్రమణిక | పుట | శ్లోక సంఖ్య | శ్లోకానుక్రమణిక | పుట |
|---|---|---|---|---|---|
| 36 | అజస్రే | 122 | 10 | దేవి శ్రుతిం | 45 |
| 54 | అదేయో యత్వాక్ | 188 | 53 | నేతు ర్నిత్య సహాయినీ | 166 |
| 8 | అనామ్రాతావద్యం | 35 | 42 | పాదారున్తుపం | 138 |
| 3 | అనుకల | 17 | 52 | పితేవ త్వత్ప్రేయాన్ | 163 |
| 33 | అన్యేఽపి | 115 | 57 | ప్రణమ దను విధిత్సా | 124 |
| 30 | అపాఙ్గా | 107 | 32 | ప్రశకన బలజ్యోతిః | 112 |
| 13 | అస్యేశానా | 57 | 26 | భోగ్యా వామపి | 94 |
| 15 | ఆక్రామ | 62 | 12 | మనసి విలసతాణ్ణా | 53 |
| 23 | ఆజ్ఞానుగ్రహ | 85 | 45 | మర్మస్పృశో రసనిరా | 144 |
| 41 | ఆనన్దాత్మభిః | 132 | 50 | మాతర్మైథిలి | 153 |
| 43 | ఆమర్యాదం | 139 | 51 | మాతర్లక్ష్మి | 161 |
| 44 | ఆమోదాద్భుత | 141 | 48 | యది మనుజ తిరశ్చాం | 148 |
| 11 | ఆహుర్వేదా నమానం | 48 | 21 | యదూరే మనసో యదేవ | 79 |
| 60 | ఇత్యుక్తి | 180 | 4 | యద్భ్రూభఙ్గాః ప్రమాణం | 21 |
| 14 | ఊద్బాహుస్త్వాం | 59 | 5 | యద్యానత్తవ వైభవం | 27 |
| 2 | ఉల్లాస పల్లవిత | 11 | 34 | యువత్వాదా | 117 |
| 16 | ఏకో ముక్తాతపత్ర | 64 | 17 | రతిర్మతి సరస్వతీ | 66 |
| 38 | ఏకం న్యఞ్చ్య | 126 | 20 | శబ్దాదీన్ విషయాన్ | 74 |
| 58 | ఐశ్వర్య మక్షరగతిం | 176 | 1 | శ్రియై సమస్త | 7 |
| 57 | ఔదార్య కారుణికతా | 174 | 9 | శ్రియశ్శ్రీః శ్రీరఙ్గేశయ | 41 |
| 46 | కనక రశనా | 145 | 61 | శ్రీరఙ్గే శరద శ్శతం | 182 |
| 19 | కాలే శంసతి | 70 | 18 | సహసిర | 69 |
| 35 | ఘనకనకద్యుతి | 119 | 47 | సామాన్య భోగ్యమపి | 147 |
| 56 | జనన భవన | 172 | 39 | సురభిత నిగమాన్తం | 128 |
| 59 | జ్ఞాన క్రియా | 178 | 7 | సూక్తిం సమగ్రయతు | 35 |
| 25 | తత్ర స్రక్స్పర్శ గన్ధం | 90 | 49 | స్ఖలిత కటక | 151 |
| 29 | తవ స్పర్శాదీశం | 105 | 6 | స్తోతారం తముశన్తి | 31 |
| 24 | తస్యాశ్చత్వాత్ కృపా | 87 | 31 | స్వతశ్శ్రీస్త్వం విష్ణోః | 110 |
| 27 | తే సాధ్యా స్సన్తి | 99 | 28 | స్వరూపం స్వాతన్త్ర్యశ్రీ | 101 |
| 40 | త్వత్ స్వీకార | 130 | 22 | హేలాయా మఖిలం | 82 |
| 55 | దశశతపాణిపాద | 170 | | | |

# శ్రీగుణరత్నకోశ పాశురముల అనుక్రమణిక


| సంఖ్య | పాశురములు | పుట | సంఖ్య | పాశురములు | పుట |
|---|---|---|---|---|---|
| 44 | అజమెనుం | 143 | 51 | తాయాగుమిలక్కుమియే | 163 |
| 58 | ఆజ్ఞైఅప్పకరం | 178 | 61 | తిరువరజ్గ | 184 |
| 52 | అప్పణ్ పోల్ | 165 | 9 | తిరువుక్కుం తిరువే | 44 |
| 1 | అరియిన | 11 | 6 | తుడిత్తిమివోణ్ | 34 |
| 24 | అవ్వాయినిణ్ | 88 | 5 | దేవి నినవైభవ | 30 |
| 23 | అఱ్పుదమా | 86 | 60 | తొల్లవర్ | 182 |
| 50 | అన్నాయ్శీర్ | 160 | 7 | నల్లదాముఱ్ఱ | 38 |
| 55 | ఆయిరమాయిరమాన | 17[illegible] | 38 | నళిన మలర్ | 127 |
| 28 | ఇన్దవిజైమై | 104 | 4 | నిఱ్పనవుం | 26 |
| 31 | ఇయల్బినిల్ | 112 | 17 | నిన్బురువజ్గళ్ | 68 |
| 26 | ఇరువీర్క్కుం | 98 | 40 | నీ శిఱిదే | 132 |
| 53 | ఇజైయోనుక్కన్నాఖుం | 168 | 34 | పగర్న్దన | 119 |
| 13 | ఇజైవి యువ్వల గత్తిజైక్కన్తు | 59 | 42 | పజ్గయత్తాళ్ | 138 |
| | | | 12 | బత్తి సిద్దాజ్ఞనత్తాల్ | 56 |
| 41 | ఇన్బ వడివాయ్ | 136 | 56 | పిఱన్దగ | 174 |
| 33 | ఇన్నముం | 116 | 10 | పురుడర్గళ్ | 48 |
| 2 | ఊడిత్తిడ | 16 | 25 | పూన్దెరియల్ | 93 |
| 14 | ఊయర్త్తిబుయ | 62 | 18 | పెయర్వ్వన | 70 |
| 27 | ఊన్ఱ్ త్తార్ పో | 101 | 29 | పైన్దొడై | 129 |
| 21 | ఎదుమనత్తు | 82 | 20 | పొల్లాద | 78 |
| 47 | ఏదిరైయొన్దు | 148 | 29 | మజ్గళ | 107 |
| 16 | ఒరుముత్తుక్కడై | 66 | 36 | మదియముదు | 123 |
| 49 | కడకముం | 153 | 32 | మిగుమాఱ్ఱల్ | 115 |
| 30 | కడైక్కణ్ణాల్ | 110 | 43 | ముప్పువదుం | 141 |
| 3 | కణ్డోఱుం | 20 | 57 | వైత్తియుం | 176 |
| 35 | కరుముగిల్ | 121 | 37 | వణజ్గినార్ | 125 |
| 19 | కలన్దపుయిర్ | 74 | 22 | విళైయాడ | 84 |
| 46 | కనకమేకలై | 146 | 48 | వేణియే | 151 |
| 8 | కుఱ్ఱ త్తిణ్ | 40 | 11 | వేదజ్గళ్ | 53 |
| 45 | చువైతరు | 145 | 59 | శఱ్ఱుమే | 180 |
| 54 | తడజ్కడల్ | 169 | 15 | శిఱ్ఱార్కణ్ | 62 |

# శోధన పత్రము

| పుట సంఖ్య | పంక్తి సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| II | 6 | అంతర్య్యాతము | అంతర్ఖ్యాతము |
| ,, | 26 | నదా | సదా |
| IV | 14 | 15—6—195 | 15—6—1954 |
| VII | 4 | శిష్ | శ్రిష్ |
| ,, | 8 | దగ్గరక | దగ్గరకు |
| VIII | 5 | బొందిని | బొందిన |
| ,, | 13 | వేద్వుఁడైన | వేద్యుఁడైన |
| IX | 6 | మహాత్త్వము | మహాత్త్వము |
| XI | 12 | కొన్నఁతి | కొన్నంత |
| XVI | 11 | దాసేగణః | దాసీగణః |
| XVII | 3 | పాక్తద | ప్రాక్తద |
| XXII | 12 | భక్తింభందయ | బంధయ |
| XXIII | 16 | యత స్పార్వత్రికం | యత స్సార్వత్రికం |
| ,, | 19 | లావణ్యమోః | లావణ్యయోః |
| 10 | 9 | నంబలి | నంజలి |
| 12 | 10 | లిల | లీల |
| 16 | 8 | ప్రాధావ్యము | ప్రాధాన్యము |
| 19 | 6 | వెముఁగొందు | వెలుఁగొందు |
| 24 | 26 | చెప్పక | చెప్పుక |
| 25 | 20 | «కేభీ» | «కేళీ» |
| 26 | 6 | యొర్చి | యేర్చి |
| 30 | 24 | సంతొషిచి | సంతోషించి |
| 36 | 8 | శ్రీదేవిదే | శ్రీదేవిసే |
| 37 | 25 | వైదగ్ధ్వి | వైదగ్ధ్వి |
| ,, | 32 | వ్యానిరణ | వ్యాకరణ |
| 38 | 2 | ముఱ్ఱఫ్ | ముఫ్ఱ |
| 39 | 17 | యిష్ఠ | యిష్ట |
| ,, | 19 | వాలైరి | వారైరి |

| పుట సంఖ్య | పంక్తి సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 59 | 20 | అద్వితీయు | అద్వితీయ |
| 63 | 12 | ఇవా | ఇహా |
| 71 | 16 | ఆకరోత్ | అకరోత్ |
| 81 | 10 | అనెక | అనేక |
| ,, | 12 | దెహమును | దేహమున |
| 103 | 19 | స్వరూమును | స్వరూపమును |
| 106 | 13 | పరిమిళ | పరిమళ |
| 115 | 18 | అన్యేపి | అన్యేపి |
| 122 | 22 | మదు | మధు |
| 126 | 2 | ముఖంమండలి | ముఖమండల |
| 129 | 29 | తామపూర | తామరపూ |
| 134 | 28 | ప్రత్యయము | ప్రత్యయము |
| 136 | 11 | దడువ | దడుప |
| 140 | 32 | సజ్కర్ణే | సజీకర్ణే |
| 145 | 6 | జెసెదను | జేసెదను |
| 155 | 33 | గలికిన | గలిగిన |
| 163 | 18 | సితేవ | పితేప |
| 164 | 19 | బ్రితి | బ్రీతి |
| 177 | 20 | బడయు | పడయు |
| 183 | 24 | జీదితము | జీవితము |